
జ్ఞానోదయ రహస్యం
(The Mystique of Enlightenment)
యు.జి.కృష్ణమూర్తి
తెలుగు అనువాదం: జె.యస్. సుబ్రహ్మణ్యం
ఇంగ్లీష్ సంకలనం: Rodney Arms

యు. జి. కృష్ణమూర్తి

# జ్ఞానోదయ రహస్యం

*(యు.జి. అనే మనిషి నిర్హేతుక భావాలు)*

*తెలుగు అనువాదం: జె. యస్. సుబ్రహ్మణ్యం*

**ఆంగ్ల మూలం**

U.G. Krishnamurti
*The Mystique of Enlightenment*
*(The unrational ideas of a man called U.G)*
Edited by: Rodney Arms

www.ugkrishnamuerti.net

<u>యుజి కాపీ రైట్ డిక్లరేషన్</u>

*“నా బోధనకి (teaching కి), యీ పదాన్ని మీరు వాడదలచు కుంటే, కాపీ రైట్ లేదు. మీరు స్వేచ్ఛగా కాపీ చేసుకోవచ్చు, పంచి పెట్టవచ్చు, మీ అర్థం చెప్పుకోవచ్చు, అపార్థం చేసుకోవచ్చు, వక్రీకరించ వచ్చు, అస్తవ్యస్తం చెయ్యెచ్చు. మీకిష్టమైనట్టు మీరు చేసుకోండి, అంతేకాదు, నా అంగీకారం గాని, మరెవ్వరి అనుమతి గాని లేకుండా మీరే గ్రంధకర్త అని దావా చేసుకోవచ్చు ”*

**-- యు.జి.**

# కృతజ్ఞతలు

ఈ పుస్తకాన్ని అనువదించడంలో నన్ను ప్రోత్సహించి, అవసరమైన సలహాలను సవరణలు నాకందించి, ఎడిటింగ్, ఫార్మేటింగ్, లో అన్నివిధాల సహాయ సహకారాలనందించి, యీ పుస్తక ముద్రణకు కారణభూతులైన, యుజీ క్రిష్ణమూర్తి గారి మిత్రులు J.S.R.L. నారాయణమూర్తి (USA) గారికి నా కృతజ్ఞతాభివందనలు. కవర్ డిజైనింగ్ లో ముఖ్య పాత్ర వహించిన నారాయణమూర్తి గారి సతీమణి శ్రీమతి వెండి మూర్తి గారికి నా ధన్యవాదాలు, అలాగే నన్ను మొదటినుండీ ఎంతగానో ప్రోత్సహించిన యుజీ మిత్రులు కొర్లిమర్ల చంద్రశేఖర్ (బెంగుళూరు) గారికి, Dr. Raj Mehta (USA) గారికి, మరియు సంకలన కర్త Rodney Arms గారికి నా కృతజ్ఞతలు.

జోశ్యుల సీతారామ సుబ్రహ్మణ్యం

Hyderabad, India, 9440724540,

josyulass4@yahoo.com

# అనువాదకుని గురించి

పుట్టుక 1949 జూన్ 26 న పశ్చిమ గోదావరి, పాలకొల్లు పక్క పల్లెటూరులో. పెరిగింది సఖినేటిపల్లి పాలెంలో. 1966 లో ఆంధ్రా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కాలేజీలో జేరడం. చదువు పాడైనా, ఠాగోర్, గాంధీ, వివేకానంద, శరత్ చంద్ర, ప్రేమ్ చంద్, గోపీచంద్, చలం, బుచ్చిబాబు, రావిశాస్త్రి, కార్ల్ మార్క్స్, శ్రీ శ్రీ మొదలైన వారి  పుస్తకాలు చదివే అవకాశం దక్కింది. చుట్టూ కనపడే దారిద్ర్యం, అన్యాయం, అవినీతి కమ్యూనిష్టు భావాలు రేపేయ్. అప్పటి రచనా వ్యాసంగం కొన్ని కథలు కవితలతో ఆగిపోయింది. అప్పుడే జరిగింది, అంధ విశ్వాసాల నుండీ, ఛాందస  సంప్రదాయ సంస్కృతుల నుండి శాశ్వత విముక్తి. తరవాత కాకినాడ JNTU M.Tech.  చివరిలో BHEL లో ఉద్యోగం రావడం, చదువుకు స్వస్తి చెప్పి ముప్పై సంవత్సరాలు కర్తవ్య నిర్వహణలో పూర్తిగా మునగడం, 2003 లో డిప్యూటీ జనరల్ మేనేజర్ పదవిలో స్వచ్ఛంద ఉద్యోగ విరమణతో జీవం కొంత స్వేచ్ఛా శ్వాస తీసుకోడం జరిగింది.

అప్పటికే వేదోపనిషత్తులు, భౌద్ధం, బైబిలు, ఖురాన్, పతంజలి, రజనీష్, మహేష్ యోగి, ముఖ్యంగా జిడ్డు కృష్ణమూర్తి పుస్తకాలు చదవడం జరిగింది. 2009 లో God, Mind, Time & Free Will అనేవి లేవనే 4 వ్యాసాలు  ఫిలాసఫీఫోరం2 @Yahoogroup.com పెట్ట బడ్డాయ్. కొన్ని శేష ప్రశ్నలకు జవాబులు ఇంకా ఆకాంక్షిస్తున్న తరుణంలో, జూన్ 2015 లో, ఒక మిత్రుని ద్వారా యు.జి. కృష్ణమూర్తి గురించి వినడం, ఇంటర్నెట్ లో పెట్టబడిన యుజీ పుస్తకాలన్నీ చదవడం, యుజీ లో ఏదో తెలియని కొత్తదనం కనిపించి ఈ పుస్తకానికి  తెలుగులో అనువాదం ప్రారంభించడం, అన్నీ మూడు వారాల్లో జరిగి పోయాయ్.

'ఇకపై ఏ ప్రశ్నలూ లేని స్తితే ఇది' అంటాడు యుజీ, అదేమిటో… ఆయన ఇంకా ఏమంటున్నాడో మీరే చదవండి.

----------

# విషయసూచిక

# ప్రవేశిక

జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణమూర్తి



[Dr.జె.ఎస్.ఆర్.ఎల్. (జగర్లపూడి శ్రీ రామ లక్ష్మి) నారాయణమూర్తి గారు 1934 లో నరసరావుపేటలో పుట్టారు. తత్త్వశాస్త్రం అధ్యయనం చేసి, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో M.A., University of California, Berkeley లో Ph.D. సంపాదించు కున్నారు. *'తెలుగు విజ్ఞానసర్వస్వం, మతము దర్శనములు'* సంపుటానికి సహాయ సంగ్రాహకులుగా ఒక సంవత్సరం (1958-59), తత్త్వశాస్త్ర ఉపన్యాసకులుగా అంధ్ర విశ్వవిద్యాలయంలో మూడు సంవత్సరాలూ (1959-62), కాలిఫోర్నియాలోని మాంటెరే పెనిన్సులా కాలేజీలో 26 సంవత్సరాలు పనిచేసి 2000 సంవత్సరంలో రిటైరయ్యారు. విజ్ఞాన సర్వస్వంలో పనిచేస్తున్నప్పుడు అనేక వ్యాసాలు తెలుగులోకి అనువాదం చెయ్యడమేకాక, ఎన్నో వ్యాసాలు స్వంతంగా రచించారు. తత్త్వశాస్త్రంలో కొన్ని వ్యాసాలు ప్రచురించడమే కాకుండా, ఎలియట్

రాబర్ట్స్ అనే కవితోనూ, జూలీ పెలింగ్స్ తోనూ, సారీస్ గారి తోనూ కలిసి చలం గారి 'సుధ' అనే కవిత్వం పుస్తకాన్నీ, (Motilal Banarsidass/UNESCO, Delhi 1990), కొన్ని వేమన పద్యాల్నీ (*Selected Verses of Vemana* (ఏర్చబడ్డ వేమన పద్యాలు), (Sahitya Akademi, New Delhi, 1995) ఇంగ్లీషులో కి అనువదించారు. గోరాగారి *'నాస్తికత్వం'* అనే పుస్తకాన్నీ (నాస్తికకేంద్రం, విజయవాడ, 2007), కొర్లిమర్ల చంద్రశేఖర్ గారు యూజీని గురించి రాసిన నోట్ బుక్స్ ని ('Stopped in Our Tracks', Stories of U.G. in India' (Smriti Books, New Delhi, 2005) ఇంగ్లీషులోకి అనువదించారు. యూజీ కృష్ణమూర్తిగారితో 26 ఏళ్ళుగా సాంగత్యం ఉండేది. ఆయన పుస్తకాల్ని కొన్నింటిని ఎడిట్ చేసి వాటికి ఉపోద్ఘాతాలు రాయడమే కాకుండా, *Being Yourself* (స్వ-ప్రచురణ, 2014 – Amazon.com) అనే పుస్తకంలో యూజీని గురించి, ఆయనతోటి సాంగత్యంగురించీ, అయనతో గడిపిన సమయాలను గురించీ, ఆయన బోధలు గురించీ, ఆయన బోధనా విధానం గురించీ వ్యాసాలు రశారు. ప్రస్తుతం భార్య వెండిగారితో కాలిఫోర్నియాలోని సీసైడ్ లో నివాసం. యుజీ కృష్ణమూర్తి గారితో నారాయణ మూర్తి గారి కొన్ని అనుభవాలూ, యుజీ గురించి ఆయన ఏమంటున్నారు అన్నది ఈ కింద చదవండి.]

1990 లో అనుకుంటాను – నేను నా కుటుంబంతో సహా యూజీతో బెంగుళూరులో చంద్రశేఖర్, సుగుణ గార్ల ఇంట్లో ఒక వారం రోజులు గడిపిన సందర్భంలో అయన అన్నారు అకాశవాణి దూరదర్శన్ వారు ఆయన్ని TVలో తెలుగులో ఇంటర్వ్యూ చేస్తామని అడిగారనీ, ఆయన దానికి ఒప్పుకోలేదనీ. నేనప్పుడు ఆయనతో అన్నాను: చూడండి, యూజీ, మీరు ఒప్పుకుంటే నేను మీతోకూడా వచ్చి మీకు సహాయం చేస్తానన్నాను. ఆయన దానికి ఒప్పుకోలేదు. దానికి ముఖ్యమైన కారణం అయన జీవితంలో చాలా కాలం విదేశాల్లో గడపడం వల్ల తెలుగులో తన భావాలని వ్యక్తపరచుకునే అలవాటు పోయి ఉండడంవల్ల కావచ్చు, లేదా తన భావాలు తెలుగులో వ్యక్తపరచుకోడం అంత సులువు కాదనీ కావచ్చు. అసలు విషయం ఏమిటంటే, ఆయన భావాలని వ్యక్తపరచుకోడానికి ఇంగ్లీషులోనే

ఆయన సరికొత్త పదజాలాన్ని సృష్టించుకోవాల్సివచ్చింది – ఉదాహరణకు, ఆయనకి 49వ సంవత్సరంలో జరిగిన మౌలిక పరిణామాన్ని వివరించడనికి సరైన పదం దొరక్క 'calamity' అనే పదాన్ని ఉపయోగించుకున్నారు. దాన్ని చదువరులు అక్షరాలా అర్ధంచేసుకుంటారేమోనని దానికి ఆయన తన స్వంత వివరణని చెప్పారు. మహేశ్ భట్ ఇంగ్లీషులో రాసిన యూజీ జీవిత చరిత్రని చంద్రశేఖర్ తెలుగులోకి అనువదించే సందర్భంలో చంద్రశేఖర్ గారూ, నేనూ అ 'calamity' అనే పదాన్ని ఎలా అనువదించాలి అని యూజీతో చర్చించాం. ఆయనకి జరిగిన మూల పరిణామానికి ఆ పదం ఎంత నిరర్ధకమైనదో తెలిసినప్పటికీ చివరికి 'విపత్తు' అనే పదం సరైనదనే నిర్ణయానికి వచ్చాం.

అలాంటి నేపథ్యంలో, యూజీ పుస్తకం 'Mystique of Enlightenment' ని తెలుగులోకి అనువదించడానికి జోస్యుల సీతారామ సుబ్రహ్మణ్యంగారు ఎంతో ధైర్యసాహసాలతో ముందడుగు వేయడం ముదావహం. మొదట దాని చిత్తు ప్రతిని ఆయన రాజ్ మెహతా గారికి పంపారు. మెహతాగారు దాన్ని నాకు పంపారు. దాన్ని కొద్దిగా చవిచూచి వెంటనే నేను సుబ్రహ్మణ్యంగారికి ప్రోత్సహిస్తూ రాశాను ఇంగ్లీషులోని భావాలు తెలుగులోకి సరిగానే వచ్చేట్టుగా అనువదించినట్టు కనబడుతోందని. అది ఈపాటికి ఒక సంవత్సరం క్రితం. అప్పటినించీ ఆయన నా సూచనలనూ, చంద్రశేఖర్ గారి సూచనలనూ దృష్టిలో ఉంచుకుని తన అనువాదాన్ని తిప్పి రాశారు. యూజీ స్వత: పుస్తకాలంటూ ఏమీ రాయలేదు. ఆయనతోటి పలువురు చేసిన సంభాషణలనే సంకలనంచేసి పుస్తకాలుగా ప్రచురించారు. నా ఉద్దేశంలో ఆ పుస్తకాలన్నింటిలోనూ ఇదే ప్రథమమూ, తక్కిన పుస్తకాలన్నిటికంటే ముఖ్యమైనదీనూ.

***

ఒకసారి నేను లారీ మారీస్ అనే స్నేహితుడు యూజీని గురించి రాసిన '*సహజ మానవుడు*' (*Natural Man*) అనే కవిత్వం పుస్తకం ఉపోద్ఘాతంలో ఇలా రాశాను: "ఒకప్పుడు యూజీ అనే వ్యక్తి ఉండేవాడు. అందరిలాగే అతనూ పెరిగి పెద్దవాడయ్యాడు; చదువుకోవడానికి బడికెళ్ళాడు; వివిధమైన ఆధ్యాత్మిక

సాధనలన్నీ చేశాడు; పెళ్ళి చేసుకున్నాడు; ఆయనకి పిల్లలు పుట్టారు. తరవాత ఆయనకి పిచ్చెక్కినంత పనయింది. ఆ తరవాత ఏదో యాదృచ్ఛికంగా ఆయనకు ఆ 'విపత్తు' అనేది జరిగింది. దాంతో ఆ వ్యక్తి అంతరించాడు. భౌతిక శరీరం ఇంకా ఇక్కడే ఉంది. కొన్ని కొన్ని అలవాట్లూ, అభిరుచులూ, ప్రేరణలూ, స్మృతులూ ఇంకా ఉన్నాయి. అయితే వాటినన్నింటిని కలిపి ఉంచే వ్యక్తి ఇప్పుడు లేకపోవడం వల్ల ఇదివరకు వాటి వెనకాల ఉన్న బలం పోయింది." (*ఇంగ్లీషునించి నా అనువాదం.*)

ఈ పుస్తకంలో కొన్ని ఆయన జీవిత విశేషాలే కాక, ఆయన అనే అతి ముఖ్యమైన విషయాలుకూడా ఉన్నయ్యి. నాకు ఆయనతో 1980 ప్రాంతాల్లో పరిచయమైన కొత్తల్లో ఆయనతోటి సంభాషణలు ఈ విధంగానే ఉండేవి. కొద్ది సంవత్సరాల తరవాత ఆయన TV, రేడియో ఇంటర్వ్యూలు ఇవ్వడం ప్రారంభించారు. మరికొన్ని సంవత్సరాల తరవాత, రాజ్నీశ్(రజనీష్, OSHO) మాజీ శిష్యులు (రాజ్నీశ్ మరణం తరవాత) రావడం ప్రారంభించినప్పటినించీ ఆయన ఆ సీరియస్ చర్చలు తగ్గించేసి, చాలా సేపు మౌనంగా కూర్చునేవారు (ఆ శిష్యులు అప్పుడు ధ్యానంలో కళ్ళుమూసుకుని కూర్చుండేవారు. చివరి సంవత్సరాల్లో ఆయన అదీ మానేసి లూయిస్ అనే అమెరికను యువకుని సాంగత్యం ఆధారంగా అతనితో ఆడుకుంటూ పరాచికాలాడుతూ కాలం గడిపేవారు. ఆయన ఏది చేసినా (చెయ్యకపోయినా), ఆయన సాన్నిధ్యం ఉదయం నించీ రాత్రి వరకు ప్రతిరోజూ (ఆయన చనిపోయే పదిరోజుల ముందువరకూ కూడా) అందరికీ లభిస్తూ ఉండేది. ఆయన ఏమీ కష్ట పడుతున్నట్టు మనకు కనిపించకపోయినా, ప్రతిరోజూ శెలవు రోజంటూకూడా లేకుండా అంత కష్టపడి పనిచేసేవారిని మరొకరిని నేను చూడలేదు.

కొంచెంలోతుగా చూస్తే ఆయనకి ధనమంటే, కీర్తి అంటే ఆసక్తి లేదనీ, తనకి అనుయాయులూ, శిష్యులూ కావలసే తాపత్రయం అసలే లేదనీ స్పష్టంగా తెలుస్తుంది. ఆయన తన దగ్గరకి వచ్చినవాళ్ళతో డబ్బు విషయంలో ఆడుకునే ఆటల్ని కొందరు ధనాకాంక్షగా తప్పు అర్ధంచేసుకున్నారు. ఆయనతో 26 ఏళ్ళుగా సన్నిహిత పరిచయం ఉన్నవాణ్ణి నాకు తెలుసు ఆయనకు ధనం అంటే లెక్క లేదనీ, అంతేకాదు, ఆయనకి శారీరిక, మానసిక సుఖాలమీద వ్యామోహం కూడా లేదనీ.

యూజీతో పరిచయమైన కొత్తల్లోనే నాకు స్పష్టమైంది, ఆయన నేను చేసిన వంటనీ, నా సంపాదకత్వాన్ని మెచ్చుకుంటూ అందరితో గొప్పగా చెప్పుకున్నా, ఆయన నా అహాన్ని పెంచే ఒక్క మాట కూడా ఎప్పుడూ అనలేదు. మరొకరు ఆయన గురించి ఏమన్నా, ఏం రాసినా అవి తనను గురించి కాదన్నట్టు ఉంటారు. ఒకాయన పదేళ్ళు శ్రమపడి ఎంతో మందితో ఇంటర్వ్యూలు చేసి యూజీ జీవిత చరిత్ర రాశారు. దానిని ఎవరో యూజీకి చూపించారు. దాన్లో కొన్ని పేజీలు చదివి 'ఇలా రాసింది నాగురించేనా?' అని ఆశ్చర్యపడ్డారు. నిజంగా ఆయనని ఖండించినా, దూషించినా, భూషించినా ఆయన పట్టించుకునేవారుకారు.

మీరు ఏ నేపథ్యంనించి వచ్చినా, మీ పుట్టుపూర్వోత్తరాలు ఏమైనా, ఆయన మీతో ఎంతో సన్నిహితంగా మెలగ గలరు. మీ లోటుబాట్లు, మీ మెరుగులూ మీరు చెప్పకపోయినా ఆయనకు తెలుసు. ఆయన సాన్నిధ్యంలో నేనే కాక ఎంతో మంది చాలా special గా feel అయ్యేవారు. ఆయనకు దగ్గరగా వచ్చినవాళ్ళకి చాలామందికి తెలుసు: వాళ్ళని ఎంతగా భరతం పట్టించినా, ఆయన అర్థం చేసుకున్నట్టుగా వాళ్ళని మరెవరూ అర్థం చేసుకోలేదనీ, చేసుకోలేరనీ, ఆయన వారివిషయంలో ఏవిధంగా ప్రవర్తించినా అది వారు వారిని అద్దంలో లాగా చూచుకునేందుకేననీ.

1985 ప్రాంతాల్లో ఒకరోజు యూజీ ఉండే వసతిలో వెనకాల ఒక గదిలో పడుకుని పొద్దునే నిద్దరలేచినప్పుడు యూజీ నా గదిలోకి వచ్చారు: అప్పుడు సంభాషణ మధ్యలో నేను అన్నాను: "యూజీ, మీతో సాంగత్యం వల్ల నాకు ఏంపోయినా ఫరవాలేదు; నేను పోయినాకూడా," అని. దానికి ఆయనిచ్చిన సమాధానం: "మీరు పోతే నేనూ పోతాను, సార్." అప్పుడు నాకు గ్రాహ్యమైంది, 'యూజీ' అనేది నా మనో కల్పనే అని.

మరొక రోజున యూజీ apartment లో అలాగే పొద్దునే లేచి, యూజీ గదిలోకి వచ్చినప్పుడు అన్నాను: "యూజీ, ఒక్కొక్క సమయంలో నేను అనుభవించేవి ఏవీ వాస్తవం కాదనిపిస్తోంది, యూజీతో సహా," అని. దానికి ఆయన సమాధానం: "అవును, యూజీ వాస్తవం కాదు."

ఆయనలాగా దేశకాల పరిస్థితులకి అనుగుణంగా క్షణక్షణానికీ మారిపోతుండే వ్యక్తిని నేను నా జీవితంలో చూడలేదు. ఆయనతో shopping కీ వాటికీ వెళుతూ ఒక రోజంతా గడుపుతే మీకే తెలుస్తుంది, రోజు పూర్తయ్యేప్పటికి మీరు డీలా పడిపోతారని. క్షణం క్షణం జరిగే అన్ని మార్పులకు తట్టుకోవడం కష్టం.

యూజీ సమక్షంలో కొంతకాలం గడిపిన వారికి కొందరికైనా అప్పుడప్పుడు చూచాయగా అనిపిస్తూనే ఉంటుంది: ఆయనని చూడడం అంటే విశ్వవ్యాప్తమైన సత్త అనేది దేన్నో చూస్తున్నట్టు. ఆయన చివరి రోజుల్లో కూడా ఆయన మరణ శయ్యపై ఉన్నప్పుడుకూడా, ఆయన ఉండే గదిలోకి ప్రవేశించినప్పుడు ఏదో ఒక గంభీరమైన శక్తి మండలంలోకి ప్రవేశించినట్టు అనిపించేది. ఆ మండలంలో యూజీకీ మీకు మధ్య విభజన ఉండదు.

తన మిత్రులతో ఆయన తరుచూ అంటూండేవాడు: తనచుట్టూ ఏ వ్యవస్థనీ, ఏ సంస్థనీ స్థాపించ వద్దనీ, తన మరణం తరవాత అసలు తననూ తన పేరును కూడా మనసులోనించి తుడిచి పెట్టేసుకోవాలననీ, తను చెప్పిందంతా పూర్తిగా మర్చిపోవాలనీ అంటూండేవారు. ఆయన చనిపోయినప్పుడుకూడా తన శరీరాన్ని తగలపెట్టి అస్తికలని ఏ కర్మకాండా లేకుండా దగ్గరే ఉన్న సముద్రంలో కలిపెయ్యాలని ఆయన మహేశ్ భట్ ని ఆదేశించారు. అలాంటివాడు అవధూత కాక మరేమవుతాడు.

ఒక్కొక్కప్పుడు యూజీ వాణి ఏదో ప్రాచీనకాలానికి చెందిన ఒక మహర్షి నించి వచ్చినట్టుగా వినిపించేది. ఆ వాణి కాలాతీతమైనదిగా, మనకు పరిచయంలేని మరో పరిమాణం (dimension) నించి వచ్చినట్టుగా అనిపించేది. ఒక సారి ఆయన ఉండే apartment లో ముందుగదిలో రాత్రిళ్ళు పడుకుంటూండేవాణ్ణి. ఎందుకో ఆ ఉదయం ఆయన నాముందర నిల్చున్నప్పుడు ఆయన కళ్ళపాపల్లోకి సూటిగా చూశాను: వాటిల్లో ఒక గంభీరమైన అఖాతం కనిపించింది. అక్కడ ఒక వ్యక్తి ఉన్నట్టుగా అనిపించనేలేదు. ఆ రోజునించీ, ఆయన ఎప్పుడూ మనతో మామూలుగా మాట్లాడుతున్నట్టూ, వ్యవహరిస్తున్నట్టూ కనిపిస్తున్నా, 'అక్కడ' ఒక

వ్యక్తి అంటూ ఎవరూ లేరనే భావం అప్పుడప్పుడు కలుగుతూనే ఉండేది. అందుకనే ఆయన స్నేహితులు అంటూ ఉండేవారు: "ఇంట్లో ఎవరూ లేరు," అని!

అంతకుముందు మరొక సారి ఉదయాన్నే గుండ్రంగా ఉన్న టేబులు దగ్గర కూచున్నాను ఆయనకు ఎదురుగా: అప్పుడు ఆయనతో అన్నాను: "యూజీ, మీకూ నాకూ మధ్య అంతరంలేదనీ, మనిద్దరం మధ్యంతరంలేని ఒకేఒక వ్యక్తిగా ఉన్నాం అని అప్పుడప్పుడు నాకనిపిస్తుంది," అని. దానికి ఆయన సమాధానం, "నాకెప్పుడూ అలాగే ఉంటుంది," అని.

యూజీ చెప్పేది వినడం వల్లా, ఆయన సంభాషణలను పుస్తకాల్లో చదవడంవల్లా, ఆయనతోటి సంపర్కం వల్లా ఏమిటి ఒరుగుతుందీ అనే పెద్ద ప్రశ్న ఒకటి వెయ్యక తప్పదు: ఒకసారి 2004 సంవత్సరం చివర్లో ఆయన దర్శనానికని ఇద్దరు పుస్తక ప్రచురణకర్తలు వచ్చారు. అప్పుడు వారితో సంభాషించడానికని అక్కడే ఉన్న నన్ను దగ్గరికి వచ్చి కూర్చోమన్నారు. ఎవరు వేశారో గుర్తులేదు గాని, ఆ ప్రశ్నే ఉదయించింది: దానికి అదివరకటిమల్లే నేనిచ్చిన సమాధానం: "యూజీ చెప్పిన మాటలు వినడం వల్ల మీరు అన్నీ నష్టపోతారు. మీ నమ్మకాలూ, మీ ఆశలూ, మీ భావాలూ, మీరు విలువకట్టే వన్నీ కోల్పోతారు. అయితే మిగిలేదేమిటి అని మీరడగొచ్చు. వాటి స్థానంలో మరేమీ ఉంచుకోనవసరం లేదని యూజీ అంటారు. ఫలితం ఏమీలేకుండా ఉండడమే. "మీకు ఊతలేవీ అవసరంలేదు. మీరు లేచి నిలబడి నడవండి. ఒకవేళ కింద పడితే, మళ్ళీ మీరే లేచి నడవగలరు," అని యూజీ అంటారు.

యూజీ పరిచయంతో మీకు కొన్ని కొన్ని విషయాలు తెలుస్తాయి: యూజీనీ ఆయాన చెప్పేమాటల్నీ మనం అర్థం చేసుకోలేము. అది అసంభవం. దానికి ముఖ్యమైన కారణం ఆయన చెప్పే మాటలు ఒక్కొక్కప్పుడు అహేతుకంగానూ, పరస్పర విరుద్ధంగాను కనిపిస్తాయి. ఆయనే ఎప్పుడూ అంటూనే ఉండేవారు: 'నన్ను ఎప్పుడు ఏదో చట్రంలో పెట్టి బిగించాలని చూస్తూనే ఉంటారు, కాని అది అసాధ్యం." ఒకసారి నన్ను నేను ప్రశ్నించుకున్నాను: "నువ్వు ఎందుకు యూజీని అర్థంచేసుకోవాలనుకుంటున్నవు?" అని. నాకు దాని సమాధానం వెంటనే

మనసుకు తట్టింది: "నువ్వు దాన్నించి ఏదో రాబట్టుకోవాలనుకుంటున్నావు కనక. నీకు అదేదీ అవసరంలేనప్పుడు ఆయన్ను అర్థం చేసుకునే అవసరమేలేదు." ఆనాటినించీ నేనెప్పుడు యూజీని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించలేదు.

మీరు ఏమాటన్నా ఆయన దానికి ఆయన ప్రతి చెప్పడమూ, దాన్ని తిరస్కరించడమూ చాలమందికి ఉన్న అతి సాధారణ అనుభవం. నేను ఒకసారి ఆయనతో అన్నాను: "అవతలవాళ్ళు ఏది చెప్పినా మీరు షూట్ చేస్తుంటారు," అని. దానికి ఆయనిచ్చిన సమాధానం: "నేను షూట్ చేస్తున్నాను, కానీ మీరే నక్కుతూంటారు, తప్పించుకోడానికని." దైనందిన జీవితానికి ఆలోచన ఎంత అవసరమైనప్పటికీ అది మానవుడికి ఎంత ముప్పు తెచ్చిపెట్టిందో ఆయన స్పష్టంగా నిరూపించి చూపగలరు.

ఒక్కొక్కప్పుడు యూజీతో అనేవాణ్ణి, మీరు చెప్పేది అందరు వినేలా రచ్చబండమీద చెపుతే జనం మీ చర్మాన్ని ఒలిచి మిమ్మల్ని చంపేస్తారు, ఏసుక్రీస్తుని చంపిననట్టుగా. మీరు చెప్పేది మానవవజాతి అలోచనా క్రమానికీ, సంస్కృతికీ, జీవనానికీ ముప్పు తెస్తుంది.

యూజీలాంటివాళ్ళు ప్రపంచంలో కోటిలో ఒక్కరుకూడా ఉండరు. యూజీ అనేవారు: "వందకోట్లలో ఒక్కడు ఉండొచ్చు." అది విన్న ఒకాయన దానిమీద జోకు వేశాడు: సరే, మీరొకరున్నారు, మరి తక్కిన ఐదుగురూ ఎక్కడున్నారు?" అని.

******

హాస్యం అటుపక్కన పెట్టి, అడగాల్సిన ప్రశ్న ఇది: మరి ఆయన చెప్పేది ఎవరికీ అర్థం కాదనుకున్నప్పుడు, ఆయన చెప్పిన వాటిని చదవడం ఎందుకూ అని. దానికి ముఖ్యమైన సమాధానం: మనలో చాలా మందికి జ్ఞానోదయం, మోక్షం లాంటివాటిమీద చాల వ్యామోహం ఉంది: మనలో కొందరు దానికోసం జీవితాల్నికూడా వెచ్చించిన వారున్నారు. యూజీని చదివితే బావుకునేది ఏదీ లేకపోవచ్చుగాని, ఆయన చెప్పేది జాగ్రత్తగా వింటే ఆ వ్యామోహం మాత్రం వదిలి పోతుంది. ముఖ్యంగా ఆయన చెప్పేదేమిటంటే మోక్షకాంక్ష అంటే మనం జీవితం సతతమూ సుఖమయంగా ఉండాలనీ, కష్టం ఒక్క క్షణం కూడా లేకుండా ఉండాలని

కోరుకోవడమే. అది అంతా ఒక భ్రాంతి అనీ, జీవితం సదా సుఖమయంగా ఉంచుకోడం అసంభవమనీ తెలిసినప్పుడు, ఆ మోక్షకాంక్షకూడా పోతుంది.

తరతరాలుగా కలుగుతూన్న మానవ సంక్షోభం గురించి మాట్లాడడమే ఆయన ధ్యేయం. అయితే, ఆయన ఒక బుద్ధుడు లాగానో, యేసుక్రీస్తులాగానో, జిడ్డు కృష్ణమూర్తి లాగానో మనమున్న పరిస్థితి పరిష్కారానికి ఒక మార్గాన్ని చూపడు. అసలు ఒక మార్గాన్ని వెతుక్కోవడమే పెద్ద సమస్య అని ఆయన అంటారు.

మన సమస్యలకి ముఖ్య కారణం మనం ప్రస్తుతం ఉన్న స్థితిలో ఉండకుండా అంతకంటే మెరుగైన మరో స్థితిలో ఉండాలనుకోవడమే. మన చుట్టూ ఉన్న సమాజం మనలో ఒక పరిపూర్ణ మానవుడనే భావాన్ని కల్పించి దానికోసం సతతమూ పాకులాడాలని మనని ప్రోత్సహిస్తుంది. ఆ భావమే మనలో సంఘర్షణని ప్రవేశపెడుతుంది. అంతేకాదు, నేను, నేను ఉండాల్సిన ఆ స్థితి అనే విభజనని కూడా కల్పిస్తుంది. ఆ విభజనే సంఘర్షణ; అదే మన క్షోభకి కారణం.

ఆ నేను అనే భావం మనలో సంఘర్షణని కల్పించడమే కాదు, మనకూ మన సమాజానికీ, మన ప్రపంచానికీ మధ్యకూడా విబేధాన్ని కల్పిస్తుంది. ఆ నేను అనేది సుఖాన్ని కోరుకుంటూ కష్టాన్ని పక్కకి నెట్టడానికి సదా ప్రయత్నిస్తూంటుంది. ఇలాంటి జీవనంలో మనం సుఖం అనుకునేది కూడా బాధాపూరితమైనదే. ఎందుకంటే మనం కోరుకున్నది జరుగుతుందా జరగదా, వస్తుందా రాదా అనే ఆవేదనే కాకుండా, మనం సుఖాన్ని "ఇది సుఖం" అని అనుభవించినప్పుడు, తత్క్షణంలోనే అలాంటిది శాశ్వతంగా ఉండాలనీ, లేదా అలాంటిది మరేదైన కావాలనే అన్వేషణలో ఆందోళణ పడిపోతాం. అది లేకపోతే నాకు జరగదు అనే ఊహలో పడి అస్వస్థత చెందుతాం. ఈ అస్వస్థత మన జీవితం అంతా వ్యాపిస్తుంది. దాన్నించి దూరంకావడానికనే శాంతిని అన్వేషిస్తూ మోక్ష మార్గాలని వెతుకుతాం. ఈ మార్గాలని పట్టి సాధన అనే పేరుతో మన జీవితాన్ని, ఆస్తినీ, కుటుంబాన్నీ వెచ్చిస్తాం.

ఇవన్నీ ఒక ఆస్తికుడికీ ఆధ్యాత్మికుడికీ జరిగే విషయాలే కావు; సాధారణ మానవుడెవడికైనా ఇలాంటి అశాంతి, అస్వస్థత తప్పవు. ఎందుకంటే అస్వస్థతని

కలిగించే మానసిక సామగ్రి అందరిలోనూ సమానంగానే ఉంటుంది. అది నేను మరొకడిలాగా ఎప్పుడు గొప్పవాడినవుతాను, ధనవంతుడవుతాను, కీర్తివంతుడవుతాను, వాడికున్న సుఖమూ, అధికారమూ, స్థితీ, పదవీ, ఆస్తీ, స్త్రీ లాంటి వన్నీ నాకెప్పుడు కలుగుతాయి, నాకు ప్రస్తుతం ఉన్న న్యూనతా భావమూ, భయమూ, అవమానమూ, దుఃఖమూ ఎప్పుడు పోతాయి -- ఇలాంటి వేదనా, వ్యామోహమూ, ఆతృతా ఉన్నంతవరకూ మనకు అశాంతీ, ఆందోళనా అస్వస్థతా తప్పవు. అంతేకాదు, ఇవి పోగొట్టుకోడానికని మనం అనేక రకాల అఘాయిత్యాలకు కూడా పాలుపడతాం.

ఆందోళన మానవుడికి సర్వసాధారణమైన విషం. అది ఉండడం వల్లనే అతను స్వయంగా బాధని అనుభవించడమేకాక ఇతరులకు కూడా బాధను కలిగిస్తాడు. ఆలోచనాక్రమం వల్ల తాను తనను ఇతరులతో పోల్చిచూసుకుని అల్పంగానో అధికంగానో ఉన్నాననుకుని, తన అల్పత్వాన్ని లేకుండా చేసుకునేందుకని ఎంతో శ్రమని వృథా చేస్తాడు. తన న్యూనతని ఒప్పుకోకుండా దాన్ని కప్పిపుచ్చి ఇతరులకు ఎంతో బాధని కల్పిస్తాడు. తన భయాన్ని ముఖాముఖీ ఎదుర్కోలేక, ఇతరులకు హాని కల్పిస్తూ హింసను చేపడతాడు.

అంతేకాదు. మనకి ఏదైనా ఒక్కటి కావలనుకుంటే, యూజీ అన్నట్టు, మనకి ఏ సమస్యా ఉండదు. అవ్వాకావాలి, బువ్వాకావలి అనుకుంటాం: ధనమూ, ఆస్తీ, పేరుప్రఖ్యాతులూ అన్నీ కావాలి, అంతేకాక మోక్షమూ కావాలి అంటాం. రెండు సీట్లమీద ఒకే సమయంలో కూర్చోవాలనుకుంటాం. అది అసంభవం. యూజీ అంటారు: “You want all this and Heaven too!”

కొంతమంది మనశ్శాంతికని ధ్యానమూ పూజలూ వగైరా చేస్తూంటారు. అవన్నీ తాత్కాలికంగా ఉపశమనాన్నిస్తాయి కానీ మనం కోరుకునే శాశ్వత శాంతినిగానీ ఆనందాన్నిగానీ ఇవ్వలేవు. అసలు విషయమేమిటంటే ఏ సాధనమూ అలాంటి దాన్ని ఇవ్వలేదు. అంతేకాదు, అసలు శాశ్వతమైన శాంతే కాదు, మరేదీ కూడా శాశ్వతమైనది లేదు అని యూజీ అంటారు. అలాంటిది అసంభవం అనే గ్రహింపు కలిగితే మనకేమవుతుంది?

ఈ సంఘర్షణ, అన్వేషణ అనేవి మనసుకు స్వతః ఏర్పడ్డ రుగ్మతలు. ఇవి మన ప్రయత్నాలవల్లా సాధనలవల్ల పోయేవి కావు. 'నేను' అనేభావం ఉన్నంతవరకూ, అంటే ఆలోచనా క్రమం దాని పని అది చేసుకుంటూ పోతున్నవరకూ వీటిలో ఏమార్పూ రావు. మృత్యు భయంలాంటీ మన భయాలూ అంతే. "మీకు నిజంగా భయం పోవాలని లేదు, ఎందుకంటే, భయం పోతే మీరు పోతారు. అది మీరు ఒప్పుకోరు. అలాగే మనకు ఉండే అశాంతీ, అస్వస్థతా 'నేను' అనేది అవి పోవాలని ప్రయత్నిస్తున్నంతవరకూ అవి అలాగే ఉంటాయి; అంతే కాదు మన ప్రయత్నాలు వాటికి మరింత ఆయుస్సు పోసి బలవత్తరం చేస్తాయి. 'నేను' అనేది ఏమి చేసినా ఆ 'నేను' వేళ్ళువేసుకుని పాతుకుపోయినట్టే.

అలాగే తమ సమస్యలకి పరిష్కారాలకోసం ఆయనని ప్రశ్నలు అడిగేవారికి కూడా అయన చేసే సవాలు అదే: మీ ప్రశ్నలకు మీ దగ్గర ఇదివరకే సమధానాలు ఉన్నాయి. అయితే వాటిల్లో ఏది నిజమో మీకు తెలియదు. అది నిర్ధారణచేసుకోవడానికని నా దగ్గరికి వస్తారు. నేను చెప్పేది నచ్చకపోతే మరో గురువుదగ్గరికి వెళ్తారు. మీ ప్రశ్నకు జవాబు కావాలని మీరు నిజంగా కోరుకోడంలేదు. కారణం, ఆ ప్రశ్న మీరే. ఆ ప్రశ్నపోతే మీరూ పోతారు. కాని అది మీకు సరిపడదు.

యూజీతో ముఖాముఖీ సంప్రదించడానికి వచ్చినవారికి సాధారణమైన అనుభవం.. ఆయన మీ నమ్మకాలనీ, అభిప్రాయాల్నీ ఖండించడమే. అలా కొంతసేపు ఆయనతో మాట్లాడితే మీకే తెలుస్తుంది, మీరు నించున్న నేలకూడా కూలిపోతోందని. అందుకనే నేనంటాను: యూజీని కలిసింతరవాత మీకు మిగిలేది ఏమీ ఉండదు. అన్నీపోతే మీకు ఆయన ఇచ్చేదికూడా ఏమీ ఉండదు. ఏ ఆధారమూ అవసరం లేదంటారు ఆయన.

యూజీ బోధన అంటూ ఏమీ లేదు. ఉన్నది ఉన్నట్టుగా చెప్పటమే ఆయన విశిష్టత. ముఖ్యంగా తను ఏవిధంగా జీవిస్తున్నారో, వ్యవహరిస్తున్నారో వివరించి చెప్పడమే ఆయన చేసేది. ఆయన చెప్పేది ఆవిధంగా వింటూ ఉంటే, ఆయన పుస్తకాలు చదువుతూ ఉంటే, ఆయన విడియో, ఆడియో టేపులు చూస్తూ, వింటు

ఉంటే మీలో ఏమార్పు జరుగుతుందో, మీకూ తెలియదు, నాకూ తెలియదు. యూజీ అప్పుడప్పుడు అంటూ ఉండేవారూ: "నేను చెప్పేది వినడం వల్ల మీకు గతం భారం కొంత తగ్గి తేలికౌతుంది," అని. అది నిజమో కాదో మీరే చెప్పాలి.

యూజీని ఎవరూ అర్ధంచేసుకోలేరు. అంతేకాదు, అర్ధంచేసుకోవడమనే ప్రక్రియకే ఆయన చిచ్చు ఫెడతారు. ఎందు కంటే అర్ధంచేసుకోవడం అంటే 'నేను' అనేది ఇంకా బలం కావడమే. అర్ధంచేసుకోవడనికి ఏమీ లేదని, మీరు అర్ధం చేసుకోవడానికి బుద్ధి అనే ఏ సాధనాన్ని ఉపయోగిస్తున్నారో అది పనికిరాదనీ, మరొక సాధనం ఏమీ లేదనీ ఆయన అంటారు. అలాంటి పరిస్థితుల్లో చేతులు ఎత్తేయడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? ఉంటే ఈ పుస్తకాన్ని చదవండి. చదవడం వల్ల మీకేదో ఒరగబోతోందనుకుంటే మీరు ఈ పుస్తకం జోలికి పోకండి. ఇది మీకు సరైనది కాదు.

--జగర్లపూడి శ్రీ రామ లక్ష్మి నారాయణమూర్తి,

సీసైడ్, కాలిఫోర్నియా, USA,

సెప్టెంబరు 17, 2016.



**యూజీ కృష్ణమూర్తి గారితో నారాయణమూర్తి గారు**



*"జ్ఞానోదయమనేది ఏదీ లేదనేది తనంతట తాను తెలుసుకొన్నప్పుడు, అణ్వేషణ ఆగి పోతుంది. అన్వేషణ ద్వారా 'నేను(self)' నుండి విముక్తి పొందాలని నీవు కోరుకొంటున్నావ్, కానీ 'నేను' నుండి నిన్ను విముక్తి చేసుకోడానికి నీవు ఏదైతే చేస్తున్నావో అదే 'నేను'. ఇంత చిన్న విషయం నీకర్థమయేట్టు నేనెలా చెప్పను? ఎలా అనేది ఏదీ లేదు. అది నేను నీకు చెపితే, ఆ నేను కొనసాగడానికి మరింత బలాన్ని మాత్రమే యిస్తుంది."* **--యు.జి.**

--------------

# ఆంగ్లమూలానికి Alice Furlaud రాసిన ‘ముందుమాట

చాలా మంది గురువులు మాట్లాడే ‘జ్ఞానోదయం’, యు.జి. క్రిష్ణమూర్తి చెప్పే ‘సహజ స్తితి’ తర్వాత చాలా మంది అధ్యాత్మిక సాధకులు కోరుకొంటున్న “ఆ సత్యం”, గురించి, బహుశా ఇప్పటివరకు చాలా ముక్కుసూటిగా వ్రాయబడిన పుస్తకం యిది. యుజీ  సంభాషమల నుండి ఎంపిక చేసుకొన్న ఈ భాగంలో ఆయన ఇప్పటికీ చెపుతున్నదేమంటే, అందరూ చెప్పుకునే ఆ జ్ఞానోదయం అనేది పూర్తిగా ఒక భౌతిక జీవసంబంధిత ఘటన మాత్రమే అని. మనం, సంస్కృతి సంప్రదాయల నుండి, మతపరమైన అధ్యాత్మిక ఆలోచనల నుంచీ, మనిషి పోగుచేసుకొన్న జ్ఞానం నుండి సంపూర్తిగా విముక్తి చెందినప్పుడే ఈ దేహం, తనయొక్క అద్వితీయమైన మేధాశక్తితో, మనిషిని విముక్తి చేసి అతని యొక్క  సహజ స్తితిలో ఉంచుతుంది.

ఆయన స్విట్జర్లేండ్ లో  ఉన్నప్పుడు, ఆయన యొక్క నలభై తొమ్మిదవ ఏట, యుజీ  చెపుతున్న, ఆ “విపత్తు(calamity)” ఆయనకు సంభవించినప్పటి నుండి, యుజీ  ఈ సహజ స్తితిలో జీవిస్తున్నాడు. అప్పటినుండి ఆయనకు  యూరోప్ లోనూ ఇండియా లోనూ, ఈ విషయం మీద ప్రావీణ్యత గల మంచి వక్తగా ఆయన పేరుగాంచాడు. ఆయన సంభాషణలు  మామూలుగా నలుగురూ కూర్చొని సరదాగా మాట్లాడుకునేట్టుగా ఉండేవి. ఒకప్పుడు మెచ్చుకొని, తర్వాత కాలంలో, పనికిరాని పాత చెత్త మాట్లాడే మనిషి అని యుజీ  భావించిన, పేరొందిన ఆద్యాత్మిక వేత్త అయిన  జిడ్డు క్రిష్ణమూర్తి  ఆయన బంధువు కాదు. యుజీ  బహుశా, అధ్యాత్మిక విషయాల్లో  ప్రావీణ్యతగల గురువుల కంటే, లేదా ‘తాము గురువులు కాదనే చెప్పుకొనే గురువుల కంటే అత్యధిక వివాదాస్పదమైన వాడు. ఈయన ఆవేశపూరితంగా మాట్లాడే వాడుగా, అమితమైన ఆగ్రహం కలిగిగించే వాడుగా, మరియు జ్ఞాన-వ్యతిరేక ప్రవక్తగా పిలవ బడ్డాడు.

The Mystique of Enlightenment అనే యీ పుస్తకం ఒక సాధనా మార్గంలో యిప్పటికే ఉన్న వారందరికీ, లేదా ఒక మార్గంలో నడవాలనుకొనే వారందరికీ, ఒక అపూర్వమైన అమూల్యమైన తోడు. అధ్యాత్మిక వ్యవహారాలు ఆమూలాగ్రంగా తెలిసినప్పటికీ, జీవిత కాలమంతా అధ్యాత్మిక సాధనలు చేయడం వల్ల కాక, ఆ సాధనలు చేసినప్పటికీ కూడా, తాను ఏ విధంగా విముక్తి పొందేడో నిర్మొహమాటంగా, సూటిగా తెలియజేసిన, ఒక మనిషి యొక్క వ్యక్తిగత, అంతర్గత జీవిత కధ, యిది.

..... Alice Furlaud

----------



Sitting: Susheel Kumar, Brahmachari Sivarama Sarma, UG, JSRL Narayana Moorty & Mr. Dinesh
Standing: K. Chandra Sekhar with Suguna Garu

--------



K.Chandrasekhar & Suguna with UG at Begaluru ‘Hridaya Vihar'-

2004



UG with Valentine

జ్ఞానోదయ రహస్యం

మొదటి భాగం

# యు.జి.

*(1973 నుండి 1976 మధ్య ఇండియా & స్విట్జర్లేండ్ లో జరిగిన సంభాషణల సంకలనం.)*

*****

నేను జ్ఞానోదయం పొందిన వాడినని ప్రజలు చెప్పుకుంటారు. ఈ పదాన్ని నేను అసహ్యించుకొంటాను -- నా వ్యవహార శైలిని వివరించి చెప్పడానికి వాళ్లకి మరో పదం ఏదీ దొరక లేదు. అంతేకాదు, అసలు జ్ఞానోదయమనేదే లేదని నొక్కి చెపుతున్నాను. నా జీవితమంతా జ్ఞానోదయం కొరకు వెదికి, జ్ఞానోదయం పొందడానికి ప్రత్నించి, చివరికి జ్ఞానోదయమనేదే ఎక్కడా లేదనే విషయం నా అంతట నేను కనుక్కున్నాను. కాబట్టి ఒక మనిషి జ్ఞానోదయం పొందిన వాడా కాదా అనే ప్రశ్నే ఉదయించదు. నేను జ్ఞానోదయం పొందిన వాడనని చెప్పుకునే మన మధ్యలో ఉన్న వారినే కాదు, క్రీస్తు పూర్వం, ఆరవ శతాబ్దపు బుద్ధుడికి కూడా నేనసలు ప్రాధాన్యతనివ్వను. “నాకు జ్ఞానోదయం అయింది” అని చెప్పుకునే మన మధ్యే ఉన్న వాళ్ల సంగతి యిక చెప్పక్కర లేదు, వీళ్లు అన్నీ తేలిగ్గా నమ్మే ప్రజల అమాయకత్వం మీద బతికే స్వార్ధపరులు. మనిషి బయట ఏ శక్తీ లేదు. భయాన్నుండి మనిషి దేవుణ్ణి సృష్టించేడు. అందువలన భయమే మన సమస్య, దేవుడు కాదు

------------

తెలుసుకోడానికి ‘నేను’ అనేదే అసలు లేదన్న సంగతి నా అంతట నేను కనుక్కొన్నాను -- ఈ అవగాహన గురించే నేను మాట్లాడుతున్నది. అది నిన్ను విచ్ఛిన్నం చేస్తుంది. ఇది ఒక పెద్ద పిడుగులా నీ మీద పడుతుంది. నీ పెట్టుబడి అంతా ఒక్కదాని మీదే పెట్టేవ్, ఆత్మ సాక్షాత్కారం (self-realization, తనను తాను

తెలుసుకోడం) అనే దానిమీద! చివరికి హఠాత్తుగా కనుక్కున్నావ్, కనుక్కోడానికి గానీ, తెలుసుకోడానికీ గానీ 'నేను లేదా self లేదా ఆత్మ' అనేది ఏదీ లేదని. అపుడు నీకు అనిపిస్తుంది, "ఇప్పటివరకు నా జీవితంలో నేను చేసినదేమిటి? అంతా వృధా?!" నీ అంతట నీవు తెలుసుకున్న యీ నిజం నిన్ను విచ్ఛిన్నం చేస్తుంది.

-------------

అన్నీ రకాల ఘటనలూ నాకు జరిగేయ్. నేను అన్నిటినీ అనుభవించా, శరీరంలో విరీతమైన నెప్పులు, బాధలు, భరించ లేనివి -- అందుకే అంటున్నా, ఇది నీకు నిజంగానే వద్దంటావ్. నాకు జరిగిన దాంట్లో ఏ కొంచమైనా మీకు తెలిసేట్టు చెప్పాలని, మీకు కొంచమైనా, దాని యొక్క ఓ చిన్న అనుభూతిని, యివ్వాలని నా ఆశ, నేనలా చేయగలిగితే, అపుడు నువ్వు దాన్ని ముట్టుకోడానికి కూడా ఒప్పుకోవ్. నువ్వు దేని వెనకాల పరుగెడుతున్నావో అది లేనే లేదు. అది ఒక మిధ్య. దీని జోలికి పోవడానికే నీవు యిష్ట పడవ్.



మహేశ్ భట్ తో యు.జి.

**యుజీ :** చూడండి, నేనిప్పటికీ అదే చెప్తా నాకు తెలియదని, మీరు ఏ పేరుతో దీన్ని పిలిచినప్పటికీ; జ్ఞానోదయం, స్వేచ్ఛ, మోక్షం, లేదా విముక్తి అనే పదాల్ని

వాడ్డం నాకు యిష్టం లేదు; ఈ పదాలన్నిటిలో రకరకాల అర్థాలు ఉన్నాయ్, ప్రతీ పదం ఒక్కో భావాన్ని తలపిస్తుంది. ఇది నీవు కష్టపడి సాధించేది కాదు. అది దానంతటఅదే జరిగి పోతుంది . ఇది ఒకరికి జరిగి మరొకరికి ఎందుకు జరగదో నాకు తెలియదు.

**ప్రశ్న: అయితే అది మీకు జరిగిందన్న మాట?**

***యుజీ :*** *నాకు జరిగింది.*

**ప్రశ్న: ఎప్పుడు సర్ ?**

**యుజీ** : నా నలభైతొమ్మిదో ఏట. కానీ, నువ్వు కోరుకునే దాన్ని పొందే దిశలో నువ్వు చేసే ప్రతీదీ -- సత్యాన్ని లేదా వాస్తవాన్ని కనుక్కోవడానికి చేసే శోధన -- నీవెప్పుడూ ఉండే నీ యొక్క సొంత 'సహజ స్థితి' నుండి నిన్ను దూరంగా తీసుకొని పోతాయ్. అది నీ కృషి వల్ల సంపాదించేది కాదు, పొందేది కాదు. అందువల్లనే నేను దానికి 'అకారణం'(acausal) అనే పదం వాడతాను. అది సభవించడానికి కారణమేమీ లేదు, కానీ, ఎలాగో ఆ అన్వేషణ ఆగిపోయింది.

ప్రశ్న: **అయితే అది వెదకి సాధించినది కాదంటారా? ఎందుకు అడుగు తున్నానంటే.. మీరు తత్వ శాస్త్రాలు చదివేరనీ, ఆధ్యాత్మికవేత్తలతో కలిసి తిరిగేరని నేను విన్నాను.**

**యుజీ:** చూడండి... ఆ వెదకడం మిమ్మల్ని మీనుండి దూరం చేస్తుంది, అది వ్యతిరేక మార్గంలో నడుస్తుంది. దీనితో దానికి ఏమాత్రం అసలు సంబంధం లేదు.

**ప్రశ్న: ఇది(యీా వెదకడం) జరిగినప్పటికీ అది జరిగింది, దీనివల్ల కాదు, అవునా?**

**యుజీ** : ఇది జరిగినప్పటికీ – అవును అదే సరైన పదం. నువ్వు చేసేదంతా, యిది వరకే నీలో వున్న దాన్ని బయటపడనీయకుండా చేస్తోంది. అందుకే దీన్ని నీ 'సహజ స్థితి' అంటున్నాను. నీవు ఎల్లప్పుడూ ఆ స్థితి లోనే ఉంటావ్. దాని రీతిలో అది వ్యక్తం చేయడాన్ని అడ్డుకుంటున్నదే నీ అన్వేషణే. వెతకడం ఎప్పుడూ తప్పుడు మార్గంలోనే నడుస్తుంది. వేటినైతే నీవు నిగూఢమైనవి, పవిత్రమైనవి అనుకొంటున్నావో- అవన్నీ నీ చైతన్యంలో (consciousness లో) ఉన్న కాలుష్యం.

కానీ, కాలుష్యం అనే పదం మీకు నచ్చక పోవచ్చు.. (చిరునవ్వు..), కానీ ఏదైతే నువ్వు పవిత్రమైనది, పూజ్యమైనది, నిగూఢమైనది అని భావిస్తావో అదంతా కాలుష్యమే.

అందువల్ల నువ్వు చెయ్యగలిందేమీ లేదు. ఇది నీ చేతుల్లో లేదు. అనుగ్రహం అనే పదం నేను వాడ దలచుకో లేదు, ఎందుకంటే ఎవరి అనుగ్రహం అనే ప్రశ్న వస్తుంది. నువ్వేమీ ప్రత్యేకంగా ఎంచుకోబడిన వ్యక్తివి కాదు; దీనిని పొందే అర్హత నీకుంది, ఎందుకో నాకు తెలియదు.

నాకు సాధ్యమయి ఉండి ఉంటే, మీలో ఎవరికైనా సహాయపడ గలిగే వాణ్ని. ఇది నేను యివ్వలేనిది, కారణం.. అది మీ దగ్గరే ఉంది, నేను మీకెందుకివ్వాలి? మీదగ్గర ఇప్పటికే ఉన్న దాన్ని అడగడం హాస్యాస్పదం .

**ప్రశ్న: కానీ నాలో ఆ సహజ స్తితి ఉన్న అనుభూతి నాకు లేదు, కానీ మీకుంది.**

**యుజీ :** కాదు, యిది అనుభూతి చెందడం అనే ప్రశ్న కాదు, తెలుసుకోవడం కాదు; ఇది నీకెప్పటికీ తెలియదు. దీన్ని నీ అంతట నీవు తెలుసుకునే మార్గమే లేదు; ఇది దానంతట అదే వ్యక్తమవడం మొదలౌతుంది. నీవీ సహజ స్తితిలో ఉన్నట్లు నీకు తెలుస్తూ ఉంటుందని కాదు... ఎలా చెప్పాలో నాకు తెలియటం లేదు. నేను యితరుల కంటే భిన్నమైన వాణ్ణనే తలంపు నా స్పృహ లోకి ఎప్పుడూ రాదు.

**ప్రశ్న: మీకు మొదటి నుంచీ యిలాగే అనిపించేదా, మీ గురించి మీకు తెలిసినప్పటి నుండీ?**

**యుజీ :** లేదు, అది చెప్పలేను. మతసంబంధిత వాతావరణంలో పెరిగిన నేను అందరిలాగే దేన్నో వెదకుతూ దేనివెనకాలో పడ్డాను. అందుచేత యీ ప్రశ్నకు బదులివ్వడం కష్టం, ఎందుకంటే నా పూర్వ చరిత్ర మొత్తం లోకి వెళ్ళాలి. జవాబు దొరకచ్చు, నాకు తెలియదు... (నవ్వు..)

--------------

**ప్రశ్న: తెలుసుకోవాలనే ఆసక్తి వల్ల, నచికేతుడిలా, యివన్నీ మీ వ్యక్తిగత జీవితంలో ఎలా జరిగేయో నాకు తెలుసుకోవాలని ఉంది,. మీకు తెలిసినంత వరకు చెప్పండి**

**యుజీ** : చూడండి, యిదో పెద్ద కథ. అంత తేలికైనది కాదు.

**ప్రశ్న: మాకు వినాలని ఉంది.**

**యుజీ** : కాదు, చూడండి, అది మీకు తెలియాలంటే నా మొత్తం జీవితం గురించి చెప్పాల్సి వస్తుంది- దానికి చాలా టైమ్ పడుతుంది. నా జీవిత కథ ఒక పాయింట్ వరకు వెళ్ళి అక్కడ ఆగిపోతుంది- దాని తర్వాత చెప్పడానికేమీ ఉండదు.

నా జీవిత చరిత్ర రాయదానికి ఆసక్తి చూపిన ఇద్దరు రచయితలకూ వేరు వేరు ధృక్పధాలు ఉన్నాయ్. నేను చేసిన ఆధ్యాత్మిక సాధనలు, విద్యాభ్యాసము, మునుపటి జీవితం అంతా కలసి నన్ను అక్కడికి చేర్చేయని ఒకాయనంటాడు. అదంతా ఉన్నప్పటికీ.. దానివల్ల మాత్రం కాదని నేనంటాను (నవ్వు). రెండో రచయితకి 'అదంతా ఉన్నప్పటి కీ' అన్న నా మాటలు 'నచ్చ లేదు, ఎందుకంటే ఓ పెద్ద పుస్తకం రాయడానికి కావలసిన మేటరు దొరకదు కాబట్టి... (నవ్వు). వాళ్ళకి నా ముందు జీవితం ముఖ్యం. ప్రచురణ కర్తలకు కూడా అదే కావాలి.. ఇది సహజం. ఎందుకంటే, 'కారణ కార్యాలు (cause and effect) ముడిపడిన క్షేత్రంలోనే వాళ్ళు వ్యవహరిస్తారు కాబట్టి. అందువల్లే ఇలా జరగడానికి గల కారణాన్ని తెలుసుకొందుకు వారు ఆసక్తి చూపుతున్నారు. అంటే, మనం ఎక్కడ మొదలు పెట్టేమో అక్కడికి తిరిగి వచ్చామన్న మాట, మొదటి గడిలోకి. మనం యిప్పటికీ "ఎలా, ఎందుకు" అనే దాని మీదే శ్రద్ధ చూపుతున్నాం.

నా పూర్వ జీవితానికి ఏమీ విలువ లేదు. అది ఎవరికీ ఆదర్శప్రాయం కాదు, కారణం ఏమంటే, ప్రతి ఒక్కరి బేగ్రౌండ్ ప్రత్యేకమైనది. ప్రతి ఒక్కరి జీవితంలో జరిగే ప్రతీ ఘటనా, దాని రీతిలో అది ప్రత్యేకమైనది. నీ స్తితిగతులూ, పరిసరాలూ, నీ నేపధ్యం వేరు. నీ జీవితంలోని ప్రతి సంఘటనా ప్రత్యేకమైనది.

**ప్ర: ప్రపంచానికి ఓ ఆదర్శ పురుషుణ్ణి ఇవ్వాలనే దృష్టితో నేను అడగటం లేదు. మనం ఒక నక్షత్రాన్ని చూస్తాం, సూర్యుణ్ణి చూస్తాం, చంద్రున్ని చూస్తాం- ఇదీ అంతే, మిమల్ని అనుకరించడానికి కాదు నేనది అడిగింది. నేనడిగేది అసందర్భం కాదేమో - ఎవరికి తెలుసు? అందుచేత అంటున్నా నేను నచికేతుడనని. మీ దగ్గర నుండి నిజం తెలుసుకునే వరకు మిమ్మల్ని వదలదలుచుకో లేదు.**

**యుజీ :** అయితే, మీ ప్రశ్నలకు జవాబులివ్వడానికి మీకు యమధర్మరాజు కావాలి!

**ప్ర: మీరేమీ అనుకోక పోతే మీరే యమధర్మరాజు అనుకోండి.**

**యుజీ :** ఏమీ అనుకోను. కానీ మీరు కూడా నాకు హెల్ప్ చెయ్యండి. ఛూడండి... నేనేమీ చెయ్యలేని స్థితిలో వున్నా. ఎక్కడ మొదలు పెట్టాలో, ఎక్కడ ఆపాలో తెలియడం లేదు. నాకు తెలుసు,(..నవ్వు) నా జీవిత కధాంతా మీకు చెప్పాల్సి వస్తుందని.

**ప్ర: వినడానికి మాకభ్యంతరం లేదు.**

**యుజీ :** నా కథ బయటికి రావడం లేదు.

**ప్ర: మీరు ప్రేరేపించ బడాలి.**

**యుజీ :** నేను ప్రేరేపించబడను. ఒకరిని ప్రేరేపించే వాళ్ళలో నేను ఆఖరి వాణ్ని. మీ తృప్తి కోసం, ఏ విలువా లేని, నా మరో వైపున్న జీవితం గురించి మీకు చెప్పక తప్పదు.

*(ఆయన పుట్టుక 9 జూలై 1918 లో దక్షిణ భారత దేశంలోని ఒక ఉన్నత-మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంలో జరిగింది. పేరు ఉప్పలూరి గోపాల కృష్ణ మూర్తి . ఇంటిపేరు ఉప్పలూరి. ఆయన పుట్టిన కొద్ది రోజులకే తల్లి మరణించింది. ఆయన తాతగారు, మాతామహుడు ఆయన్ని పెంచి పెద్ద చేసేరు, మచిలీపట్నం దగ్గరలో ఉన్న గుడివాడ అనే చిన్న టౌన్ లో.)*

చాలా ఆధ్యాత్మిక వాతావరణంలో నేను పెరిగి పెద్దవాణ్నయ్యాను. మా తాతగారు మంచి పేరున్న వాడు. ఆయనకు బ్లావాట్స్ కీ (దివ్య జ్ఞాన సమాజ స్థాపకులు) & ఓల్కాట్ (Olcott) కాక రెండవ & మూడవ తరం దివ్య జ్ఞాన సమాజ సభ్యులు కూడా తెలుసు. వీరంతా మా యింటికొచ్చే వారు. మా తాత గారు పెద్ద లాయరు, ధనవంతుడు, సంఘంలో పేరున్న వాడు. అయినప్పటికి చాలా పురాతన భావాలు గలవాడు. ఆయన యొక్క పురాతన భావాలు ఒక పక్కా, వీటికి వ్యతిరేకమైన దివ్య జ్ఞాన వ్యవహారం మరో వైపు. ఆయన అదోరకమైన కొత్త పాతల

కలగలుపు మనిషి. ఆయన కొత్త పాతల మధ్య సమన్వయం చేసుకోలేక పోయాడు. అక్కడే నా సమస్య మొదలైయ్యింది.

*(తన కుమారుడు ఎవ్వరూ చెప్పలేనంత గొప్ప స్తితిని పొందడానికే పుట్టేడని, ఆయన తల్లి చనిపోయే ముందు చెప్పిందని, అందరూ యుజీతో తరచుగా చెపుతూవుండే వారు. యుజీ తాత గారు యీ విషయాన్నీ గట్టిగా నమ్మి, యుజీకి విద్యాబుద్ధులు చెప్పించి వృద్ధిలోకి తీసుకొని రావడానికై, తన న్యాయవాద వృత్తిని గూడా వదలేసేడు. యుజీ తాత గారు, అమ్మమ్మ గారు, వారి స్నేహితులూ, యుజీ ఒక "యోగ భ్రష్టుడని" నమ్మే వారు. యోగ భ్రష్టుడంటే మునుపటి జన్మలో జ్ఞానోదయానికి చాలా దగ్గరగా వెళ్ళిన వాడని అర్ధం)*

మా తాతగారు నా విద్యాభ్యాసం సరైన రీతిలో జరగాలనే ఉద్దేశ్యం తో ఒక జ్ఞాన సంబంధిత గంభీర వాతావరణం నా చుట్టూ కల్పించడం కోసం, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు మొదలగు వారి సలహా మేరకు వేద పండితులను జీతమిచ్చి నియమించారు -- కొన్ని కారణాల వల్ల, యీ విషయాలపై ఎక్కువ మాట్లాడ్డం నాకిష్టం లేదు -- ఆ వేద పండితులు వచ్చి, ఉదయం నాలుగు గంటల నుండి ఆరు గంటల వరకు ఉపనిషత్తులూ, పంచదసీ, నైశ్కార్మ్య సిద్ధి, భాష్యాలు, భాష్యాలకు భాష్యాలు మొదలైనవన్నీ- చదివే వారు. ఈ పనికిరానిదంతా ఆ అయిదారేళ్ళ బాలుడు వినాల్సివచ్చేది. అది ఎంత ఎక్కువగా చదివించే వారంటే, నాకేడేళ్లు వచ్చేటప్పటికే అవన్నీ చాలా వరకు నాకు కంఠస్థం అయిపోయాయ్. చాలా మంది సాధువులూ, పీఠాధిపతులూ మా యింటికి వచ్చేవారు. రామకృష్ణ మిషనుకు సంబధించిన వారు మొదలైన వారు, ఎందుకంటే మా తాత గారిల్లు సాధుసంతు జనానికి ఎప్పుడూ తెరిచే ఉండేది. చిన్నతనంలోనే నేను తెలుసుకున్న ఒక విషయం ఏమిటంటే, వీళ్ళంతా తమ్ము తామే వంచన చేసుకొనే కపటులని: వీళ్ళు నమ్మేదొకటి, చెప్పేదొకటి, రహస్యంగా చేసేది మరొకటి. వీళ్ళ జీవితాలన్నీ హంగులూ ఆర్భాటాలూ తప్ప మరేమీ కాదు, శూన్యం. అప్పుడే నా శోధన మొదలయ్యింది.

మా తాత గారు ధ్యానం చేస్తూ ఉండే వారు. (ఆయన చనిపోయారు, ఆయన గురించి చెడ్డగా చెప్పడం నాకు యిష్టం లేదు.) ఆయన రోజూ ఒకటి రెండు గంటలు

వేరే రూములో ధ్యానం చేస్తూండేవారు. ఒక రోజున రెండేళ్ల పిల్లాడు ఎందుకో ఏడవడం మొదలు పెట్టేడు. ఆయన వచ్చి పిల్లాణ్ణి కొట్టడం మొదలు పెట్టేడు, పిల్లాడికి యించుమించుగా స్పృహ తప్పినంత పనైంది. రోజూ రెండు గంటలు ధ్యానం చేసే ఈయన.. చిన్న పిల్ల వాడితో ఈ విధంగా ఎందుకు వ్యవహరించేడు? ఈ సంఘటన నాకు చాలా మానసిక క్షోభను కలిగించింది. (సైకలాజికల్ పదం వాడ్డం నాకిష్టం లేదు. కానీ యిక్కడ తప్పదు). ఈ ధ్యానాల వ్యవహారమంతా ఓ తమాషా తప్ప మరేమీ కాదని అప్పుడు నాకు అనిపించింది. వీళ్ళ జీవితాలు పేలవంగా, శూన్యంగా కనిపించేయ్. వీళ్ళందరూ బ్రహ్మాండంగా మాట్లాడతారు. అందంగా అన్నీ వివరించి చెప్తారు. కానీ వీళ్ళ నిజ జీవితాల మాటేమిటి? వీళ్ళ జీవితాల్లో ఏదో భయాందోళనలు ఉంటాయ్: వీళ్ళు బయట చెప్పేది వీళ్ళ జీవితాల్లో కనిపించదు. వీళ్ల ప్రోబ్లమేమిటీ? -- వీళ్ళను విమర్శించడం నా ఉద్దేశ్యం కాదు. ఇటువంటివి చాలా సార్లు జరుగుతూనే ఉండేవి. నేను గూడా వీళ్లతో చేరిపోయాను: “బుద్ధుడు, క్రీస్తు మొదలైన గొప్ప బోధకులు చెప్పేదాంట్లో ఏమైనా ఉందా? ప్రతి ఒక్కరూ మోక్షం, విమోచన, విముక్తి గురించి మాట్లాడుతున్నారు. అది ఏమిటి? నా అంతట నేను తెలుసుకోవాలి. వీళ్ళందరూ నాకు ఎందుకూ ఉపయోగించని వాళ్ళు. అయినా, వీళ్ళు చెప్పే లక్షణాలు ఉన్న ఉపదేశకుడు ఎవరో ఒకరు యీ ప్రపంచంలో వుండి ఉండాలి. అటువంటి వాడు ఒక్కడైనా ఉన్నాడా అనే విషయాన్ని, నా అంతట నేను తెలుసుకోవాలి”

అపుడు చాలా సంగతులు జరిగేయ్. ఆరోజుల్లో శివానందసరస్వతి అనే ఒకాయన ఉండేవాడు.- ఆయన హిందూమత ప్రచారకుడు. నాకు 14 నుండి 21 ఏళ్ల మధ్య వయసు ఉన్నప్పుడు, తరచుగా ఆయన దగ్గరకు వెళ్ళి ఇంద్రియ నిగ్రహ సాధనలన్నీ చేసేను. (ఇక్కడ అనవసరమైన సంఘటనలను చాలా వరకు వదిలేస్తున్నాను). అంత చిన్నతనంలోనే , మోక్షమనేది ఉందా, ఉంటే దాన్ని నేను పొందాలి, అనే నిర్ణయానికి వచ్చేసేను. మోక్షకాములకు ఆత్మవంచన ఉండదనే విషయాన్ని నాకే గాక యితరులకు గూడ నిరూపించాలనుకొన్నాను. యోగ సాధన చేసేను, ధ్యాన సాధన చేసేను, అన్నిటినీ చదివేను. యోగా శాస్త్ర గ్రంధాలలో

చెప్పబడిన సమాధి, సవికల్పసమాధి, నిర్వికల్పసమాధి లాంటి అన్నీ రకాల అనుభవాలు అనుభూతులు నాకు కలిగేయ్. అప్పుడు నాకు అనిపించింది: "ఆలోచన నువ్వు కోరుకున్న ప్రతి అనుభవాన్ని అనుభూతినీ సృష్టించ గలదు, బ్రహ్మానందం, దైవానుగ్రహం, ఆనంద పారవశ్యం, శూన్యం లోకి కరిగి పోవడం మొదలైన అనుభవాలన్నీ." ఇవి నిజం కాదు, ఎందుకంటే యీ పనులన్నీ నేనే యాంత్రికంగా చేస్తున్నాను గాబట్టి. నా వరకు ఈ ధ్యానాలకు విలువ లేదు. వీటివల్ల నాకేం ప్రయోజనం కనిపించ లేదు."

తరవాత, వయసులోనున్న నాకు సెక్స్ కోరిక చాలా పెద్ద సమస్యగా తయారయింది. "ఇది మన శరీరం లోని ఒక సహజమైన జీవసంబంధిత భౌతికవాంఛ. మరేదో పొందడానికి మనలో చాలా సహజంగా ఉన్న యీ లైగిక వాంఛలను అణగదొక్కి, వీటిని వీళ్ళందరూ ఎందుకు వద్దనుకొంటున్నారు? ఇది (లైంగికేచ్ఛ) మోక్షం, విముక్తి లాంటి వాటి కన్నా ఎక్కువ వాస్తవమైనది, ఎక్కువ ముఖ్యమైనది. ఇది ఒక నిజం- మగ దేవుళ్ళను, ఆడ దేవుళ్ళను తలచు కున్నప్పుడు కలల్లో స్కలనం అయ్యేది – యిటువంటివి నాకు జరిగేయి. నేను తప్పు చేస్తున్నానని ఎందుకనుకోవాలి? ఇది ప్రకృతి సిద్ధమైనది; ఇది కంట్రోల్ చెయ్యడం నా వశం లో లేదు. దీనిని నియంత్రించడానికి ధ్యాన సాధన సహాయపడలేదు. నా చదువు నాకుపకరించ లేదు, నా క్రమ శిక్షణలు నాకు ఉపయోగపడ లేదు. నేను ఉప్పు ముట్టుకోను, కారం సరుకులు తినను. "ఒకరోజు యీ శివానందగారు మామిడి ఊరగాయలు చాటుగా తిండం చూశాను. ఈయన ఏదో పొందడానికి అన్నిటినీ వదిలేడు, కానీ యీ చిన్న విషయంలో గూడా నియంత్రణ పాటించలేకపోయాడు. ఈయన ఆత్మ వంచకుడు." నేను ఆయన గురించి చెడ్డగా చెప్పదలచుకోలేదు. "ఈ రకమైన జీవితం నాకు ఒద్దు" అనుకొన్నాను.

---------------

**ప్ర: మీ 14, 21 సంవత్సరాల వయసులో మీలో లైంగిక కోర్కెలు ఎక్కువగా ఉండేవని మీరు చెప్పేరు, మరి పెళ్లి చేసుకున్నారా?**

**యుజీ :** లేదు, నేను తొందర పడలేదు; నేనాకోరికను ఆపడానికి ప్రయత్నించ లేదు. సెక్స్ కోరిక కలిగినపుడు స్వానుభవంలో అది ఎలా ఉంటుందో చూడాలనుకున్నాను. "ఒక వేళ దాన్ని అలాగే వదిలేస్తే అది ఏమవుతుంది? ఈ వ్యవహారం అంతా అర్థం చేసుకోవాలని అనుకొన్నా: ఈ సెక్స్ కోరికల ప్రేరేపణకు నేనెందుకు సహకరిస్తున్నాను? సెక్స్ గురించి నాకేమీ తెలియదు- అలాంటపుడు, రకరకాలైన శృంగార దృశ్యాలు నాలో ఎలా వస్తున్నాయ్?" ఇదే నా విచారణ (inquiry). ఇదే నా ద్యానం, పద్మాసనంలో కూర్చోవడం తలక్రిందులుగా నించోవడం..కాదు. "ఈ దృశ్యాలను నాలో ఎలా కల్పన చెయ్య గలిగేను?" -- నేనెప్పుడూ సినీమాలు చూడ లేదు, శృంగార దృశ్యాలు, పోస్టర్లు చూడలేదు- మరి ఎలా,.. యీ దృశ్యాలు నా మనసులోకి ఎలా వచ్చాయ్? ఇవి బయట నుండి నా మెదడు లోకి వెళ్ళినవి కావు, లోన ఉన్నవే. బాహ్య ప్రపంచం ప్రేరేపిస్తుంది-- ప్రేరణ బయట నుండి వస్తుంది. కానీ మరో రకమైన ప్రేరణ లోపల నుండి వస్తుంది- ఇది నాకు చాలా ముఖ్యం. బయటి ప్రేరణలు లేకుండా చూసుకోగలను, కానీ లోపల ఉన్నవాటిని, ఎలా తీసెయ్య గలను?" ఇది నేను కనుక్కోవాలనుకున్నా.

తరువాత యీ సంభోగ క్రియానుభవం ఎలా వుంటుందో తెలుసుకోవాలని అనుకున్నా. నాకు సెక్స్ అనుభవం లేనప్పటికీ, ఇది ఎలా ఉంటుందో నాకు తెలుసుననిపించింది. ఇది యిలా కొంత కాలం జరిగింది. ఒక స్త్రీతో సంభోగించడానికి నేను తొందరపడ లేదు. జరిగేది జరగనీ అని వాటిని పట్టించుకోలేదు. అప్పటిలో నాకు పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం లేదు. నా ఆశయం ఒక సన్యాసిగా, ఒక యోగిగా ఉండడం, పెళ్లి చేసుకోడం కాదు. పరిస్తితులు మారేయ్, అప్పుడు నాకనిపించింది, "సెక్స్ కోరిక తీర్చుకోడం కోసమే అయితే పెళ్లి ఎందుకు చేసుకోకూడదు? మన సమాజం అందుకోసమే ఉంది. మరో స్త్రీతో లైంగిక సంబంధం ఎందుకు పెట్టుకోవాలి? పెళ్లి తరవాత సెక్స్ అనుభవం సహజంగా ప్రకటితమవుతుంది"

----------------

నాకు 21 సంవత్సరాల వయసులో, ఒక నిర్ధారణకి వచ్చేసేను, బుద్ధుడూ, జీజస్, శ్రీ రామకృష్ణ, మొదలైన బోధకులు, చిన్న పిల్లల్లా తమలో తాము ఆడుకొన్నారు, తమ్ము తాము వంచించుకొన్నారు, యితరులను కూడా వంచించారని నాకు గట్టిగా అనిపించింది. చూడండి, ఇది యిలా జరిగిఉండదు. "వీళ్ళు మాట్లాడే, వీళ్ళు వివరించే ఆ స్తితి ఎక్కడుంది? వీళ్ళ వర్ణనకి నా జీవనవిధానానికీ ఏమాత్రం పోలిక లేదు. కోపం ఉండకూడదని ప్రతీ వాళ్ళూ చెపుతారు— నేనెప్పుడూ కోపంగానే ఉంటాను. నాలోపల క్రూర ప్రవృత్తులు నిండి ఉంటాయ్. అందుచేత అదంతా అవాస్తవం. నేనెలా ఉండాలో అన్నదాని గురించి వీళ్ళు చెప్పినదంతా అవాస్తవం. వాళ్ళు చెప్పేది నిజం కాదు కాబట్టి అది నన్ను తప్పు దారిలో నడిపిస్తుంది. అవాస్తవాలు చెప్పే జీవితం నాకు వద్దు. నాకు ఆశ ఎక్కువ. ఆశారాహిత్యం గురించి వీళ్ళు మాట్లాడుతారు. ఎక్కడో ఏదో తప్పు ఉంది. నా వరకు అత్యాశ అనేది నిజమైనది, సహజమైనది; వాళ్ళు మాట్లాడేదంతా ప్రకృతి సిద్ధం కాదు. అందువల్ల ఎక్కడో ఏదో తప్పు ఉంది. నన్ను నేను, వంచన చేసుకొని, ఆశారహిత స్తితిలో ఉండడం కోసం నేను మారడానికి సిద్ధంగా లేను. నాలో అత్యాశ ఉండటమనేది ఒక నిజం. ఇదే విషయాలు ఎప్పుడూ మాటాడుతుండే మనుషుల మధ్య బతికేను- ఏ ఒక్కరిలో నిజం లేదని చెప్పగలను. ఒక విధంగా చెప్పాలంటే 'జీవితమంటేనే ఒక విరక్తి, వికారం' ('existentialist nausea') లాంటిది కలిగింది. (ఆ రోజుల్లో యీ పదాలు వాడ్డం తెలియదు. ఇప్పుడు ఆ పదాలు తెలుసు) పవిత్రం, దైవికం అని పిలవబడే ప్రతి దానిపై రోత, అసహ్యం నా శరీరమంతా పాకి, యిటువంటివన్నిటినీ బయటకు నెట్టేసింది. శ్లోకాలు వల్లించడం మానేశా. మతాలను విసర్జించా. యోగా సాధనాలు ఆపేశా. వాటిలో ఏమీలేదు. కానీ, ఇక్కడ ఉన్నది మాత్రం ప్రకృతిసిద్ధమైనది. నేనొక కర్కోటకుడను, రాక్షసుడను. నాలో ఉన్న దంతా హింస- ఇది నిజమైనది. నేను కోరికలతో నిండిపోయాను. వాంఛారహితం, ఆశారాహిత్యం, కోపరహితం అనేవాటికి నా వరకు అర్ధం లేదు. ఇవన్నీ అవాస్తవాలు, అవి అసత్యాలు మాత్రమే కాదు, అవి నన్ను మోసగిస్తున్నాయ్. అందుచేత "ఈ

వ్యవహారమంతా నాకు వద్దు." అని నాలో నేను గట్టిగా నిర్ణయించుకొన్నాను. కానీ ఇది అంత తేలికైన పని కాదు కదా.

అపుడు ఒక వ్యక్తితో నాకు పరిచయమైంది, మేము ఈ విషయాలన్నీ మాట్లాడుకున్నాం. నేను దేనినీ నమ్మక పోవడం వలన, సంస్కృతి, సాంప్రదాయాలకు పూర్తి విరుద్ధంగా మాట్లాడ్డం వలన, నేను నిజమైన నాస్తికుడనని (ఆచరణలో కాక పోయినా) ఆయన కనిపెట్టేడు ఆయన నాతో అన్నాడు. "మద్రాసు దగ్గరలో ఉన్న తిరువణ్ణామలై అనే వూరులో, రమణ మహర్షి అనే ఒకాయన ఉన్నాడు. రండి, వెళ్ళి ఆయన్ని చూసొద్దాం. ఆయన మూర్తీభవించిన హిందూ సాంప్రదాయం." అని సాధువును నేను కలవదలచుకో లేదు. నువ్వు ఒక్కరినీ చూస్తే, అందరినీ చూసినట్టే. నేను ఎప్పుడూ గురువుల కోసం వెదకడం, వాళ్ళ కాళ్ళ ముందు కూర్చొని వాళ్ళ ప్రవచనాలు వినడం లాంటివి చేయలేదు. ఎందుకంటే, అందరు చెప్పేదీ ఒక్కటే. "చేసిందే యింకా యింకా చేస్తూనే వుండు, అది నీకు దొరుకుతుంది" అని. నాకు బోలెడు అనుభవాలు దొరికేయ్. ఆ అనుభవాలన్నీ తాము శాశ్వతంగా ఉండిపోవాలని డిమేండ్ చేసేవి. కానీ శాశ్వతత్వం అనేది ఎక్కడా లేదు. ఈ సాధువులంతా చిత్తశుద్ధి లేనివాళ్లు. పుస్తకాల్లో ఉన్నది నాకు చెప్తారు. బుక్స్ నేను గూడా చదవ గలను. చేసిందే మళ్ళీ మళ్ళీ చెయ్యడం నాకొద్దు. అనుభవాలు నాకు అక్కర లేదు, అవి నాకొద్దు. వాళ్ళ అనుభవాన్ని నాతో పంచుకోవాలనుకుంటున్నారు. అనుభవించడంలో నాకు ఆసక్తి లేదు. అనుభవం గూర్చి చెప్పాలంటే, మతాలు బోధించే అనుభవానికీ లైంగికానుభవానికీ లేదా మరో అనుభవానికి ఏమీ తేడా లేదు. అధ్యాత్మిక అనుభవం గూడా మిగతా అనుభవాల్లాంటివే. బ్రహ్మానుభూతి పొందడంలో నాకు మక్కువ లేదు. వాస్తవానుభవం, సత్యానుభవం మీద నాకు కోరిక లేదు. వాళ్ళు యితరులకు సహాయ పడగలరేమోగాని నాకు సహాయం చెయ్య లేరు. నేను చేసిన దాన్నే మళ్లీ మళ్ళీ చెయ్య లేను. నేను చేసినది చాలు. స్కూల్లో లెక్కల ప్రోబ్లమ్ సాల్వ్ చెయ్యడానికి ప్రాక్టీస్ చెయ్యాలి. సమస్య పరిష్కరించాక సమస్యలోనే సమాధానం ఉన్నదన్నసంగతి మనకు తెలుస్తుంది. అందుచేత సమస్యను పరిష్కరించడానికి

ఎందుకు బుర్ర బద్దలు కొట్టుకోవడం? వీటన్నిటిలోకి వెళ్ళడం కంటే ఆన్సర్ ఏమిటో కనుక్కోవడం తేలికైన పని.

అయిష్టంతో, సంకోచంతో, మనసంగీకరించక పోయినా రమణ మహర్షిని చూడ్డానికి వెళ్ళేను. "అక్కడికి ఓసారి వెళ్ళు, నీలో ఏదో ఒక మార్పు వస్తుంది" అని చెప్పి, అక్కడికి ఆయన నన్ను లాక్కెళ్లేడు. పాల్ బ్రంటన్ రాసిన "సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా", అనే పుస్తకం గురించి మాట్లాడి, ఆ బుక్ నాకిచ్చాడు. రమణ మహర్షి గురించి రాసిన చాప్టర్ చదివేను. "ఒకే. నాకేమీ అభ్యంతరం లేదు, వెళ్ళి చూసొస్తా" అన్నాను.

ఆయన (రమణ మహర్షి) అక్కడ కూర్చొని ఉన్నాడు. ఆయనను చూసిననాకు అనిపించింది, "ఈయన నాకేవిధంగా సహాయ పడగలడు? కామిక్స్ చదువుతూ, కూరగాయలు తరుగుతూ, అక్కడున్న వస్తువులతో ఆడుకొంటున్న ఈయన నాకేవిధంగా సహాయ పడ గలడు? ఈయన నాకేమీ హెల్ప్ చేయలేడు." సరేలే అనుకొని నేనక్కడ కూర్చున్నాను. నాకేమీ అనిపించ లేదు. నేను ఆయనను చూశాను, ఆయన నన్ను చూశాడు. "ఆయన సమక్షంలో కూర్చుంటేనే నీలో ఒక ప్రశాంతతని అనుభూతి చెందుతావ్, నీ ప్రశ్నలన్నీ మాయమౌతాయి, ఆయన చూపులే నీలో మార్పులు తీసుకొస్తాయ్" అని నేను విన్న కధలన్నీ, కధలుగానే మిగిలి పోయాయ్. నేనక్కడ కూర్చునే వున్నాను. నాలో చాలా చాలా ప్రశ్నలున్నాయ్, చిన్న చిన్న సిల్లీ ప్రశ్నలు. "నాలోని ప్రశ్నలు మాయమవలేదు. రెండు గంటలు కూర్చున్నా. అపుడు నాకే అనిపించింది , ఆయన్ని కొన్ని ప్రశ్నలు అడుగుదామని. ఆరోజుల్లో మోక్షం పొందాలనే కోరిక నాకు చాలా గాఢంగా ఉండేది. "మీరు విముక్తి పొందిన వారై ఉండాలి కదా" అని ఆయన్ని అడగాలనిపించింది కానీ, అడగలేదు. "మీ వద్ద ఉన్నది నాకు యివ్వ గలరా" అని అడిగేను. ఆయన జవాబు యివ్వ లేదు. అందుచేత కాసేపటి తర్వాత మళ్ళీ అదే ప్రశ్న వేశాను, " మీ దగ్గర ఎద్దైతే ఉందో అది నాకు ఇవ్వగలరా". అపుడాయన అన్నాడు, "నేను యివ్వగలను, కానీ నువ్వు తీసుకోగలవా" అని. పసిపాపనా! మొదటిసారిగా ఈయన చెపుతున్నాడు, తన దగ్గర ఏదో ఉంది గాని దాన్ని నేను తీసుకోలేనని,

తానివ్వ గలనని. ఇంత వరకు ఎవరూ యిలా చెప్ప లేదు, తాను ఇవ్వగలడు కానీ నేను తీసుకోలేనని ఈయన అంటున్నాడు. అపుడు నాలో నేను అనుకున్నాను, "ఈ ప్రపంచంలో, ఆయన యిస్తానన్నది తీసుకోగలిగిన వ్యక్తి ఉంటే, అది నేనే... కారణం నేను ఏడేళ్లు ఎన్నో యోగ సాధనలు చేశాను కాబట్టి." "నేను తీసుకోలేనని ఆయన అనుకోవచ్చు గానీ నేను తీసుకోగలను" అని నాకనిపించింది, ఆరోజుల్లో నాకు నామీద అంత నమ్మకం ఉండేది..*(నవ్వు...)*

నేనాయనతో ఎప్పుడూ గడప లేదు, ఆయన బుక్స్ చదవ లేదు. అందుచేత ఆయన్ని మరికొన్ని ప్రశ్నలడిగేను, "ఎవరైనా ఒకప్పుడు విముక్తి పొందినట్లు, మరొకప్పుడు విముక్తి పొందనట్లు ఉంటారా?" అని. ఆయన అన్నాడు, "నువ్వు విముక్తుడైన వాడివి, లేదా అసలు విముక్తి అవని వాడివి" అని. నేను మరో ప్రశ్న అడిగేను కానీ అది నాకు గుర్తు లేదు. దానికి ఆయన వింతైన సమాధానం చెప్పేడు, "నిన్ను అక్కడికి చేర్చడానికి మెట్లేమీ లేవు" అని. నేనాయన మాటలను పట్టించుకోలేదు. నాకు యీ ప్రశ్నలతో పని లేదు. ఈ జవాబులు ఏవిధంగా చూసినా నాకు ఆసక్తికరంగా కనబడలేదు.

కానీ "నువ్వు తీసుకో గలవా"- అన్న ఆయన ప్రశ్న నాలో "ఈయన ఎంత దురహంకారి" అనే భావన కలిగించింది. "అది ఏదైనప్పటికీ నేను ఎందుకు తీసుకోలేను? ఆయన దగ్గర ఉన్నదేమిటి?'- అది నా సహజ మైన ప్రశ్న. ఆ ప్రశ్న దానంతట అది యీ విధంగా మారింది: బుద్ధుడు, జీజస్ మొదలైన వాళ్ళందరూ ఉన్న ఆ స్తితి ఏమిటి? రమణ గూడా ఆ స్తితిలో ఉన్నాడా... ఉండి ఉండాలి.. ఏమో... నాకు తెలియదు – ఆయన గూడా నాలాగే ఒక మనిషి. ఆయన నా కంటే ఎలా భిన్నంగా ఉంటాడు? ఇతరులేమంటున్నారు, ఆయనేమంటున్నాడు అన్నది నాకనవసరం; ఆయన చేస్తున్నది ఎవరైనా చెయ్య గలరు. అందులో ఏముంది? ఆయనలో నాలో ఎక్కువ తేడా ఏమీ లేదు. ఆయన గూడా తలితండ్రులకే పుట్టేడు. ఈ విషయాలపై ఆయనకుండే అభిప్రాయాలు ఆయనకున్నాయ్. ఆయనలో ఏదో మార్పు జరిగిందని కొందరంటారు, కానీ నాకూ ఆయనకీ ఏవిధమైన తేడా ఉంది? ఆయన దగ్గర ఏముంది: ఆయన ఉన్న స్తితి ఏమిటి?—అది నా ప్రాధమిక ప్రశ్న,

మూల ప్రశ్న—ఈ ప్రశ్నలు నాలో కదులుతూనే ఉండేవి. "ఆస్తితి ఏమిటో నేను కనుక్కోవాలి. ఆ స్థితిని నాకెవ్వరూ యివ్వ లేరు; నాకు నేనే కనుక్కుంటాను. ఇదివరకెవ్వరూ ప్రయాణం చెయ్యని యీ సముద్రంలో దిక్సూచి లేకుండా, ఏ పడవా లేకుండా, చిన్న తెప్ప గూడా లేకుండా నేను ప్రయాణం చెయ్యాలి. ఈ మనిషి ఉన్న స్తితి ఏమిటో నా అంతట నేను కనుక్కుంటాను." అది నాకు కావాలని చాలా గాఢంగా కోరేను, ఆ కోరికే లేకపోతే, దానికి నా జీవితాన్ని అర్పణ చేసేవాణ్ణి కాదు.

ప్ర: ఈ ఇవ్వడం-తీసుకోడం వ్యవహారం నాకర్థం కాలేదు.

**యుజీ** : "నేనివ్వ గలను కానీ, నీవు తీసుకో గలవా" అని రమణ మహర్షి అన్నదానికి అర్థం ఏమిటో నేనేమీ చెప్పలేను. కానీ ఒక విధంగా, నా సొంత ప్రశ్నను రూపొందించుకోడానికి అది సహాయ పడింది. చూడండి, ఒకవేళ యిప్పుడు ఎవరైనా అలాంటి ప్రశ్న నాకు వేస్తే, 'తీసుకోడానికి ఎవ్వరి దగ్గరా ఏమీ లేదు' అని అంటాను. నీకీవ్వడానికి నేనెవరిని. నాకున్నదే నీకూ ఉంది. మనమందరమూ 25 సన్నిధి స్ట్రీట్ లో ఉన్నాము. 25, సన్నిధి స్ట్రీట్ ఎక్కడ ఉందని నువ్వడుగుతున్నావ్. నువ్వక్కడే ఉన్నావని నేనంటాను. నేనక్కడ ఉన్నట్లు నాకు తెలుసు అని కాదు. నువ్వెక్కడున్నావో తెలుసుకోవాలని ఈ కోరుకోవడమే – నీవా ప్రశ్నను అడగడం

--------------

*(రమణ మహర్షిని గానీ మరే ఆధ్యాత్మిక గురువును గానీ ఆ తరువాత ఎప్పుడూ తాను కలవలేదని యుజీ చెప్పేడు. అంతే కాదు ఫిలాసఫీ సబ్జెక్ట్ పరీక్షలు రాయడానికి తప్ప ఆధ్యాత్మికతకు, భక్తికి సంబంధిత పుస్తకాలను ఆయన మళ్ళీ ముట్ట లేదు.)*

అపుడు నా నిజమైన అన్వేషణ మొదలయ్యింది. నా ఆధ్యాత్మిక, మతపర నేపధ్యమంతా నాలో ఉంది. నా పరిశోధన మొదలయ్యింది. కొన్ని సంవత్సరాలపాటు, మానసిక శాస్త్రం, తత్వ శాస్త్రం (ప్రాత్య, పాశ్చాత్య.. రెండూ), మంత్ర తంత్ర శాస్త్రాలు , ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు, మానవ పరిజ్ఞాన క్షేత్రాలన్నిటినీ అధ్యయనం చేసేను. నా సొంత అభిప్రాయాలను గూడా పరిశీలించేను. నా పరిశోధన కొనసాగుతూనే ఉంది. "ఆ స్తితి ఏమిటి? అనేది నా ప్రశ్న. ఈ ప్రశ్నలో దాని తీవ్రత

దానికుంది. ఈ జ్ఞానమంతా నాకు తృప్తి నివ్వలేదు. ఇదంతా చదవడమెందుకు? నా మాస్టర్స్ డిగ్రీ లో మానసిక శాస్త్రం ఒక సబ్జెక్టు. దురదృష్ట వశాత్తు మా సిలబస్ లో అది ఒక భాగం . మనస్సు(మైండ్) అనేది నాకు అర్థం కాకుండా నన్నుఎప్పుడూ కలవర పెట్టేది, యీ చిన్న కారణం వలన సైకాలజీ సబ్జెక్ట్ మీద నాకు ఆసక్తి ఎక్కువ ఉండేది. "ఈ మైండ్ ఎక్కడ ఉంది?" దీని గురించి కొంత తెలుసుకోవాలి. ఇక్కడ నాలో మనసనేది ఏదీ నాకు కనపడ లేదు. కానీ యీ పుస్తకాలన్నీ మనసు గూర్చి మాట్లాడుతాయ్. కమాన్, ఈ పాత్యాశ్చ మానసిక పండితులేమి చెప్తారో నన్ను చూడనీ. ఒక రోజు మా కాలేజి ప్రొఫెసర్ గారిని అడిగేను, "మనం రోజంతా మైండ్ గురిచే మాట్లాడుకొంటున్నాం, కానీ ఈ మైండ్ (మనసు) అంటే ఏమిటో మీకు పూర్తిగా అర్థం అయిందా?. మనం చాలా పుస్తకాలు చదువుతున్నాం, ఫ్రాయిడ్, Jung, Adler మొదలైన వారు రాసినవి. అదంతా నాకు తెలుసు. పుస్తక్కాల్లోని అర్థాలు, భావాలు, వివరణలు నేను చదివేను. కానీ "మైండ్" అనేదేమిటో మీ అంతట మీరు తెలుసుకున్నారా?" అపుడు ఆయన అన్నాడు "అటువంటి ఇబ్బంది పెట్టే ప్రశ్నలు అడక్కు (నవ్వు...). అవి చాలా అపాయకరమైన ప్రశ్నలు. నువ్వు పరీక్ష పాస్ అవ్వాలనుకుంటే యీ నోట్స్ లు రాసుకో, కంఠతా పట్టు, అవే పరీక్షల్లో రాయ్.- పాసయి డిగ్రీ తీసుకుంటావ్." "నాకు డిగ్రీ మీద ఇంటరెస్ట్ లేదు; మైండ్ గురించి తెలుసుకోవడమే నాకున్న ఇంటరెస్టు."

*(తాతగారు చనిపోయినందు వలన, తన డిగ్రీ పూర్తి చెయ్య కుండానే, యుజీ మద్రాస్ యునివర్సిటి కాలేజీ వదిలి వెళ్ళి పోయేడు. 1943 లో ఆయన వివాహం జరిగింది.)*

"ఆ తరవాత, దివ్యజ్ఞాన సమాజం(theosophical society) తో యిది వరకే నాకు సంబంధం ఉండడం వల్ల థియోసఫికల్ సొసైటీతో పని చేయడం మొదలు పెట్టేను. దివ్యజ్ఞాన సమాజం, జె. కృష్ణమూర్తి, మరియు మా తాతగారికున్న బోలెడు డబ్బు, నాకు వారసత్వం గా వచ్చింది. అందు చేత అవన్నీ నాకెంతో ఉపయోగ పడ్డాయ్. ఆ టైంలో నా వద్ద కావలసినంత డబ్బు ఉంది, ఏభై – అరవై వేల డాలర్లు. దీని వల్ల ఆ రకమైనవన్నీ చెయ్య గలిగేను. థియోసఫికల్ సొసైటీ లో లెక్చరర్ గా

పని చేసేను.(తరవాత యుజీ యీ సొసైటీకి 'ఇండియా' లో జాయింట్ సెక్రటరీ గా ఎన్నుకోబడ్డాడు.) కానీ ఈ పనిలో నాకేమాత్రం యిష్టత లేదు – ఇదంతా ఎవరో యిచ్చిన సమాచారం, ఈ ఉపన్యాసాలు ఇవ్వడం వలన ఉపయోగమేమిటి? ఆ రోజుల్లో నేను మంచి వక్తను. కానీ యిప్పుడు కాదు. అప్పుడు నేను ఒక ఫస్ట్ క్లాస్ స్పీకర్ని. అన్నీ చోట్లా అన్నీ సభల్లో ఉపన్యాసాలు ఇచ్చే వాణ్ని. అన్ని ఇండియన్ యూనివర్శిటీలలో ప్రసంగాలు చేశాను. కానీ నాకివన్ని నిజం కాదు. బుర్ర ఉన్న ప్రతి వాడు యీ పని చెయ్యగలదు, పుస్తక జ్ఞానం పోగు చెయ్యడం తరవాత ప్రసంగ రూపంలో బయటికి విసరడం. “నేను చేస్తున్న పనేమిటి? నేను టైమ్ ఎందుకు వేస్ట్ చేసుకుంటున్నాను? ఈ లెక్చరింగ్ నా జీవనాధారం కాదు. ఇదే నీ జీవనాధారమైతే నేను అర్ధం చేసుకోగలను, చిలక పలుకుల్లా చెప్పిందే చెపుతూ పది రూపాయిలు సంపాదించి జీవనం సాగించక తప్పదు. ఇది నా జీవనోపాది కాదు. కానీ నా ఆసక్తి వేరే దానిలో ఉంది, నా కిష్టమైనది వేరే దాంట్లో ఉంది.”

అప్పుడు *(యుజీ థియోసఫికల్ సొసైటీ తో గడిపిన చివరి రోజుల్లో, late 1940's లో)* జె. క్రిష్ణమూర్తి సీన్ లోకి వచ్చారు. జె.కె అమెరికా నుండి తిరిగి వచ్చి ఆయన యొక్క కొత్త రకమైన ....

**ప్ర: జె. క్రిష్ణమూర్తి మీ బంధువా?**

**యుజీ** : క్రిష్ణమూర్తి పెట్టిన పేరు, యింటి పేరు కాదు. ఆయన యింటి పేరు జిడ్డు, - క్రిష్ణమూర్తి అనే పేరు చాలామంది పెట్టుకుంటారు- పూర్తి పేరు జిడ్డు క్రిష్ణమూర్తి. ఆయన తో కలిసి పని చేసేను. ఆయన వచ్చినప్పుడల్లా సుమారు ఏడు ఏళ్ళు ఆయన ఉపన్యాసాలు విన్నాను. నేనెప్పుడూ ఆయనను వ్యక్తిగతంగా కలవలేదు ఎందుకంటే ఆయన “జగద్గురు(world teacher)” వ్యవహారమంతా ఒక రకమైన దూరాన్ని మా ఇద్దరి మధ్య సృష్టించింది. జగద్గురువుగా తయారు చేయబడడం సాధ్యమా? జగద్గురువులు పుడతారు, తయారు చేయబడరు”. అది అప్పటి నా ఆలోచనా విధానం . దాని నేపధ్యం, దాని వ్యవహారం అంతా నాకు తెలుసు. వాళ్ళ అంతర్గత సర్కిల్ లో నేను సభ్యున్ని కాదు. నేను వాళ్ళ సర్కిల్ బయట ఉన్న వాణ్ని. వాళ్ళ వ్యవహారాల్లోకి తలదూర్చడం నాకు ఏమాత్రం ఇష్టం

లేదు. అక్కడ గూడా అదే ఆత్మ వంచన, అంటే.. వాళ్ళ జీవితాల్లో ఏమీ లేదు, అవి నిస్సారమైనవి -- ఆ పండితులు, దివ్యా జ్ఞానులు, చెప్పుకోదగ్గ మనుషులు, యివన్నీ పై పై ఆర్భాటాలే. ఇదంతా ఏమిటి? దీని వెనకాల ఏముంది?

క్రిష్ణమూర్తి (జిడ్డు) రంగం లోకి వచ్చిన ఏడు సంవత్సరాల తర్వాత పరిస్థితులు మా యిద్దరిని కలిపేయి. ఆయన్ని రోజు కలిసే వాణ్ని. అన్ని విషయాలు మేం మాట్లాడుకొన్నాం. ఆయన యొక్క అవ్యక్త అస్పష్ట భావాల మీద నాకెటువంటి ఆసక్తి కలగ లేదు. ఆయన ఉపన్యాసాలు నాకు నచ్చ లేదు. నేనొక సారి ఆయనతో అన్నాను, "వాడుకలో ఉన్న, మానసిక శాస్త్ర సంబంధిత పదజాలం లోని కొన్ని మాటలు మీరు పట్టుకొని, వాటిని ఉపయోగించి ఏదో చెప్పడానికి మీరు ప్రయత్నిస్తున్నారు. విశ్లేషణ ఉపయోగించి ఒక విషయం నిర్ధారించి, అది విశ్లేషణ వల్ల రాదు అంటున్నారు. ఈ రకం విశ్లేషణలు ప్రజలను నిస్త్రాణ చేస్తాయ్. ఇది ప్రజలకుపయోగించదు. ఇది నన్ను నిర్బలుణ్ణి చేస్తోంది." "మీ దగ్గర ఉన్న దేమిటి? ఇదీ నా ప్రశ్న. మీరు నాపై విసిరే ఆ అస్పష్ట భావాల పై నాకేమాత్రం ఆసక్తి లేదు. అస్పష్టమైన మీ మాటల వెనుక ఏదైనా ఉందా? అదేమిటి? నాకొకటనిపిస్తోంది -- ఎందుకో తెలియదు -- మీరు నాపై విసిరే అస్పష్టమైన భావాల వెనుకనున్నదీ, నేను తెలుసుకోవాలనుకుంటున్నదీ ఒకటేనని. అది నా ఊహ కూడా అవ్వచ్చని ఏ కారణం వల్లనో నాకనిపిస్తోంది. మీరు (అందరికీ తెలిసిన ఒక ఉపమానాన్ని యిక్కడ ఉపయోగిసస్తున్నా..) పంచదార రుచి చూసి ఉండక పోవచ్చు కానీ కనీసం పంచదారను మీరు చూసి నట్టే నాకనిపిస్తోంది, మీరు వివరించే విధానం చూస్తుంటే, మీరు కనీసం పంచదారను చూసి ఉండాలి. కానీ, మీరు పంచదార రుచి చూశారని ఖచ్చితంగా చెప్పలేను."

అలా, మేము సంవత్సరాల తరబడి చాలా కష్టపడ్డాం (పరస్పర అవగాహన కొరకు) (నవ్వు..). మా ఇద్దరి మధ్యా కొన్ని వ్యక్తిగత భేదాలున్నాయ్. నాకు ఆయన దగ్గరనుంచి నిజాయితీగల, నిక్కచ్చయిన జవాబులు సూటిగా కావాలి. కానీ ఆయనకున్న కారణాల వలన, ఆయన నాకు సూటిగా సమాధానాలు ఇవ్వలేదు. ఆయన తనను తాను చాలా సమర్థించుకుంటున్నాడు. ఆయన దేన్నో కాపాడడానికి

ప్రయత్నిస్తున్నాడు. “సమర్థించుకోడానికి మీదగ్గర ఏముంది? మీ గతాన్నంతా చెట్టు మీద వేలాడగట్టి, దాన్ని ప్రజలకు వదిలేయండి. మిమ్మలను మీరు కాపాడుకోడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నారు? ఆయన గతచరిత్ర గురించి నిజాయితీగల తిన్నవైన జవాబులు నాకు కావాలి, కానీ ఆయన యిచ్చిన జవాబులు నన్ను తృప్తిపరచలేదు. చివరికి నేను ఆయన్ని నేను నిలదీసి అడిగేను, “రండి, ఇప్పుడే నాకు చెప్పండి, నామీద విసురుతున్న అర్థం కనపడని మాటల వెనక ఏదైనా ఉందా? అపుడు ఆయన అన్నాడు, “నీ అంతట నీవు దాన్ని తెలుసుకొనే మార్గం లేదు.” అంతే- అదే మా అనుబంధానికి చివరి రోజు. చూడండి, “నాకు తెలుసుకొనే మార్గం లేనపుడు, నాకు తెలియ జేయగల మార్గం మీవద్ద లేనపుడు- ఇంక మనం మాట్లాడుకుని ప్రయోజనం ఏమిటి? అంతా వృధా! నేను ఏడు సంవత్సరాలు వృధాచేసేను. గుడ్ బై!, నేను యీపైన మిమ్మల్ని కలవదలచుకోలేదు.” అని బయటకు వచ్చేసేను.

*(సుమారుగా యీ సమయంలోనే అవ్వచ్చు, తనలో కొన్ని ఆశ్చర్యకరమైన మానసిక శక్తులు కనపడ్డంవల్ల, తనలో ఏమి జరుగుతోందో యుజీకి అర్థం కాలేదు.)*

నా నలభై తొమ్మిదవ ఏటికి ముందు నాకు చాలా శక్తులు, చాలా అనుభవాలు కలిగేయ్, కానీ వాటికి నేను ప్రాధాన్యతనివ్వలేదు. నేను ఒక మనిషిని చూసినవెంటనే, అతడు నాకేమీ చెప్పక పోయినా, అతని భూత భవిష్యత్ వర్తమాన పరిస్తితుల గురించి నాకు తెలిసిపోయేది. నేను వాటిని వాడుకోలేదు. నేను చాలా ఆశ్చర్యపడే వాణ్ని, ఏమీ అర్థం అయ్యేది కాదు. నాకీ శక్తి ఎందుకు కలిగిందో నాకు తెలిసేది కాదు. అప్పుడప్పుడు నే చెప్పినట్లుగానే అన్నీ జరిగేవి. అవి ఎలా జరుగుతున్నాయో, ఎంత ప్రయత్నించినా నాకర్థ మయ్యేది కాదు. “ఈ శక్తి నా దగ్గర ఎందుకు ఉంది?.” అప్పుడప్పుడు నేను కొన్ని విషయాలు చెప్పేవాడిని, అలా చెప్పినవన్నీ ఎప్పుడూ జరిగుతూ ఉండేవి. వాటిని సరదాగా ఉపయోగించడానికి నేను ప్రయత్నించలేదు. వాటి వల్ల కొన్ని అవాంఛనీయ పర్యవసానాలు జరిగి, అవి కొంత మందికి బాధను కలిగించాయి.

*[యుజీ ఉపన్యాసలిస్తూ దేశాలన్నీ తిరుగుతూనే ఉన్నాడు. 1955 లో తన పెద్ద కుమారుని పోలియో వైద్యానికి తన భార్య, నలుగురు పిల్లలతోసహా అమెరికాకు మకాం మార్చేడు. 1961 కి అతని దగ్గర ఉన్న డబ్బంతా ఖర్చు అయిపోయింది. అతనిలో ఉపద్రవకరమైన పెద్ద మార్పులు చోటుచేసుకోవడం మొదలు పెట్టేయ్. వాటిని ఆయన నియంత్రించలేక పోయాడు, ఆయన వాటిని కంట్రోల్ చేయదలచుకోలేదు కూడా. ఇవన్నీ ఆరేళ్లు పాటు జరిగి ఆయన చెప్పే "విపత్తు (calamity)" తో అంతమయ్యాయ్ (ఆయన చెప్పే "సహజ స్తితి లోనికి ప్రవేశం). ఆయన సంసార జీవితం ముక్కలయ్యింది. పెళ్ళాం బిడ్డల్ని ఇండియా పంపించేశాడు. ఆయన, చేతిలో చిల్లిగవ్వ లేకుండా లండన్ చేరేడు, పనీపాటలు లేకుండా రోడ్లమీద తిరుగుతూ మూడు సంవత్సరాలు గడిపేడు. ఆయన అధఃపతానానికి దారి తీస్తున్నాడని ఆయన మిత్రులనుకున్నారు. కానీ ఆ టైములో ఆయన జీవితం, ఆయనకు చాలా సహజంగా గడచినట్టుగా అనిపించిందని ఆయన చెప్పుకున్నాడు. అటుతర్వాత దైవ భక్తులు మాత్రం ఆ రోజులను "ఆత్మ యొక్క కాళ రాత్రి" అంటూ మార్మిక పదాలతో వర్ణించే వారు. కానీ యుజీ దృష్టిలో ఆ సమయం లో ఆయనకు, ప్రాపంచిక సుఖాలకై ప్రాకులాట గానీ, పెద్ద కష్టాల్లో ఉన్నట్టు అనిపించడం గానీ , నిరాశా నిస్పృహలు గాని లేవు, మనసు అసంకల్పంగా అటూ యిటూ చెదరడం, తప్ప.]*

ఆ ఘటనల తరవాత, నాకు తల లేనట్టుగా అనిపించేది. "నా తల ఎక్కడుంది? నాకు తల ఉందా, లేదా? యీ తల ఉన్నట్టుగానే అనిపిస్తోంది. ఈ ఆలోచనలు ఎక్కడ నుండి వస్తున్నాయ్?" ఇవే నా ప్రశ్నలు. తల లేని మిగతా శరీరం మాత్రమే అటూ ఇటూ వెడుతోంది. ఏమీ చెయ్యాలని అనిపించేది కాదు. గాలికి ఎగిరి పడే ఎండుటాకులా, బతుకు హీనంగా గడిచేది. ఇలా చాలా కాలం గడిచింది. ఏం జరిగిందో తెలియదు గానీ, చివరకు ఒక రోజు నాకనిపించింది, "ఈ రకం జీవితం మంచిది కాదు" ముక్కూ మొహం తెలియని వారి దయా దాక్షిణ్యాలతో బతికే నేను... ఎందుకూ పనికి రాని వాణ్ని. మనసులో ఉద్దేశ్యం గానీ సంకల్పం గానీ

ఏదీలేదు. నేనేం చేస్తున్నానో నాకు తెలిసేది కాదు. నేను పిచ్చి వాడిలా ఉండే వాణ్ని. నేను లండన్ లో రోడ్లమ్మట తిరుగుతూ ఉండేవాన్ణి. ఉండడానికి చోటు లేదు. రాత్రంతా వీధుల్లో తిరుగుతూ ఉండే వాణ్ణి. పోలీసు వాళ్ళు ఎప్పుడూ నన్ను ఆపి అడుగుతూ ఉండే వారు, "నీకు ఉండడానికి చోటేమీ లేదా? నిన్ను జైలులో పెడతాం." అని. అటువంటి జీవితాన్ని గడిపేను. పగలు బ్రిటీష్ మ్యూజియంకి వెళ్ళి కూర్చోనేవాణ్ణి, నాకు టికెట్ దొరికేది. అక్కడేం చదవాలి? చదవడానికి ఏమాత్రం ఆసక్తి లేదు. పుస్తకాల మీద ఆసక్తి లేదు. ఏదో ఒకటి చదువుతున్నట్టు నటించాలి కాబట్టి, నేరస్తులు వాడే అసభ్య పర్యాయ పద నిఘంటువు తీసుకొని చదివే వాణ్ణి. రాత్రి ఎక్కడో అక్కడకి వెళ్ళి గడిపే వాణ్ణి. అలా చాలా కాలం గడిచింది.

ఒకరోజు హైడే పార్కులో కూర్చుని ఉండగా ఒక పోలీసువాడొచ్చి, నువ్విక్కడ ఉండకూడదు, నిన్ను బయటకు తోసేస్తాం అన్నాడు. ఎక్కడకెళ్ళాలి? ఏం చెయ్యాలి? డబ్బులు లేవ్. జేబులో అయిదు పెన్నీలు మాత్రమే ఉన్నట్టున్నాయ్. నా బుర్రలో ఒక ఆలోచన ఒచ్చింది. "రామకృష్ణ మిషన్ కు వెళ్ళు." అంతే, ఆ ఆలోచన ఎక్కడనుంచి వచ్చినదో తెలియదు. వేరే దారి లేక, డబ్బులు సరిపోయేవరకు రైల్లో వెళ్ళి, మిగతా దూరం నడచి వెళ్ళేను, రామకృష్ణ మిషన్ స్వామీజీని కలవడానికి. వాళ్ళు "ఇపుడు రాత్రి పదయ్యింది, ఆయనిప్పుడు నిన్నేకాదు ఎవ్వరినీ చూడరు" అన్నారు. నేనిప్పుడే చూడాలని సెక్రటరీతో చెప్పేను. మొత్తంమ్మీద స్వామీజీ బయటికి వచ్చాడు. నా స్క్రాప్ బుక్ (న్యూస్ పేపరు కటింగ్సు వగైరా పెట్టుకున్న పుస్తకం) ఆయన ముందుంచాను. ఆ బుక్కులో నా లెక్చర్లు, వాటిపై న్యూయార్క్ టైమ్స్ వ్యాఖ్యలు, నా బేగ్రౌండ్ అంతా ఉంది. నా అమెరికా మేనేజరు తయారు చేసిన ఆ స్క్రేప్ బుక్ ఎందుకో నా దగ్గరే ఉంచుకున్నాను. "అది ఒకప్పుడు నేను... కానీ ఇప్పుడు నేనిలా." అన్నాను. "మీకేం కావాలి?" ఆయన అడిగేరు. "మెడిటేషన్ రూముకి వెళ్ళి రాత్రంతా అక్కడే కూర్చుంటాను" అన్నాను "మీరది చెయ్య కూడదు, రాత్రి ఎనిమిది తర్వాత మేడిటేషన్ రూము లోనికి ప్రవేశం ఇవ్వరాదని మాకు రూలుంది" స్వామి అన్నారు. అపుడు, వెళ్లడానికి నాకు ఎక్కడా చోటు లేదని చెప్పేను. "మీకొక హోటల్ రూము ఏర్పాటు చేస్తా, ఈరాత్రికి అక్కడ ఉండి రేపు రండి"

ఆయన అన్నాడు. అలాగే ఆరాత్రికి హోటల్ రూములో ఉండి, మరునాడు పన్నెండు గంటలకి వెళ్ళేను. అలసిపోయి ఉన్నాను. వాళ్ళు లంచ్ చేస్తున్నారు. నన్ను గూడా భోజనం చేయమన్నారు. మొదటి సారిగా మంచి భోజనం చేసేను. నేను ఆకలిని గూడా పోగొట్టు కున్నాను. ఆకలిదప్పులు నాకు తెలిసేవి కాదు.

భోజనం తర్వాత నన్ను పిల్చి అన్నారు, "సరిగ్గా మీలాంటి వారికోసమే నేను చూస్తున్నాను. ఇక్కడ ఎడిటింగ్ పనులు చూస్తున్న నా అసిస్టెంట్ మానసిక అనారోగ్యం తో హాస్పిటల్ పాలయ్యాడు. వివేకానంద శతదినోత్సవ పత్రికను నేను తయారు చెయ్యాలి. ఈ పనికి నీవే సరైన వాడివి. దీనికి నువ్వు హెల్ప్ చెయ్య గలవు." అపుడు నేనన్నాను, "నేను రాత పని చేయలేను, ఆ రోజుల్లో ఎడిటింగ్ చేసే వాణ్ని. నేనిప్పుడు చెయ్య లేను. ఇపుడు నేనెందుకూ పనికిరాని వాణ్ని. ఈ విషయంలో నేను మీకు సహాయ పడ లేను." అన్నాను. ఆయన అన్నాడు, "లేదు, లేదు, మనమిద్దరమూ కలిసి ఏదో ఒకటి చేద్దాం." భారతీయ తత్వ శాస్త్రాలు, సంప్రదాయాలు బాగా తెలిసిన ఒక వ్యక్తి ఆయనకిప్పుడు చాలా అవసరం. ఆయనకు ఈ పని చెయ్యడానికి ఎవరో ఒకరు దొరికేవారు. కానీ ఆయన అన్నాడు, "అలా కాదు. నీవు కొంతసేపు విశ్రాంతి తీసుకో, ఇక్కడే ఉండు, నీకు కావసినవన్నీ నేను చూసుకుంటాను." నేను అన్నాను, "సాహిత్యానికి సంబంధించిన పనులు నేను చేయలేను. నాకు ఒక రూమ్ యివ్వండి, మీ పాత్రలు, గిన్నెలు కడుగుతాను, వేరే పనులేమైనా చేస్తాను కానీ ఈ రకమైన పనులను ఒక్కణ్ణీ చేయ లేను." అపుడు ఆయన అన్నాడు, "నాకీ పనే కావాలి." అని. అందుచేత ప్రయత్నించి ఆ పని చేశాను, నాకు ఆయనకూ తృప్తినివ్వక పోయినా. మొత్తం మీద యిద్దరం కలసి సంచికను పూర్తి చేశాం.

ఆయన నాకు అయిదు పౌండ్స్ ఇచ్చేవాడు, మిగతా స్వాముల కిచ్చినట్టు. చాలా కాలం తర్వాత నా దగ్గర అయిదు పౌండ్స్ వున్నాయ్ ఖర్చు పెట్టుకోడానికి. "వీటితో ఏం చెయ్యాలి?" చాలా కాలంగా నా దగ్గర డబ్బు లేనందువల్ల, డబ్బు విలువను గుర్తించ గల శక్తి గూడా పోయింది. ఒకప్పుడు నేను లక్ష రూపాయల చెక్కుపై సంతకం చేసే వాణ్ని. కొంత కాలం తర్వాత జేబులో ఒక్క పైసా గూడా లేని

పరిస్థితి వచ్చింది. ఇప్పుడు అయిదు పౌండులు. దీంతో ఎంచెయ్యాలి? అందుచేత లండన్ లోని సినీమాలన్నీ చూడ్డానికి నిర్ణయించు కున్నాను. మధ్యాన్నం వరకు మిషన్ లో పని చేసి, ఒంటిగంటకు లంచ్ చేసి సినీమాకు చెక్కేసే వాణ్ని. ఒక్కొక్కప్పుడు చూడ్డానికి సినీమాలు మిగిలేవీ కాదు. లండన్ కి దూరంలో ఒక షిల్లింగ్ కి మూడు సినీమాలు చూపించే వారు. అలా సినిమాలన్నీ చూసేసి డబ్బులన్నీ ఖర్చు పెట్టేశాను.

నేను మేడిటేషన్ రూములో కూర్చొని మేడిటేషన్ చేసే వాళ్ళను చూసి ఆశ్చర్య పోతూ ఉండే వాణ్ని. వీళ్ళందరూ ఎందుకు యీ వెర్రి పనులు చేస్తున్నారు, అని నాకనిపించేది. అప్పటికే యిటువంటివన్నీ నా దేహం లోంచి బయటకు పోయాయ్. కానీ ఆ ధ్యాన కేంద్రంలో నాకొక విచిత్రమైన అనుభవం కలిగింది. అది నేను ఊహించుకున్నది అవ్వచ్చు లేదా మరోటి అవ్వచ్చు, ఆదేమైనప్పటికి కొన్ని వాస్తవాలు ఉన్నాయ్: మొదటి సారిగా నాకు ఏదో వింతైన అనుభూతి,.. నేను కూర్చునే ఉన్నాను, ఏమీ చేయకుండా, ధ్యానం చేసే వాళ్ళను చూస్తూ, వాళ్లపై జాలి పడుతూ. "వీళ్ళు ధ్యానం చేస్తున్నారు, సమాధి లోకి వెళ్లాలని ఎందుకనుకొంటున్నారు?" వాళ్ళు పొందేదేమీ లేదు. నేనివన్నీ చేశాను. వారు చిన్న పిల్లల్లా వాళ్ళతో వారు ఆడుకొంటున్నారు. ఇవన్నీ చేస్తూ వీళ్ళు జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నారు, నేనేంచేసి వీళ్ళను రక్షించగలను? ఇవన్నీ వీళ్ళనెక్కడకీ తీసికెళ్లలేవు. నేను అక్కడ కూర్చునే ఉన్నాను ... ఏమీ లేదు.... అంతా ఖాళీ... అపుడు ఏదో వింతగా అనిపించింది : నా శరీరం లో ఏదో కదులుతున్నట్టు అనిపించింది. శరీరంలో ఒక రకమైన కదలిక వచ్చింది. ఒక్క సారిగా శరీరంలో ఏదో పాకుతున్నట్టు తెలిసింది. ఏదో ఒక శక్తి పురుషాంగం నుండి, తలగుండా బయటకు వెడుతోంది, అక్కడ ఒక రంధ్రం ఉందా అనిపించేట్టుగా. అది యిలా(వృత్తాకారంలో) క్లాక్ వైజ్ గా తరవాత ఏంటి క్లాక్ వైజ్ గా, తిరుగుతోంది, విమానాశ్రయంలో లో విల్స్ సిగరెట్ అడ్వర్టైజ్మెంట్ లా. అది నాకు వింతగా సరదాగా అనిపించింది. నేను దీన్ని, దేనికీ ఆపాదించ లేదు. జీవితంలో ఇంకేమి చేయలేని వాణ్ని. ఎవరో నాకు తిండి పెడుతున్నారు. ఎవరొకరు నన్ను జాగ్రత్తగా చూసుకొంటున్నారు. మరునాడును

గురించిన ఆలోచనలేదు. అయినప్పటికీ నాలో ఏదో అనిపిస్తోంది : "ఇలా జీవించడం చాలా వికృతమైన మతిచలించిన విధానం. ఈ మూర్ఖత్వం మొండితనం అన్నీ హద్దులూ దాటి పోయింది. ఇలా కాదు." (ఈ ఆలోచనలున్నప్పటికీ) తల కనిపిచడం లేదు- నేనేం చేయగలను? ఇది ఇలా జరుగుతూనే ఉంది. మూడు నెలల తర్వాత నేను అన్నాను, "నేను పెళ్లిపోతున్నాను, ఈ రకమైన పనులు నేను చెయ్య లేను." చివరికి స్వామి నాకు కొంత డబ్బు యిచ్చారు, 40 లేదా 50 పౌండ్స్ అనుకుంటా. అపుడు నేను నిర్ణయించు కున్నాను......

ఇండియా వెళ్లడానికి రిటర్న్ టికెట్ యింకా నా దగ్గరే వుంది. అందుచేత పేరిస్ వెళ్ళి ఆ టికెట్ అమ్మి డబ్బు చేసుకున్నాను. నా దగ్గర ఉన్న 35 పౌండ్స్ తో కలిపి మొత్తం 150 పౌండ్స్ నా దగ్గర ఉంది. ఇది వరలో చేసినట్టే పెరిస్ హోటల్ లో ఉంటూ, రోడ్లన్నీ తిరుగుతూ మూడు నెలలు గడిపేను. ఈ సారి తేడా ఏమంటే యిపుడు నా జేబులో డబ్బు ఉంది. కానీ నెమ్మదిగా యీ డబ్బు అంతా కరిగి పోయింది. మూడు నెలల తర్వాత ఇండియా వెళ్లిపోడానికి నిర్ణయించు కున్నాను, అయినా ఇండియా వెళ్లడం యిష్టం లేదు. ఏమైనా సరే ఇండియా వెళ్లదలచు కోలేదు. నా భార్యా పిల్లలు అక్కడ ఉన్నందు వలన ఇండియా వెళ్లడానికి చాలా భయ పడ్డాను, ఇండియా వెడితే సమస్యలు మరీ క్లిష్టతర మౌతాయి. వాళ్ళందరూ నా దగ్గరకు వస్తారు. అందుచేత ఇండియా వెళ్ళదలచుకోలేదు. అతి కష్టం మీద ఇండియా వెళ్ళే ఆలోచనని ఆపుకొన్నాను.

ఇంకా స్విట్జర్లేండ్ లో నాకు చాలా కాలంగా ఒక బేంక్ ఎక్కౌంట్ ఉంది. ఆ బేంక్ లో యింకా కొంత డబ్బు ఉండచ్చు అనిపించింది. స్విట్జర్లేండ్ వెళ్ళి డబ్బు తీసుకొని, తర్వాత ఆలోచిద్దాం అనుకొని, హోటల్ బయటకు వచ్చి, టేక్సీ ఎక్కి గార్ ది ల్యాన్ (Gare de Lyon) తీసుకు వెళ్ళమని చెప్పేను. కానీ పేరిస్ నుండి జూరిక్ (zurich) (నా బేంక్ అక్కౌంట్ ఉన్న చోటు) వెళ్ళే ట్రైన్ Gare de L'Est నుండి వెడుతుంది. Gare de Lyon కి తీసుకొని వెళ్ళమని డ్రైవర్ కి ఎందుకు చెప్పేనో నాకు తెలియదు. అందువల్ల అతడు నన్ను Gare de Lyon దగ్గర దింపేసేడు. అక్కడ జెనీవా వెళ్ళే ట్రైన్ ఎక్కేను. నేను జెనీవాలో దిగేను, అప్పటికి నా చేతిలో నూట ఏభై ఫ్రెంక్స్

ఉన్నాయి. చేతిలో డబ్బు లేనప్పటికీ, అక్కడ హోటల్ లోనే బస చేసేను. రెండు వారాల తర్వాత హోటల్ వాళ్ళు బిల్లిచ్చి డబ్బు కట్ట మన్నారు. నా దగ్గర డబ్బు లేదని చెప్పి చేతులెత్తేసేను. వేరే దారి లేక. ఇండియన్ కాన్సులేట్ కి వెళ్ళి ఇండియా పంపించేయమని అడగడానికి నిర్ణయించు కున్నాను. అలా.. అప్పుడు, ఇండియా వెళ్ళక తప్పదు అనే ఆలోచనను నిరోధించే శక్తి నాలో చచ్చిపోయింది. ఇండియన్ కాన్సులేట్ కి వెళ్ళి నా గురించి రాసిన ఆ scrapbook ను బయటికి తీసేను. ఆ బుక్ లో "ఇండియా లో పుట్టిన, ప్రతిభాశాలులైన గొప్ప వక్తలలో ఈయన ఒకడు" అని రాసివుంది. నా ప్రతిభ గురించి నోర్మన్ కజిన్స్ (Norman Cousins) & రాధాకృష్ణన్ ల అభిప్రాయాలూ ఆ స్క్రాప్ బుక్కులో ఉన్నాయి. వైస్ కన్సూల్, "ఈ రకం మనిషిని ఇండియన్ గవర్నమెంట్ ఖర్చు తో ఇండియాకు పంపడం కుదరదు, సరేనా? ఇండియా నుండి డబ్బు తెప్పించడానికి ప్రయత్నించండి, అప్పటి దాకా నాతో ఉండండి" అన్నాడు మా యిద్దరికి యీ సంభాషణ చాలాసేపు జరిగింది. అక్కడ నేను, యీ స్విస్ లేడీ వాలెంటైన్ ది కెర్వెన్ (Valentine de Kerven) ని కలిసేను. ఆమె ఇండియన్ కాన్సులేట్ లో అనువాదకురాలు , కానీ ఆ రోజు ఆమె రిసెప్షన్ డెస్క్ దగ్గర కూర్చుంది, ఆ రోజు రిసెప్షనిస్ట్ రాకపోడం వల్ల. మేమిద్దరం చాలా మాట్లాడుకొన్నాం, తరవాత క్లోజ్ ఫ్రెండ్స్ అయ్యేం. ఆవిడ అన్నది, "మీరిక్కడే వుండ దలచుకుంటే, స్విట్జెర్లాండ్ లో మీరుండడానికి ఏర్పాటు చేస్తాను. ఇండియా వెళ్ళడం ఇష్టం లేకపోతే వెళ్ళకండి." అని. ఒక నెల తర్వాత కన్సులేట్ వాళ్ళు నన్ను పంపించేసేరు. కానీ మేం మేనేజ్ చేసేమ్- ఆమె నాకు స్విట్జర్లాండ్ లో ఓ ఇల్లు సమకూర్చింది. ఆమె ఉద్యోగం వదిలేసింది. ఆవిడ ధనికురాలు కాదు. ఆవిడ దగ్గర కొద్దిగా డబ్బు ఉంది, ఆమె పెన్షన్ డబ్బు. ఈ డబ్బుతో మేం బతగ్గలమ్.

అపుడు మేం saanen(సానెన్) వెళ్ళేము. ఆ ప్రదేశంతో నాకు కొంత సంబంధం వుంది. 1953 లో ఈ ప్రదేశం గుండా ప్రయాణం చేస్తున్నపుడు యిక్కడ కొన్ని రోజులున్నాను. నేను saanen ను చూసినపుడు నాలో ఎవరో చెప్పినట్టనిపించింది, "ట్రైన్ దిగివెళ్ళి కొంతసేపు యిక్కడ గడుపు." అని. అందువల్ల అప్పుడో వారం అక్కడ గడిపేను. అప్పుడు నేను అనుకున్నాను , "నా శేష జీవితం గడపదానికి ఇదే

అనువైన స్థలం" అని. ఆ రోజుల్లో  నా దగ్గర బోలెడు డబ్బు ఉండేది. ఇక్కడున్న వాతావరణ కారణాల వల్ల నా భార్యకు ఈ ప్లేస్ లో ఉండడం ఇష్టం లేదు. అదీ గాక అప్పుడు మాకున్న ఇతర పరిస్తితుల వల్ల మేం అమెరికా వెళ్ళేము. ఈ విధంగా అప్పటి నా కల యిప్పటికి నిజమయ్యింది. సానెన్ (Saanen) లోనే జీవించాలని నేనెల్లప్పుడూ కోరుకోడం వల్ల మేం ఇక్కడకు వచ్చాం. అందువల్ల నేనిక్కడే ఉండడం కొనసాగించేను. అపుడు జె. కృష్ణమూర్తి గారు ఎందుకో గాని, తన ప్రతి ఏటా జరిగే వేసవి మీటింగులకు సానెన్  ఎంచుకున్నారు. ఈయన సానెన్ కు రావడం మొదలు పెట్టేరు. నేను అక్కడే ఉన్నాను. క్రిష్ణమూర్తి గారి పై గాని, మరోదాని మీదగాని  నాకు ఇంటరెస్ట్ లేదు. నాకు దేనిపైనా ఆసక్తి ఉండేది కాదు. ఉదాహరణకి, నా 49 వ సంవత్సరానికి  ముందు వాలెంటైన్ కొన్నేళ్లు నాతో కలసి  ఉన్నప్పటికి, నాకు ఆసక్తికరమైన విషయాలైన సత్యము, నిజము లాంటి వాటి గురించి ఆమెతో నేనెప్పుడూ మాట్లాడ లేదనే విషయం, ఆవిడ మీకు చెప్ప గలదు. ఈ విషయాల గురించి ఆమెతోగాని మరెవ్వరితో గానీ    నేనెప్పుడూ చర్చించలేదు. ఏదో తెలుసుకోవాలనే తపన, ఏదో పొందాలనే కోరిక, నాలో ఆ టైమ్ లో లేదు. కానీ వింతైనదేదో నా లోపల జరుగుతోంది.

ఆ సమయంలో [దీన్నిగుడ్లు  పొదిగే సమయం (incubation) అంటాను నేను] నా శరీరం లోపల రక రకాలైనవి  ఏవో జరుగుతున్నాయ్ – తగ్గని  తల నెప్పులు, భరించలేని  మెదడు నెప్పులు వగైరా. ఎన్ని వేల యాస్ప్రిన్(asprin) టేబ్లెట్స్ వేసుకున్నప్పటికీ గుణం కనిపించ లేదు. అది మైగ్రేన్ (పార్శ్వనొప్పి) లాంటి తల నొప్పి కాదు. భయంకరమైన తలనొప్పులు. యాస్ప్రిన్ బిళ్ళలు, పదిహేను ఇరవై కప్పుల కాఫీలు రోజు తాగే వాణ్ని, తల నెప్పి భరించలేక! ఒక రోజు వాలెంటైన్ అన్నది, "ఏమిటి రోజుకు పదిహేను కప్పుల కాఫీయా? దానికి ఎంత ఖర్చు అవుతుందో నీకు తెలుసా? నెలకు 3 to 4 వందల ఫ్రెంక్స్. ఏమిటిది?" అని. ఏమైనప్పటికీ, అది నాకు అత్యంత ఘోరమైన అనుభవం. అన్నిరకాల వింతైన అనుభవాలు నాకు కలిగేయ్. నాకు గుర్తుంది... నా శరీరం మీద చేత్తో రాసినపుడు దేహంపై  భాస్వరపు కాంతి కనిపించేది. వాలంటైన్, ఆమె రూము నుండి బయటకు

పరుగెట్టుకు వెళ్ళేది, ఇంటి పక్క నుండి అర్ధ రాత్రి కారులు వెళుతున్నాయేమో చూడ్డానికి. నేను బెడ్ మీద దొర్లి నప్పుడల్లా వెలుతురు కిరణాలు శరీరం నుండి బయటికి వచ్చేవి, (..నవ్వు) యిదంతా చాలా తమాషాగా ఉండేది నాకు. ఏమిటిది? అది విద్యుత్తు. అందుకే నేను అంటున్నా, అది ఎలెక్ట్రో మాగ్నెటిక్ ఫీల్డ్ అని. మొదట నేననుకొన్నా, నా నైలాన్ బట్టల వలన కలిగిన స్టాటిక్ ఎలెక్ట్రిసిటీ అని. కానీ గుర్తుకు వచ్చింది, నైలాన్ దుస్తులు వాడ్డం ఎప్పుడో మానేశానని. నేను నఖసిఖ పర్యంతం అనుమానం మనిషిని. ఒక పట్టాన నేను దేన్నీ నమ్మను. నా కళ్ల ఎదుట ఒక అద్భుతం జరిగినా నేను ఒప్పుకోను. నేనలా తయారు చేయబడ్డా. ఇటువంటిది నాకు జరగబోతోందని నాకు ఎప్పుడూ అన్పించ లేదు.

నాకు చాలా వింతైన సంఘటనలు జరిగేయ్. ఇవన్నీ విముక్తి, మోక్షం, విమోచన లాంటి వాటికి సంబంధించినవని నేనెప్పుడూ అనుకోలేదు, ఎందుకంటే, అప్పటికే ఇవన్నీ నా దేహం నుండి బయటకు పోయాయ్. నేనెంతవరకూ వచ్చానంటే.. "బుద్ధుడు తనను తాను వంచించుకొని, అందరినీ గూడ తప్పు దోవ పట్టించచేడని. మానవాళిని రక్షించడానికొచ్చిన అందరు బోధకులు, రక్షకులు గూడ మూర్ఖులు, తమను తామే మోసగించుకొన్నారు. అందు వల్ల వీటిపై నాకేమాత్రం ఆసక్తి లేదు". అంచేత ఇవన్నీ నా శరీరం(system) నుండి పూర్తిగా బయటికి వెళ్ళి పోయాయి. ఈ వింత వింత సంఘటనలు వాటి రీతిలో అవి జరుగుతూనే ఉన్నాయ్. "నేను కోరుకున్న లక్ష్యానికి నే చేరబోతున్నా, దానికి దగ్గరలో ఉన్నా" అని నేను ఎప్పుడూ అనుకోలేదు. దానికి దగ్గరగా ఉండడం అనేది లేదు, దూరంగా ఉండడం అనేదీ లేదు, దానికి మరీ దగ్గరగా వెళ్ళడం అనేది లేదు. ఒక ప్రత్యేకమైన మనిషి అవడం వల్లగానీ, దానికి prepare చేయబడడం వల్లగానీ, ఎవ్వరూ దానికి దగ్గరగా ఉండరు. దానిని పొందడానికి తయారుగా, రడీగా ఉండడం అనేది లేదు. ఒక వెయ్యి ఇటుకలు అకస్మాత్తుగా మీద పడ్డట్టుగా అది వచ్చి నిన్ను కొడుతుంది.

ఒకసారి (ఏప్రిల్ 1967) జె. క్రిష్ణమూర్తి పేరిస్ ఒచ్చినపుడు నేను కూడా అక్కడే ఉండడం జరిగింది. నా స్నేహితులు కొందరు నాతో అన్నారు, "మీరు కూడా వెళ్ళి మీ పాత ఫ్రెండ్ చెప్పేది వినచ్చు కదా, ఆయన యిక్కడ ఉపన్యాసం ఇస్తున్నాడు" అని.

“ సరే, చాలా ఏళ్ల నుంచి, 20 ఏళ్ళుగా, ఆయన ప్రసంగం విన లేదు, వెళ్ళి విందాం”. నేనక్కడికి వెళ్ళినపుడు రెండు ఫ్రెంక్స్ ఇమ్మని అడిగేరు. నేనన్నాను, జె. క్రిష్ణమూర్తిని వినడానికి రెండు ఫ్రెంక్స్ ఇవ్వడానికి నేను సిద్ధంగా లేను, “రండి, వెళ్ళి మరేదైనా పిచ్చి పనులు చేద్దాం. ఏదైనా ఒక స్ట్రిప్-టీజ్ జాయింట్ కో, Folies-Bergere కో, “కేసినో డి పెరిస్” కో వెడదాం. రండి, 20 ఫ్రెంక్స్ ఇచ్చి అక్కడికే వెడదాం.” అన్నాను. అలా అక్కడకు వెళ్ళి Casino de Paris షో చూస్తున్నాం. ఆ సమయం లో నాకు చాలా వింతైన అనుభవం కలిగింది. స్టేజి మీద డాన్సు చేస్తున్నది నేనా, మరొక డేన్సరా అన్నది- నాకు తెలియ లేదు. అది నాకు చాలా వింతైన అనుభవం. అది ఒక విచిత్రమైన నాలోని కదలిక. (ఇది ఇపుడు నాకు సర్వ సాధారణమై పోయింది.) అక్కడ విభజన లేదు. అక్కడ డేన్సర్ ని చూడ్డానికి నాలో ఎవరూ లేరు. డేన్స్ చేసేది నేనా, లేక ఆ స్టేజి మీద మరొకరున్నారా అనే ప్రశ్న నన్ను కలవర పరిచింది. ఈ అసాధారణమైన అనుభవం నన్ను కన్ఫ్యూజ్ చేసి కొంత సేపు ఇబ్బంది పెట్టింది. తరవాత మేం బయటకు వచ్చేశాం.

“ఆ స్తితి ఏమిటి”? అనే ప్రశ్నలో గాఢమైన తీవ్రత, ఒత్తిడి నిండి ఉంది, నా వరకు -- అది ఆవేశపూరితమైన తీవ్రత (intensity) కాదు. ఈ ప్రశ్నకు జవాబు కొరకు ఎంత ఎక్కువ ప్రయత్నిస్తే, అంత ఎక్కువ విఫలమయ్యాను, అంతే గాక.. ప్రశ్న యొక్క తీవ్రత గూడా మరింత పెరిగింది. ఇది ఒక ‘వరి వూక’ లాంటిది. (నేనెప్పుడూ ఇదే ఉపమానం యిస్తాను). వరి వూక గుట్టకు నిప్పు పెట్టినపుడు అది లోపల కాలుతూ ఉంటుంది, నిప్పు బయటకు కనబడదు, కానీ ముట్టుకుంటే చేయి కాలుతుంది. అదే విధంగా యీ ప్రశ్న గూడా నాలో రగులుతూనే ఉంది. నేను పొందదలచుకొన్న “ఆ స్తితి ఏమిటి?” అది నాకు కావాలి, అంతే. కృష్ణమూర్తి గారు చెప్పేడు, “అది తెలుసుకొనే మార్గం లేదు,” అని. కానీ యింకా నాకు తెలుసుకోవాలనే ఉంది, ఆ స్తితి ఏమిటో, ... బుద్ధుడున్నట్టి, శంకరుడున్నట్టి, ఆ గురువులందరు ఉన్నట్టి స్తితి.

తరవాత, జూలై 1967 లో మరొక దశ వచ్చింది. క్రిష్ణమూర్తి గారు సానెన్లో ఉన్నాడు, ఉపన్యాసాలు యిస్తూ. నా మిత్రులు బలవంత పెట్టేరు, “నువ్వు

డబ్బులివ్వకుండానే ఫ్రీగా వినచ్చు, రాకూడదా" అని. "సరే, వచ్చి వింటాను." అన్నాను. నేను క్రిష్ణమూర్తి గారు చెప్పింది వింటున్నప్పుడు నాలో ఒక విచిత్రమైనదేదో జరిగింది – ఆయన నేనున్న స్తితిని వర్ణిస్తున్నాడు, ఆయన ఉన్న స్తితిని కాదు... అనే అదో రక మైన అనుభూతి నాలో కలిగింది. ఆయన ఉన్న స్తితిని తెలుసుకోవాలని నేనెందుకు అనుకుంటున్నాను? ఆయన ఏదో వివరిస్తున్నాడు, కొన్ని కదలికల గురించి, ఏదో జాగృతి (awareness) గురించి, ఏదో మౌనం(silence) గురించి—"ఆ నిశ్శబ్దంలో మనస్సు అనేది ఉండదు; క్రియమాత్రమే."

యిలాంటివన్నీ ఆయన చెపుతున్నాడు. అప్పుడు నాకు అనిపించింది "నేను ఆ స్తితిలోనే ఉన్నాను, నేను చేసిందేమిటి...ఈ ముప్పై నలభై సంవత్సరాలూ, వీళ్ళందరు చెప్పినదీ వింటూ, తిప్పలు పడుతూ, బుద్ధుడు లేదా జీజస్ మొదలైన వారున్న స్తితులను అర్ధం చేసుకోవాలని కోరుకుంటూ? ఇప్పుడు నేను ఆ స్తితి లో ఉన్నాను", ఈ విధంగా నాకు అనిపించి నపుడు నేను ఆ గుడారం నుండి బయటకు వెళ్ళి పోయాను, మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు.

అపుడు – చాలా వింతగా – "ఆ స్తితి ఏమిటి ?" అనే ప్రశ్న మార్పు చెంది మరో ప్రశ్న రూపం ధరించింది. అదే.. "ఏ స్తితిని కావాలని నేను గట్టిగా కోరుకొన్నానో, ఇవ్వమని ప్రతి ఒక్కరినీ గట్టిగా అడిగానో, బుద్ధుడు గూడా ఉన్నట్టి, ఆ స్తితిలో నేను ఉన్నట్టు నాకు ఎలా తెలుస్తుంది?" నేను ఆ స్తితిలో ఉన్నాను, కాని ఆ విషయం నాకెలా తెలుసు?

ఆ మరుసటి రోజు (యుజీ 49th పుట్టిన రోజు), నేనొక చెట్టు కింద బెంచి మీద కూర్చున్నా,.. ప్రపంచం లోనే అత్యంత అందమైన సానెన్ లేండ్ లోని సెవెన్ హిల్స్ అండ్ సెవెన్ వేలీస్ (ఏడు కొండలు మరియు ఏడు లోయలు) ను చూస్తూ. నేనక్కడ కూర్చున్నా. ఆ ప్రశ్న ఉన్నది నా మనస్సులో మాత్రమే కాదు, నా నర నరాల్లో ఆ ప్రశ్న నిండి ఉంది. "నేనా స్తితి లో ఉన్నానని నా కెలా తెలుస్తుంది? తాను ఆ స్తితిలో ఉన్నట్టు తెలిసిన వ్యక్తి ఒకడు ఉన్నాడనే, ఒక రకమైన విచిత్రమైన విభజన నాలో ఉంది. ఇంకా ఆ స్తితికి సంబంధించిన, నేను చదివిన, నేను

అనుభూతి చెందిన, యితరులు చెప్పిన, ఆ నా జ్ఞానమే (knowledge) ఆ స్థితి గురించి ఆలోచిస్తోంది. అంటే.. మెదడులో ఉన్న ఈ knowledge మాత్రమే 'ఆ స్థితి' ఉన్నట్లు భ్రమింప చేస్తోంది. ఇదే నాలో ఉన్న విభజన(division) అని నాకు తెలిసినప్పుడు, నాకు అనిపించింది... నలభై సంవత్సరాల తర్వాత గూడా నేను ఒక్క అడుగు గూడా ముందుకు పేయలేదనీ, నేనింకా మొదటి గడి లోనే ఉన్నానని. అవును, "నేనా స్థితిలో ఉన్నట్లు నాకెలా తెలుస్తుంది" అనే ప్రశ్న వేస్తున్నది, ఎవరో కాదు, ఆ "స్థితి" కి సంబందించిన నా జ్ఞానం మాత్రమే. అంటే... వాళ్ళందరూ ఈ స్థితి గురించి చెప్పిన వివరణలు విని, నేను గూడా ఆ స్థితి లోనే ఉన్నాననే భ్రమలో నేనున్నాను. చిన్న పిల్లాడిలా నాతో నేను ఆడుకుంటున్నాను. నేనొక పెద్ద మూర్ఖుణ్ణి. అంతా భ్రమ. అయినా "నేనున్నది ఆ స్థితిలోనేమో" అన్న అదోరకమైన భావన ఇంకా నాలో ఉంది.

రెండవ ప్రశ్న "నాకెలా తెలుస్తుంది ఆ స్థితి ఇదే అని?" – ఆ ప్రశ్నకు నా వద్ద జవాబు లేదు. ఇది ఒక సుడిగుండంలో ఉన్న ప్రశ్న లాంటిది – ఇది యిలాగే కొంత కాలం సాగింది. అపుడు అకస్మాత్తుగా ప్రశ్న మాయమయ్యింది. ఏమీ జరగ లేదు. ఆ ప్రశ్న మాయమయ్యిందంతే. "అమ్మయ్య! భగవంతుడా! ఇప్పుడు నాకు జవాబు దొరికింది" అని నేను అనుకోలేదు. అంతే కాదు, ఆ స్థితి గూడా మాయమై పోయింది -- అంటే, "ఆ బుద్ధుడూ, జీజస్ లాంటి వారు ఉన్న స్థితిలో నేనున్నానని నేను అనుకునే స్థితి' కూడా మాయమయ్యింది. ఆ ప్రశ్న మాయమై పోయింది. నాలో యివన్నీ అంతమై పోయాయ్. ఇంకేమీ లేదు. "ఆ ప్రశ్నలన్నిటికీ యిప్పుడు నా దగ్గర జవాబులు ఉన్నాయి" అని అప్పటినుండి యింకెప్పుడూ నేను అనుకోలేదు. నేను ఏ స్థితిలో ఉండి "ఇదే ఆ స్థితి" అన్నానో, ఆ స్థితి మాయమై పోయింది. ప్రశ్నే మాయమైపోయింది, ఇంకేమీ లేదు. చూడండి, అది శూన్యత కాదు, ఏమీ లేకపోవడం కాదు, ఖాళీ కాదు, ఇది అటువంటిపేమీ కాదు; ప్రశ్న అకస్మాత్తుగా మాయమైయింది, అంతే.

------------------

*(తన మూల ప్రశ్నకు జవాబు లేదు, అనే విషయాన్ని ఆయన కనుక్కున్నప్పుడు, ఆ ప్రశ్న ఒక్కసారిగా మాయమవడం అనేది ఒక భౌతిక సంఘటన, యుజీ అంటున్నది "అది నా శరీరంలోని ప్రతి జీవ కణాన్నీ, ప్రతి నరాన్ని, ప్రతి గ్రంధినీ బద్దలు చేసినట్లుగా అనిపించిన, అకస్మాత్తుగా నాలో జరిగిన, ఒక పెద్ద పేలుడు,* explosion*." ఆ ప్రేలుడు వల్ల ఆలోచన ఎల్లప్పుడూ కోన సాగుతూనే ఉంటుంది అనే భ్రమ గాని, 'నేను' అనే ఒక కేంద్రం ఆలోచనలను ఒక దానితో మరొకటి కలుపుతూ ఉంటుందనే భ్రమ గానీ, ఇకపైన లేదు.)*

అపుడు ఆలోచన తనను దేనితోనూ లింక్ చేయ లేదు. లింకింగ్ పోతుంది. ఒక్క సారి లింక్ తెగిపోయిన తర్వాత ఆ లింకింగ్ ఇకపై జరగదు. అపుడు ఆలోచన ఒక సారి మాత్రమే విచ్ఛిన్నం(explode) అవ్వడం కాదు... ఆలోచన కలిగినప్పుడల్లా అది విచ్ఛిన్న మవుతుంది. అందువల్ల ఆలోచనల నిరంతరత(continuity) ఇకపై ఉండదు. అపుడు ఆలోచన తన సహజ లయలో(natural rhythm) లో పడుతుంది.

అప్పటినుండి ఏ రకమైన ప్రశ్నలు నాకు లేవు, ఎందుకంటే ప్రశ్నలు అక్కడ ఇకపైన ఉండలేవు. నాకున్నవి యీ ప్రపంచంలో మామూలు పనులు చక్కబెట్టుకుందుకు అవసరమైన సాధారణ ప్రశ్నలు మాత్రమే. ఉదాహరణకి: "హైదరబాద్ ఎలా వెళ్ళాలి?" ఇటువంటి ప్రశ్నలకు ప్రజల వద్ద జవాబులుంటాయ్. కానీ, **ఆ** ప్రశ్నలకు ఎవ్వరి దగ్గర ఏ సమాధానాలు లేవు -- అందుచేత ప్రశ్నలు ఇక పైన లేవు.

నా తలలో ఉన్న ప్రతీదీ బిగిసి పోయింది. నా మెదడులో ఇంక దేనికీ చోటు లేదు. నా తలలో ఉన్న ప్రతీది టైట్ గా ఉన్నట్టు నాకు మొదటిసారి తెలిసొచ్చింది. ఈ పాత అభిప్రాయాలూ, జ్ఞాపకాలు, (పూర్వ వాసనలు) వీటికేపేరు పెట్టినా – అవి మేమున్నామంటూ అప్పుడప్పుడు పైకి లేవ డానికి ప్రయత్నిస్తూనే ఉంటాయ్. కానీ, మెదడు కణాలు ఎంత బిగిసి ఉంటాయంటే, అవి అక్కడ మూర్ఖంగా అటూ ఇటూ సంచరించడానికి తావే ఉండదు. విభజన అక్కడ ఉండ లేదు –

ఇది(విభజన) భౌతికంగా అసంభవం. దీని గురించి నీవేమీ చేయనక్కర లేదు. అందుచేత ఈ ప్రేలుడు సంభవించినపుడు, అది గొలుసుకట్టు ప్రతిక్రియలను (chain reactions) కలుగజేస్తుంది.. (ప్రేలుడు, explosion అనే మాట ఎందుకు వాడేనంటే అది ఒక న్యూక్లియర్ ఎక్స్ ప్లోజన్ – అణు విచ్ఛేదనం లాంటిది కనుక.) శరీరం లోని ప్రతి కణం, ఎముకల లోపల మజ్జ లోని కణాలన్నీ ఈ రకమైన మార్పు చెంద వలసినదే – "మార్పు" అనే పదం వాడ్డం నాకిష్టం లేదు ... అయినప్పటికి ఇది ఒక వెనక్కి- రాలేని మార్పు నీవు వెనక్కి వెళ్ళే ప్రశ్నే రాదు. ఈ మనిషి మళ్ళీ గోతిలో పడే అవకాశం లేదు. పూర్వపు స్తితికి తీసుకొని పోలేని ఒక రకమైన రసాయనిక ప్రక్రియ (alchemy) లాంటిది.

ఇది ఒక అణు విచ్ఛేదం లాంటిది, తెలుసా – దేహాన్నంతా ముక్కలు చేస్తుంది. ఇది అంత తేలికైనది కాదు; ఇది మనిషి అంతం – ఆ ముక్కలు చెయ్యడం ఎలా ఉంటుందంటే అది శరీరం లోని ప్రతి కణాన్ని, ప్రతి నరాన్ని బద్దలు కొడుతుంది. ఆ సమయంలో నేను చెప్పలేనంత శారీరక చిత్ర హింసలకు గురయ్యాను. ఆ ప్రేలుడుని నీవు అనుభూతి చెందుతావని కాదు నేను అంటున్నది,-- ఆ ప్రేలుడును నీవు అనుభూతి చెందలేవ్ – కానీ దాని తదుపరి ప్రభావం, అటు తర్వాత శరీరం మీద దాని యొక్క ప్రభావం, చివరిగా దాని పర్యవసానం, శరీరం అంతటి లోని మొత్తం రసాయినిక తత్వాన్ని పూర్తిగా మార్చేస్తాయ్.

-----------------

**ప్ర: హెచ్చు స్తాయి (**higher planes**) అనుభవాలు గూడా మీకు కలిగే ఉంటాయ్, "స్తాయి" అనే పదం వాడ్డం మీకభ్యంతరం లేకపోతే...**

**యుజీ:** మీరు స్తాయిలు గురించి మాట్లాడుతున్నారా? స్తాయిలనేవి ఏమీ లేవు. స్తాయిలూ లేవు, లెవెల్సూ లేవు. కానీ, ఈ "ప్రేలుడు" వల్ల, లేదా మీరు దీనికి మరో పేరు పెట్టి పిలవచ్చు కావాలంటే, చాలా వింతైనది ఒకటి జరిగింది : నేను నీకంటే భిన్నమైన వాణ్ని అనే ఆలోచనే నా కాన్షియస్నెస్(చైతన్యం) లోకి ఎప్పుడూ రాదు. ఎప్పుడూ కూడా ఆ ఆలోచన నా కాన్షియస్నెస్(చైతన్యం) లోకి వచ్చి నీవు నా కంటే భిన్నమైన వాడివని గాని, నేను నీకంటే భిన్నమైన వాడినని గాని చెప్పదు,

ఎందుకంటే ఇక్కడ ఒక రిఫరెన్స్ పాయింట్ గానీ, ఒక కేంద్రం గాని లేదు. ఈ కేంద్రాన్ని ఆధారంగా తీసుకొని మాత్రమే నీవు ఇతర రిఫరెన్స్ పాయింట్లు సృష్టిస్తావ్.

**ప్ర: ఏదో ఒక విధంగా మీకూ యితర మనుషులకు, కొంత తేడా తప్పకుండా ఉంది.**

**యుజీ :** బహుశా శరీరధర్మ పరంగా.

**ప్ర: మీలో చాలా పెద్ద రసాయినక మార్పులు జరిగేయని మీరు చెప్పేరు. ఇది మీకెలా తెలిసింది? మీరు ఎప్పుడైనా పరీక్ష చేయించుకున్నారా, లేక మీరే ఊహించుకొని యీ నిర్ణయానికి వచ్చారా?**

**యుజీ :** ఆ ఎక్స్ ప్లోజన్ (పేలుడు) యొక్క పర్యవసానాల వల్ల, ఒక సమన్వయ కర్త, ఓ కొ-ఆర్డినేటర్ లేకుండా, ఒక ఒక కేంద్రీకృత సమన్వయం లేకుండా, ఈ జ్ఞానేంద్రియాలు ఇపుడు పనిచేసే తీరును చూస్తే -- నేను అంతమాత్రమే చెప్ప గలను. మరొక విషయం : శరీర రసాయనికత మారిపోయింది – ఇది నేను చెప్పగలను ఎందుకంటే యీ రసాయనిక ప్రక్రియ లేదా యీ సమూల రసాయనిక మార్పు జరగకుండా, ఈ జీవిని ఆలోచన నుండి, 'ఆలోచనల నిరంతరత (continuity of thought) నుండి విముక్తి చేసే మార్గం లేదు. అందుచేత, ఆలోచనల పరంపర లేదు కాబట్టి ఇలాంటిదేదో జరిగిందని నీవు చాలా తేలిగ్గా చెప్పచ్చు, కానీ, వాస్తవంగా జరినదేమిటి? ఇది నా అనుభవం లోకి వచ్చే మార్గం లేనే లేదు.

**ప్ర: ఇదంతా మనసు ఆడుతున్న ఆటలు కావచ్చు, అంటే 'నేను విచ్ఛిన్నమైన మనిషిని' అని కేవలం నా మనస్సులో నాకు అనిపించి ఉండచ్చు.**

**యుజీ :** నేను ఇక్కడ దేన్నీ అమ్మడానికి ప్రయత్నించడం లేదు. దీన్ని అనుకరించడం అసాధ్యం. ఇది నేను ఏ క్షేత్రంలో మార్పు కొరకు ఎదురు చూసేనో, కలలు కన్నానో, కోరుకున్నానో ఆ క్షేత్రానికి బయట జరిగింది. అందువల్ల నేను దీనిని ఒక మార్పు అని చెప్పను. నాకు ఏంజరిగిందో నిజంగా నాకు తెలియదు. నేను మీకు చెపుతున్నది నేను పనిచేస్తున్న తీరు. నీవు వ్యవహరించే విధానానికి నేను వ్యవహరించే పద్ధతికి కొంత తేడా ఉన్నట్టు కనిపిస్తోంది, కానీ మౌలికంగా తేడా

ఏమీ ఉండే అవకాశం లేదు. నీకూ నాకూ మధ్య తేడా ఎలా ఉంటుంది? ఉండలేదు. కానీ మనల్ని మనం వ్యక్త పరచుకోడానికి మనం ప్రయత్నించే విధానంలో తేడా ఉన్నట్టు కనిపిస్తోంది. కొంత తేడా ఉన్నదన్న భావన నాకుంది, ఆ తేడా ఏమిటి, అన్నది అర్థం చేసుకోవడానికి నేను ప్రయత్నిస్తున్నాను. నో, నేను వ్యవహరిస్తున్న తీరు యిది.

--------------------

*{ప్రేలుడు జరిగిన తరువాత గడచిన ఏడు రోజుల్లో తన జ్ఞానేంద్రియాల పని తీరులో మౌలిక మార్పులు యుజీ గమనించాడు. ఆఖరి రోజు ఆయన శరీరం ఒక "భౌతిక మరణ ప్రక్రియకి' గురై (నిర్వికల్ప సమాధి), దానివల్ల కలిగిన మార్పులు శాశ్వతంగా ఉండిపోయాయ్.}*

అపుడు మొదలయ్యాయ్ మార్పులు రావడం – మరుసటి రోజు నుండీ, ఏడు రోజుల వరకు – రోజూ ఒక మార్పు. మొదట చర్మం మెత్తగా అవడం కనిపెట్టేను, కనురెప్పలు మూత పడకుండా ఉండిపోవడం, తరువాత రుచిలో, వాసనలో, వినికిడిలో మార్పులు – ఈ అయిదు మార్పులు నేను గమనించేను. ఇవి యింతకు ముందు గూడా ఉండి ఉండచ్చు, నేను మొదటి సారిగా యిపుడు గుర్తించి ఉండచ్చు.

*(మొదటి రోజున):* నా చర్మం పట్టులా మెత్తగా, వింతగా వెలిగిపోతూ, బంగారు రంగులో ఉన్నట్టు గుర్తించాను. నేను గెడ్డం గీసుకుంటున్నప్పుడు మాటిమాటికి రేజర్ జారి పోయేది. బ్లేడు మార్చినా ప్రయోజనం లేక పోయింది. నా ముఖం ముట్టుకున్నపుడు ఆ ఫీలింగ్ కొత్త రకంగా ఉండేది, రేజర్ పట్టుకునే పద్ధతి కూడా వేరేలా ఉండేది. ప్రత్యేకించి నా చర్మం – నా చర్మం మెత్తగా, పట్టులా బంగారు ఛాయతో వెలిగిపోయేది. దీన్ని నేను దేనికీ ఆపాదించ లేదు. గమనించేనంతే.

*(రెండవ రోజున):* మొదటి సారిగా నా మనస్సు అన్నిటితో విడిపోయి అన్య సంబంధ రహితమైన, నేను అంటున్న, ముక్తస్తితిలో (declutched state) ఉందని నాకు తెలిసిపోయింది. నేను పై అంతస్తు వంట గదిలో ఉన్నాను. వాలెంటైన్ టమేటాసూప్ చేసింది. దాన్ని చూశాను గాని అదేమిటో నాకు తెలియ లేదు. ఆమె

చెప్పింది, అది టమేటా సూప్ అని. నేను రుచి చూసేను, అప్పుడు గుర్తించేను, టమేటా సూప్ రుచి యిలా వుంటుందని. ఆ టమేటా సూపు తాగేను. తరువాత యీ అదో రకమైన మానస స్తితికి తిరిగి వచ్చేశాను. మానసస్తితి అనే పదం సరైనది కాదు; అది అమానస స్తితి, అంటే మనసే లేని స్తితి. – నేను మళ్ళీ మరచి పోయిన స్తితి. అది ఏమిటని మళ్ళీ అడిగా. ఆమె మళ్ళీ అంది, టమేటా సూప్ అని. నేను మళ్ళీ రుచి చూసి, కొంచెం తాగి మళ్ళీ మర్చి పోయేను. ఈ ఆటలు కాసేపు ఆడేను. ఇదంతా తమాషాగా ఉండేది. నాకు యీ ముక్త స్తితి యిపుడు నాకు సర్వసాధారణం అయిపోయింది. చాలా మంది ఒంటరిగా ఉన్నపుడుండే మాదిరిగా, చింతలతో, ఊహలతో, మరో రకమైన ఆలోచనలతో సమయాన్ని నేను యిపుడు గడపను. అవసరం వచ్చినప్పుడు మాత్రమే నా మైండ్ ఎంగేజ్ అవుతుంది, ఉదాహరణకి నన్ను మీరు ప్రశ్నలు అడిగినపుడు లేదా టేప్ రికార్డర్ ఫిక్స్ చేయడం మొదలైనవి చేయవలసి వచ్చినప్పుడు. మిగతా సమయమంతా నా మైండ్ ముక్త స్తితిలో ఫ్రీ గా అంటే ఆలోచనలు లేని స్తితిలో ఉంటుంది. ఏమైనప్పటికీ ఇప్పుడు నా జ్ఞాపకశక్తి నాకు వెనక్కి వచ్చేసింది- అంతకు మునుపు జ్ఞాపక శక్తి పోయింది, కాని తరవాత వెనక్కొచ్చేసింది. కానీ ఇపుడు నా జ్ఞాపక శక్తి నా బేగ్రౌండ్ లోనే ఉండి అవసరం ఉన్నపుడు మాత్రమే ఉపయోగం లోకి దానంతట అది వస్తుంది. అవసరం లేనపుడు ఇక్కడ మనస్సు ఉండదు, ఆలోచన ఉండదు. జీవం (life) ఒక్కటే ఉంటుంది.

(*మూడవ రోజున*): కొంతమంది మిత్రులు డిన్నర్ కు వస్తానని చెప్పేరు. “సరే, నేను గూడా ఏదో ఒక డిష్ చేస్తాను.” అన్నాను నేను. కానీ నాకు రుచి, వాసన సరిగ్గా తెలియ లేదు. నాకు రాను రాను తెలిసి వచ్చింది, ఈ రెండు జ్ఞానేంద్రియాలు మార్పు చెందేయని. వాసన నా ముక్కులోకి వెళ్ళినపుడల్లా ఘ్రాణేంద్రియ కేంద్రం లో దురదగా ఉంటుంది. అలాగే సువాసనాభరితమైన సెంట్ సెంట్ గానీ ఆవుపేడ గానీ ఒకే రకంగా చికాకు పరుస్తాయ్. ఏ పదార్థం రుచి చూసినా దాని లోని ఎక్కువ ఘాటైన పోపు సరుకు రుచి మాత్రమే తెలుస్తుంది. ఆ వంటకంలో వాడిన మిగతా పదర్థాల రుచులు నెమ్మదిగా ఒక్కొక్కటే తెలుస్తాయ్. అప్పటినుండి సెంట్స్ వల్ల

నాకేమీ ఉపయోగం లేదు, మషాలా వంట నన్ను ఆకర్షించదు. మాషాలాలోని ఏ దినుసు ఎక్కువ ఘాటుగా ఉంటే దాని రుచి మాత్రమే నాకు తెలుస్తుంది, కారం లాంటివి.

(*నాలుగవ రోజున*) : కళ్లకేదో జరిగింది. మేము రియాల్టో రెస్టోరెంట్ లో కూర్చుని ఉన్నాం, అపుడు ఒక గొప్ప విశాలదృష్టి (vista vision) నాకు అనుభవంలోకి వచ్చింది, concave మిర్రర్ (పుటాకార దర్పణం) లాంటిది. నా దగ్గరకు వస్తున్న వన్నీ నాలోనికి వస్తున్నట్లు, నా నుండి దూరంగా వెడుతున్న వన్నీ నా లోపలినుండి బయటకు వెడుతున్నట్లు నాకు అనిపించేది. ఇదంతా ఎలా జరుగుతోందో నాకు అర్థమయ్యేది కాదు. – నా కళ్ళు బ్రహ్మాండమైన అతిపెద్ద కెమెరాలా పనిచేస్తూ, దానంతట అది ఫోకస్ మారుస్తున్నట్టు అనిపించేది. ఇప్పుడు నేను ఈ వింతకి అలవాటు పడిపోయాను. ఇపుడు కూడా నాకు వస్తువులు అలాగే కనిపిస్తాయ్. మీ మినీబస్ లో నన్ను రౌండ్స్ తిప్పినప్పుడు, ఒక కెమెరా మేన్ లా ఊగుతూ ఉన్నట్లూ, ఎదురుగా వచ్చే కార్లు నా లోపలికి వస్తున్నట్టు, మా పక్కనుండి వెళ్ళే కారులు నాలోపలి నుండి బయటికి వస్తున్నట్టు అనిపించేది. నా చూపు ఒక దానిపై నిలిపి నపుడు నా కళ్ళు ఏకాగ్రత తో దాన్ని చూస్తాయ్, ఒక కెమెరాలాగ. మరొక విషయం: మేము రెస్టోరెంట్ నుండి తిరిగి వచ్చాక, నేనింటికి వచ్చి అద్దంలో చూసుకున్నాను, నా కళ్ళు అలా ఎందుకు ఉన్నాయో తెలుసుకుందుకు. అద్దం లోకి చాలా సేపు చూశాను. అపుడు నేను గమనించింది ఏమంటే ఒక్కసారి గూడా నేను రెప్ప లార్పడం జరగ లేదు. అరగంట పైన అద్దంలోకి చూసినా నేను రెప్పలార్ప లేదు. సహజంగా జరిగే రెప్పలార్పుడు నాకు ఆగిపోయింది. నాకిపుడు గూడా అంతే.

(*ఐదవ రోజున*) నా వినికిడి లో తేడా కనిపించింది. నాకు కుక్క మొరగడం వినిపించింది. ఆ మొరుగుడు నా లోపలినుండి వచ్చినట్టు నాకనిపించింది. అలాగే ఆవు అరిచిన శబ్దం, రైలు కూత – శబ్దాలన్నీ అకస్మాత్తుగా నాలోపలినుండి వచ్చినట్లే నాకనిపించింది, బయటినుండి వచ్చినట్టు అనిపించేది కాదు. ఇప్పటికీ అంతే. ఐదు జ్ఞానేంద్రియాలు అయిదు రోజుల్లో మారేయ్.

ఆరవ రోజు నేను సోఫాలో పడుకొని ఉన్నాను – వాలెంటైన్ వంట గదిలో ఉంది. ఒక్కసారిగా నా శరీరం మాయమైయ్యింది. అక్కడ నా శరీరం లేదు. నేను నా చేతిని చూసుకున్నాను. (అదో రకమైన ప్రవర్తన – మీరు చూసి ఉంటే నన్ను పిచ్చాసుపత్రిలో చేర్పించి ఉండే వాళ్ళు) – నా చేతిని మళ్ళీ చూసుకున్నా— "ఇది నా చెయ్యేనా?" అక్కడ ప్రశ్నించడం లేదు, కానీ అక్కడ పరిస్తితి అల్లాగే ఉంది – నేను దాన్ని వర్ణిస్తున్నానంతే. అలా ఈ శరీరం ముట్టుకున్నా – ఏమీ లేదు – టచ్ చేసిన పాయింట్ దగ్గర స్పర్శ తప్ప అక్కదేమీ లేదు. అపుడు వాలంటైన్ ను పిలిచాను: ఈ సోఫాలో నా శరీరం కనిపిస్తోందా, అని అడిగెను. ఇక్కడ నా శరీరం ఉన్నట్లు నాకు తెలియటం లేదని అన్నాను. ఆమె ముట్టుకొని, "ఇది నీ శరీరమే." అన్నది. కానీ ఆ భరోసా నాకు ఓదార్పును, తృప్తిని యివ్వ లేదు. ఏమిటీ వింత వ్యవహారం? నా దేహం నాకు కనపడ్డం లేదు. నా బాడీ పోయింది, మళ్ళీ తిరిగి రాలేదు. తాకిన శరీరం భాగాలు తప్ప మిగతా శరీరం మాయమైనట్టు అనిపిస్తోంది. ఇలా అనిపించడానికి కారణం, చూడటానికి & స్పర్శకు ఇక్కడ ఏమాత్రం సంబంధం, సమన్వయం లేదు కాబట్టి, స్పర్శ తగలని చర్మ భాగాలు, స్పృహలోకి ఉండవు కాబట్టి, శరీరం యొక్క పూర్తి చిత్రం తయారు అవడం సాధ్యం కాదు.

ఏడవ రోజున, నేను మళ్ళీ అదే సోఫాలో పడుకొని విశ్రాంతి తీసుకోంటూ అన్య సంబంధ రహితస్తితి (ముక్తస్తితి, declutched state) ని హాయిగా అనుభవిస్తున్నపుడు వాలెంటైన్ వచ్చేది, ఆమెను నేను గుర్తు పట్టే వాణ్ని; ఆమె రూమ్ బయటకు వెళ్లిపోయేది – అంతే, ఖాళీ, వాలెంటైన్ ఇంక మనసులో ఉండేదికాధు – "ఇదేమిటి? వాలంటైన్ చూడ్డానికి ఎలా ఉంటుందో గూడ ఊహించ లేక పోయే వాణ్ని." నా లోపల నుండి వచ్చే శబ్దాల్ని మాత్రం వినే వాణ్ని. అవి దేనికి సంబంధించినవో తెలిసేది కాదు. నా జ్ఞానేంద్రియాలను సమన్వయం చేసేది అక్కడ లేదని తెలుసుకొన్నాను: సమన్వయ కర్త అక్కడ లేడు, అతడు మిస్సింగ్!

నాలోపల ఏదో జరుగు తున్నట్లు నాకు అనిపించింది: నా శరీర భాగాలన్నిటి నుండి జీవ శక్తి ఒక కేంద్ర బిందువు వైపు లాగబడుతున్నట్లుగా అనిపించింది "యిపుడు నీ జీవితానికి ముగింపు వచ్చేసిందని, నీ మరణం సంభవించబోతోంది"

అని నాకనిపించింది. నేనపుడు వాలెంటైన్ ను పిలిచి చెప్పేను "నేనిపుడు చావబోతున్నాను, నా మృత దేహాన్ని నువ్వేదో ఒకటి చెయ్యాలి. వైద్యులకు యిచ్చేయ్ – అది వాళ్ళకు ఉపయోగ పడచ్చు. దహనం చేయడడం, పాతి పెట్టడడం లాంటి వాటిపై నాకు నమ్మకం లేదు. నీ కోసమైనా ఏదో ఒకటి చెయ్యాలి. లేకపోతే అది కంపు కొడుతుంది—అందుచేత ఎవరికైనా ఇచ్చేయ్యచ్చుకదా." అని. అపుడు ఆమె అన్నది "`నువ్వు విదేశీయుడవు. స్విస్ ప్రభుత్వం నీ మృత దేహాన్ని తీసుకోదు. దాని సంగతి మర్చిపో." అని చెప్పి వెళ్ళి ఆమె వెళ్ళి పోయింది. ఈ జీవశక్తి (లైఫ్-ఫోర్స్) దేహంలోని ఒకే బిందువ వైపు పయనిస్తున్నదా... అన్నట్టుగా ఈ భయంకర ప్రక్రియ కొనసాగింది. నేను సోఫాలో పడుకొని ఉన్నాను. ఆమె మంచం కాళీగా ఉంది. అందుచేత ఆ మంచం మీదకు జరిగి పడుకొని కాళ్ళు జాపి తయారుగా ఉన్నాను. ఆవిడ నన్ను పట్టించు కోకుండా వెళ్లిపోయింది. ఆమె అంది, "ఓ రోజు ఇది మారింది, రెండోరోజు మరోటి మారింది అంటూ ఏదేదో చెపుతావ్, ఈ వ్యవహారమంతా ఏమిటి?" వీటిపై ఆమెకి ఏవిధమైన ఆశక్తీ లేదు. ఈ మతపరమైన విషయాలపై ఆమెకు ఎప్పుడూ ఇంటరెస్ట్ లేదు. ఇటువంటివి ఆవిడ ఎప్పుడూ వినలేదు. "నేను చచ్చిపోబోతున్నానంటావ్. నీవు చావబోవటంలేదు. నువ్వు బాగానే ఉన్నావ్, దృఢంగా ఆరోగ్యంగా, అని చెప్పి ఆమె వెళ్లిపోయింది.

నేను మళ్ళీ కాళ్ళు జాపి పడుకొన్నాను, ఇది ఇలాగే కొనసాగింది. జీవ శక్తి (లైఫ్ ఎనేర్జీ) అంతా ఒక కేంద్ర బిందువ దగ్గరకు వెడుతోంది – ఆ బిందువ ఎక్కడ ఉందో నాకు తెలియదు. ఒక కెమెరా రంధ్రం నెమ్మదిగా మూసుకు పోతున్నట్లుగా అనిపించిది. (యిక్కడ నేనంటున్న కెమెరా- ఒక ఉపమానం మాత్రమే, అక్కడ వాస్తవంగా జరిగిన దానికి నేను వర్ణించిన దానికి చాలా తేడా ఉంది, ఎందుకంటే ఇలా ఆలోచనలు చేసే వారు అక్కడ ఎవరూ లేవు. ఇదంతా నా అనుభవంలో ఒక భాగము, లేకుంటే ఇది నేను చెప్పలేక పోయే వాణ్ని.) ఆ కెమెరా రధ్రం మూసుకోవడానికి ప్రయత్నిస్తోంది, అక్కడ మరో శక్తి దాన్ని తెరిచి ఉంచడానికి ప్రయత్నిస్తోంది. తరవాత కొంత సేపటికి ఏంచెయ్యడానికి, కెమెరా అపర్చర్ తెరిచి

ఉంచడానికి కూడా ఇచ్ఛ లేక పోయింది. హఠాత్తుగా కెమెరా మూసుకు పోయినట్టు అనిపించింది. దాని తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు.

ఈ ప్రక్రియంతా జరగడానికి నలభై తొమ్మిది నిమిషాలు పట్టింది – ఈ మరణ ప్రక్రియ. ఇది ఒక భౌతిక మరణం లాంటిది. ఇది ఇప్పుడు కూడా నాకు జరుగుతూ ఉంటుంది. చేతులు కాళ్ళు చల్లా బడతాయ్, శరీరం కర్రలా బిగుసుకు పోతుంది. గుండె కొట్టుకోడం తగ్గి పోతుంది. ఊపిరి పీల్చడం తగ్గిపోతుంది. గాలి పీల్చడమ్ కష్టమై పోతుంది. కొంత సేపటికి తుది శ్వాస విడుస్తావ్. అదే నీ అంతం. తరవాత ఏమవుతుందో ఎవరికీ తెలియదు.

నేను యీ మరణ ప్రక్రియ నుండి బయపడిన తర్వాత, నాకు ఫోన్ కాల్ వచ్చిందని ఎవరో చెప్పారు. నేను కాల్ అటెండ్ కావడానికి మెట్లు దిగి కిందకు వెళ్ళేను. నాలోని మత్తు, అలసట యింకా పోలేదు. నాకేం జరిగిందో నాకింకా అర్థం కాలేదు. అది ఒక భౌతిక మరణం. చనిపోయిన నన్ను ఏది తిరిగి బ్రతికించినదో నాకు తెలియదు. ఈ మరణ ప్రక్రియకు ఎంత సమయం పట్టిందో నాకు తెలియదు. దానిగురించి నాకేమీ తెలియదు, ఎందుకంటే అక్కడ అనుభూతి చెందేవాడు అంతమయ్యాడు. మరణానుభవం పొందడానికి అక్కడ ఎవరూ లేరు. ఈ ప్రక్రియ అలా సమాప్తమయింది. నేను లేచాను

----------------

నేనిప్పుడే పుట్టిన పిల్లవాణ్ణి, అని నాకు అనిపించలేదు – "ఇదే జ్ఞానోదయం" అనే ప్రశ్నే రాదు. ఆ వారం రోజుల్లో నన్ను ఆశ్చర్య పరచినవన్నీ, రుచి, చూపు మొదలగు వాటిలో వచ్చిన మార్పులన్నీ శాశ్వతంగా ఉండిపోయాయ్. **ఈ** ఘటనలన్నిటినీ "విపత్తు (calamity)" **అని నేను అంటాను**. ఇది ఒక "విపత్తు" అని ఎందుకన్నానంటే -- ఎవరైతే దీన్ని గొప్పది, ఆనందకరమైనది, ప్రేమ, తన్మయత్వం అని ఊహించారో, వారికి ఇది ఒక భరించ శక్యం గాని శారీరక చిత్ర వధ అని తెలిసినపుడు — ఆ దృష్టితో చూస్తే ఇటువంటిది ఒక పెద్ద విపత్తు. ఇది నాకు విపత్తు కాదు, కానీ గొప్ప బ్రహ్మానందకరమైనదేదో జరుగబోతోందని అనే ఊహాచిత్రం మనసులో ముద్రించుకున్న వాళ్ళకి యిది విపత్తు. ఇంచుమించు యిది

యీ విధమైనది: నీవు న్యూయార్క్ సిటీ ని గొప్పగా ఊహించుకొని, చూడాలని కలలు కని అక్కడకి వెళ్ళిన తర్వాత అక్కడ నీవనుక్కన్నట్టుగా ఏమీ లేదనుకో, అది దేవుడు వదిలేసిన, దెయ్యాలు గూడా వదిలేసిన ఊరులా ఉందనుకో... అది నువ్వు కావాలనుకొన్నది, కోరుకొన్నది కాదు, పూర్తిగా విరుద్ధమైనది అనిపించినప్పుడు నీకేమనిపిస్తుంది... అది నీకు ఘోర విపత్తు లాంటిదే కదా? అక్కడున్నదేమిటో నీకు నిజంగా తెలియదు -- నీ దగ్గర దాన్ని గురించి తెలుసుకొనే దారేమీ లేదు -- ఇక్కడ ఏ ఊహాచిత్రం(ఇమేజ్) లేదు. ఈ అర్థంలో, "నేనొక జ్ఞానోదయం పొందిన వాణ్ణనీ, విముక్తి పొందిన వాణ్ణనీ, స్వేచ్ఛా జీవినని, మనవాళిని విముక్తి చేయబోతున్నానని, నేనెప్పుడూ అనుకొను, ఎవ్వరితోనూ చెప్పను. "విముక్తి దేని నుండి? నేను మరొకరిని ఎలా విముక్తి చేయగలను? ఎవరినీ విముక్తి చేసే ప్రశ్నే లేదు, అలా చేయాలంటే నేను విముక్తి చెందిన వాణ్ననే అభిప్రాయం నాలో ఉండి తీరాలి, మీకర్థమయిందా?

----------------

తరువాత ఎనిమిదవ రోజున నేను సోఫాలో కూర్చున్నాను, అపుడు చెప్పలేనంత శక్తి నా లోపల ఒక్కసారిగా ఉత్పన్నమయ్యింది, నా దేహాన్నంతటిని కుదిపేస్తూ. నా శరీరంతో పాటు నేనున్న ఇంటినీ, మొత్తం విశ్వాన్నంతా కూడా కుదిపేస్తోందా, అంతా కంపిస్తోందా అన్నట్టుగా. అటువంటి కదలికలను నీవు సృష్టించలేవు. అది అకస్మాత్తుగా జరిగిపోయింది. అది బయటినుండి వస్తోందా, లోపలనుండి వస్తోందా, కిందనుండి వస్తోందా, పైనుండి వస్తోందా అనేది నాకు తెలియదు – అది ఏ చోటు నుండి వస్తోందో నేను తెలుసుకోలేక పోయాను; అంతా అయిపోయింది. అది చాలా గంటలు అలాగే ఉండిపోయింది. దాన్ని నేను భరించ లేక పోయాను, కానీ దాన్ని ఆపడానికి కూడా ఏమీ చేయలేక పోయాను; మొత్తం నిస్సహాయంగా ఉండిపోయాను. ఇలా ప్రతి రోజు, రోజువిడిచి రోజు, జరుగుతూనే ఉండేది. నేనెప్పుడు కూర్చున్నా -- ఈ కంపన, మూర్ఛలాంటిది మొదలయ్యేది. మూర్ఛలాంటిది గూడా కాదు. ఇది చాలా రోజుల వరకు జరిగింది.

(మూడు రోజులవరకు యుజీ  బెడ్ మీదే పడుకొని ఉన్నాడు. శరీరం బాధతో వంకరలు తిరిగి  పోయేది.  శరీరంలోని ప్రతి కణంలో, ఒక దాని తర్వాత ఒకటి, నెప్పి వస్తూనే ఉండేది.  ఆరు నెల్ల వరకు, ఆయన విశ్రాంతి తీసుకొన్నపుడు, పడుకున్నప్పుడు,  అమితమైన శక్తి, ఉప్పెనలా ఉండి ఉండి వస్తూ ఉండేది)

శరీరానికి శక్యం కాలేదు (వీటన్నిటినీ భరించడం)....శరీరానికి నెప్పి తెలిసేది. అది చాలా బాధకారమైన ప్రక్రియ. చాలా బాధకారమైనది. ఇది భౌతికమైన బాధ, ఎందుకంటే శరీరానికి హద్దులుంటాయ్ – దానికి తనదైన ఒక రూపు ఒక ఆకారం ఉంటుంది. ఆ శక్తి  ఒక్కసారిగా బయటకు వచ్చినపుడు, ఓ వరదలా  వస్తుంది. అది నీ శక్తి కాదు, నా శక్తి కాదు, భగవంతుని శక్తి కాదు (మీరేపేరైనా పెట్టుకోండి) అక్కడున్న శక్తికి శరీరం యొక్క హద్దులు తెలియవవు; ఆ శక్తి శరీరానికున్న హద్దులను పట్టించుకోదు. దాని  ఊపు దానికుంది. అది చాలా బాధకారమైనది. ఇది పారవశ్యకరమైనది, ఆనందకరమైనది, ముక్తిని ప్రసాదించేది అని చెప్పబడే  ఆ అర్థరహిత చెత్త విషయలాకి సంబంధించినది  కాదు. అది నిజంగా చాలా బాధాకరమైనది. అది జరిగిన తరువాత నెలల తరబడి చెప్పలేనంత బాధలు అనుభవించాను; అంతకు ముందు కూడా. ప్రతి ఒక్కరూ,  రమణ మహర్షి కూడా బాధ అనుభవించేరు, అది జరిగిన  తరువాత.

అతి పెద్ద జలపాతం – ఒకటి కాదు వేల కొద్దీ జలపాతాలు – అలా అలా నెలలకొద్దీ జరుతూనే ఉన్నాయ్. అది చాలా బాధా కరమైన అనుభవం –  బాధాకరం అంటే, ఆ శక్తి ఒక  వింతైన విధానంలో పనిచేస్తుంది. మీకు తెలుసా, ఎయిర్ పోర్ట్ లో విల్స్ సిగరెట్ వ్యాపార ప్రకటన.  ఒక పరమాణువు దిశలు మారుస్తూ తిరుగుతూ ఉంటుంది. ఒక పరమాణువు: గీతలు 'ఇలా యిలా వెడుతూ ఉంటాయి (యుజీ చేసి చూపిస్తాడు) గుండ్రంగా గడియారం ముల్లు తిరిగే దిశలో, మళ్ళీ వ్యతిరేక దిశలో (క్లాక్ వైజ్ అండ్ ఏంటి క్లాక్ వైజ్)  ఒక  పరమాణువులా అది లోపల తిరిగేది – నీ శరీరంలో ఒక భాగంలోనే కాదు; మొత్తం శరీరమంతా. శరీరాన్ని ఒక తడి గుడ్డ వలే పిండుతున్నట్టుగా అనిపించేది. ఇప్పుడు గూడా నాకలానే అనిపిస్తుంది. అది పిలిస్తే వచ్చేది కాదు. నువ్వేమీ చెయ్యలేవ్. నిన్ను  చుట్టబెడుతున్నట్లు నీకు  అనుభూతి

కలుగుతుంది, నీ మీదకు దిగుతున్నట్టుగా. అది ఎక్కడనుండి దిగుతోంది? అది ఎక్కడ నుండి వస్తోంది? ఎలా వస్తోంది? వచ్చినప్పుడల్లా కొత్తగా, వింతగా – ప్రతిసారీ వేరే విధంగా వస్తుంది. అంచేత ఏంజరుగుతోందో నీకు తెలియదు. నీవు పక్క మీద పడుకోంటావ్, అది అకస్మాత్తుగా మొదలవుతుంది -- చీమల్లా మెల్లగా కదలడం మొదలవుతుంది. నల్లులు అనుకొని నేను కిందకు దూకి చూస్తే.. అక్కడ నల్లులు లేవ్...(నవ్వు..) – మళ్ళీ పడుకొంటాను.... వెంట్రుకలకు కరెంట్ షాక్ తగిలినట్టు అనిపిస్తుంది. అలా నెమ్మదిగా కదులుతుంది.

వళ్ళంతా నొప్పులు ఉండేవి. ఆలోచన ఈ శరీరాన్ని ఎంతగా నియంత్రించేదంటే, ఆలోచన తన పట్టు విదిలినపుడు, శారీరక జీవక్రియ తనపనులు తాను చేసుకోవాలనే ఆతృత తో కంగారు పడిపోతుంది. నా ప్రమేయం లేకుండానే, మార్పులు వాటంతట అవే జరిగిపోయేవి. చేతులు కదిలే తీరు మారింది. మామూలుగా అందరి చేతులూ ఈ విధంగా తిరుగుతాయ్. (యుజీ చేసి చూపుతాడు) ఆర్నెల్ల వరకు ఈ చేతి గుత్తి జాయింట్ చాలా నొప్పిగా ఉండేది, అది నార్మల్ పొజిషన్ లోకి, అంటే సాధారణ స్తితిలోకి, తనంతట వచ్చేవరకు. నా చేతుల కదలికలు యిప్పుడిలా ఉంటాయ్. అందుకే కొంతమంది అంటారు, నా చేతుల కదలికలు “యోగ ముద్రలు” లా ఉంటాయని. చేతుల కదలికలు ఇపుడు ఇదివరకటి కంటే చాలా భిన్నంగా ఉంటాయ్. అప్పుడు నా ఎముకల లోని మజ్జ లో గూడ నెప్పులుండేవి. ప్రతి కణం మారడం మొదలుపెట్టింది, యీ ప్రక్రియ ఆరు నెలలవరకు జరిగింది.

తరవాత లైంగిక హార్మోన్స్ ( sex hormones) మారడం మొదలు పెట్టేయ్. నేను మగ వాణ్ణో ఆడదానినో నాకు తెలిసేది కాదు -- అసలు యీ వ్యవహారమేమిటి – సడన్ గా ఎడం వైపున ఆడవాళ్ళ స్తనం కనపడింది. ఇటువంటివన్నీ – వివరాల్లోకి వెళ్ల దలచు కోలేదు – వీటన్నిటికీ పూర్తి రికార్డు ఉంది. అలా మార్పులు జరుగుతూనే ఉండేవి. ఈ శరీరం తన సొంత లయ(రిధమ్) లోకి పడడానికి మూడు సంవత్సరాలు పట్టింది.

----------------

**ప్ర: ఇది మీకెలా జరిగిందో మేము అర్ధం చేసుకో గలమా?**

**యుజీ : చేసుకోలేరు.**

**ప్ర: ఏం జరిగిందో అర్ధం చేసుకో గలమా?**

**యుజీ**: నా జీవితంలోని సంఘటనల వివరాలు మీరు చదవగలరు. అంతే. నా 49 వ పుట్టినరోజుకి యిటూ అటూలో, ఒక రోజున నాలో ఏదో పని చేయడం మానేసింది. ఉంకొక రోజున మరో యింద్రియంలో మార్పు వచ్చింది. మూడో రోజున మరో మార్పు ఒచ్చింది. నాకు ఏమేమి ఏవిధంగా జరిగేయో దానికి రికార్డు ఉంది. కానీ అది మీకేవిధంగా ఉపయోగిస్తుంది? మీకెందుకూ పనికి రాదు. అంతే కాదు, అది మీకు ప్రమాదం గూడా, ఏందుకంటే, బయట కనపడే వాటిని మీరు అనుకరించడానికి ప్రయత్నిస్తారు. ప్రజలు వీటిని అనుకరించి తమలో ఏదో జరిగి పోతోందని భ్రమిస్తారు – చాలా మంది చేసేది యిదే. నేను మామూలుగానే ప్రవర్తించా. జరుగుతున్నదేమిటో నాకు తెలియ లేదు. అదొక వింతైన పరిస్తితి. ఈ రికార్డులు ఉంచడం వల్ల ఏమీ ప్రయోజనం లేదు – వీటిని ప్రజలు అనుకరించడం మాత్రమే చేస్తారు. ఈ స్తితి ఒక విధంగా సహజమైనది.

-----------------

(*మొండెం పైనా కిందా, మెడ తల మొదలగు స్తలాల్లో, భారతీయ యోగా గురువులు చెప్పే 'చక్రాలు' అనబడేవి ఉండే స్తలాల్లో, 'వాపులు' ఆయన మిత్రులు గమనించేరు. అవి వివిధ రూపాల్లో, రంగులలో శరీరంపై, అపుడపుడు వస్తూ పోతూ ఉండేవి. పొట్ట కింద పొగాకు చుట్ట లాంటి చారలు ఉండేవి. బొడ్డు పైన బాదం గింజ రూపంలో గట్టిగా ఉన్న వాపు ఉంది. గుండె మీద నీలి రంగులో ఒక పెద్ద పతకం లాంటి ఓ గట్టి వాపూ, దాని చుట్టూ కంఠం కింద మరో చిన్న గోధుమ రంగు పతకం లాంటి వాపులు కనబడ్డాయ్. ఈ వాపులు రెండూ, మెడ చుట్టూ వివిధ రంగుల్లో ఉన్న గొలుసుకు వెళ్లాడుతూ నెక్లెస్ పతకం లో ఉండే హిందూ దేవుళ్ళను తలపించేవి. మిగతా చోట్ల ఉన్న ఉబ్బులు గూడా హిందూ దేవుళ్ల శిల్పాలను చిత్రాల వలె అనిపించేవి. ఆయన మెడ చుట్టూ ఉన్న వాపులు శివుని మెడలోని తాచు పాముగానూ, అ పాము తలపై ఆయన గెడ్డం అనినట్టుగా అనిపిస్తుంది.*

*కనుబొమ్మల మధ్య పద్మం రూపంలో మరో వాపుంది. బుద్ధుని విగ్రహం తల మీద ఉన్న బొడిపెల్లాంటి వాపులు యుజీ తలపై కనిపించేయ్. మోజెస్ కు మరియూ తావో తాంత్రికులకు ఉండే కొమ్ముల్లాంటి పెద్ద గట్టి వాపులు అప్పుడప్పుడు వస్తూ పోతూ ఉంటాయ్. మెడ పై ఉన్న రక్త నాళాలు ఎరుపు నీలం రంగుల్లో ఉండి, పాము తలలోపలికి వెడుతున్నట్టుగా ఉబ్బి ఉన్నాయ్.)*

వీటన్నిటినీ ప్రదర్శించుకోవడం నాకిష్టం ఉండదు, కానీ మీరు డాక్టర్లు గదా. ఇండియా లో చిహ్నాలు (symbolisms) ఉన్నాయ్ – త్రాచు పాము. ఇక్కడ ఉన్న వాపులు మీకు కనపడుతున్నాయా? -- తాచుపాము రూపంలో ఉన్నాయ్. నిన్న చంద్రుడు ఉదయించిన మొదటి రోజు. నీ చుట్టూ జరుగుతున్న అన్నిటి యొక్క ప్రభావం శరీరంపై పడుతుంది; ఇది నీ చుట్టూ జరుగుతున్నవాటికి వేరు కాదు. అక్కడ జరిగేవన్నీ ఇక్కడ జరుగుతాయ్ – ఇక్కడ భౌతిక స్పందన మాత్రమే ఉంటుంది . ఇది affection (ప్రభావం). నీ చుట్టూ జరిగేది ప్రతీదీ నిన్ను ప్రభావితం చేస్తుంది. నీవు దీన్ని అపలేవు, ఎందు వలనంటే, నీ చుట్టూ నీవు నిర్మించుకున్న నీ రక్షణ కవచం ధ్వంశమైనది. ఈ సింపుల్ కారణం వల్ల దీనిపై, బయట జరిగే ప్రతీదానివల్లా దీనికి హానిజరిగే అవకాశం ఉంది. చంద్రుని దశలు -- పౌర్ణమి, అర్ధ చంద్రుడు, అమావాస్య వగైరా - మారుతున్నపుడల్లా యిక్కడున్న వాపులు క్రమంగా తాచుపాము రూపానికి మారతాయ్. అందువల్లనే అయి ఉండచ్చు... కొంతమంది, శివుడు మొదలైన యిలాంటి చిత్రాల్ని (images) సృష్టించారు. – కానీ ఈ ఉబ్బులన్నీ తాచుపాము రూపంలోకి ఎందుకు మారుతున్నాయ్? ఈ వాపులెందుకు వచ్చేయని నేను డాక్టర్లందరిని అడిగేను. కానీ ఎవరూ నాకు తృప్తికరమైన సమాధానం ఇవ్వలేక పోయారు. ఇక్కడ గ్రంధులు(గ్లాండ్స్) గాని మరొకటి గాని ఉన్నాయా లేవా అన్నది నాకు తెలియదు.

-----------------

కొన్ని గ్రంధులు ఉన్నాయ్ (మానవ శరీరంలో), వినాళ గ్రంధులు (Ductless-glands) అనేవి. ఈ వినాళ గ్రంధులపై పరిశోధన చేస్తున్న కొంతమంది డాక్టర్లతో

నేను చాలా సార్లు చర్చించాను. ఈ గ్రంధులను హిందువులు "చక్రాలు" అంటారు. హిందువులు వూహించిన చక్రాలు ఉన్న చోటే సరిగ్గా ఈ వినాళ గ్రంధులు ఉన్నాయ్. థైమస్ గ్లేండ్ అనే గ్రంధి ఒకటి ఇక్కడ ఉంది. మన చిన్నతనంలో ఇది చాలా చురుగ్గా పని చేస్తుంది – చాలా చురుగ్గా – వీటికి అనుభూతులు (ఫీలింగ్స్) ఉంటాయ్, అసాధారణమైన ఫీలింగ్స్. మన యవ్వన దశారంభంలో యివి నిద్రాణావాస్తలోకి వెళ్ళిపోతాయని చెపుతారు. మరలా ఇటువంటిది ఏదైనా జరిగినప్పుడు, నీవు మళ్ళీ పుట్టినప్పుడు ఈ గ్లేండ్ తనంతట తాను పనిచేయడం మొదలు పెడుతుంది. అలా, అన్నీ ఫీలింగ్సూ ఉంటాయ్. ఫీలింగ్స్ ఆలోచనలు కావు, ఉద్రేకాలు కావు; ఇతరులపై చూపే ఆప్యాయత లాంటిది. అక్కడ ఎవరికైనా బాధ కలిగితే ఇక్కడ బాధ కలుగుతుంది – నెప్పిలా అనిపించదు గాని మనసు చివుక్కుమంటుంది -- మీరు అనుకోకుండా అనేస్తారు "అయ్యో" అని, అటువంటిది.

ఇది నాకు నిజంగా జరిగింది, నేనొక కాఫీ తోటలో ఉన్నప్పుడు: ఒక తల్లి తన చిన్న బిడ్డను కొట్టడం మొదలు పెట్టింది, చిన్న బిడ్డ కదా పాపం. పిచ్చి కోపంతో గట్టిగా కొట్టడం వలన ఆ బిడ్డకి స్పృహ తప్పేనంత పనైయ్యింది. నన్ను ఒకాయన అడిగేడు "మీరు కలగచేసుకొని ఆమెనెందుకు అపలేదని?" నేను అక్కడే నిలబడి ఉన్నా, చూడండి, నాకేమిచెయ్యాలో తోచలేదు. ఎవరిమీద నేను దయ తలచాలి, తల్లి మీదా పిల్ల మీదా? ఇదీ నా జవాబు. "దీనికెవరు బాధ్యులు?" ఇద్దరూ ఏమీ చేయలేని స్తితిలో ఉన్నారు: తల్లి తన కోపాన్ని అణచు కోలేక పోయింది, పిల్ల పాపం ఏమీ చెయ్య లేదు, ఏమీ తెలియనిది. ఇలా కొనసాగింది – ఒకదాని తర్వాత మరొకటి – అపుడు అవన్నీ, ఆ దెబ్బల గుర్తులు నా వీపు మీద కనబడ్డాయ్. అలా ఆ ఘటన లో నేను గూడా భాగం పంచుకొన్నాను. (నా ప్రత్యేకతను తెలియజేయడం కొరకు నేనిది చెప్పడం లేదు.) ఇది సాధ్యం, కారణమేమంటే చైతన్యాన్ని (consciousness) ను విడదీయ లేము. అక్కడ జరిగేది ప్రతీదీ నీ మీద ప్రభావం చూపుతుంది. ఇదే ఆప్యాయత(affection) అంటే, మీకు అర్ధమయిందా? ఇక్కడ కూచ్చుని నీవు ఎవరిపైనా తీర్పునిచ్చే ప్రసక్తే లేదు. ఆ పరిస్తితి అలాంటిది, దాని ప్రభావం నీమీద ఉంది . అక్కడ జరిగే ప్రతీదీ నిన్ను ప్రభావితం చేస్తుంది.

**ప్ర: విశ్వమంతటిలో జరిగే ప్రతీదీ ప్రభావితం చేస్తుందా?**

**యుజీ** : అది చాలా పెద్దది కదా. నీ చైతన్య క్షేత్ర పరిధి (your field of consciousness.) లో ఉన్నంత వరకూ. అయినా చైతన్యానికి హద్దులు లేవు. అక్కడ అతనికి దెబ్బ తగిలితే, నీకు కూడా యిక్కడ దెబ్బ తగులుతుంది. నీకిక్కడ బాధ కలిగితే వెనువెంటనే అక్కడ ప్రతిస్పందన ఉంటుంది. నేను విశ్వమంతటిని గురించి చెప్పలేను గాని, నీ చైతన్యం యొక్క పరిధి వరకు, నీవు పనిచేస్తున్న క్షేత్ర పరిధి వరకు ఆ నిముషంలో, నీ ప్రతిస్పందన (response) ఉంటుంది – నీవు స్పందిస్తున్నావని కాదు.

తరవాత, మిగతా గ్రంధులన్నీ గూడా ఇక్కడ ఉన్నాయ్... ఇక్కడ చాలా గ్రంధులున్నాయ్; ఉదాహరణకు – పిట్యూటరీ గ్రంధి – 'మూడో కన్ను', 'ఆజ్ఞ చక్రం' అని వాళ్ళంటారు. ఆలోచనలు అడ్డు రావడం పూర్తిగా, శాశ్వతంగా ఆగిన తర్వాతే ఈ గ్రంధి పనిచేయడం మొదలు పెడుతుంది: శరీరానికి సూచనలు ఉత్తరువులు ఇచ్చేదీ ఈ గ్రంధే, ఇకపై ఈ పని 'ఆలోచన' చేయదు. ఆలోచన అడ్డు రాదు. (బహుశా అందుకనే వాళ్ళు దీన్ని ఆజ్ఞ చక్రం అంటారు. దీనిని నేను వ్యాఖ్యానించడం లాంటిది చేయడం లేదు. బహుశా ఇది మీకు కొంత ఊహించడానికి వీలవుతుంది.) కానీ, నీవొక రక్షణ కవచాన్ని నిర్మించుకొని, ఆలోచన అనే రక్షణ కవచాన్ని సృష్టించుకొని, బయటి విషయాల ప్రభావానికి నువ్వు లోను కాకుండా, నిన్ను నీవు కాపాడు కొంటున్నావ్.

---------------

ఆలోచనను ఒక స్వీయ-రక్షణా యంత్రం (self-protective mechanism) గా వాడుకొనే వాడు యిక్కడ లేనందువల్ల అది(ఆలోచన) తనను తాను కాల్చి వేసుకుంటుంది. ఆలోచన దహనమై అయనీకరణ (ionization) చెందుతుంది, (మీ సైంటిఫిక్ పదాలు వాడ వచ్చు అంటే). ఆలోచన అంటే ఒక ప్రకంపనమే (vibration) కదా. ఇలా ఆలోచన అయానీకరణ అయినపుడు అది బూడిద లాంటి పదార్థాన్ని బయటకు తోస్తుంది, అప్పుడప్పుడు శరీరమంతా బూడిదతో కప్పివేయ బడుతుంది. ఆలోచనలు ఏమాత్రం అవసరం లేనపుడు నీ శరీరమంతా దీనితో కప్పి వేయ

బడుతుంది. ఆలోచనను వాడకపోతే అదేమవుతుంది? అది కాలిపోతుంది – అది ఒక శక్తి – అది ఒక దహన క్రియ. శరీరం వేడెక్కుతుంది తెలుసా. దీనివల్ల శారీరమంతా చెప్పలేనంత వేడెక్కుతుంది, అందువల్ల చర్మమంతా, ముఖం పాదాలు ప్రతీదీ బూడిద లాంటి పదార్థంతో కప్పివేయ బడుతుంది.

స్వచ్ఛమైన, తేలికైన భౌతిక శాస్త్ర పదాలతో , శారీరకధర్మ సంబంధిత పదాలతో ఇది వివరించి చెప్పడానికి గల కారణాల్లో అది ఒకటి. దీనిలో మానసిక శాస్త్ర సంబంధిత విషయాలేమీ లేవు. ఇక్కడ ఆధ్యాత్మికతకు సంబంధించిన సంగతులు కూడా ఏమీ లేవు. మత విషయాలు సూచించే భావ గర్భితాలు అసలేమీ లేవు. ఈ విషయం మీకు తప్పకుండా చెప్ప వలసిన బాధ్యత నామీద ఉంది, తరవాత మీరంగీకరించారా లేదా అన్నది నేను పట్టించుకోను, అది నాకు ముఖ్యం కాదు.

-------------

ఇటువంటిది చాలమందికి జరిగి ఉండాలి. ఇది వందకోట్ల మందిలో ఒకరికి జరుగుతుందని నేనంటాను, అది సంభవించిన వాళ్ళలో నువ్వు ఒకడివి. ఆ ఒక్కడూ దీనికోసం ప్రత్యేకంగా సిద్ధం చేయబడ్డ వాడని కాదు. ఇది జరగడానికి శరీరాన్ని పరిశుద్ధి చేసే పద్ధతులు గానీ, సాధనలూ అవసరం లేదు – ఏ రకమైన సన్నద్ధతా (Preparation) అక్కరలేదు. చైతన్యం (consciousness) ఎంత శుద్ధిగా ఉంటుందంటే, దాన్ని శుద్ధి పరచడానికి నీవు చేస్తున్నది ఏదైనా, అది ఆ చైతన్యానికి మలినం జోడిస్తుంది.

ఆ చైతన్యం తనను తాను పూర్తిగా ప్రక్షాళన (ఫ్లష్ ఔట్) చేసుకోవాలి: అది పవిత్రతను గానీ అపవిత్రతను గానీ అక్కడున్న ప్రతీదాన్ని అనవాలు లేకుండా కడిగి పారేసుకోవాలి. పవిత్రమైనవి, పరిశుద్ధమైనవి అని నీవు అనుకొన్నవన్నీ ఆ చైతన్యంలో మలినాలే. అది నీ సంకల్పం వల్ల జరగదు; నీ ప్రయత్నం లేకుండానే, హద్దులూ సరిహద్దులూ కూలి పోయినప్పుడు వరద గేట్లు తెరుచుకొని అన్నీ కొట్టుకు పోతాయ్. అలా అన్నీ కొట్టుకుపోయే ప్రక్రియలో నీకి విచిత్ర చిత్రాల అనుభవాలు (visions) కలుగుతాయ్. ఈ చిత్రాలు బయట ఉన్నవీ కాదు, నీ లోపల ఉన్నవీ కాదు. ఒక్కసారిగా, అకస్మాత్తుగా నీకు నీవే, ఈ 'చైతన్యం మొత్తం అంతా' (whole

consciousness), బుద్ధుడు, క్రీస్తు, మహావీరా, మహమ్మద్, సోక్రటీస్ లాంటి వారి రూపాల లోకి మారిపోతుంది -- ఈ స్తితి లోకి వచ్చిన వాళ్ళరూపాలలోకి మాత్రమే, గొప్ప వాళ్ల యొక్క లేదా, మానవజాతిని నడిపిన నేతల యొక్క రూపాలలోకి కాదు. ఇదంతా వింతగా ఉంటుంది – కానీ ఎవరికైతే ఇలాంటిది జరిగిందో వాళ్ల రూపాలలోకి మాత్రమే.

అందులో ఒకడు ఒక రంగు పూసినట్టు కనబడుతున్న మనిషి. (సరిగ్గా చెప్పాలంటే రంగుతో పూయడం కాదు), ఆ రోజుల్లో ఆ రూపం ఎలా ఉండేదో నేను అందరికి చెప్పగలిగే వాడిని. ఒక స్త్రీ వక్షోజాలతో, జుట్టు విరబూసుకొని – నగ్నంగా. అలా భారత దేశంలో ఇద్దరు సాధువులు ఉండేవారని నాకేవరో చెప్పేరు – అక్కమహాదేవి మరియు లల్లేశ్వరి – వాళ్ళు ఆడ వాళ్ళు, నగ్న స్త్రీలు. సడన్ గా ఆ రెండు చనులు, విరబుసున్న జుట్టు నాకు వచ్చేసేయ్ – ఇంద్రియాలు గూడ స్త్రీల ఇంద్రియలుగా మారిపోయేయ్.

కానీ ఇంకా అక్కడ విభజన ఉంది – నీవు & నీ కాన్షియస్నెస్ (consciousness) బుద్ధుని రూపం లేదా ఏసు క్రీస్తు రూపం వహించారు లేదా మరొక రూపం, అదేమిటో ఆ దేవుడికే తెలియాలి – అదే పరిస్తితి: "నేను ఆ స్తితి' లో ఉన్నట్లు నాకేలా తెలుస్తుంది?" కానీ ఆ విభజన చాలా సేపు ఉండదు; అది మాయమై పోయి మరొకటి ఒస్తుంది. వందల కొద్దీ మనుష్యుల చిత్రాలు కనిపిస్తాయ్ – బహుశా వందలకొద్ది మనుషులకు ఇది (ఈ స్తితి లోకి రావడం) జరిగి ఉంటుంది. ఇది చరిత్రలో భాగం – చాలమంది ఋషులు, కొంతమంది పశ్చిమ దేశస్తులు, బిక్షువులు, చాలమంది స్త్రీలు, ఒకో సారి చాలా వింతైన విషయాలు. చూసారా, మునుపటి మనుషుల అనుభవాలన్నీ మీ -కాన్షియస్నెస్ లో ఒక భాగం. "సాధువులు కదం తొక్కుతూ బయటికి వెళ్ళి పోతున్నారు" అనే వాక్యాన్ని వాడుతున్నాను; క్రైస్తవమతంలో ఓ కీర్తన ఉంది "సాధువులు కదం తొక్కుతూ లోపలికి వెడుతున్నప్పుడు" అని. వాళ్ళందరు నీ చైతన్యం నుండి బయటకు పరుగులు పెడుతూ వెళ్లిపోతారు, ఎందుకంటే వాళ్ళక్కడ ఇంక ఉండలేరు, కారణం, అదంతా అపరిశుద్ధం, మాలిన్యం.

నేను ఖచ్చితంగా చెప్పలేను గాని, నీవు ఇలా అనవచ్చు బహుశా సాధువులలో, యోగులలో, సన్యాసులలో జరిగిన ఈ రకం ప్రేలుడుల వల్ల మానవ చైతన్యానికి తగిలిన గట్టి ప్రభావం (impact) వల్ల, నీలో ఉన్నదంతా ఒక్కసారి విచ్ఛిన్నం అవడానికి ఎల్ల వేళలా ప్రయత్నిస్తూ ఉందా అన్నట్టుగా అనిపించడం నీలో అసంతృప్తిని కలిగించి ఉండచ్చు" అదే అవ్వచ్చు – దాని గురించి నేనేమీ చెప్ప లేను. వాళ్ళు నిన్ను ఈ స్తితి వరకు తోస్తున్నారు కాబట్టి వాళ్ళక్కడ ఉన్నారని నీవు చెప్పగలవు, అంతేగాక వాళ్ళు దేనికొరకు ఉన్నారో ఆ పని అయిపోయిన తర్వాత వాళ్ళు వెళ్లిపోతారు – ఇదంతా నా ఊహ మాత్రమే. కానీ యీ మంచీ, చెడూ, శుద్ధమైనవి, అపరిశుద్ధమైనవి, పవిత్రమైనవి, అపచారమైనవి అన్నీ బయటకు కొట్టుకు పోవడం జరగ వలసిందే, లేకపోతే నీ చైతన్యం (కాన్షియస్నెస్) ఇంకా కల్మషంగానే, అపరిశుద్ధంగానే ఉంటుంది. ఆ సమయంలో ఇది (యీ ప్రక్షాళన ప్రక్రియ) జరుగుతూనే ఉండేది. -- అక్కడ వందలాది వేలాది ఉన్నాయి(కల్మషాలు) – తర్వాత(కల్మషాలన్నీ బయటికి నెట్టివేయబడిన తరువాత) నీవు, ఆదిలో ఉన్న అతి ప్రాచీనాదశ నాటి చైతన్యస్తితి లోకి మళ్ళీ ఉంచ బడతావ్. ఒక్కసారి అది తన నుండి, తనంత తానుగా స్వఛ్ఛ మయిన తరవాత మరేదీ దాన్ని స్పృశించ లేదు, ఏదీ దాన్ని మళ్ళీ మలిన పర్చ లేదు. అప్పటి వరకు జరిగిన నీ గతమంతా అక్కడే ఉంది . కానీ అది నీ చర్యలను ఇకపైన ప్రభావితం చెయ్య లేదు.

ఆ విపత్తు (కెలామిటీ) జరిగిన తర్వాత మూడు సవత్సరాల వరకు ఆ చిత్ర విచిత్రాలు సంభవిస్తూనే ఉండేవి. ఇప్పుడు అవన్నీ పూర్తిగా ఆగి పోయాయ్. విభజించ బడ్డ చైతన్య స్తితి (The divided state of consciousness) ఇక మీదట అస్సలు పనిచేయలేదు. అది ఎప్పుడూ విభజన రహిత స్తితి consciousness లోనే ఉంటుంది. ఏదీ దాన్ని తాక లేదు. ఏదైనా జరగ వచ్చు -- ఆలోచన మంచిది అవ్వచ్చు, చెడ్డది అవ్వచ్చు, లండన్ లోని ఒక వేశ్య టెలిఫోన్ నంబర్ కావచ్చు. నేను లండన్ లో జులాయిలా తిరుగుతున్నప్పుడు చెట్టుకు తగిలించిన ఫోన్ నెంబర్లు చూస్తూ ఉండే వాడిని. వేశ్యల దగ్గరికి వెళ్ళే ఇంటరెస్ట్ నాకు లేదు, కానీ ఆ ఫోన్ నెంబర్లు నాకు ఆసక్తికరంగా కనబడేవి. నాకు వేరే పనేదీ ఉండేది కాదు,

చదవడానికి పుస్తకాలు లేవ్, చెయ్యడానికి ఏమీ లేదు, ఆ నెంబర్లు చూడ్డం తప్ప. ఒక నెంబరు స్థిరంగా ఉండి పోయిందక్కడ, అదే గుర్తుకొచ్చేది, అదే రిపీట్ అవుతూ ఉండేది. అక్కడకు ఏం వస్తోంది అన్నది ముఖ్యం కాదు – మంచి, చెడు, పవిత్రత, అపవిత్రత. ఇది మంచని, ఇది చెడ్డని చెప్పడానికి అక్కడ ఎవరున్నారు?— అవన్నీ అంతమై పోయాయ్. అందుకే 'religious experience' (మత సంబంధిత అనుభవం) అనే పదాలు వాడ వలసి వస్తోంది. (religion, మతం అనే పదానికి మీరు చెప్పే అర్థంలో కాదు) : ఇది నీవు ఎక్కడనుండి వచ్చావో ఆమూల స్థితిలో (source) లో నిన్ను తిరిగి ఉంచు తుంది. నిర్మలమైన ప్రాచీన ప్రాథమిక మూల చైతన్య స్థితిలోకి, వెనక్కి నీవు వెళ్లిపోతావ్. నువ్ దాన్ని జాగృతి (awareness) అని పిలు, లేదా నీ కిష్టమైన మరొక పేరుతో పిలు. ఆ స్థితిలో అన్నీ జరుగుతున్నాయ్, కానీ జరిగే సంఘటనల పై ఆసక్తి ఉన్నవాడు గాని, వాటిని చూసే వాడు గాని అక్కడ ఎవరూ లేరు. అవి వాటంతట అవే వస్తాయి, వెళ్లిపోతాయి, గంగా ప్రవాహంలా: మురుగు నీరు, సగం కాలిన శవాలు, మంచివి, చెడ్డవి రెండూ వచ్చి కలుస్తాయ్ – ప్రతీదీ -- కానీ ఆ నీరు ఎల్లపుడూ స్వచ్ఛంగా ఉంటుంది.

---------------------

ఈ మొత్తమంతటిలో అతి పెద్ద చిక్కువిడని, దిగ్భ్రమపరచే భాగం ఏమిటంటే... జ్ఞానేంద్రియాలు స్వతంత్రంగా పనిచేయడం మొదలు పెట్టడం. జ్ఞానేంద్రియాల పనులను జతకలిపి చూసే, linking చేసే సమన్వయ కర్త (co-ordinator) అక్కడ లేడు, అందు వల్ల మాకు చెప్పలేనన్ని సమస్యలు ఒచ్చేయ్ – వాలెంటైన్ ఈ వీటన్నిటినీ దాటుకొంటూ పోవాల్సి వచ్చింది. మేము వాకింగ్ కు వెళ్ళినపుడు, ఒక పువ్వు నాకు కనబడ్డప్పుడు, అదేమిటీ అని నేను అడిగే వాణ్ని. అపుడామె చెప్పేది, అది ఒక పువ్వని. కొంత దూరం పోయిన తరవాత ఒక ఆవుని చూసి అది ఏమిటని అడిగే వాణ్ని చిన్న పిల్లాడిలా. అలా అన్నీ మళ్ళీ నేర్చుకోవాల్సి వచ్చేది, అది నిజంగా తిరిగి నేర్చు కోవడం కాదు, ఆ విషయ జ్ఞానమంతా నా బేగ్రౌండ్ లో ఉంది, కానీ బయటకు వచ్చేది కాదు. మా వ్యవహారం అలా ఉండేది. "ఈ పిచ్చి ప్రవర్తన ఏమిటి?" మాటల్లో పెట్టాలి కాబట్టి ఇలా చెపుతున్నాను గానీ, నాకుమాత్రం, నేను

ఒక వింతైన మానసిక స్తితిలో ఉన్నట్టు అనిపించ లేదు. నా మానసిక స్తితి బాగానేఉంది. నా ప్రవర్తనంతా  నార్మల్ గా ఉంది. ఇదేమిటి, అదేమిటి అని అర్ధం పర్ధం లేని ప్రశ్నలు వేయడం తప్ప. అంతే, వేరే ప్రశ్నలు లేవు. ఇదంతా ఎలా అర్ధంచేసుకోవాలో వాలెంటైనుకు  కూడా తెలియదు. నేను నార్మల్ గా ఉన్నట్టు ఆమెకు అనిపించినప్పటికి, జెనీవాలో ఉన్న ఒక పెద్ద మానసిక వైద్యుడి దగ్గరకి పరుగెట్టుకు వెళ్లింది, ఇదేమిటటో అర్ధం చేసుకోడానికి, కానీ అదే సమయంలో నా ప్రవర్తన ఆమెకు పిచ్చిగా అనిపించలేదు.  నేను ఏ ఒక్క పిచ్చి పని చేసి ఉండినా, ఆమె నన్ను వదిలేసి ఉండేది. నేనెప్పుడూ పిచ్చిగా ప్రవర్తించ లేదు. ఎప్పుడూ కూడా; అది ఏమిటి ఇది ఏమిటి అని వింతగా  అడగడం తప్ప. అది ఆవు, ఇది, అది అని ఆవిడ చెప్పేది. ఇది అలా జరుగుతూనే ఉండడం ఆవిడకు నాకు కూడా ఇబ్బంది కరంగానే ఉండేది. ఆమె మానసిక వైద్యుణ్ణి కలిసి నప్పుడు ఆ డాక్టర్ గారు, ఆ మనిషిని చూస్తేగాని మేమేం చెప్పలేము, ఆయనను తీసుకు రండి, అన్నాడు. కానీ నాకు తెలుసు నాలో ఏదో అద్భుతమైనదేదో జరిగిందని. కానీ అదేమిటో నాకు తెలియ లేదు. అయినా నాకది ఇబ్బంది అనిపించ  లేదు. “అది ఆవా? కాదా?” అని అడగడమెందుకు? అది ఆవైతేనేమీ, గాడిదైతే నేమి, గుర్రం అయితే నేమి, తేడా ఏమిటి? – ఈ దిగ్భ్రాంతి కరమైన పరిస్తితి చాలా కాలం కొనసాగింది – నా మునుపటి జ్ఞానమంతా నా నేపధ్యం లో ఉంది. ఇప్పుడు కూడా అదే పరిస్తితి, కానీ ఇప్పుడు ఆ ప్రశ్నలు వెయ్యడం పూర్తిగా మానేసాను. ఇపుడు నేనేదైనా చూస్తున్నపుడు నేను దేన్ని చూస్తున్నానో  నాకు నిజంగా తెలియదు. అందుకే నేనంటాను, ఇది ఒక ‘ఏమీ తెలియని స్తితి’ (a state of not knowing) అని. నాకు నిజంగా తెలియదు. అందుకే నేనంటాను,  నీ అదృష్టం వల్లనో, లేదా ఏదో అనుకోని ఒక అవకాశం వల్లనో నువ్వు ఒక్కసారి అక్కడ ఉంటే,  అప్పటి నుండి ప్రతీదీ దాని పద్ధతి లోనే జరుగుతుంది. నీవెప్పుడూ ‘సమాధి’  స్తితి లోనే ఉంటావు. అ స్తితి లోపలికి వెళ్ళడం, అ స్తితి నుండి బయటకు రావడం అంటూ ఏమీ  ఉండదు. నువ్వు ఎప్పుడూ అక్కడే ఉంటావ్. నాకు ఆ పదం (సమాధి) వాడడం  ఇష్టం లేదు,

అందుకే అది ఒక 'ఏమీ తెలియని స్తితి' అంటాను. నీవు దేన్ని చూస్తున్నావో నీకు నిజంగా తెలియదు.

------------------

దాని విషయంలో నేనేమీ చేయలేను – నేను వెనక్కి వళ్ళే ప్రసక్తే లేదు; అంతా సమాప్తమయిపోయింది – ఇది "వేరే విధంగా" పనిచేస్తోంది, వేరే విధంగా నడుస్తోంది. (అది ఎలా ఉంటుందో కొంచమైనా తెలియ చెప్పడానికి, నీకో ఫీల్ feel యివ్వడానికి, "వేరే విధంగా" అనే పదాలు వాడుతున్నాను)

కొంత తేడా ఉన్నట్టు నాకు అనిపిస్తోంది (నేను చెప్పదలచుకున్న దానికి నీవు అర్థం చేసుకున్న దానికి). నన్ను చూడటానికి వచ్చే వాళ్ళతో నాకున్న సమస్య ఇది: నేను వ్యవహరించే తీరు వాళ్ళకు అర్థం కావడం లేదని అనిపిస్తోంది, అలాగే వాళ్ళు వ్యవహరించే తీరు నాకు అర్థం కావటం లేదని అనిపిస్తోంది. మేము ఇద్దరం ఎలా మాట్లాడుకోగలం? మేమిద్దరం ఆపెయ్యాల్సి వస్తుంది. మా ఇద్దరి మధ్య సంభాషణ ఎలా కోన సాగుతుంది? నేను ఏదో ఆవేశంగా పిచ్చిగా మాట్లాడతాను, దేనికీ సంబంధం లేకుండా. పిచ్చి వాడికి నాకు తేడా ఒక వెంట్రుక వాసి మాత్రమే – అందుకే మీతో అంటాను, ఆ క్షణంలో టాపిక్ మార్చండి లేదా ఆపేయ్యండి అని.

ఏమీ తేడా లేదు, అస్సలు తేడా లేదు. చూడండి, ఏదో అదృష్టం వల్లనో, ఏదో తెలియని అవకాశం వల్లనో ఎలాగో ఇటువంటిది జరుగుతుంది. (అది అనుభవంలో ఎలా ఉంటుందో మీకు కొంచెం తెలియ చెప్పడానికి 'జరుగుతుంది' అనే పదం వాడుతున్నాను) అదంతా మొత్తం నీకు, ఫినిష్ అయిపోయింది.

ప్ర: "ఆత్మ జ్ఞానులలో (నిజం గ్రహించిన, realized వాళ్ళలో) గూడా ఒకరికీ మరొకరికీ తేడాలు ఉంటాయా?

యుజీ : అవును, ఎందుకంటే వారి నేపధ్యాలు వేరు వేరు కాబట్టి. తనను వ్యక్తం చేసుకోగలిగేది ఒక్క బేగ్రౌండ్ మాత్రమే. అది తప్ప అక్కడ మరొకటి ఏముంది? నేను వ్యక్తం చేస్తున్నదే నా బేగ్రౌండ్: నేనెంత శ్రమ పడ్డానో, నా దారి, ఏ దారిలో వెళ్ళేనో, ఇతరుల మార్గాలను ఏవిధంగా తోసిపారేసేనో -- ఆ పాయింట్ వరకు నేనేం

చేసేనో లేదా ఏం చెయ్య లేదో నేను చెప్పగలను – ఏమైనా అది నాకు ఏవిధంగానూ సహాయపడ లేదు.

**ప్ర: కానీ మీ లాంటి వాళ్ళు మా కంటే బిన్నంగా ఉంటారు. ( ఏమనుకోకండి, "మీ లాంటి వారు" అన్నందుకు). మా ఆలోచనలలో మేం మునిగి పోతుంటాం.**

**యుజీ:** అతని నేపధ్యం వేరు కాబట్టి, మీతో పోల్చి చూసినప్పుడు మాత్రమే కాకుండా, యీ స్తితిలోనే ఉన్నారనబడే వాళ్లెవ్వరితో పోల్చి చూసినా అతడు భిన్నంగా ఉంటాడు.

**ప్ర: ఈ విధమైన "ప్రేలుడు" సంభవించిన ప్రతీ మనిషి ప్రత్యేకమైన వాడైనప్పటికీ, ప్రతి ఒక్కరూ తమ యొక్క సొంత బేగ్రౌండును వ్యక్తపరుస్తున్నారనే అర్ధంలో, వాళ్లందరిలో గూడా కొన్ని, కామన్ గా అందరిలోఉండే ఉన్న లక్షణాలు కొన్ని తప్పక ఉంటాయని అనిపిస్తోంది.**

**యుజీ:** దాన్ని గురించి నేనెప్పుడూ పట్టించుకోను; మీరు పట్టించుకుంటారనుకుంటా. నేనెప్పుడూ ఇతరలతో నన్ను పోల్చుకోను.

--------------------

ఇంతే, మరేమీ లేదు. నా జీవిత కథ అయిపోయింది. ఇంక రాయడానికి ఏమీ లేదు, ముందేమీ ఉండదు. ఎవరైనా వచ్చి ప్రశ్నలు వేస్తే నేను జావాబిస్తా; ఎవరూ ఏమీ అడగక పోయినా నాకు పరవాలేదు. ప్రజలను విముక్తి చేయడమనే 'అధ్యాత్మిక వ్యాపారం' (holy బిజినెస్) పెట్టుకొని నేను కూర్చో లేదు. ప్రజలకి ఇవ్వడానికి నా వద్ద ప్రత్యేకమైన ఉపదేశం ఏదీ లేదు, జ్ఞానోదయం తేడానికి ఏర్పడిన ధార్మిక సంస్థలన్నీ దుకాణాలే అనీ, జాగృతి(awareness) ద్వారా మానసిక పరివర్తన పొందడం లాంటి కబుర్లన్నీ పనికి రానివే అనీ.. చెప్పడం తప్ప. మానసిక పరివర్తన అసంభవం. సమూలమైన జీవ సబంధిత శారీరిక మార్పు(biological mutation) వల్లనే సహజ స్తితి (natural state) సంభవించగలదు.

**-- మొదటి భాగం సమాప్తం --**

జ్ఞానోదయ రహస్యం

రెండవ భాగం

# జ్ఞానోదయ తేజం

*(ఇండియా & స్విట్జర్ లెండ్ లో జరిగిన, 1973 సంభాషణల నుండి జేమ్స్ బ్రోడ్ స్కీ  సంకలనం.)*

*****

ఎవ్వరినీ విముక్తి చెయ్యడానికి నేను బయలుదేర లేదు. నిన్ను నీవే విముక్తి చేసుకోవాలి, అది నువ్వు చేసుకోలేక పోతున్నావ్. చెప్పడానికి నా దగ్గరున్న విషయాలు ఆ పని చేయలేవు. నేనున్న ఈ  స్తితిని  వివరించి చెప్పడంలో నా ఉద్దేశ్యం, అభిమతం ఏమంటే, ధార్మిక వ్యాపారాలు  చేసే వీళ్ళందరి చేత దీనంతటిచుట్టూ కప్పివేయబడ్డ మంత్ర తంత్ర మానసిక మాయాజాల భ్రమల ముసుగును, పూర్తిగా తుడిచి వెయ్యడం మాత్రమే. మీ  ఊహాలలో తప్ప మరెక్కడా లేని ఒక 'స్తితి'ని పొందడం కొరకు  మీ  సమయాన్ని,  శక్తిని,  వృధా చేయ చేయ వద్దని నేను మిమ్మల్ని బహుశా ఒప్పించ గలనేమో.

------------

దీన్ని తిన్నగా అర్ధం చేసుకోండి, నేను వివరిస్తున్నది మీరున్న  స్తితిని,  మీ సహజ స్తితిని... నా స్తితిని కాదు, లేదా దైవ సాక్షాత్కారాన్ని పొందిన వాని స్తితినో, లేదా జీవకణ మార్పిడి(mutation) జరిగిన వాని స్తితినో,  లేదా అటువంటి మరో స్తితినో కాదు. ఇది మీ సహజ స్తితి. కానీ, మీలో సహజంగా ఉన్నదాన్ని తన యొక్క రీతిలో తనను వ్యక్త పరచనీయకుండా అడ్డుకుంటున్నది, ఏదో పొందలనే మీ ఆరాటం, ఇప్పుడున్న దానికి భిన్నంగా మరోలా మారలనే మీ ప్రయత్నం,

-----------

దీన్ని నువ్వు ఎప్పటికీ అర్థం చేసుకోలేవ్; నీ గత అనుభవాల పరిభాషలో మాత్రమే దీన్ని నీవు అనుభూతి చెందగలవు. ఇది అనుభవ రంగానికి బయట ఉంటుంది. ఈ సహజ స్తితి అకారణం, కారణం లేనిది. అది అనుకోకుండా జరిగి పోతుంది. ఇది ఎందుకు జరిగిగింది, ఎలా జరిగింది అని మాట్లాడుకోవడం సాధ్యం కాదు, దాని అవసరం కూడా లేదు. 'నీ పనులు నీవేవిధంగా నిర్వహిస్తున్నావు' అనే ఒక్కటి మాత్రమే నీకు తెలిసిన నిజం; నేను వివరించిన దాన్ని, నీవు వ్యవహరిస్తున్న దానితో పోల్చి చూసుకోవడం అనేది వ్యర్ధమైన పని. నువ్వు ఈ పోల్చి చూసుకోవడాలు ఆపేసినప్పుడు ఉండేదే నీ సహజ స్తితి. అప్పుడు నువ్వు ఎవరి ఉపన్యాసాలూ వినవు.

నా బోధన (teaching) అనేది ఏదీ లేదు. ఇక ముందు గూడ ఉండదు. "బోధన" అనేది దీనికి సరైన పదం కాదు. టీచింగ్ అంటే ఒక పద్ధతి, ఒక వ్యవస్థ, ఓ ప్రక్రియ లేదా నీ జీవన విధానంలో మార్పు తీసుకు రావడానికి ఉపయోగించే ఒక కొత్త ఆలోచనా విధానం అనే అర్ధం వస్తుంది. నేను చెపుతున్నది బోధనా క్షేత్రానికి బయట ఉంది. ఇది నేను వ్యవహరిస్తున్న తీరుకు వివరణ మాత్రమే. ఇది ఒక మనిషి సహజ స్తితికి వివరణ మాత్రమే. ఆలోచన చేసే కుతంత్రాలు పక్కకు పెట్టి చూస్తే, నీవు గూడా ఇలాగే వ్యవహరిస్తున్నావ్.

సహజ స్థితి అనేది ఒక ఆత్మజ్ఞాని లేదా ఒక దైవజ్ఞాని యొక్క స్థితి కాదు, ఇది సాధన వల్ల పొందేది కాదు, కోరితే వచ్చేది కాదు; యిది యిప్పటికే, already ఉంది -- ఇది జీవిస్తున్న స్థితి. ఈ స్తితి, జీవం యొక్క కార్యకలాపం మాత్రమే. జీవం అంటే, నా అర్ధం ఒక అభౌతిక అస్పష్ట నిగూఢ భావం అని కాదు. ఇది, ఆలోచన యొక్క జోక్యం లేకుండా తమ పనిని సహజంగా నిర్వహిస్తున్న జ్ఞానేంద్రియాల జీవనం. జ్ఞానేంద్రియాల సొంత వ్యవహారాల్లోకి, ఆలోచన అక్రమంగా బలవంతంగా చొరబడుతుంది. ఆలోచనకు లాభాపేక్ష ఉంటుంది: ఆలోచన, ఏదో ఒకటి పొందదానికి, జ్ఞానేంద్రియాలు చేసే పనులను నిర్దేశించి తన అస్తిత్వాన్ని నిరంతరం నిలుపుకుందుకు వాటిని వాడుకొంటుంది.

నీ 'సహజ స్థితికీ, పరమానందం, దైవానుగ్రహం, తన్మయం లాంటి మత సంబంధమైన స్థితులకూ ఏమాత్రం సంబంధం లేదు. అవన్నీ అనుభవాల పరిధి లోనే ఉంటాయ్. కొన్ని శతాబ్దాలుగా, దైవానుగ్రహం కొరకు అన్వేషించే మానవులను నడిపించిన వాళ్ళకి బహుశా యీ మత సంబంధిత అనుభవాలు కలిగి ఉండచ్చు. అవి నీకు కూడా కలగ వచ్చు. అవి నీ ఆలోచనలు సృష్టించిన స్థితులు; అవి ఎలా వచ్చాయో అలాగే వెళ్ళిపోతాయ్. కృష్ణ చైతన్యం, బుద్ధ చైతన్యం, క్రీస్తు చైతన్యం లేదా మరో చైతన్యం(consciousness). ఇవన్నీ తప్పుడు దిశలో చేసిన ప్రయాణాలే. ఇవన్నీ కాల పరిధి లోనే ఉంటాయ్. కాలాతీతమైనది ఎప్పటికీ అనుభవం లోకి రాదు, అవగాహన లోకి రాదు, పట్టు చిక్కదు, అంతే కాదు.. ఏ మనిషి కూడా దాన్ని వ్యక్తం చేయలేడు. ఆ అందరూ నడిచే మార్గం నిన్ను ఎక్కడకీ చేర్చ లేదు. అక్కడెక్కడో ఒయాసిస్సు (ఎడారిలో జలాశయం) లేదు; నీవు ఎండమావిలో చిక్కుకున్నావ్.

-------------------

ఈ స్థితి, నీ ఉనికి యొక్క ఒక భౌతిక పరిస్థితి. ఇది ఒక రకమైన సమూల మానసిక పరివర్తన కాదు. ఇది (సహజ స్థితి) ఒక మానసిక స్థితి కాదు, ఒక రోజు దాంట్లోపడి మర్నాడు బయటికి ఒచ్చెయ్యడానికి. నీవిప్పుడున్న స్థితిలో, ఎంతగా యీ ఆలోచన అనేది శరీరమంతా విస్తరించి దేహం లోని ప్రతి కణం యొక్క కార్య నిర్వహణలో అడ్డు తగులుతుందో నీవు ఊహించ లేవు. సహజ స్థితిలో పడే ఈ ప్రక్రియ, ప్రతీ కణాన్నీ, ప్రతీ గ్రంధినీ, ప్రతీ నరాన్నీ పేల్చి వేస్తుంది. అది ఒక రసాయనిక మార్పు. ఒక రకమైన సమూల రసాయినక-మార్పిడి (alchemy) జరుగుతుంది. కానీ LSD, లాంటి కెమికల్ మత్తు పదార్థాలు తీసుకొన్నపుడు కలిగే అనుభవాలకి ఈ సహజ స్థితికి ఏమాత్రం సంబంధం లేదు. అవన్నీ అనుభవాలు, యిది కాదు.

------------------

## జ్ఞానోదయ రహస్యం

జ్ఞానోదయం అనేది ఏదైనా ఒకటి ఉందా? నా వరకు చెప్పాలంటే ఇక్కడ ఉన్నదేమిటంటే, ఒక స్వచ్ఛమైన ఒక భౌతిక ప్రక్రియ మాత్రమే; ఇందులో ఒక రహస్యం గానీ, అధ్యాత్మికత గానీ ఏదీలేదు. నేను కళ్ళు మూసుకొంటే కొంత కాంతి కనురెప్పల గుండా లోనికి పెడుతుంది. నేను కనురెప్పలపై అడ్డు పెట్టుకొన్నప్పటికీ ఇంకా కొంత వెలుగు లోపలకే పెడుతుంది. నుదుటి మీద ఒక రకమైన కనపడని రంధ్రం ఉన్నట్లు అనిపిస్తోంది, కానీ దాని గుండా లోపలికి ఏదో చొచ్చు కొని పేడుతోంది. ఇండియాలో ఆ కాంతి బంగారు రంగులో ఉంటుంది; యూరోపులో అది నీలంగా ఉంటుంది. మెడ వెనుక భాగం నుండి కూడా ఒక రకమైన కాంతి లోపలికి చొచ్చుకొని పెడుతుంది. పుర్రె ముందు-వెనుకలను కల్పుతూ ఒక రంధ్రం ఉందా అన్నట్టుగా అనిపిస్తుంది. ఈ వెలుగు తప్ప లోపల ఏమీ లేదు. ఈ ప్రదేశాలన్నీ మూసి వేసినపుడు లోపల అంతా మొత్తం చీకటి. ఈ లోపలి వెలుగు ఏమీ చేయదు, అంతే కాదు యీ వెలుగు, శరీరం తన పనులను చేసుకోవడంలో ఏవిధంగానూ సహాయ పడదు. అది అక్కడ ఉన్నదంతే.

------------

ఈ స్తితి ఏమీ తెలియని ఒక స్తితి (a state of not knowing); నువ్వు ఏమి చూస్తున్నావో గూడా నీకు నిజంగా తెలియదు. అక్కడ గోడ మీదున్న గడియారాన్ని అరగంట నుండీ నేను చూస్తునప్పటికీ, అది ఎంత టైమ్ చూపిస్తోందో నాకు తెలియదు. అది గడియారమని గూడా నాకు తెలియదు. నా లోపల ఉన్నదంతా “నేను దేన్ని చూస్తున్నాను?” అనే ఒక ఆశ్చర్యం. యీ ప్రశ్నయిలా యీ మాటలతో ఏర్పడడం కాదు: నా దేహమంతా ఒక పెద్ద ప్రశ్నార్థకంగా ఉండి పోతుంది. అది అద్భుతం అనిపించే ఒక ఆశ్చర్య స్తితి, కారణం నేను చూస్తున్న దేమిటో అస్సలు అర్థం కాదు కాబట్టి. నేను చూసే ఆ వస్తువుకు సంబంధించిన, నేను నేర్చుకొన్న జ్ఞానమంతా, డిమేండ్ లేనంత వరకు, ఎవరూ అడగనంతవరకు, నేపధ్యంలో నొక్కి ఉంచ బడుతుంది. ఇది అన్నిటితో సంబంధం విడిపోయిన స్తితిలో (declutched state లో) ఉంటుంది. టైమెంతయ్యింది అని నీవు అడిగినప్పుడు నేనంటాను, “మూడుంపావు” అని. ఎదురుగానున్న ఆ గడియారం చూపించే టైమ్

చెప్తాను. ఈ నా జవాబు ఓ బాణం వదలినట్టు వెంటనే బయటకు వస్తుంది. తర్వాత నేను మళ్ళీ వెనక్కి ఏమీ తెలియని ఆ అద్భుత ఆశ్చర్య  స్థితిలో ఉండిపోతాను.

---------------

నీలో ఎల్లప్పుడూ ఉండే ఆ గొప్ప మహత్తర శాంతిని నీవెప్పుడూ అర్థం చేసుకోలేవ్, అదీ నీ యొక్క సహజ స్తితి(Natural state). ప్రశాంత మైన మానసిక స్తితిని సృష్టించడానికి నువ్వు చేసే ప్రయత్నమే నీలో అలజడిని సృష్టిస్తోంది. నీవు శాంతి గురించి మాట్లాడ్డం మాత్రమే చెయ్యగలవు, నీవొక మానసిక స్తితిని సృష్టి చేసుకొని, చాలా శాంతంగా ఉన్నావని నీవు  అనుకుంటావ్. కానీ అది ప్రశాంతత కాదు; అది హింస. అందువల్ల, శాంతిని  ప్రాక్టీస్ చేయడం వల్ల ఉపయోగం లేదు. మౌనాన్ని సాధన చెయ్యడంలో అర్థం లేదు. నిజమైన మౌనం విస్ఫోటకరం; అధ్యాత్మిక సాధకులు పొందాలనుకొనే, ఆ నిర్జీవమైన మానసిక స్తితి కాదు ఇది. "ఆహా! నాకు నాలో ప్రశాంతత ఉంది, అక్కడ నిశ్శబ్దత ఉంది,, బ్రహ్మాండమైన నిశ్శబ్దం! నేను నిశ్శబ్దాన్ని అనుభవిస్తున్నాను" -- అనే మాటల్లో ఏమాత్రం అర్థం లేదు. ఇది ఒక అగ్ని పర్వతం లాంటిది: ఇది ఎప్పుడూ బుడగలు చిమ్ముతూ మరుగుతూ ఉంటుంది – ఆ శక్తి, ఆ జీవం – అది దాని లక్షణం. నాకెలా తెలుసని మీరడగవచ్చు. నాకు తెలియదు. లైఫ్ కి అంటే జీవానికి తెలుసు తన గురించి, యీ మాటల్లో చెప్పవచ్చంటే --  జీవానికి తన అస్తిత్వం తెలుసు  (it is conscious of itself).

-----------------

నేను ఫీలింగ్ (అనుభూతి) గురించి మాట్లాడినప్పుడు, నువ్వు అనుకొనే అర్థంలో కాదు. వాస్తవంగా ఫీలింగ్ అనేది ఒక భౌతిక స్పందన, త్రైమస్ గ్లేండ్( గ్రంధి) లో దబ్ దబ్ అనే  ఒక మెత్తని శబ్దం. ఎండోక్రిన్ గ్రంధుల్లో ఒకటైన ఈ త్రైమస్ గ్రంధి గుండె ఎముక కింద ఉంటుంది. ఈ గ్రంధి చిన్నతనం లో చురుకుగా పనిచేసి, యుక్త వయసు వచ్చిన తరవాత నిద్రాణ స్తితిలోకి వెళ్ళి పోతుంది. నీవు నీ సహజస్తితి లోకి వచ్చినపుడు మళ్ళీ పనిచేయడం ప్రారంభించుతుంది. ఇంద్రియానుభూతులు

(సెన్సేషన్సు) ఈ గ్రంధి లోనే ఫీలవడం జరుగుతుంది. ఆ ఫీలింగ్స్ మంచివా చెడ్డవా నీవు విశ్లేషించవు; అవి అక్కడ మెత్తటి శబ్దాలు మాత్రమే. గోడ గడియారం లోని పెండ్యులం ఊగడం, కనిపించి నంతవరకు పక్షి ఎగరడం మొదలైన బయటి చలనాలు(మూమెంట్స్) కూడా థైమస్ గ్రంధి లోనే ఫీలవడం జరుగుతుంది. నీ మొత్తం అస్తిత్వమంతా(The whole of your being) ఆ చలనమే అనిపిస్తుంది. అలాగే దేహమంతా ఆ వినిపించే శబ్దంతో కంపిస్తుంది. ఇక్కడ విభజన(నేను వేరు, బయటి వస్తువులు వేరు అనేది) లేదు. అంటే “ఆ ఎగిరే పక్షిని నేనే” అని నీకు అనిపించడం లాంటిది కాదు. అక్కడ “నీవు” అనేదీ లేదు, బయట వస్తువ(object) అనేదీ లేదు. నీలో అటువంటి స్పందన కలగడానికి కారణమేమిటో నీకు తెలియదు. అది ఒక సెన్సేషన్ (ఇంద్రియ జ్ఞానం) అని కూడా నీకు తెలియదు.

‘ప్రభావం (Affection)’ అంటే అర్థం ప్రతీదీ నిన్ను ప్రభావితం చేస్తుంది (ఈ పదానికి ఇది నేనిచ్చే అర్థం కాదు), అంతే గాని, నీ నుండి ఒక భావోద్వేగం అ వస్తువ వైపు ప్రవహిస్తోందని కాదు. సహజ స్తితి అనేది ఒక చాలా అతి సున్నితత్వం గల స్తితి – కానీ ఇది భౌతిక పరమైన ఇంద్రియాల సున్నితత్వం, అంతే గాని ఇతరులపై ఉద్వేగంతో కూడిన కరుణ లేదా మృదుత్వం లాంటిది గానీ కాదు. నాకు ‘యితరులు’ అనేవారు లేరు... అనే అర్థంలో మాత్రమే అక్కడ కరుణాభావం ఉంది. అందువల్ల అక్కడ నేను వేరు, ఇతరులు వేరు అనే తేడాలు (విభజన) లేవు.

-------------

‘నేను’ లేదా ‘మనస్సు’ లేదా ‘తాను(self) అనబడే ఒక entity (ఒక పదార్థం, ఒక వస్తువు) నీలో ఉందా? నీవు చూస్తున్న దాన్ని నీవు వింటున్న దానితో, వాసన చూస్తున్న దాన్ని రుచి చూస్తున్న దానితో... అలా జ్ఞానేంద్రియాలు చేసే పనులను సమన్వయ పరిచే సమన్వయ కర్త ఒకడున్నాడా? ఒకే జ్ఞానేద్రియం నుండి వచ్చే వివిధ రకాల అనుభూతులను(sensations), ఉదాహరణకు కళ్ల నుండి ప్రవహించే ప్రేరణలన్నిటినీ (impulses) కలిపేది, లింక్ చేసేది ఒకటుందా? నిజం చెప్పాలంటే ప్రతీ రెండు అనుభూతుల మధ్య కొంత అంతరం(గేప్) ఉంటుంది. ఓ సమన్వయ కర్త

ఈ రెంటినీ కలుపుతూ ఈ గేప్ ను పూరిస్తాడు: అతడు “నేను కొనసాగిస్తున్నాను” అనే ఒక భ్రమను(illusion of continuity ని) తనంతట స్థిర పరచుకుంటాడు.

సహజ స్తితి లో వివిధ జ్ఞానేంద్రియాల నుండి వచ్చే సందేశాలను సమన్వయ పరచేది ఏదీ ఉండదు. ప్రతి జ్ఞానేంద్రియమూ దేనితోనూ సంబంధం లేకుండా స్వతంత్రంగా తన రీతిలో పని చేసుకొంటూ పోతుంది. బయటి నుండి ఆ అవసరం (డిమాండ్) వచ్చినప్పుడు, ఒకటి గాని, రెండు గానీ, లేదా అన్ని జ్ఞానేంద్రియాలను గానీ సమన్వయ పరచి స్పందిచ వలసిన అవసరం వచ్చినపుడు గూడ, అక్కడ ఆ సహజ స్తితిలో కో-ఆర్డినేటర్(సమన్వయ కర్త) ఉండడు. కానీ అక్కడ తాత్కాలిక సమన్వయ స్తితి ఉంటుంది. అక్కడ కంటిన్యుటీ లేదు; అవసరం తీరిపోయిన తరవాత జ్ఞానేంద్రియాలన్నీ ఏ సమన్వయమూ లేకుండా ఒకదానితో మరొకటి కలవకుండా, విడివిడిగా పనిచేస్తాయ్. ఎప్పుడూ ఇలాగే జరుగుతుంది. ఒక్కసారి కంటిన్యుటీ (నిరంతరత) విచ్ఛిన్నమై పోయినప్పుడు (అది ఒకప్పుడు ఉండేదని కాదు), ఆ కంటిన్యుటీ అనే భ్రమ శాశ్వతంగా తొలగి పోతుంది.

నేను చెప్పిన దానిలో మీకు అర్థం ఏదైనా కనబడుతోందా? మీకు అర్థం కనబడదు. ఎందుకంటే మీకు తెలిసినదంతా మీ అనుభవం యొక్క ఆలోచనల పరిధిలోనే ఉంటుంది, ఈ స్తితి ఒక అనుభవం కాదు. మీకు దీనిగురించి ఓ రవ్వంత అనుభూతిని, కలుగజేయడానికి మాత్రమే నేను ప్రయత్నిస్తున్నాను, కానీ దురదృష్ట వశాత్తు నా ప్రయత్నం మిమ్మల్ని తప్పు దారి పట్టిస్తోంది.

సమన్వయ కర్త లేనపుడు, ఇంద్రియజ్ఞాన అనుభూతుల(sensations) మధ్య లింకింగ్ లేదు, అనుభూతులను అనువదించడం జరగదు; అవి స్వచ్ఛమైన వట్టి సెన్సేషన్స్ లాగానే ఉంటాయ్. అవి అనుభూతులని గూడా నాకు తెలియదు. మీరు మాట్లాడుతున్నపుడు నేను నిన్ను చూడవచ్చు. నా కళ్ళు మీ మూతి వైపే చూస్తూ ఉంటాయ్ కారణం అది కదులుతూ ఉంటుంది కాబట్టి, అంతే కాక చెవులు శబ్ద తరంగాలను అందుకుంటాయ్. ఈ రెండిటినీ కలిపి మాట్లాడుతున్నది మీరు అని చెప్పేది ఏదీ నాలో లేదు. నేను భూమినుండి బుడగల్లా పైకి లేచే ఊట నీటిని(వాటర్ ఫౌంటెన్) చూస్తూ నీళ్ళ శబ్దం వింటూ ఉండవచ్చు గాని, ఆ వినపడే హోరు నీటి

శబ్దమని గానీ, నేను చూసే నీటికీ వినే శబ్దానికీ సంబంధమున్నదని గానీ, చెప్పేది ఏదీ (నాలో) లేదు. నేను నా పాదాన్ని చూస్తున్నప్పుడు అది నా పాదమని చెప్పేది ఏదీ లేదు. నేను నడుస్తున్నపుడు నా పాదాలు కదులుతున్నట్లు చూస్తాను – అది చాలా ఫన్నీగా ఉంటుంది: “అదేమిటి ఆ కదులుతున్నది?” ఇక్కడ పనులు నిర్వహిస్తున్నది, ఆలోచన ముట్టని ఆది కాలం నాటి చైతన్యం (primordial consciousness).

--------

కళ్ళు చాలా సూక్ష్మం గా గ్రహించే ఒక కెమెరా లాంటివి. కాంతి వస్తువుల మీద పడి ప్రతిఫలించి రెటీనాపై పడినప్పుడు కలిగే ఇంద్రియజ్ఞానం(sensation), ఆప్టిక్ నరాల ద్వారా మెదడుకు చేరతాయని శారీరక ధర్మ శాస్త్ర వేత్తలు చెప్తారు. చూడగలిగే నైపుణ్య శక్తి ఒక భౌతిక విషయం మాత్రమే. చూస్తున్నది ఒక మంచు పర్వతమైనా, ఒక చెత్త బుట్ట అయినా కళ్ళకు ఏమి తేడా ఉండదు : అవి ఒకే రీతిలో సెన్సేషన్స్ కలిగిస్తాయ్. కళ్ళు, ఎవరినైనా ఏ వస్తువు నైనా వివక్షత లేకుండా చూస్తాయ్.

కళ్ళను నియంత్రించే ఒక కెమెరా మేన్ ఉన్నాడనే ఒక భావన నీకు కలుగుతుంది. వాటిని వాటికే వదిలినప్పుడు -- కెమెరా మేన్ లేనపుడు – కళ్ళు ఒకచోట నిలవ కుండా ఎప్పుడూ కదులుతూ ఉంటాయ్. బయటి వస్తువులు, కళ్ళను వాటివైపు లాక్కుంటాయ్. బయటి కదలికలు కళ్ళను ఆకర్షిస్తాయ్, కాంతివంతమైనవివి, రంగు రంగుల వస్తువులు మిగతా వాటికంటే ప్రత్యేకంగా కనిపిస్తాయ్. అక్కడ వాటిని చూస్తున్న ‘నేను’ ఉండదు; పర్వతాలు, పువ్వులు, చెట్లు, ఆవులు అన్నీ నన్ను చూస్తాయ్. చైతన్యం(Consciousness) అనేది ఒక అద్దం లాంటిది, అది బయట ఉన్న అన్నిటినీ ప్రతిఫలిస్తూ ఉంటుంది. లోతు, దూరం, రంగు, అన్నీ తెలుస్తాయ్, కానీ వీటన్నిటినీ మనకర్థమయ్యే భాషలో చెప్పేవారు లేరు. నేను చూస్తున్న వస్తువులు (నానుండి) వేరుగా, సెపరేటుగా ఉన్నట్టు కనిపించవు, వాటి దూరం గూడ కనిపించదు... వాటిని గూర్చిన, నావద్ద ఉన్న నాలెడ్జి యొక్క అవసరం వచ్చినపుడు తప్ప. గదిలో ఎదురుగా కూర్చొని ఉన్న

ఒక వ్యక్తి తల లోని వెంట్రుకలను లెక్క పెట్టడం సాధ్యం కాక పోవచ్చు కానీ, ఆ పని నేను చెయ్యగలనేమో అన్నంత స్పష్టత అక్కడ ఉంటుంది.

కనురెప్పలు కొట్టుకోవడం (blinking) జరగదు, అకస్మాత్తుగా ఏదో అపాయం వస్తే తప్ప. – ఇది చాలా సహజం ఎందుకంటే, బయట వస్తువులు ఎప్పుడూ దృష్టిని వాటి వైపు లాగుతాయ్ కాబట్టి. తరవాత కళ్ళు అలసి పోయినపుడు, శరీరంలో యిమిడి ఉన్న ఒక యాంత్రిక విధానం (బిల్ట్-యిన్ మెకానిజం) కళ్ళను అవి చూసే వస్తువు నుండి వేరు చేస్తుంది – కళ్ళు ఒకవేళ తెరిచే ఉంటే, అవి మసకగా అయిపోతాయ్. కళ్ళు ఎప్పుడూ తెరిచే ఉంటే, కనురెప్పలు కొట్టుకోడం ఆగిపోతే, కళ్ళు తడి ఆరిపోయి నువ్వు అంధుడవు అయిపోతావ్; అందువల్ల కనుల చివర లోపల కొన్ని గ్రంధులున్నాయ్, మీ విషయంలో అవి ఏక్టివేట్ కాలేదు, అవి కళ్ళు పొడిగా అవకుండా నీటిని విడుదల చేసి అంధత్వం రాకుండా కళ్ళను రక్షిస్తాయ్. అందువల్ల కళ్ళు ఎల్లప్పుడు తెరుచుకొని ఉన్నపుడు కళ్ల చివర నుండి నీళ్ళు ఎల్లపుడూ కారుతు ఉంటాయ్; ఇది తెలియని వారు యీ నీటిని ఆనంద భాష్పాలు అని వర్ణిస్తారు, దీనిలో దైవ సంబంధిత విషయమేమీలేదు. కళ్లెప్పుడూ తెరిచే ఉంచడానికి ప్రత్నించి సాధన చెయ్యడం వల్ల ఈ స్తితి పొందలేరు సరికదా కళ్ళకు హానికరమైన అధిక ఒత్తిడి కలుగ చేసినట్లవుతుంది. పిచ్చాసుపత్రి లో ఏదో కారణం వల్ల కనురెప్పలు ఆడని కొంత మంది రోగులు ఉంటారు, అది ఒక రోగ లక్షణం. కానీ అదృష్టం వల్లగాని లేదా తెలియని ఒక అవకాశం వల్ల గాని నీవు సహజ స్తితి లో పడినపుడు, ఇదంతా తనదైన రీతిలో అది జరిగి పోతుంది.

-------------------

అందం (beauty) అనేది చూసే వారి కళ్ళలో ఉందా? మనం చూసే వస్తువలో ఉందా? దేనిలో ఉంది? అందం ఆలోచనచే ప్రేరేపితమైనది. నా ఎదురుగా కనబడే పర్వతాన్ని చూడ్డం మానేసి దానిమీద నేను కవిత్వం రాయను. అక్కడ జరిగేది ఏమిటంటే, నేను నడుస్తూ ఉంటాను అపుడు సడన్ గా ఏదో వేరే విధంగా ఉన్నది చూస్తాను ఎందుకంటే వెలుతురులో మార్పు ఒచ్చింది. ఈ మార్పుకు నాకు సంబంధమేమీ ఉండదు. ఇది ఏదో కొత్తది చూడ్డం లాంటిది కాదు, లేదా నీ శ్రద్ధంతా

(total attention) అక్కోడే ఉందని కాదు; అక్కడ సడన్ గా వెలుతురులో మార్పు వచ్చిందంతే. దాన్ని అందమని గుర్తించి నట్టు కాదు. అక్కడ స్పష్టత ఉంది, బహుశా కాంతి కిరణాల రంగు మారే ముందు ఆ స్పష్టత అక్కడ లేక పోవచ్చు. అపుడు ఈ చైతన్యం (consciousness), సడన్ గా యీ దేహానికి ఎదురుగా ఉన్న వస్తువు సైజంత వ్యాకోచిస్తుంది, అపుడు ఊపిరి తిత్తులు లోతుగా గాలి పీల్చు కుంటాయ్. ఇదే ప్రాణాయామం(శ్వాస నియంత్రణ); అంతే గాని గదిలో ఓ మూల కూర్చొని మీరు చేస్తున్న, ముక్కు రంధ్రం నుండి గాలి లోనికి తీసుకోవడం మరో ముక్కు రంధ్రం నుండి బయటకు గాలి వదలడం కాదు. ఈ ప్రాణాయామం ఎప్పుడూ జరుతూనే ఉంటుంది. శ్వాస తీసుకోడంలో సడన్ మార్పు జరిగినట్టు తెలుస్తుంది, తర్వాత మరో దానిపై దృష్టి పడుతుంది.. ఆవు అంబా అనడం లేదా నక్క కూయడం లాంటివి. దృష్టి ఎప్పుడూ మరలుతూ ఉంటుంది; ఇక్కడ, ఆలోచన నిర్ణయించిన దాన్ని "ఇది అందమైనది" అని చెప్పిన దాని పైనే చూపు నిలిచి ఉండదు. ఇక్కడ నిర్దేశిస్తున్న వారెవరూ లేరు.

----------

నువ్వు ఎవరినైనా నీకు ఏదైనా చెపుతుంటే శ్రద్ధగా వినగలవా? నువ్వు వినలేవు. నీవు నిన్ను మాత్రమే వింటావ్. శబ్ద జ్ఞానేంద్రియాన్ని దాని మానాన దాన్ని వదిలేస్తే, అక్కడున్నదంతా శబ్దం యొక్క ప్రకంపనలే – ఆ పదాలన్నీ ఒక ప్రతిధ్వనించే గదిలో ఉన్నట్టుగా నీ లోపల తిరిగి తిరిగి వినపడుతూ ఉంటాయ్. ఈ శబ్ద జ్ఞానేంద్రియం, నీలో గూడ అచ్చు ఇలాగే పని చేస్తుంది, నీకు వినబడే మాటలు బయటి నుండి వస్తున్నాయని నువ్వనుకోవడం తప్పు. ఇంకా సూటిగాచెప్పాలంటే: ఎవరు మాట్లాడినప్పటికీ వారి ఒక్క మాట గూడా నువ్వు ఎప్పుడూ వినలేవు, ఆ మనిషితో నీకు ఎంత దగ్గరి సంబంధమున్నదని నువ్వు భావించినప్పటికీ; నీవెప్పుడూ ఆ మనిషి మాట్లాడే మాటల యొక్క నీ సొంత అనువాదాన్ని మాత్రమే వినగలవు. నువ్వు వింటున్నవన్నీ నీ మాటలే. ఇతరుల మాటలన్నీ, బహుశా మీ వరకూ వట్టి చప్పుడు... అంటే, కర్ణభేరి అందుకొని నరాల ద్వారా మెదడుకు చేరవేయబడ్డ ఓ శబ్ద తరంగం. ఆ తరంగాలను నీవు ఎల్లప్పుడూ అనువదించి అర్థం

చేసుకోడానికి ప్రత్నిస్తున్నావ్, ఎందులకంటే నువ్వు వింటున్న దాని నుండి ఎదో పొందాలని కోరుకుంటున్నావ్. అది ఒకరితో సంబంధం ఏర్పరచుకోడానికి ఒక స్థాయి వరకు బాగానే ఉంటుంది. ఉదాహరణకు: “ఈ డబ్బు తీసుకొని ఒక అర కిలో కేరెట్స్ ఇవ్వు.” – కానీ ఎవరితోనైనా మీకు మాట్లాడుకునే సంబంధానికి అదే లిమిట్.

(శబ్దాలను) అనువదించడం అనేది అక్కడ లేనపుడు, అన్నీ భాషలు ఒకేలా శబ్దం చేస్తాయ్, నీ నాలెడ్జ్ స్ట్రక్చర్(పరిజ్ఞానం) ఏ భాషలో మాట్లాడినా, మాట్లాడక పోయినా. కానీ, అక్కడ తేడా ఎక్కడుందంటే, అక్షరాల మధ్య ఉన్న దూరం లోనూ మరియు వాటిని పలికే రాగం లో మాత్రమే. భాషలలో వివిధ రకాల శ్రావ్యత ఉంటుంది. నీవు నేర్చుకొని అలవాటు చేసుకొన్న నీ అభిరుచి నీకు చెపుతుంది, ‘బీతోవన్ తొమ్మిదవ స్వర సమ్మేళణ’ (Beethoven's Ninth Symphony) పిల్లి అరుపుల కంటే చాలా శ్రావ్యంగా ఉంటుందని; రెండూ గూడా నిజమైన అనుభూతులను సమానంగా కలుగ జేస్తాయ్. కానీ కొన్ని శబ్దాలు దేహానికి నష్టం కలిగించ వచ్చు. శబ్దం తీవ్రత కొన్ని డెసిబల్స్ డాటితే, అది నరాల మీద ఒత్తిడి చేసి చెవిటితనం కలుగ చేస్తుంది -- నేను వీటి గురించి నేను మాట్లాడడం లేదు. నేను చెప్పేదేమిటంటే, సంగీతాన్ని, కవిత్వాన్ని, భాషని మెచ్చుకోడం అనేది సంస్కృతి(culture)ని బట్టి నిర్ణయింప బడుతుంది, అది గూడా ఆలోచన సృష్టించిందే.

---------

మిగతా జ్ఞానేంద్రియాలతో వ్యవహరించినట్టుగానే, స్పర్శకు సంబంధించిన ప్రక్రియతో గూడ ఆలోచనలు జోక్యం చేసుకుంటాయ్, నీవు దేన్ని ముట్టుకున్నా ఇది గట్టి, ఇది మెత్తన, వేడి, చల్లన, తడి, పొడి అని చెపుతుంది ఆలోచన. నీవు తెలుసుకోలేక పోతున్నావు గానీ, నీ ఆలోచించడమే నీ దేహాన్ని సృష్టిస్తుంది. ఈ ఆలోచనాప్రక్రియ లేనపుడు శరీరం యొక్క స్పృహ ఉండదు, అంటే శరీరం ఉన్నట్టు తెలియదు – అంటే అసలు దేహమే లేదని చెప్పడం. ఇతరులకు నా దేహం యొక్క అస్తిత్వం ఉంది; నా వరకు నా దేహం యొక్క అస్తిత్వం లేదు. అక్కడక్కడ శరీరం తాకడం వల్ల కలిగిన స్పర్శ జ్ఞాన స్తానాలన్నీ విడి విడిగా ఉంటాయ్, వాటన్నిటినీ

సమన్వయపరచి, కలిపి చూసే ఆలోచన అక్కడలేదు. అందువల్ల ఈ దేహం, దాని పరిసరాల్లో ఉండే వస్తువుల కంటే వేరు కాదు(వేరుగా కనిపించదు). అవి మిగతావాటిలాగే ఒక అనుభూతుల సముదాయం. నీ దేహం నీకు చెందినది కాదు.

నీకీ ఫీలింగ్ ని కొంచమైనా నేను యివ్వ గలనేమో ప్రత్నిస్తా. రాత్రి ఎప్పుడు పడుకొన్నప్పటికీ నేను నాలుగు గంటలు నిద్ర పోతాను. తరవాత తెల్లారే వరకు మంచమీద పూర్తి మెళుకువతో పడుకొని ఉంటాను. పక్క మీద పడుకున్నదేమిటో నాకు తెలియదు. నేను నా ఎడం పక్కకు తిరిగి పడుకొన్నానో, కుడివైపుకు తిరిగి పడుకొన్నానో నాకు తెలియదు – గంటల కొద్దీ నేనిలా పడుకొని ఉంటాను. బయట ఏదైనా శబ్దం వినబడితే – ఒక పక్షి గాని, మరొకటి గాని – అది నాలో ప్రతిధ్వనిస్తుంది. నా గుండె "లబ్ డబ్ లబ్ డబ్" శబ్దాలు వినిపిస్తాయ్ కానీ అవేమిటో నాకు తెలియదు. రెండు బెడ్ షీట్ల మధ్యా ఎవ్వరూ లేరు. దేహం యొక్క రూపం అక్కడ లేదు. అక్కడ ఏముందీ, అని అడిగితే, పక్కమీదున్న దుప్పటి, కప్పుకొన్న దుప్పటి మధ్య శరీరం తాకిన స్తలాలూ మరియు అవయవాలు ఒకదానికొకటి తాకిన స్తానలు మాత్రమే తెలుస్తాయ్, ఉదాహరణకు, ఒక కాలికి మరొక కాలు తగిలిన చోట. శరీరం తాకిన స్తానాల(పాయింట్స్) దగ్గర స్పర్శ జ్ఞానం ఉంటుంది, మిగతా శరీరం అక్కడ ఉన్నట్టు అనిపించదు. ఒకరకమైన అస్పష్టమైన బరువు ఉంటుంది, బహుశా భూమ్యాకరణ శక్తి వల్ల అవ్వచ్చు, వీటన్నిటినీ లింక్ చేయడానికి లోపల ఏమీ లేదు. కళ్ళు శరీరమంతటినీ చూస్తున్నప్పటికీ, శరీరం తాకిన స్తలాలు మాత్రమే అక్కడ ఉన్నట్టు అనిపిస్తుంది. ఈ రెంటికీ, చూసేదానికీ తాకిన స్తలాలకీ సంబంధం ఉండదు. శరీరం యొక్క తాకిన స్తలాలనను నా శరీరం యొక్క రూపంతో లింక్ చెయ్యడానికి ప్రయత్నం చేస్తే బహుశా కొంత వరకు నేను లింక్ అవ్వచ్చు కానీ, ఈ లింకింగ్ ఎక్కువ సేపు నిలవదు. నేను నుంచున్నా కూచున్నా యీ వ్యవహారం ఇలాగే ఉంటుంది.. అక్కడ శరీరమే లేదు (అంటే శరీరం ఉన్నట్లు నాకు అనిపించదు).

మామిడి పండు రసం రుచి ఎలా ఉంటుందో నీవు నాకు చెప్పగలవా? నేను చెప్ప లేను. నువ్వు గూడా చెప్ప లేవు; కానీ నీవు మామిడి రసం తాగిన గత అనుభవాన్ని, జ్ఞాపకాన్ని, తిరిగి ఇపుడు జీవించడానికి ప్రయత్నిస్తావ్ – ఆ రుచి ఎలా ఉంటుంది అనే దాన్ని నీ అంతట నీవు సృష్టించుకుంటావ్ – ఇది నేను చేయ లేను -- పాత అనుభవాన్ని ఇప్పుడు బయటకు లాగి "అవును, మామిడి రసం రుచి ఇలాగే ఉంటుంది" అని చెప్పడానికి నా నాలికపై మామిడి రసం ఉండి తీరాలి, మామిడి పండు రసాన్ని చూస్తేనో లేదా వాసన చూస్తేనో నాకు సరిపోదు. దీనర్థం వ్యక్తిగత అభిరుచులు, రుచులూ మారతాయని కాదు. నేను బజారుకెళ్లినపుడు, యింతకు ముందు నాకు ఎప్పుడూ నచ్చే వస్తువుల వైపే నా చేతులు వెడతాయ్. ఎందుకంటే, అక్కడ లేని తినుబండరాల కొరకు నేను ఆశతో ఎదురు చూడను, కారణం వాటి పాత అనుభవాలను గుర్తు చేసుకోలేను కాబట్టి.

నీ దైనందిక జీవితంలో రుచుల కంటే వాసనలు ఎక్కువ ప్రభావం చూపిస్తూ ఉంటాయ్. ఘ్రాణేంద్రియాలు వాసనలను గ్రహించడానికి ఎల్లపుడూ రెడీగా ఉంటాయ్. వాసనలు కలిగించే సెన్సేషన్సుతో నీవు జోక్యం చేసుకోకుండా ఉంటే, అక్కడ చికాకు పెట్టే ముక్కులో దురద తప్ప మరొకటి ఉండదు. నువ్వు ఆవు పేడను వాసన చూస్తున్నా, ఫ్రెంచ్ సెంట్ వాసన చూస్తున్నా తేడా ఉండదు – నువ్ ముక్కు పాముకొని ముందరకు వెళ్ళి పోతావ్.

ఎవరైనా అడిగిన ప్రశ్నలకు ప్రతిస్పందనగా నా మాటలు బయటకు వస్తాయ్. సహజ స్తితి గురించి కూర్చొని ఉపన్యాసలివ్వలేను – అది నాకు కృత్రిమంగా అనిపిస్తుంది. ఆలోచించి ఆన్సర్లు ఇచ్చే వారెవ్వరూ ఇక్కడ లేరు. నీవు బంతిని నావైపు విసిరితే అది నాకు తగిలి వెనక్కు వస్తుంది, దాన్నే నీవు 'జవాబు' అంటావ్. కానీ నేను జవాబులేమీ ఇవ్వడం లేదు; 'ఈ స్తితి' తనను తాను వ్యక్తం చేసుకొంటోంది. నేనేమంటున్నానో నిజంగా నాకు తెలియదు, నేను చెపుతున్నదానికేమీ ప్రాముఖ్యత కూడా లేదు. నేను మాట్లాడినదే నీవు రాయచ్చు, కానీ అది నా వరకు అర్థం లేనిది– అది ప్రాణం లేనిది.

ఇక్కడున్న ఈ 'సహజ స్థితి' సజీవమైనది, a living thing. దీన్ని అవగాహన చేసుకోవడం నాకే సాధ్యం కాదు, ఇక నీ సంగతి చెప్పనక్కర లేదు. ఇది ఒక పుష్పం లాంటిది. (ఈ ఉపమానం మాత్రమే నేనివ్వ గలను.) ఇది అలా వికసిస్తుందంతే. యిది ఇక్కడ ఉందంతే. ఇది ఉన్నంతవరకు దీని సువాసన, మిగతా పువ్వులకున్న సువాసనలకంటే భిన్నమైనదిగా, ఒక ప్రత్యేకమైనదిగా ఉంటుంది. అది నీవు గుర్తించక పోవచ్చు. నువ్వు దాని గురించి కవిత్వాలు, కావ్యాలు రాయచ్చు, రాయక పోవచ్చు. ఈ పుష్పాన్ని వీధిని పోయే ఆవు తినేసెయ్యచ్చు, లేదా గడ్డి కోసేవాడు నరికి పడేయ్యొచ్చు లేదా అది కృశించి పోవచ్చు. చివరికది నశించి పోతుంది. ఏమైనా ఫరవా లేదు. దాని సుగంధాన్ని నువ్వు భద్రపరచ లేవు. నీవు భద్రంగా దాచ గలిగేది రసాయనిక సువాసన మాత్రమే, జీవించి ఉన్న దాన్ని కాదు. అలాంటి మనిషి యొక్క భావాలను, ప్రవచనాలను, ప్రసంగాలను భద్రపరచి ఉంచడంలో అర్ధం లేదు. ఈ స్థితికి సమకాలీన ప్రయోజనం, సమకాలీన వ్యక్తీకరణ మాత్రమే ఉంటుంది.

---------

నువ్వు ఈ స్థితికి లోకి వచ్చిన తర్వాత నీ వ్యక్తిత్వంలో ఏమీ మార్పు రాదు. ప్రోగ్రాం చేయబడినట్టుగా స్పందించే ఒక కప్యూటరువి మాత్రమే నీవు. నిజానికి నిన్ను నీవు మార్చుకోవడానికి నీవు చేసే ప్రయత్నమే నిన్ను నీనుండి దూరంగా ఉంచి, సహజమైన తీరులో వ్యవహరించ కుండా చేస్తుంది. ఈ స్థితిలో పడ్డ మనిషికి వ్యక్తిత్వం మారదు. అటువంటి మనిషి, కోపం నుండి, విపరీత ధోరణల నుండి విముక్తి పొందుతాడని నీవు ఆశించద్దు. అతని నుండి అధ్యాత్మిక వినయ శీలతను ఆశించ వద్దు. అతడు నీకు తెలిసిన వాళ్లందరికంటే గర్విష్టి కావచ్చు, ఎందుకంటే అతడు, ఇంతకు ముందు ఏ మనిషీ తాకని ఒక ప్రత్యేకమైన చోట జీవాన్ని, లైఫ్ ని తాకుతున్నాడు (అంటే ఇంతకుముందు ఏమనిషీ జీవించని విధంగా సహజంగా జీవిస్తున్నాడు).

ఈ కారణం వల్లనే ఈ సహజ స్థితి లోకి వచ్చిన ప్రతి ఒక్కరూ, తాను జీవిస్తున్న కాల పరిస్థితులకు అనుగుణంగా, ఒక ప్రత్యేక మైన, అపూర్వమైన రీతిలో తానున్న ఈ స్థితిని వ్యక్తం చేస్తారు. ఇందు వల్ల, ఇద్దరు గానీ అంతకంటే ఎక్కువ మంది గానీ

ఈ స్థితిలో ఉన్నవారు సమకాలీకులైతే, వారందరూ ఒక చోట సమావేశం కారు. "మేమంతా ఆత్మ- జ్ఞానులం! మేము ఒక వర్గానికి చెందుతాం!" అని చెప్పుకుంటూ వీళ్ళు చేతిలో చెయ్యి వేసుకొని వీధుల్లో నాట్యం చెయ్యరు.

--------------

మనిషికి కావలసిన సహజ అవసరాలు ప్రాధమిక మైనవి: తిండి, గుడ్డ, గూడు. నీవు దానికోసం పని చెయ్యాలి, లేదా ఎవరైనా నీకివ్వాలి. నీ అవసరాలు ఇంతవరకే అయితే, ఈ అవసరాలు తీర్చుకోడం ఎక్కువ కష్టమైన పని కాదు. ఈ ప్రాధమిక అవసరాలు వద్దనుకోవడం అధ్యాత్మికతకు చిహ్నం కాదు, తిండి, బట్ట, ఇల్లు కంటే ఎక్కువ కావాలనుకోడం అనేది ఒక మానసిక అస్వస్తత.

సెక్స్ అనేది మనిషికి ప్రాధమిక అవసరం కాదా? లైంగికేచ్ఛ మనిషి ఆలోచన మీద ఆధార పడి ఉంటుంది, శరీరానికి సెక్స్ కోరిక ఉండదు. స్త్రీ పురుషుల మధ్య, జననేంద్రియాల్లోనూ, బహుశా హార్మోన్ బేలన్స్ లోనూ మాత్రమే తేడాలుంటాయ్. "నేను మగవాణ్ని, ఆమె ఆడది, అందమైన ఆడది" అని చెప్పేది మన ఆలోచనే. సెక్స్ ఫీలింగ్స్ ని అనువదించి "ఇవి లైంగిక అనుభూతులు" అని చెప్పేది ఆలోచనే. లైంగిక క్రియ జరపడానికి కావలసిన ప్రేరణను పెంచేది ఆలోచనే, ఆ ప్రేరేపణ లేకపోతే సెక్స్ సాధ్యం కాదు: "స్త్రీని చూడ్డం కంటే ఆమె చేయి పట్టుకొంటే ఎక్కువ సుఖం కలుగు తుంది. ఒక్క కౌగలించు కోడం కంటే ముద్దు గూడ పెట్టు కొంటే ఎక్కువ సుఖంగా ఉంటుంది" వగైరా, వగైరా. సహజస్తితిలో లైంగిక ఆలోచన పెరుగుతూపోవడం (build-up) అనేది ఉండదు. ఈ build-up లేకపోతే లైంగిక కార్యం చేయడం అసాధ్యం. లైంగిక కార్యం శరీరంలో తీవ్రమైన ఉద్రేకాన్ని కలుగ జేస్తుంది. ఈ దేహం సహజంగా చాలా శాంత స్వభావ జీవి, కానీ నువ్వు దాన్ని చెప్ప లేనంత ఒత్తిడికి గురి చేసి, తర్వాత ఉపశమనం పొంది దానిలో సుఖాన్ని ఫీలవుతావ్. వాస్తవంగా యిది శరీరానికి బాధను కలిగిస్తుంది.

సెక్స్ కోరికలను అణగదొక్కడం, సెక్స్ ఎనర్జీని మరో రూపంలోకి మార్చుకోవడానికి ప్రయత్నాలు చేయడంవల్ల నువ్వు ఈ సహజ స్తితి లోకి ఎప్పుడూ రాలేవ్. దేవుడిని గురించి నువ్వు ఆలోచించినంత కాలం నీకు సెక్స్

ఆలోచనలు ఉంటాయ్. బ్రహ్మచర్యాన్ని పాటించే, నీకు తెలిసిన ఏ దైవ భక్తుడనైనా అడుగు, రాత్రి కలలో స్త్రీలు రాకుండా ఉంటారా అని. జీవితంలో నీకున్న సొంత (ఫస్ట్ హేండ్) అనుభవానికి దగ్గరగా ఉన్న వాటిల్లో తారా స్థాయికి చేరిన లైంగిక అనుభవం ఒకటి; నీకున్న మిగతా అనుభవాలన్నీ సెకండ్-హేండ్ వే, యితరులవే. ఎన్నో నిషేధాలు, మూఢ నమ్మకాలు దీనిచుట్టూ ఎందుకు అల్లుకుంటావ్? సెక్స్ లో ఉన్న ఆనందాన్ని నీవు ఎందుకు నాశనం చేస్తావ్? నేనేమీ సుఖ లాలసను వ్యభిచారాన్ని ప్రోత్సహించడం లేదు; కానీ ఉపవాసాల వల్ల, ఇంద్రియ నిగ్రహాల వల్ల నువ్వేమీ సాధిచ లేవ్.

----------------

మనం వర్తమానంలో జీవించడం అవసరం. (There must be a living contact). నీవు ఈ గదిలో నుండి బయటకు వెళ్ళగానే నువ్వు నా మనస్సు లోంచి మాయమై పోతావ్. నువ్వెక్కడున్నావ్, ఇక్కడ ఎందుకు లేవు – ఈ ప్రశ్నలు ఉదయించవు. ఇక్కడ మానసిక చిత్రాలు(ఇమేజెస్) లేవు – వాటికిక్కడ చోటు లేదు – జ్ఞానేంద్రియాలు ఇపుడు నేను చూస్తున్న వాటితో పూర్తిగా లీనమై ఉన్నాయ్. ఇక్కడ యీ గదిలో ఉన్న వస్తువులతో లివింగ్ కాంటాక్ట్ ఉండి తీరాలి, అంతేగాని, ఇక్కడ లేనివాటిని గూర్చిన ఆలోచనలు కాదు. అందుచేత జ్ఞానేంద్రియాలు చేసే పనులలో పూర్తిగా నిమగ్నమై ఉంటే, రేపు నాకు భోజనం దొరుకుతుందా లేదా అన్న భయానికి, లేదా దేముడు, సత్యము, నిజం మొదలైన వాటిని గూర్చిన ఊహాగానాలకు తావుండదు.

ఇది, మనిషి యొక్క ఎప్పుడూ ఉండే ప్రశ్నలకు సమాధానాలు యివ్వగల అన్నీ తెలిసిన, సర్వజ్ఞ స్తితి కాదు; కానీ, ఇది ప్రశ్నించడం పూర్తిగా ఆగిపోయిన ఒక స్తితి. ఈ స్తితిలో ప్రశ్నించడం ఆగి పోతుంది, దానికి కారణం, ఆ ప్రశ్నలు జీవరాశి పనిచేసే విధానంతో సంబంధం లేనివి కాబట్టి. అంతేగాక జీవరరాశి పని చేస్తున్న విధానం ఈ ప్రశ్నలకు తావు ఇవ్వదు కాబట్టి.

----------------

మన దేహంలో తనను తాను పునరుద్ధీకరించుకోగల అసాధారణమైన యాంత్రిక విధానం ఉంది. ఇది అవసరం ఎందుకంటే, ఈ సహజ స్తితిలో జ్ఞానేంద్రియాలు ఎల్ల వేళలా అత్యధిక సామర్ధ్యవంతంగా పనిచేస్తాయి కాబట్టి. జ్ఞానేంద్రియాలు అలసి పోయినపుడు శరీరం “మరణం” అనే ప్రక్రియ లోకి వెడుతుంది. ఇది నిజమైన భౌతిక మరణం, ఏదో ఒక మానసిక స్తితి కాదు. ఇది రోజులో ఒక్క సారి గాని ఎక్కువ సార్లు గాని జరగ వచ్చు. నువ్వు కావాలని ఈ మరణ ప్రక్రియ లోకి వెళ్లలేవు. అది దానంతట అదే జరుగుతుంది. మొదట్లో మత్తు మందు ఇచ్చిన ఫీలింగ్ నీకు కలుగుతుంది: జ్ఞానేంద్రియాలు వేగంగా నీరసించి పోతాయ్, గుండె కొట్టుకొనే వేగం తగ్గి పోతుంది, అరిచేతులూ అరికాళ్ళూ మంచులా చల్లబడి పోతాయ్, శరీరమంతా శవంలా బిగుసుకు పోతుంది. శక్తి(ఎనర్జీ) శరీరమంతటి నుండి ప్రవహిస్తూ ఏదో ఒక బిందువు వైపు పోతుంది. ఇది ఒకో సారి ఒకో విధంగా జరుగుతుంది. ఈ ప్రక్రియ అంతా జరగడానికి 48 లేదా 49 నిముషాలు పడుతుంది. ఈ ప్రక్రియ జరుగు తున్నపుడు ఆలోచనా స్రవంతి కొనసాగుతూనే ఉంటుంది, కానీ ఈ ఆలోచనలను అర్ధం చేసుకొనే ప్రయత్నం ఉండదు. చివరిలో హఠాత్తుగా నీవు స్పృహ తప్పుతావ్: ఆలోచనల ప్రవాహం ఆగిపోతుంది. ఆ ఆగిపోడం ఎంత సేపు ఉందో తెలుసుకొనే మార్గం లేదు – ఇది ఒక అనుభవం కాదు. ఈ ‘స్పృహ లేని స్తితి ఎంత సేపు ఉందో నువ్వేమీ చెప్పలేవు – అది నీకు తెలిసిన నీ ఉనికి లోనికి గాని, నీకు తెలిసిన నీ ఆలోచనలలో గానీ ఎప్పటికీ భాగం రాదు.

ఈ మరణం నుండి, ఏది నిన్ను వెనక్కి తీసుకొని వస్తోందో నీకు తెలియదు. అ సమయంలో నీకు సంకల్పం (will) ఉండి ఉంటే వెనక్కి రాకూడదనే నిర్ణయం తీసుకొనే వాడివి. ఆ మరణ స్తితిలోంచి బయట పడ్డ తర్వాత ఆలోచనా స్రవంతి అంతకు ముందు ఆగిన చోటునుండే కొనసాగుతుంది. నిరుత్సాహం పోయింది; స్పష్టత తిరిగి వచ్చింది. శరీరం ఇంకా చాలా బిరుసుగా ఫీలయ్యింది– తనంతట తాను నెమ్మదిగా కదిలి అవయవాలను తన స్వాధీనంలోకి తీసుకొంటుంది. ఆ కదలికలు హఠ యోగ ముద్రల కంటే చైనీస్ “టై ఛీ” విన్యాసలను ఎక్కువగా తలపిస్తాయ్. ఈ చైనీస్ వ్యాయామ శిష్యులు బహుశా తమ గురువులలో జరిగే

వాటిని గమనించి వాటిని తమ వ్యాయామంలో యిమిడ్చి వందలకొద్దీ అంగ భంగిమలను ఇతరులకు నేర్పేరు – కానీ అవన్నీ ఉపయోగం లేనివి; కానీ ఈ కదలికలు అసాధారణ మైనవి. నా శరీరం యొక్క కదలికలు గమనించిన వాళ్ళు, ఇప్పుడే పుట్టిన పిల్ల వాడి శరీర కదలికలవలే ఉన్నాయని అంటారు. ఈ మరణావస్త, జ్ఞానేంద్రియాలను, గ్రంధులను, నరాలను పునరుద్ధరించుకొనేట్టు చేస్తుంది. దీని తరవాత వాటి గ్రహణశక్తి(sensitivity) తారస్థాయిలో ఉంటుంది.

-------------------

మరణం ఎలా ఉంటుందో నీవు రుచి చూడ లేవు(అనుభూతి చెంద లేవు), ఎందుకంటే నీకు మరణం లేదు కాబట్టి: నీ సొంత మరణాన్ని నువ్వు అనుభూతి చెందలలేవ్. నీవసలు పుట్టేవా? జీవించడం, మరణించడం రెండూ విడదీయ బడనివి (Life and death cannot be separated); ఒకటి ఎక్కడ మొదలవుతుంది, మరోటి ఎక్కడ అంతమవుతుంది అనేది నీ అంతట నీవు తెలుసుకొనే అవకాశమే లేదు. మరొకరి మరణం నీవు అనుభవించ గలవు కానీ, నీ సొంత మరణాన్ని అనుభవించలేవు. ఉన్నది భౌతిక మరణం మాత్రమే; మానసిక మరణమనేది లేదు. మరణం అంటే మీరెందుకు అంతగా భయపడుతున్నారు?

అనుభవాలను పొందే నీ శారీరక నిర్మాణం (experiencing structure), తన అనుభవం లోకి ఎప్పటికీ రాని, ఏ ఘటననూ ఊహించ లేదు. అది తన యొక్క అంతం కూడా తన చేతుల మీదుగానే జరిగాలని ఆశిస్తుంది, అందువల్ల "మరణానుభూతి ఎలా ఉంటుందో" అని అది అత్యాశ్చర్య పోతూ ఉంటుంది -- ఏమీ అనిపించని స్తితి ఎలా అనిపిస్తుంది (ఏదీ ఫీల్ అవకుండా ఉండే స్తితిని ఎలా ఫీలవుతాను) అనేది ఊహించుకొంటుంది. కానీ జరగబోయే అనుభవాన్ని ముందే ఊహించడానికి నీ అనుభవ నిర్మాణానికి జ్ఞానం(నాలెడ్జ్) కావాలి, అంటే అలాంటి గత అనుభవం కావాలి, పోల్చి చూసుకోడానికి. నీవు పుట్టక మునుపు నీవు లేకపోవడాన్ని ఎలా అనుభూతి చెందేవో (what it felt like not to exist) నీవు గుర్తు పెట్టుకోలేవు, నీ సొంత పుట్టుక గూడా నీకు గుర్తు లేదు, అందుచేత భవిష్యత్తులోని 'నీవు ఉండని స్తితిని' ఊహించుకోడానికి నీకు ఏ ఆధారమూ లేదు.

నీ జీవితం గురించి నీకు తెలిసినంత కాలం, నీ గురించి నీకు తెలిసినంత కాలం, నీవు ఉన్నావ్. అందువల్ల, నీకు శాశ్వతత్వం ఉంటుందనే భావన నీకుంది. ఈ శాశ్వతత్వం అనే భావనను సమర్ధించుకోవడానికి, మరణం తర్వాత కూడా నీకు జీవితం ఉంటుందని, నీ ఆలోచన క్రమం (structure) తనను ఒప్పించుకోవడం మొదలు పెడుతుంది -- స్వర్గం, పునర్జన్మ, ఆత్మలు ఒక దేహాన్ని విడిచి మరో దేహంలోకి వెళ్ళడం లాంటివి. ఆ మళ్ళీ జన్మించేది ఏమిటని నీవనుకొంటున్నావ్? నీ యొక్క ఆ ఆత్మ ఎక్కడుంది? దాన్ని రుచి చూడగలవా? దాన్ని తాక గలవా? నాకు చూపించ గలవా? ఏముంది నీ లోపల, స్వర్గానికి వెళ్ళేది? ఏమిటది? నీ లోపల ఏమీ లేదు భయం తప్ప.

---------------

మీరు కలలు ఎందుకు కంటారు? నీవు చూసినవి, విన్నవి, అనుభూతి చెందినవి అనువదించి నీ కళ్ళను నిర్దేశిస్తూ, “ఇది అందంగా ఉంది, అది అంద వికారంగా ఉంది, నేను దీన్ని చూస్తాను, దాన్ని చూడను” అని చెప్పే, నీ ఇంద్రియ జ్ఞాన అవగాహనలను నడిపించే ‘నేను’ అనే వాడు ఒకడు ఉన్నాడనే భావన నీకుంది. కానీ నువ్వు వాటిని అలా కంట్రోల్ చెయ్య లేవ్ -- నీవు చెయ్యగలనని అనుకుంటావ్; కానీ ఆ కెమెరా (కళ్ళు), ఒక వస్తువును మరొక దానికంటే ఎక్కువ సేపు చూసినా, ఎల్లపుడు బొమ్మలు తీస్తూనే ఉంటుంది, ఆ టేప్ రికార్డర్ ఎప్పుడూ రికార్డ్ చేస్తూనే ఉంటుంది. ఆ తరువాత, శరీరం విశ్రాంతి తీసుకొన్నప్పుడు లేదా నీ ఆలోచనలు ఏక్టివ్ గా లేనపుడు, ఈ చిత్రాలు బయట పడ్డం మొదలవుతాయ్ – ఇక్కడో చిన్న ముక్క, అక్కడో చిన్న ముక్క – అది, ఒక రకమైన రంగు రంగు చిత్రాల కలయిక (mosaic) లాంటిది సృష్టిస్తుంది. అపుడు నీవు కలలు కనడం మొదలెడతావ్. ఆ ‘ఒకడు’ లేనపుడు “నేను నిద్ర పోయాను, నేను కలలు కన్నాను, ఇపుడు మెలకువగా ఉన్నాను” అని చెప్పేది ఏదీ లేదు.

--------------

నైతికత (morality) అంటే ఏమిటి? ఇది, ఎవరో ఆదేశించిన ప్రవర్తనా నియమాలు పాటించడం కాదు. ఇది, ప్రలోభాలకు లోను కాకుండా ఉండడం,

ద్వేషం, కోపం, అత్యాశ, కామ మోహాలు, హింస మొదలైన వాటిని జయించడం అనే ప్రశ్న కాదు. నీవు చేసే పనులను చేసే ముందూ, చేసిన తరువాత ప్రశ్నించడం నైతిక సమస్యను (మోరల్ ప్రోబ్లమ్ ను) సృష్టిస్తుంది. ఇది మంచనీ, అది చెడు అని వేరు చేసి వాటికనుగుణంగా నువ్వు చేసే పనులను ప్రభావితం చేస్తున్న విచక్షణా జ్ఞానమే ఈ పరిస్తితి కి కారణం.

జీవం (ప్రాణం) ఒక చర్య (life is action). ప్రశ్నించుకోని చర్యే నైతికత. నీ చర్యలను ప్రశ్నించుకోవడమంటే జీవ వ్యక్తీకరణను (expression of life) నాశనం చేయడమే. తనను కాపాడుకోవాలనే ఆలోచనలు లేకుండా తన సొంత రీతిలో తన పనులు నిర్వర్తించడానికి వీలుగా జీవాన్ని(లైఫ్ ని) అంటే దేహాన్ని స్వేచ్ఛగా వదిలిన మనిషిలో తనను రక్షించుకొనడానికి 'నేను' అనేది ఉండదు. అతనికి, అబద్ధమాడ వలసిన అవసరం గానీ, మోసం చెయ్య వలసిన అవసరం గానీ, నటించ వలసిన అవసరం గానీ, లేదా తన సమాజం అనైకత (immoral) అనుకునే పనులను చేయ వలసిన అవసరం గానీ అతనికి ఏముంటుంది?

--------------

నీ సహజ స్తితిలో నిన్ను ఉండనీయ కుండా చేస్తున్నదేమిటి? నీ నుండి నీవు ఎల్లప్పుడూ దూరంగా వెళ్ళిపోతున్నావ్. నీవు సంతోషంగా ఉండాలని కోరుకొంటున్నావ్, శాశ్వతంగా గానీ లేదా కనీసం ఈ క్షణంలోనైనా గాని. రోజు ఉండే అనుభవాలు నీకు అసంతృప్తిని కలిగిస్తున్నాయ్, అందువల్ల కొన్ని కొత్తవి కావాలనుకొంటున్నావ్. నీవు నిన్ను పరిపూర్ణ మానవునిగా సరిదిద్దు కోవాలనుకుంటున్నావ్, నిన్ను మార్చు కోవాలనుకొంటున్నావ్. ఇప్పుడున్నట్టు కాకుండా మరోలా మారాలని ప్రయత్నిస్తూ ఏదో అందుకోవాలనుకుంటున్నావ్. అదే నిన్ను నీ నుండి దూరం చేస్తోంది.

ఒక "పరిపూర్ణ పురుషుడుగా మారాలి" అనే ఆదర్శాన్ని సమాజం నీ ముందు ఉంచింది. నీవు ఏ సంస్కృతిలో పుట్టినప్పటికీ, నీ ప్రవర్తన ఎలా ఉండాలో నిర్దేశించే అధ్యాత్మిక సిద్ధాంతాలు, వంశపారంపరంగా నీకు అందజేయబడిన సంప్రదాయాలు

నీకు ఉన్నాయి. సాధనల వల్ల, ఎప్పుడో ఒకప్పుడు నీవు గూడ, ఆ ఋషులు, మునులు, జగద్రక్షకులు పొందిన స్తితికి చేరుకోగలవని, నీకు చెప్పేరు. అందువల్ల నీవు మరోవిధంగా అసహజమైన జీవనం సాగించడానికి నీ ఆలోచనలను, ప్రవర్తనను కంట్రోల్ చేయడానికి ప్రయత్నిస్తున్నావ్.

మనమంతా ఒక 'ఆలోచనా గోళం(thought sphere)లో జీవిస్తున్నాం. నీ ఆలోచనలు నీ సొంతం కాదు; అవి ప్రతి ఒక్కరికీ చెందుతాయ్. అక్కడ ఆలోచనలు మాత్రమే ఉన్నాయ్ కానీ నీవు, నీ లోని ప్రతీ ఆలోచననీ చదవడానికి మరొక ప్రతి-ఆలోచన(కౌంటర్-థాట్)ని అంటే 'ఆలోచించే వాణ్ని' సృష్టిస్తావ్. లైఫ్ ని కంట్రోల్ చెయ్యడానికి నీవు చేసే ప్రయత్నాలు నీలో 'రెండవ ఆలోచనా గమనాన్ని' (secondary movement of thought) సృష్టిస్తాయ్, దీన్ని నీవు 'నేను' అని పిలుస్తావ్. నీలోని ఈ ఆలోచనా గమనం, జీవన గమనానికి (movement of life కి) సమాంతరంగా ఉంటుంది, కానీ విడిగా దూరంగా ఉంటుంది; ఇది లైఫ్ ని (జీవాన్ని) ఎప్పటికీ తాక లేదు(అంటే సహజ జీవనానికి అనుగుణంగా ఉండదు). నీవొక జీవించే ప్రాణివి, అయినప్పటికీ నీ జీవితమంతా వేరుగా, సమాంతరంగా నడుస్తున్న ఆలోచనా క్షేత్రంలో గడుపుతావ్. జీవంతో నీకున్న సంబంధాన్ని నీకు నీవే తెంచేసుకుంటావ్ – ఇది చాలా అసహజ మైనది.

సహజస్తితి ఒక ఆలోచనారహిత స్తితి కాదు – అది (ఆలోచనారహిత స్తితి అనేది) కొన్ని వేల సంవత్సరాల నుండి అమాయక హిందువులపై రుద్దబడిన అతి పెద్ద బూటకం, అబద్ధం. నీ శరీరం శవమయ్యే వరకు, పూర్తిగా శవం అయ్యే వరకు, ఆలోచనలు లేకుండా నీవు ఎప్పుడూ ఉండవు. ఆలోచించ గలగడం బతకడానికి చాలా అవసరం. కానీ ఈ సహజ స్తితిలో ఆలోచన నిన్ను అణిచిపెట్టి ఉంచడం మానేస్తుంది; అది(ఆలోచన) తన సహజ మార్గంలో పడుతుంది. ఆలోచనలను చదివి, అవి తన ఆలోచనలే అనుకునే ఒక 'నీవు' అనే వాడు ఇక ముందు ఉండడు.

ఆలోచన యొక్క ఆ సమాంతర గమనాన్ని (పేరలల్ మూవ్ మెంట్) నీవెప్పుడైనా చూశావా? నేను - అనేది ప్రథమా విభక్తి, ఏక వచన సర్వ నామం, కర్త

(subjectivecase) అని వ్యాకరణం చెపుతుంది. కానీ నువ్వు తెలుకోవాలనుకుంటున్నది అది కాదు. నీవంటున్న 'నేను' అనే దాన్ని నువ్వు చూడ గాలవా? అది అంతు చిక్కనిది. నీవిపుడు దాన్ని చూడు, అనుభూతి చెందు, ముట్టుకో, అప్పుడు నాకు చెప్పు. నువ్వు దాన్ని ఎలా చూస్తావ్? నీవంటున్న ఆ 'నేను' ను చూస్తున్నది ఏది? ఈ సమస్య అంతటికీ ఇదే కీలకం: ఏదైతే నీవనుకునే 'నేను' ను చూస్తోందో అదే 'నేను'. ఇది, అంటే ఈ 'నేను' తనను తాను కర్త (subject) గాను మరియు కర్మ(object వస్తువ) గాను ఒక అవాస్తవమైన విభజన సృష్టించి, ఈ విభజన ద్వారా తాను కొనసాగుతోంది. ఈ విభజించే తత్వమే నీలో, నీ కాన్షియస్నెస్(చైతన్యం) లో పనిచేస్తోంది(operating). తన ఆస్తిత్వాన్ని కొనసాగించడమే దాని కావలసినదంతా. ఆ 'నీవు' ని నువ్వు అర్థం చేసుకోవాలని కోరుకున్నంత కాలం లేదా దాన్ని అధ్యాత్మికంగానో, పవిత్రంగానో, అందంగానో, లేదా ఓ గొప్ప దానిగానో మార్చాలని కోరుకున్నంత కాలం, ఆ 'నీవు' అనేది కొనసాగుతూనే ఉంటుంది. దాని గురించి నీవు ఏమీ చెయ్యదలచుకో పోతే అది లేదు, అది పోయింది.

నీవు దీన్ని ఎలా అర్థం చేసుకుంటావ్? రోజు జీవితంలో పనికొచ్చే ఒక స్టేట్మెంట్ ఇచ్చాను: "నీవు దేన్ని చూస్తున్నావో దానికీ, దాన్ని ఎవరు చూస్తున్నారో వానికీ, ఏమీ తేడా లేదు" ఇటువంటి ఒక స్టేట్ మెంట్ వల్ల నీకేదైనా ఉపయోగం ఉందా? ఒక అర్థం లేని, ఒక తర్కబద్ధం కాని, ఒక నిర్హేతుకమైన ఒక వాక్యాన్ని, స్టేట్ మెంట్ ను అవగాహన చేసుకోడానికి నీ దగ్గర ఏదైనా పరికరం ఉందా? నువ్వు ఆలోచిచడం మొదలు పెడతావ్. ఆలోచించడం ద్వారా దేన్నీ నువ్వు అర్థం చేసుకో లేవు. నువ్వు మిగతా ప్రతీ విషయాన్నీ ఏ విధంగా అనువదించి అర్థం చేసు కొంటావో, అలాగే నేను చెపుతున్న దాన్ని గూడా, నీ దగ్గర ఇప్పటికే ఉన్న నీ జ్ఞానానికి (నాలెడ్జికి) అనుగుణంగా అనువదించి అర్థం చేసుకొంటున్నావ్, ఎందుకంటే నేను చెపుతున్న దాని నుండి ఏదో పొందాలని అనుకొంటున్నావ్. నూవ్విలా చేయడం ఆపేసినప్పుడు, అక్కడ ఉన్నది నేను వివరిస్తున్నది మాత్రమే. నువ్వు ఇపుడు చేస్తున్నవి -- అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం, లేదా

నిన్ను నీవు మార్చుకోడానికి ప్రయత్నించడం మొదలైనవి లేని 'స్థితినే' నేను నీకు వివరిస్తున్నది.

-----------------

అతీతమైనది, అన్నిటికీ అవతల ఉన్నది ఏదైనా ఒకటి ఉందా? నీ చుట్టూ జరుగుతున్న వాటిపైన, రోజూ ఉండే దినచర్య మీదా నీకు ఆసక్తి లేకపోవడం వల్ల, అతీతమైనది ఒకటి ఉందని, భగవంతుడని, కాలాతీతమైనదని, సత్యం అని, వాస్తవం, బ్రహ్మ, జ్ఞానోదయమని, లేదా మరొకటటని నీవు కల్పన చేశావ్, తర్వాత దాని కొరకు నీవు అన్వేషణ చేస్తావ్. నువ్వు ఊహించుకొనే ఆ 'అతీతమైనది' ఏదీ లేక పోవచ్చు. ఆ అతీతమైన దాని గురించి నీకేమీ తెలియదు. నీకు తెలిసినదల్లా, నీకు వాళ్ళు వీళ్ళు చెప్పినది అంటే దాన్ని గురించి నీవు "పోగుజేసుకొన్న జ్ఞానం(knowledge)" మాత్రమే. నీవు ఆ నాలెడ్జిని ఆధారం చేసుకొని నీవు ఊహించుకుంటున్నావ్. అతీతాన్ని గూర్చి నీకున్న జ్ఞానమే, నువ్వు చెప్పే ఆ అతీతాన్ని సృష్టిస్తోంది; తర్వాత అతీతాన్ని గూర్చిన ఏ నాలెడ్జ్ అయితే నీదగ్గర ఉందో, సరిగ్గా అదే నీవు అనుభూతి చేస్తావ్. జ్ఞానం అనుభవాన్ని సృష్టిస్తుంది, ఆ అనుభవం నాలెడ్జికి మరింత బలం చేకూరుస్తుంది.

నీకు తెలిసినది ఏదీ, ఎప్పటికీ అతీతం కానేరదు. నీవు అనుభవించేది ఏదీ అతీతం కాదు. ఏదైనా అతీతం ఉంటే, యీ 'నీవు' యొక్క చలనం (movement) ఉండదు. బహుశా ఈ మూమెంట్ లేక పోవడమే అతీతం, కానీ అతీతాన్ని నీవెప్పటికీ ఎక్స్ పీరిఎన్స్ చెయ్య లేవు; 'నీవు' లేనప్పుడే అతీతం ఉంటుంది. అసలు అనుభవం లోకి రానిదాన్ని అనుభవించడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నావ్?

----------

నీవు చూస్తున్న దాన్ని నీవు ఎప్పుడూ గుర్తించ గలిగి ఉండాలి, అలా గుర్తించ లేక పోతే నీవు లేవు. నీవు చూస్తున్నది ఇది అని నీవు నీ భాషలో అనువదించిన క్షణంలో, అంటే నీవు దాన్ని ఫలానా అని గుర్తించినప్పుడు, 'నీవు' అనేది అక్కడ ఉంటుంది. నువ్వొక వస్తువును చూసి అది ఒక సంచి అని, ఎర్ర సంచి అని గుర్తు పడతావ్. ఆలోచన అనువదించడం ద్వారా ఇంద్రియ-స్పందన (sensation) తో

జోక్యం చేసుకొంటుంది. ఆలోచన ఎందుకు జోక్యం చేసుకొంటుంది? దీని గురించి నీవేమైనా చెయ్యగలవా? నీవు ఒక వస్తువును చూడగానే బేగ్ అనే పదం నీ లోకి వస్తుంది. బేగ్ కాకపోతే బెంచ్, లేదా మెట్లు, మెట్ల రెయిలింగ్, "ఆ మనిషి అక్కడ కూచున్నాడు, ఆయన జుట్టు నెరిసింది". ఇది ఇలా జరుగుతూనే ఉంటుంది.– నీలో నీవే ఎప్పుడూ మళ్ళీ మళ్ళీ అనుకొంటూ ఉంటావు. నువ్వలా చెయ్యక పోతే మరొక దాంతో బిజీగా ఉంటావ్: "నాకు ఆఫీసుకు లేటవుతోంది." అనో ఏదో ఒకటి. జ్ఞానేంద్రియాలు ఆ క్షణంలో చేస్తున్న పనులతో సంబంధం లేనివి ఆలోచిస్తూనే ఉంటావ్ లేదా చూస్తున్నవన్నీ లోపల తలచుకొంటూ ఉంటావు, ఇది బేగ్ అని అది బెంచ్ అని వగైరా -- అక్కడ జరుగున్నంతా అదే. బేగ్ అనే పదం నీవు చూస్తున్న దాని నుండి నిన్ను వేరు చేసి, తద్వారా 'నీవు' ను సృష్టిస్తుంది; అలా జరగక పోతే ఆ రెండిటి మధ్యా( నీకూ బేగ్ కూ మధ్య) ఖాళీ, గేప్ ఉండదు.

ఒక ఆలోచన పుట్టినప్పుడల్లా నీవు పుడతావు. ఆలోచన పోయినపుడు నీవు గూడా పోతావ్. కానీ ఈ 'నీవు' అనేది ఆలోచనను వెళ్ళ నివ్వదు, అంతేకాదు ఈ ఆలోచించడమే యీ 'నీవు' ను నిరంతరంగా ఉంచేది. వాస్తవానికి నీలో శాశ్వత అస్తిత్వం గలది (permanent entity) ఏదిలేదు, నీ యొక్క 'అన్ని ఆలోచనల, అనుభవాల మొత్తం' అనేది ఏమీ లేదు. నీలో ఆలోచించే వాడు 'ఒకడు' ఉన్నాడని, నీ ఫీలింగ్స్ ను ఫీలయ్యే వాడు 'ఒకడు' ఉన్నాడని నీవనుకుంటావ్ – అది ఒక భ్రమ. అది ఒక భ్రమ అని నేను చెప్పగలను; కానీ నీకు అది భ్రమ కాదు.

నీ భావోద్వేగాలు ఎక్కువ జటిలమైనవి. వీటిది గుడా అదే ప్రక్రియ. నేను కోపంగా ఉన్నాననీ, వాళ్ళను చూస్తే ఈర్ష్య గా ఉందని, సెక్స్ కోరికలు నన్ను ఇబ్బంది పెడుతున్నాయని, నీలో నీవే ఎందుకు అనుకొంటున్నావు? కోరికలు నెరవేరడం లేదా నెరవేరక పోవడం గురించి నేనేమీ చెప్పడం లేదు. నీలో ఒక స్పందన, ఒక సెన్సేషన్ ఉంది, అపుడు నువ్వు అంటావ్, నేను క్రుంగిపోయాను లేదా నేను విచారంగా ఉన్నాను లేదా నేను ఆనందంగా ఉన్నాను, ఈర్ష్యగా ఉన్నాను, నాలో దురాశ, అసూయ ఉంది, వగైరా. ఈ పేరులు పెట్టడం అనే ప్రక్రియ సెన్సేషన్ను అనువదిస్తున్న వాడిని అస్తిత్వంలోకి తీసుకొస్తుంది. నీవు దేన్ని

'నేను' అంటున్నావో అదే, రెడ్ బేగ్, బెంచీ, మెట్లు, బల్బ్, కోపం, ఆనందం, అసూయ మొదలైన పదాలు తప్ప వేరే మరొకటి కాదు. నీవు నీ మెదడు లోని జీవ కణాలను అనవసరమైన పనిలో పెట్టి, జ్ఞాపక కణాలను (మెమొరీ సెల్స్ ను) ఎప్పుడూ పనిచేసేలా చేసి, అక్కడ ఉన్న శక్తినంతటని దుర్వినియోగం చేస్తున్నావ్. ఇదే నిన్ను క్షీణింప చేస్తోంది.

ఎవరితోనైనా మాట్లాడడానికి లేదా నీలో నువ్వు మాట్లాడుకోడానికి ఈ పేర్లు పెట్టడం అవసరం. కానీ నీలో నువ్వు ఎప్పుడూ మాట్లాడుకొంటూనే ఉంటావ్. నువ్విలా ఎందుకు చేస్తావ్? నీకూ, బయటకు వినపడేలా తనలో తానే మాట్లాడుకొనే వాడికీ ఉన్న ఒక్క తేడా ఏమిటంటే, నీవు శబ్దం బయటకు వచ్చేలా మాట్లాడవు. ఎప్పుడయితే నువ్వు బయటకు వినపడేలా నీలో నువ్వు మాట్లాడు కుంటావో అపుడు మానసిక వైద్యుడు రంగం లోకి దిగుతాడు. పాపం ఆయన గూడ, నీవు చేస్తున్నదే చేస్తుంటాడు, తనలో తాను ఎప్పుడూ మాట్లాడుకుంటూ ఉండడం -- బేగ్, రెడ్ బేగ్, ఒకే ధోరణి, పెంకితనం (obsessive, compulsive), కొడుక్కి తండ్రిపై ద్వేషం (Oedipus complex), అత్యాశ, మార్టినీ(సారా డ్రింక్), బెంచ్, కుర్చీ, వగైరా. ఆయన నీలో ఏదో సమస్య ఉందని నిన్ను హాస్పిటల్ బెడ్ మీద పడుకోపెడతాడు, నీ మానసిక అరోగ్యం మెరుగు పర్చ డానికి సహాయ పడాలనుకొంటాడు.

ఈ ఇంద్రియ స్పందనలను (సెన్సేషన్స్ ను) వాటి మానాన వాటిని ఎందుకు వదల లేక పోతున్నావ్? వాటికి పేర్లు పెట్టి, ఎందుకు అనువదిస్తావ్? నీవు ఇలా చేయడానికి కారణమేమంటే, నీతో నీవు మాట్లాడుకోక పోతే నీవు ఉండవు. దాని పర్యవసానం ఆ 'నీవు' కు చాలా భయానకంగా ఉంటుంది

---------

ఏది నీ అనుభవం లోకి వచ్చినా – శాంతి, బ్రహ్మానందం, నిశ్శబ్దత, మోక్షం, తన్మయం, ఆనందం వగైరా అవేమిటో, ఆ భగవంతునికే తెలియాలి, -- ఇవన్నీ పాతవి, సెకండ్ హేండ్ వి అయి ఉంటాయ్. వీటన్నిటి గురించిన జ్ఞానం నీ దగ్గర ఇప్పటికే ఉంది. నువ్వొక పరమానంద స్తితిలో లేదా గొప్ప నిశ్శబ్ద స్తితిలో

ఉన్నావన్న వాస్తవానికి అర్థం దాని గురించి నీకు తెలుసని. నువ్వు దేన్నైనా అనుభవించాలంటే అది నీకు తప్పక తెలిసి ఉండాలి. ఆ జ్ఞానం(knowledge) ఏమీ అంత గొప్పది కాదు, అధిభౌతికమూ కాదు; బెంచ్, బేగ్, రెడ్ బేగ్, అనేదే జ్ఞానం(నాలెడ్జ్). జ్ఞానమనేది, ఎవరో మరొకరి ద్వారా నీలో పెట్ట బడినది, అది వాళ్ళకు మరొకరి దగ్గరనుండి వచ్చినది. అది నీది కాదు.

నీవు, ఆ ఎదురుగా ఉన్న బెంచి లాంటి ఒక సాధారణమైన వస్తువును, ఎక్స్పీరిఎన్స్ చెయ్య గలవా? చెయ్య లేవు. దానిని గురించి నీకు తెలిసిన జ్ఞానాన్ని మాత్రమే నీవు ఎక్స్పీరిఎన్స్ చెయ్య గలవు. ఆ జ్ఞానం, ఎప్పుడూ, బయట నుండి వచ్చినదే. నీ సమాజం యొక్క ఆలోచనలనే, నువ్వు ఆలోచిస్తావ్, నీ సమాజం యొక్క ఫీలింగ్స్ నే నీవూ ఫీలవుతావ్, నీ సమాజం యొక్క అనుభవాలనే నువ్వు అనుభవిస్తావ్; కొత్త అనుభవం అనేది ఉండదు. అందువల్ల ప్రతీ మనిషీ యిప్పటిదాకా ఆలోచించినదంతా, అనుభూతి చెందినదంతా, నీ సిస్టమ్(శరీరం) లో నుండి బయటకు పోయి తీరాలి. ఆ జ్ఞానమంతటి యొక్క ఉత్పత్తివే, ప్రొడక్టువే నీవు – అదే నీవు.

---------------

ఆలోచన అనేది ఏమిటి? దాని గురించి నీకేమీ తెలియదు. నీవు అంటున్న 'ఆలోచన' అనే దాని గురించి నీకు తెలినదంతా వాళ్ళూ వీళ్లూ నీకు చెప్పినదే. దాన్ని నీవు ఏంచేసుకొంటావ్ – నీకు నచ్చినట్టు కరిగించి మూస పోస్తావా, కంట్రోల్ చేస్తావా, మరో రూపాన్నిస్తావా, లేదా అది రాకుండా ఆపేస్తావా? దాన్ని ఏదో చేయాలని నీవెప్పుడూ ప్రత్నిస్తూనే ఉన్నావు, ఎందుకంటే, నీకేవరో చెప్పారు.. దీన్ని మార్చాలని, లేదా దీని స్తానంలో మరోటి పెట్టాలని, మంచి ఆలోచనలు ఉంచుకోవాలని చెడు ఆలోచనలు వదిలి పెట్టాలని. కానీ ఆలోచనలు ఆలోచనలే. అవి మంచివీ కాదు, చెడ్డవీ కాదు. ఉన్నదాన్ని ఏదో చేయాలని కోరుకొన్నంత కాలం, నువ్వు ఆలోచన చేస్తున్నట్టే. కావాలనుకోడం, ఆలోచించడం వేరు వేరు కాదు. దాన్ని అర్థంచేసుకోవాలని కోరుకుంటున్నావంటే అర్థం అక్కడ ఆలోచన

నడుస్తోందని. నీవు ఆ నడుస్తున్న ఆలోచనలకు మరింత బలం ఇచ్చి దాన్ని నిరంతరంగా ఉండేట్టు చేస్తున్నావ్.

జ్ఞానేంద్రియాలు నీలో అసహజంగా పనిచేయడానికి కారణం, ఏదో ఒకటి పొందడానికి నీవు వాటిని వాడుకోవాలనుకొంటున్నావ్. ఏదో ఒకటి పొందవలసిన అవసరమేముంది? ఎందుకంటే, నీవనుకొనే 'నీవు' ను కొనసాగించాలని కోరుకుంటున్నావ్. నీవా కంటిన్యూటీని కాపాడుకొంటున్నావ్. ఆలోచన ఒక రక్షణ యంత్రం : ఏదో ఒక దానికి లేదా ఎవరో ఒకరికి నష్టం కలిగించి అది ఆ 'నీవు' ని కాపాడుతుంది. ఆలోచన నుండి పుట్టిన ప్రతీదీ వినాశకరమైనదే. అది నిన్ను చివరికి మీ జాతిని కూడా నాశనం చేస్తుంది.

-----------

ఆలోచన యొక్క మళ్ళీ మళ్ళీ జరిగే యీ యాంత్రిక విధానమే నిన్ను క్షీణింప జేస్తుంది. అందువల్ల దాని గురించి నువ్వేం చెయ్యగలవ్? — నువ్విలా అడగ్గలవంతే. అదొక్కటి మాత్రమే ఇప్పుడున్న ప్రశ్న, ఈ ప్రశ్నకు జవాబు నేనిచ్చినా, మరొకరిచ్చినా, ఆ జవాబు ఆ ఆలోచనా గమనానికి మరింత బలం ఇస్తుంది. నువ్వు యీ విషయంలో చెయ్యగలిగేది ఏదైనా ఉందా? ఏదీ లేదు. అది చాలా చాలా బలమైనది: దానికి కొన్ని కోట్ల సంవత్సరాల గమన ఊపు (momentum) ఉంది. నీవు పూర్తిగా నిస్సహాయ స్తితిలో లో ఉన్నావ్, ఆ అసహాయ స్తితిలో ఉన్నట్లు నీవు తెలుసుకోలేవు.

మనసును నియంత్రించే ఏ పద్ధతిని నీవు సాధన చేసినా, ఆ 'నీవు' దానంతట అదే అక్కడ ఉంటుంది, ఆ సాధన ద్వారా ఆ 'నీవు' కంటిన్యూ అవుతోంది. నీవెప్పుడైనా ధ్యానం చేసేవా, నిజంగా నిష్టగా చేసేవా? అలా చేసిన వాళ్లెవరైనా నీకు తెలుసా? ఎవ్వరూ చెయ్యరు. నీవు నిజంగా ఏకాగ్రతతో మెడిటేషన్ చేస్తే పిచ్చాసుపత్రికి చేరుకుంటావ్. లేదా, జీవితం లోని ప్రతీ క్షణాన్ని ఎరిగి (aware) ఉండడానికి ప్రయత్నిస్తూ ఎల్లపుడూ పూర్తి ధ్యానంతో (Maindfullness) ఉండడం సాధన చెయ్య లేవ్. నీవు నీ చుట్టూ ఏం జరుగుతోందో ఎల్లప్పుడూ పూర్తిగా ఎరిగి ఉండలేవు; నీవు మరియు "జాగృతి (awareness)" రెండూ కలిసి ఉండలేవు

లేవు, they cannot co-exist. నీవు నీ జీవితంలో, గడియారం ప్రకారం ఒక్క క్షణం జాగృతి స్తితిలో(state of awareness లో) ఒక్కసారి ఉండగలిగితే, నిరంతరత (continuity) తెగిపోతుంది, నీ ఎక్స్పీరిఎన్సింగ్ స్ట్రక్చర్(అనుభవించే నిర్మాణక్రమం) అనే భ్రమ అంటే 'నీవు అనేది' ఒక్క సారిగా కుప్పకూలుతుంది, అపుడు ప్రతీదీ తన సహజ గమనం, లయలో అంటే natural rhythm లో పడుతుంది. ఈ స్తితిలో నీవు దేన్ని చూస్తున్నావో నీకు తెలియదు – అదే జాగృతి, awareness. నీవు చూస్తున్నది నీవు గుర్తించ గలిగితే, నీవు అక్కడ ఉంటావ్, నీకు తెలిసిన పాత దాన్ని మళ్ళీ అనుభవిస్తూ.

ఏది ఒక మనిషిని ఈ సహజ స్తితి లోకి వచ్చేలా చేస్తుందో, అలా మరొకరిని ఎందుకు చేయదో నాకు తెలియదు. బహుశా జీవ కణాల్లో అది రాసి ఉంటుంది. ఇది అకారణం(acausal). ఇది నీ ఇచ్ఛాపూర్వకంగా జరిగిన చర్య కాదు, దీన్ని నువ్ తీసుకొని రాలేవ్. నువ్వు చెయ్యగలిగింది అస్సలు ఏమీ లేదు. ఏవేరైనా తాను ఆ స్తితిలోకి ఏ విధంగా వెళ్ళేడో, నీకు చెబితే అస్సలు నమ్మకు. ఒకటి మాత్రం నీవు ఖచ్చితంగా చెప్పగలిగేదేమిటంటే, తనంతట తానుగా తెలుసుకోవడం అతనికి సాధ్యం కాదని, దాన్ని నీకు తెలియజెప్పడం సాధ్యం కాదని. శరీరం లోపల ఒక ఆటోమేటిక్ ట్రిగ్గరింగ్ మెకానిజం(మీట దానంతట అదే నొక్కబడే యాంత్రికత) ఉంది. ఆలోచన యొక్క అనుభవ నిర్మాణ విధానం (experiencing structure of thought) దానంతట అదే తన పట్టు వదలినప్పుడు, ఆ మరొకటి తనరీతిలో తన స్వాధీనంలోకి తీసుకొంటుంది. అపుడు ఎవరితోనైనా మాట్లాడవలసిన అవసరం వచ్చినపుడు తప్ప ఆలోచన యొక్క ప్రమేయం లేకుండా దేహం పనిచేసే తీరు మొత్తం, డిఫరెంటుగా, వేరే విధంగాఉంటుంది, 'బాక్సింగ్-రింగ్', ముష్టి యుద్ధ పరిభాషలో చెప్పాలంటే నీవు "తువ్వాలు లోకి విసిరేయ్యాలి"(throw in the towl, ... అంటే బాక్సింగ్ పోటీలో ఓటమిని అంగీకరించడం), పూర్తిగా నిస్సహాయంగా ఉండిపోవాలి. నీకెవ్వరూ సహాయం చెయ్య లేరు, నీకు నువ్వు కూడా హెల్ప్ చేసుకోలేవు.

----------------

ఈ స్థితి నీకు నచ్చదు. ఆ నీవు ను కొనసాగించడం లోనే నీ ఇంటరెస్ట్ అంతా. నీవు ఇలాగే కొనసాగాలనుకొంటున్నావ్, బహుశా మరో స్థాయిలో ఉండి, మరో విధంగా(వేరే dimension లో) వ్యవహరించాలనుకొంటున్నావ్, ఏదో విధంగా కంటిన్యూ చెయ్యాలను కొంటున్నావ్. కానీ నీవు పడవను నడిపే పొడుగాటి పెద్ద కర్రతో గూడా దీన్ని తాకడానికి ఏమాత్రం ఇష్ట పడవు ఎందుకంటే, అది అన్నిటినీ అంతం చేస్తుంది... నీవనుకొనే "నీవు" ని, అన్నిటినీ,– పై స్థాయిలో ఉన్న "నేను" ని, కింద స్థాయిలో ఉన్న "నేను" ని, ఆత్మని, మెలకువగాఉన్న మనసుని, నిద్రించే మనసుని – అన్నిటినీ (higher-self, lower-self, soul, Atman, conscious, subconscious -- all of that) నాశనం చేస్తుంది. కొంత వరకు వచ్చాక నీవంటావ్ "నాకు టైమ్ కావాలి" అని. అపుడు సాధన రంగంలోకి వస్తుంది. నీవనుకుంటావ్ "రేపు నేను అర్థం చేసు కుంటాను" అని. ఈ నిర్మాణం(structure) కాలం నుండి పుట్టింది, కాలం లోనే పని చేస్తూ ఉంటుంది, కానీ కాలం ద్వారా అంతం కాదు. నీవు యిప్పుడు అర్థం చేసుకో లేకపోతే, రేపు గూడా అర్థం చేసుకోలేవు. అర్థం చేసుకోడానికి ఏముంది? నేను చెపుతున్నది అర్థం చేసుకోవాలని నువ్వెందుకు అనుకొంటున్నావ్? నేను చెపుతున్నది నువ్వు అర్థం చేసుకోలేవు. నా జీవన విధానం యొక్క వివరణను నీ జీవన విధానం తో పోల్చి చూసుకొనే నీ ప్రయత్నం అంతా వృధా. ఇదేమిటో నీకు నేను తెలియపరచ లేను. తెలియజేయాల్సిన అవసరం గూడ లేదు. ఏ సంభాషణా సాధ్యం కాదు. ఆ 'నీవు' అనేది లేనప్పుడు, ప్రశ్నే లేనపుడు, అక్కడ ఉన్నది అవగాహన(understanding) మాత్రమే. ఇంక నీవుండవ్. (You are finished). మాట్లాడకుండా నీవు బయటకు నడచి, వెళ్ళిపోతావ్. నువ్వు ఇంకెప్పుడూ, 'తన స్థితి' గురించి వివరించిచెప్పే ఎవరినీ వినవు, అంతేకాదు అవగాహన (understanding) గురించి ఏ ప్రశ్నలూ వెయ్యనే వెయ్యవు.

నువ్వు దేనికోసం వెదుకుతున్నావో అది లేనే లేదు. అసలు అస్తిత్వమే లేని నీ "నేను/ఆత్మ" యొక్క మౌలిక పరివర్తనను ఊహించుకొంటావ్, గారడీచేసే అందమైన మాయ మాటలతో; ఆ ఊహాచిత్ర క్షేత్ర స్థితిలో నీవు విహరిస్తావ్. ఇదంతా

నిన్ను నీ 'సహజ స్తితి' నుండి నిన్ను దూరంగా చేస్తుంది -- ఇది, నీ నుండి నీవు దూరంగా వెళ్లిపోయే ఒక గమనం. నీవు నీవు గా ఉండడానికి అసాధారణమైన ప్రజ్ఞ అవసరం. ఆ ప్రజ్ఞ నీకు అంతకు ముందే అనుగ్రహించ బడింది; అది  నీకు ఎవరో ఇవ్వవసిన అవసరం లేదు, అది నీ దగ్గర నుండి ఎవ్వరూ తీసుకొని పోలేరు. ఎవరైతే దానికి,  అది తనదైన రీతిలో తనను   వ్యక్తపరచు కొనడానికి, పూర్తి స్వేచ్ఛ ఇస్తాడో, అతడు ఒక సహజమైన  మనిషి  (natural man).

-- రెండవ భాగం సమాప్తం –

# మనిషి బయట ఏ శక్తీ లేదు

*(ప్రొఫెసర్ హెచ్.ఎస్.కె తో ఇంటర్ వ్యూ , మైసూర్, ఇండియా 1980)*

*****

ఒక మనిషికి, తన సొంత గతం నుండే కాకుండా, మొత్తం మానవజాతి గతాన్నుండి విముక్తి పొందవలసిన అవసరం ఉంది. నేను చెప్పేదేమంటే, నీకు ముందు పుట్టిన ప్రతి మనిషి చేసిన ఆలోచనల నుండి, పొందిన అనుభూతుల నుండి, అనుభవాల నుండి గూడా నీ అంతట నీవు విముక్తి చేసుకోవాలి – అప్పుడు మాత్రమే నీవు నీవులా ఉండడానికి నీకు సాధ్యమవుతుంది. నేను ప్రజలతో మాట్లాడడంలోని ఒకే ఒక ఉద్దేశ్యం ఏమిటంటే, ప్రతీ మనిషిలో తనదైన ఒక ప్రత్యేకత ఉంటుందని తెలియజెప్పడమే. మన సంస్కృతి, నాగరికత, వీటికి నువ్వే పేరు పెట్టినప్పటికీ, ఇవి మనందరినీ ఒక చట్రంలో ఇమడ్చడానికి ఎల్లపుడూ ప్రయత్నించేయ్. మనిషి అసలు మనిషిలా లేడు; మనిషి 'ఒక ప్రత్యేకమైన జంతువు' అని నేనంటాను – ఈ సంస్కృతి యొక్క భారం యితని మీద ఉన్నంత వరకు మనిషి ఒక ప్రత్యేకమైన జంతువులా ఉండిపోతాడు.

-----------

ప్రకృతి తనదైన రీతిలో, అప్పుడప్పుడు ఒక పుష్పాన్ని, మానవ పరిణామ క్రమం యొక్క చివరి ఉత్పత్తిని, ఈ భూమి మీదకు వదులుతూ ఉంటుంది. మరియొక పుష్పాన్ని సృష్టి చేయడానికి, పరిణామ ప్రక్రియ దీన్ని ఒక నమూనాగా వాడుకో లేదు -- అందుకే నేనంటాను, ఇది పరిణామక్రమం లోని చివరి ప్రోడక్ట్ అని – ఇది ఒక పుష్పాన్ని విసిరితే, అంతే. అలాంటి పువ్వును మీరు ఒక మ్యూజియం లో పెట్టి చూడచ్చు – మీరు చేయ గలిగినది అంతే.

----------

నేను చెపుతున్నది మీకు నచ్చదు, ఎందుకంటే, అది మొత్తం భారతీయ సంస్కృతి యొక్క పునాదులను, మరియూ సిగ్మండ్ ఫ్రాయిడ్ యొక్క కృత్రిమ సింద్ధాంతాల పై (on the Freudian fraud) నిర్మించబడ్డ అతిపెద్ద మానసిక-భవంతి యొక్క పునాదులను, కూల్చి వేస్తుంది కాబట్టి. అందుచేతనే మనస్తత్వ శాస్త్రవేత్తలు దైవ భక్తులు నన్ను వ్యతిరేకిస్తారు – నేను చెపుతున్నది వాళ్ళకి నచ్చదు – వారు చెప్పేది వారికి జీవనాధారం, అదంతా పూర్తిగా పోతుంది: (నేను చెప్పేది వాళ్ళు వ్యతిరేకించకపోతే,) ఈ అధ్యాత్మిక, మానసికశాస్త్ర వ్యాపారాలు అన్నీ మరో పది లేదా యిరవై ఏళ్లలో ఆగిపోతాయ్.

-----------

**ప్ర: సార్, సంక్షోభంలో ఉన్న ఈ నాటి ప్రపంచంలో భారత దేశం ఎటువంటి పాత్ర పోషించాలి?**

యుజి : ఏ సంక్షోభంలో గుండా యీ ప్రపంచం యీ రోజు వేడుతోందో, దానినుండే ఒక పరిష్కారం ఉద్భవించాలి, ఈ ప్రపంచం తనను తాను కాపాడుకోడానికి. అది వచ్చి తీరాలని, అది పశ్చిమ దేశాలనుండి వస్తుందని నేను అనుకొంటున్నాను – ఎక్కడ నుండి అనేది నాకు తెలియదు, కానీ ఇండియాకు ఆ అవకాశం లేదు.

**ప్ర: పశ్చిమ దేశాలలలో, అక్కడ వాళ్ళు ప్రశ్నిస్తున్న దానిలో నిజాయితీ ఉందా?**

**యుజి:** వారు నిజంగానే అడుగుతున్నారు. వారి నైతిక విలువలను వారు ప్రశ్నిస్తున్నారు. ఇప్పుడది స్పందన స్థాయిలోనూ, తిరుగుబాటు స్థాయిలోనూ ఉంది. కానీ వాళ్ళకి జవాబులు కావాలి. అక్కడ ప్రజలు ప్రాక్టికల్ గా ఆలోచిస్తారు. వాళ్ళకి జవాబులు కావాలి; వట్టి వాగ్దానలతో సరిపెట్టుకోరు.

అందువల్ల అక్కడ పరిస్తితి అలా ఉన్నట్టు కనపడుతోంది – అలా కాకపోతే మనిషి నాశనం అయిపోతాడు కదా. అయినా మనిషి యొక్క ఉనికి లేకుండా పోదు; ఏదో విధంగా బతికేస్తాడు. అంతా నాశనమై పోతుందనే సిద్ధాంతాన్ని నేను బోధించడం లేదు – నేను సృష్టి నాశనమౌతుందని చెప్పే ప్రవక్తను కాను. కానీ

అది(పరిష్కారం) పశ్చిమ దేశాల నుండే వస్తుందని  నా నమ్మకం. అది ఏదో ఒక చోటునుండి రావాలి కదా, కానీ అది  ఇండియా నుండి మాత్రం కాదు.

**ప్ర: అలా అని ఖచ్చితంగా చెప్ప గలరా?**

**యుజి:** ఖచ్చితంగా చెప్ప గలను ఎందుకంటే, నా సగం జీవితాన్ని పశ్చిమ దేశాల్లో గడిపేను – మొదటి సగ భాగం ఇండియాలో గడిపేను, రెండో సగభాగం ఇపుడు పాశ్చాత్య దేశాల్లో.

**ప్ర: మీరీ నిర్ధారణకు ఎలా వచ్చారు? ఇండియా ఒక విధమైన తత్వశాస్త్రాన్ని రూపొందించినదని మీరు అనుకోవడం లేదా?**

**యుజి:** నిన్న నేను ఎమర్సన్ రాసిన కొన్ని మాటలు ఉదాహరించేను. నేను చాలా అరుదుగా ఒకరు చెప్పిన మాటలు ఉదాహరణగా చెప్తాను. ఆయన ఒక విషయం చెప్పేడు, అది చాలా అసక్తి కరమైన స్టేట్ మెంట్, అదేమిటంటే.. నీ పక్కింటి వాడు దేవుణ్ణి నమ్మాలని నీవు కోరుకొంటే, భగవంతుడు నిన్నేవిధంగా తయారు చేయగలడో అతన్ని చూడమని చెప్పు. గాడ్ అంటే ప్రేమ అనీ, గాడ్ అంటే సత్యమనీ, గాడ్ అంటే అది అనీ, ఇది అనీ  చెప్పి ప్రయోజనం లేదు.

అందువల్ల  ఇది అన్నిటికన్నా ఆసక్తికరమైన విషయం: నిన్నేవిధంగా దేవుడు నిన్ను తయారు చేయగలడో యీ ప్రపంచాన్ని చూడనీ. సరిగ్గా అదే విధంగా, నీ యిల్లు నీవు చక్క దిద్దుకోవాలి. ఇక్కడ చాలా అస్తవ్యస్తం గా ఉంది, ఇండియాలో – అది ఎక్కడకు వేడుతోందో ఎవరికీ తెలియదు. అందువల్ల నీ యొక్క వారసత్వ అధ్యాత్మిక సంపదలో ఏదైనా  ఉంటే (చాలా ఉంది, ఈ క్షణంలో నేను దాన్ని కాదనడం లేదు, ఇండియా చాలామంది మునులను, ఋషులను, అవతార పురుషులను ఇచ్చింది), ఆ వారసత్వ సంపద, తన యింటిని తాను చక్కదిద్దుకోడంలో యీ దేశానికి సహాయ పడనప్పుడు, యీ దేశం ప్రపంచానికి సహాయ పడగలదని నువ్వు ఎలా అనుకొంటావ్? ఇది ఒక విషయం.

రెండవది: నీవు ఆధునిక పరిభాషను  కొత్త పదాలను  ఉపయోగించాల్సి వస్తుంది.  పశ్చిమ దేశం ప్రజలు యీ కొత్త పదాలకీ, సమ్మోహితులై, ఆసక్తిగా ఇవన్నీ నేర్చుకొని, వాటినే తిరిగి ఉపయోగించగలుగుతున్నందుకు, తమ గురించి

తాము ఏదో కొత్తగా ఫీలవుతారు. అందులో అంతకంటే ఏమీలేదు. నువ్ కొత్త భాష నేర్చు కొంటావ్, అదే భాష మాట్లాడడంలో గొప్పగా ఫీలయిపోతావ్. కానీ అది నీకు ఏవిధం గానూ ఉపయోగించదు.

అందుచేత, భారతీయులు అంత గొప్పగా చెప్పుకొనే వారి వారసత్వ సంపద, ఈ దేశానికి ఏవిధంగా ఉపయోగిస్తోందో ముందు నాకు చెప్పగలరా? అది ఈ దేశానికి ఎందుకు సహాయపడలేక పోతోంది? — ఇదే నేను అడుగుతున్నది.

**ప్ర: ఏ రకమైన సహాయం**?

**యుజి:** అన్నిటికంటే ముందు నీకు తప్పనిసరిగా ఆర్థిక స్థిరత్వం ఉండాలి. – ప్రతి ఒక్కరికీ తిండి, బట్ట, ఇల్లు ఉండేట్టు చూడాలి. ఈ దేశంలో ఉన్న పేదరికానికి క్షమాపనలు లేవ్ -- ముప్ఫై సంవత్సరాలుగా మన దేశం, స్వతంత్ర దేశంగా ఉంది. ఈ పేదరికం వగైరాలు యీ దేశంలో ఇంకా ఎందుకు కొనసాగుతున్నాయ్? ఇదే నా ప్రాధమిక ప్రశ్న. నా దగ్గర జవాబులున్నాయని కాదు. నా దగ్గర జవాబులు లేవు. నా దగ్గర జవాబులుంటే నేనిక్కడ ఇలా కూర్చొని కబుర్లు చెప్పను; ఏదో ఒకటి చేసే వాణ్ని. ఏ ఒక్కడూ తనకు తానుగా ఏదీ చెయ్యలేడు -- ఇదీ పరిస్తితి. సామూహికంగా చెయ్యడం అంటే అందులో యిబ్బందులున్నాయ్ – నా పార్టీ, నా సింద్ధాంతం, నా పద్ధతి; నీ పార్టీ, నీ సిద్దాంతం, నీ పద్దతి – ఇవన్నీ చివరికి అంతర్యుద్ధానికి దారి తీస్తున్నాయ్. వాళ్ళ శక్తి అంతా వృధా చేస్తున్నారు, ...... ప్రయత్నిస్తూ.

**ప్ర : గెలవడానికి ప్రయత్నిస్తూ** ?

**యుజి: ప్రజల నమ్మకాన్ని గెలిచి** వారిని తమ రాజకీయ ఉద్దేశ్యాల వైపు లాక్కోడానికి. కానీ యీ వ్యవస్థల వల్ల ప్రజల సమస్యలు ఏవిధంగానూ పరిష్కరించ బడలేదు. ఇదే నేను చెప్పడానికి ప్రయత్నిస్తున్నదంతా.

**ప్ర: ఈ దేశం తనను తాను కాపాడుకోలేదా**? **వారి వారసత్వ సంపద, సంస్కృతి** (heritage) **ఏవిధంగానూ ఉపయోగ పడదా**?

యుజి : ఈ దేశం తనను తాను కాపాడుకోలేదు. దురదృష్ట వశాత్తూ గతాన్నుండి సంక్రమించినది (heritage) ప్రజలకు సహాయ పడుతున్నట్లు కనపడదు.

**ప్ర : ( ప్రశ్న వినిపించ లేదు)**

యుజి : ఇదే నేను ఎప్పుడూ చెపుతున్నాను. ఉదాహరణకు మానసిక శాస్త్రవేత్తలు, చివరి దశకు వచ్చేసారు – వాళ్లు ఇప్పుడు ఇండియా వైపు చూస్తున్నారు. వాళ్లిపుడు, అ సాధువుల దగ్గరకు, యోగుల దగ్గరకి, మీరు అంటున్న 'భావాతీత ధ్యానం (Transcendental Meditation)' నేర్పే గురువులు మొదలైన వారి దగ్గరకు వెడుతున్నారు. వాళ్ళకి వీటిపై చాలా ఆసక్తి ఉంది, కానీ వీటిని టెస్ట్ చేసి చూడాలనుకొంటున్నారు. చూడండి, వాళ్ళకి ఫలితాలు కావాలి, మాటలు కాదు, అధ్యాత్మిక అనుభవాలు కాదు, అవాస్తవ అనుభూతులు కాదు. వాళ్ళకు కావలసింది ప్రపంచ సమస్యలను పరిష్కరించదానికి వీటిని అనువర్తింప చేయడం. – వాళ్ళ ఆసక్తి అంతా దాని కొరకే. నా వాదన, నేను నొక్కి చెప్పేది, ఏమిటంటే, వారి సమస్యలకు వాళ్ళే పరిష్కారాలు కనుక్కోవాలి. శాస్త్రజ్ఞులకు వారి సమస్యలు వారికున్నాయ్, సాంకేతిక నిపుణులకు వాళ్ళ సమస్యలు వాళ్ళకున్నాయ్ – వారి సమస్యలకు పరిష్కారాలు వారే కనుక్కోవాలి – అదే వాళ్ళు చేయవలసిన మొదటి పని . వాళ్ళు యిక్కడున్న సాధువుల వైపు చూడ్డం వల్ల ఏమీ ఉపయోగం లేదు.

**ప్ర : వాళ్ళు వాళ్ళ పద్ధతిలో జవాబులు కనుక్కోవాలి.**

యుజి : వారి వారి రంగాలలో. వాళ్ళు మాత్రమే వారి సమస్యలకి పరిష్కారాలు కనుక్కోవాలి. మనం చెప్పే పరిష్కారాలు, వాళ్ళ సమస్యలకు సరైన జవాబులు కాదు, వారి సమస్యలకే కాదు, మీ దైనందిక సమస్యలకు కూడా. మనిషికి పరిష్కారాల మీద మాత్రమే మక్కువ, సమస్యలను సరైన రీతిలో చూడడంలో కాదు. ఈ గొప్ప గొప్ప సాధువులు, మునులు, మానవజాతి రక్షకులు మొదలైన వారి వద్ద, మన సమస్యలకు సమాధానాలు ఉన్నాయని నీవంటావు, అదే నిజమయితే.. అవే ప్రశ్నలు మళ్ళీ మనం ఎందుకు అడుగుతున్నాం?

అవే ప్రశ్నలు ఇంకా మనం ఎందుకు అడుగుతున్నాం? అందుచేత అవి ఆన్సర్స్ కావు. అవే సమాధానాలు అయిఉంటే, ఆ ప్రశ్నలు ఉండేవి కాదు. మనం ఇంకా ప్రశ్నలు అడుగుతున్నాం అంటే దానర్థం అవి సరైన సమాధానాలు కావని. అందువల్ల మన సమస్యలకు వాళ్లు(మన గొప్ప సాధువులు, మునులు, జగద్రాక్షకులు) యిచ్చిన అ పరిష్కారాలు సరైన పరిష్కారాలు కాదు. అవి నిజంగానే సరైన పరిష్కారాలైతే సమస్యలు సమస్యలు గానే ఎందుకు ఉండిపోతాయ్?

అందువల్ల ప్రతి వ్యక్తికీ యిపుడు ఆ బాధ్యత ఉంది; ఏ ఒక్క దేశానికే కాదు -- ఇండియా లేదా అమెరికా లేదా రష్యా. చూడండి, ప్రతి వ్యక్తి ఆ ప్రశ్నలకు తన సొంత జవాబులు కనుక్కోవాలి. అందువల్ల ప్రతి వ్యక్తీ మానవ జాతిని కాపాడే వాడే – అయితే సామూహికంగా కాదు. అతడు తన ప్రశ్నకు జవాబు కనుక్కోగలిగితే లేదా తన సమస్యలకు పరిష్కారం కనుక్కోగలిగితే, బహుశా మానవ జాతి అంతటి మీదా ఒక విధమైన ఆశ పెట్టుకోవచ్చు – కారణం మనమందరం ఒకటిగా అయ్యాం కాబట్టి: అమెరికాలో ఏమి జరుగుతున్నా దాని ప్రభావం మన మీద పడుతుంది. ఇక్కడ జరుగుతున్నది ఏదైనా అది యితర దేశాలను గూడా ప్రభావితం చేస్తుంది.

చూడండి, ప్రపంచమంతా ఒకటి - అనే ధోరణిలో ప్రపంచమంతా ఆలోచిస్తోంది – కనీసం సిద్ధాంతపరంగానైనా – కానీ తన దేశ సార్వభౌమత్వాన్ని వదలుకోడానికి ఏ ఒక్కరూ తయారుగా లేదు. ఇదే నిజంగా ఈ సమస్యకు కీలకం. ఐరోపా దేశాల ఆర్థికసమాఖ్య (European Economic Community) – వాళ్ళు ఆర్థిక కారణాల వల్లనే ఒక్కటిగా అయ్యారు, మరే యితర కారణాల వల్ల కాదు. ప్రతీ దేశం తన యొక్క సార్వభౌమత్వాన్ని యింకా నొక్కి చెపుతోంది – కానీ చూడండి, అన్నిటికంటే ముందు ఇదే అంతం అయి తీరాలి.

అమెరికా రష్యా లాంటి శక్తివంతమైన దేశాలు కూడా సమస్యలను పరిష్కరించలేక పోతున్నాయి. ఇరాన్-ఇరాక్ పోరు లాంటివి – వాళ్ళేం చేస్తున్నారు? వాళ్ళ అణ్వాయుధ నౌకాలను అక్కడ పెడుతున్నారు – కానీ వాటిని ఉపయోగించ లేరు. కనీసం ప్రాపంచిక సంఘటనలను నియంత్రించడానికి ప్రపంచ పోకడలను ఆపలేక పోతున్నారు.

అంత పెద్ద అగ్ర దేశాలే ఏమీ చేయలేక పోతున్నప్పుడు ఇండియా ఏదో చేయ గలదని మీరేలా అనుకొంటున్నారు? ఇందిరా గాంధీ ఒక రాయబారిని ఇరాన్ కి పంపింది కాబట్టి దానికి మనం గర్వ పడచ్చు. దానివల్ల ఏం జరుగుతుంది? ఇతర దేశాలు ఇండియాను వాడుకొంటున్నాయ్. దానర్థం ఇండియా ఎవరినైనా ప్రభావితం చేయగలదని కాదు – కానే కాదు. ఎవ్వరూ ఇండియా మాట వినరు. ఎందుకంటే ఆర్థిక రంగంలో గానీ, రాజకీయ రంగంలో గానీ, రక్షణ రంగంలో గానీ, ఇండియా ఏమీ చేసే పరిస్తితిలో లేదు. ఇది ఇంత వెనుక బడిన దేశం. మనం శాంతి గురించి మాటలు మాత్రం చెపుతాం. హైడ్రోజన్ బాంబును ఇండియా ఎందుకు పేల్చకూడదు? – అదీ నా ప్రశ్న. ఆ ఆయుధాలను మనం పంప గలిగే స్తితిలో ఉన్నామా లేదా అన్నది వేరే విషయం. చైనా రోజు రోజుకీ శక్తివంతంగా తయారవుతోంది. – వాళ్ళు ఇండియా చెప్పే ఈ మాటలేమీ వినరు. ఇండియాను ఎవ్వరూ లెక్క చెయ్యరు – ఇదీ పరిస్తితి.

ఇండియా నుండి వెళ్ళే అ గురువులు లోకాన్ని మార్చి వేస్తున్నారనే భ్రమ నిజంగా ఒక విపరీతానుభూతి (fantasy-ఫేంటసీ). వాస్తవంగా వీరి ప్రభావం శూన్యం . జీరో! ఇటువంటి వాటికి ఆకర్షితులై వాటి వైపు లాగబడ్డ వారు, తమ సొంత దేశాల గమ్యానికి దారి చూప లేరు -- ఇది ఒక వాస్తవం.

**ప్ర: కానీ మనకున్న బోలెడు వారసత్వ సంపద** (heritage) **భౌతిక సమస్యలని ఎలా పరిష్కరించ గలదు?**

యుజి : అది వాటిని పరిష్కరించ లేదు, ఎందుకంటే దానిలో నిజం లేదు, అది అవాస్తవం కాబట్టి. కారణం, అది మనుష్యుల నిజజీవితాల్లో జరగడం లేదు కాబట్టి – అందువల్లనే అది, ఈ దేశం యొక్క ఆర్థిక సమస్యలను పరిష్కరించడానికి ఉపయోగపడటం లేదు. జీవితం యొక్క ఏకత్వం, 'జీవన ఐక్యత' అంటూ అనేక శతాబ్దాల నుండి మాట్లాడుతున్నాం. ఇప్పటికీ ఉన్న ఈ మురికి వాడలను మీరేవిధంగా సమర్థించు కోగలరు? ఇప్పటికీ పది కోట్ల హరిజనులు అంటరాని వాళ్ళుగా ఉండడాన్ని మీరే విధంగా సమర్థించుకోగలరు? దయచేసి నన్ను అడక్కండి, నా దగ్గర ఈ ప్రశ్నలకు జవాబులు లేవు. మన పూర్వీకులు మనకు

కిచ్చిన సంస్కృతి చాలా గొప్పదని చెప్పుకోడం అసంబద్ధం(absurd) అని మాత్రమే నేను చెపుతున్నాను.

**ప్ర: అంటే మనం దాన్ని క్రియారూపంలోకి పెట్టడం లేదు.**

**యుజి:** మన గొప్ప సంస్కృతులు, సంప్రదాయాలు మనకు కలిగించిన అశలు, ఆశయాలు నెరవేర్చుకొనే విధంగా మనం జీవించడం లేదు.

**ప్ర: దాని అర్థం మన సంస్కృతి మన విలువలు అవాస్తవం అని కాదు.**

**యుజి:** దానివల్ల మనకు ఊరట ఏం ఉంది? దాని వల్ల మనకు లాభం ఏముంది? అదెలా ఉందంటే... ఒక పక్క నాకు రాత్రి భోజనం ఎక్కడ నుండి వస్తుంది అని వెతుక్కుంటూ, మా తాతగారు చాలా ధనవంతుడు, కోటీశ్వరుడు అని చెప్పుకోవడంలాగా ఉంది. నా తాతగారు కోటీశ్వరుడు అని చెప్పుకొంటూ తిరగడం వల్ల నాకేమైనా లాభం ఉందా? అలాగే, ఇండియా లో గొప్ప గొప్ప ఋషులు, గొప్ప అధ్యాత్మిక గురువులు పుట్టేరు, కానీ ఇప్పుడు మాత్రం ఒక్కరు గూడ మన మధ్య లేరు – మా సంస్కృతి చాలా గొప్పది అని మాటి మాటికీ చెప్పుకోవడం, పొగడడం వల్ల మనకేమిటి ఉపయోగం? అందులో మంచి ఏముంది? అది మన దేశానికి ఉపయోగపడాలి. అందువల్ల దాన్ని నీవు ఎందుకు ప్రశ్నించవు? ఈ వ్యవహారం మొత్తంలో ఎక్కడో ఏదో లోపం ఉండి ఉండచ్చు. ఇలా నేనెందుకు అంటున్నానంటే, ఇండియా లో ఉన్న సంస్కృతి గొప్పది, అసాధారణమైనది అని అనుకోవడం నిజమైనప్పటికీ, ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మికత అని, ధర్మం అనీ, అదని, ఇదని మాట్లాడడం నిజమైనప్పటికీ, భారత దేశం కొద్దిమంది గొప్ప గురువులను మాత్రమే తయారు చేయ గలిగింది, అదీగాక ఈ గురువులు తమలాంటి మరొక గురువును తయారు చేయలేకపోయారు. మరొక రామానుజాచార్యులను నాకు చూపించండి. రామానుజాచార్యులు ఒక్కడే, శంకరాచార్యులు ఒక్కడే, మధ్వాచార్య ఒక్కడే, ఒకే ఒక బుద్ధుడు, అవునా, ఒకే ఒక మహావీరా. వీళ్ళందరినీ వేళ్ళ మీద లెక్కించ వచ్చు.

మనం ఈ గురువుల చెప్పిన విధంగా ఆలోచించడం లేదు, కారణం ఈ గురువులు పశ్చిమ దేశాల్లోని పూజారులు (priests) లాంటి వాళ్ళు. ఇండియాలో

ఈ స్వేచ్ఛ ఉంది, అందువల్ల ప్రతి ఒక్కరూ సొంతంగా ఒక చిన్న దుకాణం పెట్టుకొని తమ సరుకులు అమ్ముకొంటున్నారు. అందువల్లనే ఇండియాలో ఇంత ఎక్కువగా స్వామీజీలు ఉన్నారు, పాశ్చాత్య దేశాల్లోని పాస్టర్స్ ఉన్నట్టుగా. పాశ్చాత్య దేశాల్లోని సంఘటిత మతం వ్యక్తిగతంగా ఎదగే అవకాశాన్ని నాశనం చేసింది, చూడండి – వాళ్ళు ప్రతీ 'వ్యతిరేకతనూ నాశనం చేసేరు. ఇండియాలో ఉన్నట్టు కాకుండా, ప్రతీ వ్యక్తీ తనంతట తాను గురువుగా ఎదిగే అవకాశాన్ని వారు ధ్వంసం చేసేరు. కానీ అదృష్ట వశాత్తూ ఇండియాలో ఆ స్వేచ్ఛ ఉంది, అందువల్ల ఇండియా ఎక్కువ మంది గురువులను యిచ్చింది.

అయినప్పటికీ, ఇండియాలో ఇక్కడున్న, వాతావరణం అంతా మతపరమైనది అనే మాట నిజమైనప్పటికీ, ('మతపరం' అనే పదానికి అర్థం ఏదయినప్పటికీ; నా వరకు నీవు మాట్లాడుతున్న మతం అనేది ఒక మూఢ నమ్మకం తప్ప మరొకటి కాదు; ఉపవాసాలు, ప్రసాదాలు, పండగలు, విందుభోజనాలు, గుడికి వెళ్లడాలు అనేవి మతం కాదు) ఆ గురువులు మరో గురువును తయారు చెయ్య లేదు. భౌద్ధ మతం అనే చట్రంలో మరో బుద్ధుడు ఉండలేడు. అలాగే మరో రామానుజాచార్యులు ఆ సిద్ధాంతాల పరిధిలో ఉండడం సాధ్యం కాదు. వాళ్ళు విడిచి వెళ్ళిన, లేదా వాళ్ళ శిష్యులు తయారు చేసిన యీ చిన్న చిన్న గ్రూపులు ఎప్పుడూ పోట్లాడుకొంటూ ఉంటాయి -- నీకు అడ్డబొట్టు ఉండాలా లేక నిలువు బొట్టు ఉండాలా అని, ఏనుగుల ముఖం మీద "V" నామం ఉండాలా లేక "U" నామం ఉండాలా అని కోర్టుకెక్కి దెబ్బలాడుకొంటారు. మతం ఇపుడు యిలా క్షీణించి యింత హీనంగా తయారయ్యింది.

అందు చేత, "వాళ్ళ లాంటి గొప్ప మనిషిని భారత దేశం తయారు చేయ గలదా?" ఈ ప్రశ్నను ఈ దేశంలోని ప్రతీ ఒక్కరూ తనలో తాను వేసుకోవాలి – ఇది మొదటి విషయం. రెండో విషయం: మీరు మాట్లాడే ఈ మతం, సంక్రమించిన సాంప్రదాయ సంస్కృతులు తమ జీవితాల్లో మనుష్యులు ఆచరణలో పెడుతున్నారా? మూడో ప్రశ్న: ఈ దేశం లోని ఆర్థిక పరమైన, రాజకీయ పరమైన

సమస్యలను పరిష్కరించడానికి యివి దోహద పడతాయా? ఈ ప్రశ్నలన్నిటికీ నా జవాబు "నో, No".

**ప్ర : ఈ రెండు విషయాలు వేరు వేరు స్థాయిలకు సంబధించినవి కాదా?**

యుజి : కాదు. దురదృష్ట వశాత్తూ జీవితాన్ని భౌతికం, అధ్యాత్మికం అని రెండుగా మనం విభజించాం – అదే మనం సృష్టించిన అతి పెద్ద గొప్ప పలాయన మంత్రం. చూడండి, ఇవన్నీ ఒకటే. నీవు జీవితాన్ని భౌతికము, అధ్యాత్మికమూ అని రెండుగా విభజించ లేవు. ఇక్కడే మనం తప్పు చేశాం. అందువల్ల పశ్చిమ దేశాల్లో లాగ: ఆదివారం మాత్రమే వాళ్ళు భక్తులు – సండేస్ మాత్రమే వాళ్ళు గుడికి వెడతారు – మిగతా వారమంతా వాళ్ళు రాక్షసులు.

మీరేమనుకొంటున్నారు? ఆ పుస్తకాలన్నీ చదవడం వల్ల, వాటిని యాంత్రికంగా పారాయణం చేయడంవల్ల ఉపయోగమేమిటి? వాటిని ప్రజలు మళ్ళీ మళ్ళీ చదవుతూ ఉంటారు – కనీసం ఆ చెదిపేదాని అర్థం ఏమిటో గూడా వాళ్ళకి తెలియదు. నేను ప్రతిరోజు ఉదయం భక్తి గీతాలు వింటాను – దానిలో నాకు ఆసక్తి ఉండడం వల్ల కాదు; రేడియో అక్కడ ఉంది కాబట్టి దానిలో పాటలు పెడతాను. ఆ భక్తి పాటలు – అవేమిటి? వాళ్ళు పాడే పాటలకు అర్థం వాళ్ళకి తెలుసా? ఇవన్నీ సెక్స్ తో కూడినవి, ఇలా చెప్పడానికి నేను చాలా విచారిస్తున్నాను, నిజంగా అవి అశ్లీలదృశ్య వర్ణనలు – నిజంగా అవి సెక్స్ తో కూడినవి. ఈ స్తోత్రాలు రాసిన వాళ్ళు లైంగిక వాంఛలు తీరని వాళ్ళు అనే నిర్ణయానికి నేను వచ్చాను, వాళ్ళిలా వారిలో కలిగిన ఆ భావాలను స్త్రీ దేతలపై పెట్టి వ్యక్త పరిచేరు. ఆ స్తోత్రాలలో వాళ్ళు స్త్రీ యొక్క ఏ ఒక్క భాగాన్ని వదల్లేదు. నేను నిందించడం లేదు.

వీటన్నిటికీ మీరు అధ్యాత్మిక వివరణలు ఇవ్వవచ్చు, వీటిపై నాకు ఇంటరెస్ట్ లేదు – ఆ వివరణాలన్నీ అసలు సంగతిని దాచిపేయడానికే. ఇవన్నీ ఎందుకున్నాయి అని అడిగే వాళ్ళని మభ్యపెట్టి నోరు నొక్కడానికే ఈ వివరణాలన్నీ.

నేను ఇక్కడున్న వాళ్ళకి చెపుతూ ఉండే వాణ్ని: అక్కడ గుడిలో ఉన్న అంటోతుకి పూజ చేయడం, శివారాధన – యోని , లింగం బిజినెస్ – ఇదంతా, ఆది మానవుడి నుండి వచ్చింది, ఆ టైంలో సెక్స్ మాత్రమే అతనికి తెలిసిన గొప్ప

ఆనందం. కొంత కాలం తరువాత ఆత్మానందం, మోక్షం లాంటివి మనిషి అనుభవం లోకి వచ్చి, ప్రాముఖ్యత సంతరించుకొన్నాయ్. కానీ పూర్వం మొదట్లో లైంగిక సుఖానికే అత్యంత ప్రాముఖ్యత యివ్వబడింది. క్రైస్తవ శిలువ కూడా పురుష మర్మావయానికి ఒక సంకేతమే.

చర్చిలో ద్రాక్ష సారా, రొట్టె (వైన్ అండ్ బ్రెడ్) ఇస్తారు – దానికి నిజంగా అర్థం ఏమిటి? అది నాగరికత లేని కాలం నుండి కాపీ చేసేరు – వాళ్ళ నాయకుడు చనిపోయినపుడు, అతని గొప్ప లక్షణాలను వాళ్ళకి వస్తాయనే నమ్మకంతో అతని మాంసం తిని అతని రక్తం తాగే వారు. ఆ ఆచారం ఒక తరంనుండి తరవాత తరానికి అందింపబడుతూ వచ్చింది.

మనకు వాటి మూలాలు తెలియ కుండానే ఆ పిచ్చి పనులు మనం చేస్తూపోతున్నాం. నేను నిందించడం లేదు, కానీ నీవు మాట్లాడే వారసత్వ సంపద ఏమిటీ? – అది నిజంగా మన దేశ ఆర్థిక సమస్యలను పరిష్కరించ గలదా?

రాజకీయ సమస్యలు, ఆర్థిక సమస్యలు ఎప్పుడూ కలిసి ఉంటాయ్. వాటిని నీవు విడదీయ లేవు. అవన్నీ ఒకటే. అవి విడదీయరానివి. ఈ రెండిటినీ నీవు ఎందుకు వేరు చెయ్యాలని చూస్తున్నావ్. రాజకీయ విప్లవం లేకుండా దేశ పరిస్తితులను మార్చడం సాధ్యమా? ఎప్పటికీ సాధ్యంకాదు. రాజకీయ విప్లవం యీ దేశంలో అసలు సాధ్యం కాదు, ఎందువలనంటే, ఒక మార్పు తీసుకొని రావాలంటే ఆ మార్పు రాజ్యాంగ పరిధిలో ఉండాలని మీ రాజ్యాంగం చెప్తోంది. దానివల్ల అధికారంలో ఉన్న ప్రభుత్వం పై తిరుగుబాటు చేసే అవకాశం గూడా లేకుండాపోయింది. అందుచేత ఆది మార్చాలని ఎలా ఆశిస్తారు? ఎన్నికల్లో పార్లమెంట్ మెంబరుగా గెలవడానికి కోట్లకొలదీ డబ్బు కావాలి – ఒక్కసారి ఖర్చు పెట్టిన తర్వాత డబ్బు తిరిగి సంపాదించాలికదా. అందు చేత ప్రజలకు సేవచేయడం కోసం వాళ్ళక్కడ లేరు – సేవచేయడం కోసం కానే కాదు – అందువల్ల వాళ్ళను నిందించ వద్దు.

ఈ సామాజిక సమస్యలన్నిటినీ ప్రభుత్వమే పరిష్కరించాలి; స్వచ్ఛంద సంస్థలకు యీ ప్రపంచంలో ఎక్కడా తావు లేదు. ప్రభుత్వం తన బాధ్యతను నిర్వర్తించక పోతే, ప్రభుత్వాన్ని పడగొట్టండి. వాళ్ళ చేత చేయించండి. వాళ్ళు

చెయ్యక పోతే, దానికి బాధ్యులు మీరు. రాజకీయ నాయకులను ఎందుకు నిందింస్తారు? మిమ్మల్ని మీరు నిందించుకోండి.

**ప్ర : కానీ ఆ ఎన్నుకోబడిన ప్రభుత్వం ఒక వర్గానికి చెందినది.**

యుజి : అవును, ధనవంతులకు. – "నా అయిదేకరాల పొలం సురక్షితంగా ఉండాలి" అనుకొనే వర్గానికి. నా దగ్గరేమీ లేదు. నాకది వర్తించదు – భూమి పరిమితి చట్టం (లేండ్ సీలింగ్) -- నాకేం కాదు. కమ్యూనిస్ట్ ప్రభుత్వం వచ్చినా నేను పోగొట్టుకోడానికి నా దగ్గర ఏమీ లేదు.

కమ్యూనిస్టులు సమస్యలను పరిష్కరిస్తారని నేననడం లేదు. ఎవ్వరూ, ఏపార్టీ, ఇండియా ప్రాబ్లమ్స్ ను సాల్వ్ చెయ్య లేరు; దేముడు తప్ప, అసలు దేముడంటూ ఒకడుంటే. అదైనా ఆయన చెయ్యగలిగితేనే. ఆయన తానొక్కడూ, భారత దేశం యొక్క సమస్యలను పరిష్కరించలేకపోతున్నాడు (నవ్వులు..). ఇది భారతదేశ సమస్యలు పరిష్కరింప బడలేనివని చెప్పే నిరాశాజనమైన మాటలు కాదు, కానీ అదెలా సాధ్యమో నాకు తెలియడం లేదు. ఈ దేశం బాగుపడుతుందనే ఆశలు నాకేమీ కనిపించడం లేదు. ప్రపంచ వ్యవహారాలలో ఈ దేశం ముఖ్య పాత్ర వహించాలని నేను కోరుతున్నాను. అలా జరిగితే నేను చాలా సంతోషిస్తాను. కానీ, భగవంతుడు గూడ ఏమీ చేయ లేడు. అన్నిశక్తులు ఉన్న ఆ దేవుడు, ఒక వేళ అసలు ఉంటే – ఉన్నాడేమో నాకు తెలియదు – ఆయనే ఏమీ చెయ్యలేకపోతే- మీరూ నేనూ ఎలాచెయ్యగలం?

అందువల్ల నేననుకొంటున్నాను ఏదో ఒక రోజున ..... ఈ ప్రజలు ఎంత బలహీనులంటే, వీళ్ళు మొత్తమంతటిని పేల్చి పారెయ్య లేరు. అలా జరిగితే కొంచెం ఛాన్స్ ఉందేమో... ఈ దేశానికున్న ప్రోబ్లం ఏమంటే, ఇండియాకి స్వతంత్రం బంగారు పళ్ళెం లో పెట్టి ఇవ్వబడింది, కానీ.. ఇతర దేశాల వాళ్ళు ఎంతో కష్టపడ్డారు, స్వతంత్రం కోసం యుద్ధం చేసేరు, స్వాతంత్రం కోసం ప్రాణాలర్పించేరు – అదీ అసలు సమస్య. ఇంగ్లీషు వాళ్ళు ఇండియాను పరిపాలనచేయడం మన దురదృష్టం. ఫ్రెంచ్ వాళ్ళు గానీ మరొకరు గానీ ఇండియాను పాలించి ఉండిఉంటే మనదేశం మరోలా ఉండేది. చైనా దగ్గర గొప్ప మిలటరీ లీడర్స్ ఉన్నారు. మావో సే టుంగ్ లాంటి ఒక్క

నాయకుణ్ణి గూడ ఇండియా తయారు చేయ లేదు. మావో సే టుంగ్ లాంటి మనిషిని ఇండియా ఎలా ఉత్పత్తి చేయ గలదు?

కానీ, మరో విషయం, ఆ కమ్యూనిస్టు దేశాలను ఆదర్శంగా తీసుకోడంలో ప్రయోజనం లేదు; ఇండియా తనదైన స్వదేశీయ విప్లవాన్ని వచ్చేట్టు చేసుకోవాలి. మావో సే టుంగ్ గూడా ఇక్కడ పూర్తిగా ఫెయిల్ అవుతాడు; ఇండియా ఒక స్వదేశీయ వస్తువును(లీడర్ని) ఉత్పత్తి చేయాలి. (వస్తువు అనే పదం నేను వాడ వచ్చంటే) అటువంటిది జరగడానికి టైమ్ పరిపక్వత అయినట్లు కనిపించదడం లేదు. అటువంటిది ఇండియాలో జరగక పోతే, ఇంక అవకాశం లేదు, ఆశ లేదు, నో ఛాన్స్, నో హోప్.

చూడండి, కాలం తప్పక ఆ వ్యక్తులను పుట్టిస్తుంది: గాంధీ లాంటి మనిషి ఆ టైమ్ లో ఇండియాకు అవసరమయ్యాడు, ఆయన రెడీగా ఉన్నాడు; ఇంగ్లండ్ కి చర్చిల్ లాంటి వాడు అవసరం అయ్యాడు, అపుడు ఆయన వచ్చాడు; ఫ్రాన్స్ కి de Gaulle లాంటి మనిషి అవసరమొచ్చింది, ఆయన అక్కడ ఉన్నాడు, అలాగే జర్మనీకి హిట్లర్. నేను ఎవ్వరినీ సమర్థించడం లాంటిది చేయడం లేదు – హిట్లర్ ఒక్కడే బాధ్యుడు కాదు; దేశమంతా ఆ సమయంలో అతని వెనక ఉంది. నీవు హిట్లర్ ను నిందిస్తే, ప్రతీ జర్మన్ పౌరుడినీ నిందించాలి – హిట్లర్ కూడా కాలం యొక్క ప్రోడక్టే. యుద్ధం అయిన వెంటనే ఇంగ్లీష్ పౌరులు చర్చిల్ ని బయటికి తోసేశారు. అది ఒక గొప్ప దేశం – ఇంగ్లాండ్ నిజంగా ఒక గొప్ప దేశం – ఇంగ్లాండ్ సమస్యలు పరిష్కరించడానికి చర్చిల్ ఏవిధంగానూ ఉపయోగపడడని వాళ్ళకు తెలుసు. గాంధీ వల్లనే ఇండియాకు స్వాతంత్రం వచ్చిందంటే, నేను వ్యక్తిగతంగా నమ్మను. అప్పటి ప్రపంచ పరిస్తితులు ఎలా ఉన్నాయంటే, బ్రిటీష్ వాళ్ళకి ఇండియాతో చాలా స్నేహంగా ఉండి, స్నేహపూర్వకంగా ఇండియా నుండి బయటకు వెళ్లిపోవలసి వచ్చింది – చూడండి, అదే మన విషాదంతం(tragedy). అందుచేత ఇది ఇంకా ఎంతకాలం కొనసాగుతుందో నాకు తెలియదు.

ఇపుడు నేను ఏవిధంగానూ ఇండియా కొరకు పనిచేయడంలేదు, అందువలన ఇండియాని విమర్శించే హక్కు నాకు లేదు. మనం ఇక్కడ కూర్చున్నాం కాబట్టి,

కాలక్షేపం కొరకు రాజకీయాలు (armchair పోలిటిక్స్) చర్చించుకొంటున్నాం. కానీ నేనిక్కడ పనిచేయడం లేదు కాబట్టి, ఇండియాలోని ఎవరికీ వ్యతిరేకంగా ఏదీ మాట్లాడే హక్కు నాకు లేదు.

నాకేదైనా దారి కనబడితే, అది చూపించడానికి నేను అందరికంటే ముందుంటాను. నాకు ఏ దారీ కనబడ్డం లేదు. చచ్చిపోయిన ఈ మతాన్ని పునరుద్ధరించడంలో నాకు నమ్మకం లేదు. దేనిని మీరు బతికించాలనుకొంటున్నారు యీ దేశంలో? – మీరు నాకు చెప్పండి. బతికించడానికి ఇక్కడ ఏమీ లేదు. ఇంక ఎక్కువ దేవాలయాలు నిర్మిస్తారా? దేనికోసం? ఇక్కడ వేల కొలది గుళ్ళున్నాయ్. మరొక గుడిని చేర్చడం ఎందుకు? అది 'నా గొప్పతనం నేను ఫీలవడానికి' మాత్రమే గానీ ఈ దేశం యొక్క అధ్యాత్మిక శ్రేయస్సు కొరకు కాదు. మరో ఆశ్రమం? ఎవరి కోసం? ఇక్కడ చాలా ఆశ్రమాలు ఉన్నాయ్, చాలా స్వామీజీలు ఉన్నారు.

అదీ ఇపుడు కనబడుతున్న పరిస్తితి. మనమంతా ఏమీ చేయలేని స్తితిలో ఉన్నాం. మనకింకా ఆశ ఉంది, ఇండియాలో ఒక రోజు సరైన వాడు వస్తాడేమో అని – కానీ దానికి ఇక్కడ పరిస్తితులు పరిపక్వంగా లేవు. ఎప్పుడు ఇక్కడ పరిస్తితులు పరిపక్వత చెందుతాయో నాకు తెలియదు. ఇక్కడ బాధలు, కష్టాలు, చూస్తున్నారు కదా – ఈ దేశంలో మనుషుల దృక్పధం చాలా వింతగా ఉంటుంది. ఈ దేశంలో ఇప్పుడున్న అధ్వాన్న స్తితికి కారణం, భారత దేశం శతాబ్దాలుగా 'అంతా విధి కృతం', తలరాత అనే సిద్ధాంతాన్ని అనుసరించడమే.

**ప్ర : ఆ జ్ఞానుల యొక్క కృషి అంతా నిరుపయోగమని మీరనుకొంటున్నారా, ఉదాహరణకు సాయిబాబా వంటి వారు**?

**యుజి** : ఆయన ఏం చేస్తున్నాడు సార్? ఏంచేస్తున్నాడు? ఆయన చెప్పుకొన్నట్టుగా ఆయన అవతార పురుషుడే అయితే, మరి యింక ఆయనే ఏమీ చేయలేనప్పుడు, ఇంకెవరు చేయగలరు? – చెప్పండి. అందువల్ల ఎక్కడో ఏదో తప్పు ఉంది. సమ్ థింగ్ రాంగ్ సమ్ వేర్ !

**ప్ర : ఐతే అదంతా వ్యర్ధమేనా**?

**యుజి: అది** వ్యర్ధమేనని నాకనిపిస్తోంది. వాళ్ళు ఏమీ చేయ్య లేరు.

**ప్ర: వాళ్ళంతా అద్భుతాలు చేస్తున్నారు, శూన్యం నుండి వస్తువులు పుట్టిస్తున్నారు.**

**యుజి:** దాని వల్ల ఎవరికి ఉపయోగం? ఆ అద్భుతాల వల్ల లాభం ఏమిటి? – కానీ. అద్భుతాలకే అద్భుతమైన దాన్ని... అదే... మొత్తం జీవితంలో మొత్తం ఆలోచనా విధానంలో పరివర్తన తీసుకు రావడానికి అవసరమైన అద్భుతాన్ని ఆయన చేసి చూపించలేడు. అది ఆయన చేయగలడా?

**ప్ర: చాలా మంది, ప్రజ్ఞావంతులని చెప్పబడే వారితో సహా, ఆయనకు ఆకర్షితులయ్యారు.**

**యుజి** : ఈ తెలివైనవాళ్ళే మంద బుద్ధులు, నోరు లేని వాళ్ళు. (నవ్వులు..) – వీళ్లే తేలిగ్గా మోసగింపబడతారు. నేను సాయిబాబా గురించే ప్రత్యేకంగా మాట్లాడటంలేదు. సాయిబాబా గురించి నాకేమీ తెలియదు. అద్భుతాలపై నాకు ఆసక్తిలేదు, ఆయన నెంబర్ వన్ స్వామీజీ, ఎందుకంటే ఆయన ఎక్కువ మంది శ్రోతలను ఆకర్షిస్తాడు. దాన్ని బట్టి చూస్తే ఆయన బాబాలలో మొదటి వాడు(నవ్వులు), యింకా నెంబర్ 2, నెంబరు 3, నెంబరు 4 యిలా -- ఎవరు ఎంతమంది భక్తులను ఆకర్షిస్తున్నారు అనే దాన్ని బట్టి వీరి వర్గీకరణ ఉంటుంది.

అందుచేత, ఆయన ఏం చెయ్యగలడో నాకు తెలియదు. అది ( ప్రతీ మనిషి జీవితంలో, మొత్తం ఆలోచనా విధానంలో, పూర్తి పరివర్తన తీసుకొని రాగలిగేది) అన్ని అద్భుతాలలో అద్భుతం అవుతుంది -- స్విస్ వాచీలు, లేదా హెచ్.ఎం.టి వాచీలు సృష్టించడం మీద నాకు ఇంటరస్ట్ లేదు – కానీ, అది అన్ని అద్భుతాలలో అద్భుతం అవుతుంది -- ఆ అద్భుతాన్ని చేయగలిగే అవతార పురుషుడు యీ ప్రపంచంలో ఉన్నట్టయితే ఆయనకు సెల్యూట్ చేసేవారిలో, నమస్కరించే వారిలో, అందరికంటే నేను ముందుంటాను. ఆయన అది చేయలేడు. అది ఎవ్వరూ చెయ్య లేరు.

అవతార పురుషులు మనకు ఏ సహాయమూ చేయలేరు; ఒక వ్యక్తి మాత్రమే అది చేయ గలడు. ఇది ఒక వ్యక్తికి సంబంధించిన సమస్య కాబట్టి అవతార

పురుషుడు ఏ సహాయమూ చేయలేడు. ప్రతి వ్యక్తిలో ఒక రక్షకుడు ఉంటాడు, ఆ రక్షకుణ్ణి బయటకు తీసుకొని రాగలిగితే, అతడు వికసిస్తే, అప్పుడు కొంత ఆశ పెట్టుకోవచ్చు. కానీ ఎప్పుడు?

**ప్ర: ఉపనిషద్దార్శనికులు అందరూ తమకు తాముగా వికసించిన వారని నేను అనుకొంటున్నాను.**

**యుజి:** ఉపనిషత్తులలో చెప్పబడిన దానిలో ఏదైనా ఉండి ఉంటే, బుద్ధుడు పుట్టవలసిన అవసరం ఉండేది కాదు. బుద్ధుడు ఎందుకు వచ్చాడు? వాళ్ళు ఆ అవకాశం, అవసరం సృష్టించారు, బుద్ధుడు లాంటి మనిషి వచ్చే అవకాశం, అవసరం సృష్టించారు. – బుద్ధుడు ఉపనిషత్తుల తరవాత ఒచ్చాడు. చూడండి, వేదాల్లో ఉన్నదంతా క్షీణించి పోయింది, అప్పుడు ఉపనిషద్రష్టలు రంగం లోకి వచ్చారు. వాళ్ళు మొత్తమంతా చిందర వందర చేశారు, అందువల్ల బుద్ధుడు వచ్చాడు; తరవాత చాలా మంది వచ్చేరు. ఈ దేశంలో బౌద్ధ మతం కూడా క్షీణించి పోయింది, అందువల్ల శంకరాచార్యులు రావలసి వచ్చింది. ఆయన శిష్యులు, అనుయాయులు అదే పని చేసేరు. అందువల్ల రామానుజాచార్యులు రావలసి వచ్చింది – ఇదీ అంతే. తరవాత మద్వాచార్యులు. ఈ బోధకులందరికీ చోటు ఎక్కడుంది?

కనుక, బహుశా మరొక బోధకుని అవసరం మళ్ళీ ఉన్నట్టుంది – అది ఆ భగవంతునికే తెలియాలి. ఆయన ఈ చుట్టూ పక్కల ఎక్కడో ఉన్నాడేమో నాకు తెలియదు. మన మధ్య ఉన్న అవతార పురుషులు గూడా, ఈ దేశాన్ని, ప్రపంచాన్ని రక్షించడానికి అవసరమయిన ఈ అద్భుతాన్ని చేయ లేక పోతున్నారని అనిపిస్తోంది

**ప్ర: భగవంతుడు గురించి మీ అభిప్రాయాలు ఏమిటి? తరచుగా మీరంటారు, దేవుడే రక్షించాలి, అని.**

**యుజి** : అది ఒక మాట్లాడే విధానం (నవ్వులు). మనిషిని దేవుడి నుండి కాపాడాలి – అది అత్యవసరం ఎందుకంటే... దేముడంటే నా అర్థం, ఆ పదం మీరు వాడే అర్థంలో కాదు. గాడ్ అనే పదం ఏ అర్థం ఇస్తుందో ఆ ఆర్థం నుండీ, గాడ్ అనే భావనకు సంబంధించిన అన్నిటి నుండీ.... కర్మ, పునర్జన్మ, అవతారం, మరణానంతర జీవనం, మీరు చెప్పుకొనే "భారత దేశపు ఆ గొప్ప వారసత్వసంపద

(heritage)" నుండి కూడా మనిషిని రక్షించాలి. ఇండియా యొక్క హెరిటేజి నుండి ప్రజలనే కాదు, ఈ దేశాన్ని గూడా రక్షించాలి. (విప్లవం ద్వారా కాదు, కమ్యూనిస్ట్ దేశాల్లో వాళ్ళు చేసినట్టు కాదు – అది కాదు పద్ధతి. ఎందుకో నాకు తెలియదు; చూడండి, ఇది చాలా చిక్కు విషయం (very tricky subject). అలా జరగక పోతే ఒక వ్యక్తి గాని, దేశం గాని బాగు పడే అవకాశం లేదు.

మనిషి దైవవ్యతిరేకిగా లేదా నాస్తికుడుగా మారమని నా ఉద్దేశ్యం కాదు. నా దృష్టిలో ఆస్తికుడు, నాస్తికుడు, 'మనమేమీ తెలుసుకోలేమని చెప్పే మధ్యరకం మనిషి' (agnostic), అందరు ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నారు.

చూడండి, నాకు వ్యకిగతంగా అనిపించేదేమంటే మనిషి బయట ఏ శక్తి లేదని -- మనిషి బయట ఏ శక్తీ లేదు – అక్కడ బయట ఏ శక్తి ఉందో అది మనిషి లోనే ఉంది. అది అలా అయినప్పుడు -- అదే నాకు ఒక వాస్తవం అయినప్పుడు – ఆ శక్తి బయట ఉందని అనుకొని ఒక చిహ్నం సృష్టించి, దాన్ని పూజించడం లో అర్థం లేదు కదా? అందువల్లే నేను అంటాను- దేవుడు, దేవుణ్ణి గూర్చిన ప్రశ్న, ఈ రోజుల్లో మనిషికి అసంబద్ధం, (irrelevant) అని. నేను చెప్పదలచుకున్నది, మీకు సరిగ్గా తెలియ జేసనో లేదో నాకు తెలియదు.

మతగ్రంధాలను కాల్చి వేయమని, గుడులన్నిటినీ పడగొట్టమని చెప్పడం కాదు యిది. అది అర్థం లేని పని, చాలా పిచ్చి పని, ఎందుకంటే, ఆ మతగ్రంధాలు, దేవాలయాలు, దేని కొరకు ఉన్నాయో, అది మనిషిలోనే ఉంది, కాదా? -- అది బయట లేదు. ఆ తమిళ రామస్వామి నాయికర్ చేసినట్టు, లైబ్రరీ లోని పుస్తకాలు మంటలో వేసి ఆ మత గ్రంధాలన్నిటినీ చలిమంటలుగా వేసుకోవడమనేది చాలా పిల్లచేష్టలు; చూడండి, అది కాదు చేయవలసిన పద్ధతి.

అందుకే, దేముడు అసంబద్ధం (irrelevant) అని నేనంటాను -- ఎందుకంటే మనిషి ఎక్కువగా, తన కాళ్లపై తాను నిలబడాలి. ఈ రోజు ఇక్కడున్న మనిషిని తయారు చేసినది నీవు మాట్లాడుతున్న యీ వారసత్వ సంపదే, అదంతా అతనిలో ఉంది. ఉపనిషత్తులలో ఉన్నదీ కాదు, ...... (మరోటీ)కాదు. ఆ బోధకులందరు చేసిన ఆలోచనలు, పొందిన అనుభవాలు, అవన్నీ ఈ మనిషి లో ఒక భాగం. అది

తనంతట తాను ఒక కొత్త రూపంలో వ్యక్తం కావాలి. లేదంటే చెప్పుకోదగ్గ ...... ఉండదు.

నీవు దేవుని గురించి మాట్లాడితే దానిలో అసలు అర్థం లేదు; ప్రతి ఒక్కడూ, దేవుణ్ణి నమ్మినవాడుగా గాని లేదా నమ్మనివాడుగా గాని తయారవుతారు తర్వాత యిద్దరూ గూడా చివరికి యుద్ధభూమికి చేరుకొని పోట్లాడుకొంటారు. ముస్లిం మతాన్ని పునరుద్ధరించడంలో లాభం ఏముంది? వీళ్ళందరూ మాట్లాడే ఈ ఇస్లాం ఏమిటి? భారతీయులలో చిన్న చిన్న మతాలవారు, వాళ్ళలో వాళ్ళు దెబ్బలాడు కున్నట్టుగా, ఇస్లాం లోని ఉపశాఖలకు చెందినవారు గూడ వాళ్ళలో వాళ్ళు కొట్టుకొంటున్నారు, అందువల్లనే నేనంటాను, ఆధునిక యుగంలో మానవునికి దేముడు అసందర్భం, అసంబద్ధం అని. దేముడు అనేది దేనిని సూచిస్తుందో అది మనిషిలో అంతకు ముందే ఉంది – మనిషికి బయట ఏ శక్తీ లేదు -- అది తనను తాను తన రీతిలో వ్యక్తం చేసుకోవాలి.

**ప్ర: అయితే మీరు పరిణామక్రమ సిద్ధాంతాన్ని(theory of evolution) నమ్ముతారన్న మాట?**

**యుజి** : చూడండి, డార్విన్ సిద్ధాంతాన్నీ అసలు పరిగణలోకి తీసుకోనక్కర లేదు – ఎందుకంటే ఆయన ప్రాధమిక వాక్యం "నేర్చుకొన్న లక్షణాలు వంశపారంపర్యంగా కింద తరాలకు అందింపబడవు" అన్నది తప్పని నిర్ధారింపబడింది కాబట్టి. పరిణామక్రమంలో కొంతవరకు నిజం ఉండవచ్చు – ఉండవచ్చు -- కానీ పరిణామ క్రమం అనే దానికి, ఆ పదానికి మనం యిచ్చే ఖచ్చితమైన అర్థం ఏమిటి? చూడండి చిన్న విషయాలు గూడా సంక్లిష్టమయి పోతాయ్. ఈ రోజుల్లో మనిషి ఎంత క్లిష్టమైన వ్యక్తిగా తయారయాడంటే, అతడు వ్యతిరేక దిశలో నడవాల్సి వస్తోంది. వ్యతిరేక దిశ అంటే అంతర్వలనాన్ని(involution) ప్రబోధించమని నేను చెప్పడం లేదు. వెనక్కువెళ్లి మొదటి సంవత్సరం నుండి ప్రారంభించడం అనే ప్రశ్నే రాదు; మనిషి ఈ రోజు నిలుచున్న చోటునుండే మొదలు పెట్టాలి.

కానీ, నేనిప్పటికీ చెపుతాను, మనిషికి క్రియా స్వాతంత్రం లేదు (Man has no freedom of action)అని. నేను చెప్పే దానికర్థం హిందూదేశస్తులు పాటించిన,ఇప్పటికీ పాటిస్తున్న విధి విధాన సిద్ధాంతం(fatalism) కాదు: 'మనిషికి క్రియా స్వాతంత్రం లేదు' అని నేను అన్నది, తనను తాను మార్చుకోడానికి, గతం యొక్క భారం నుండి విముక్తి చెందడానికి సంబంధించినంత వరకు.

ఇప్పుడు అవసరమైనది ఏమిటంటే, ప్రతీ వ్యక్తీ, గతంయొక్క భారం నుండి, మీరు మాట్లాడుతున్న యీ గొప్ప హెరిటేజ్(వారసత్వసంపద) నుండి తప్పక విముక్తి చెందడం. వ్యక్తి తన గతం యొక్క భారం (బర్డెన్) నుండి బయట పడితే గాని, తన సమస్యలకు నూతన పరిష్కారాలు కనుక్కోలేడు; ఆ పాత ......(వాటినే) రిపీట్ చేస్తున్నాడు. కనుక అది ఆ వ్యక్తి ఇష్టం. అతడు తనయొక్క మొత్తం గతాన్నుండి, అంటే మీరు మాట్టాడుతున్న heritage నుండి పూర్తిగా తనను విముక్తి చేసుకోవాలి – అంటే, అనేక సంవత్సరాలనుండి పోగేసుకున్న జ్ఞానం నుండి తెగతెంపులు చేసుకోవాలి – అప్పుదు మాత్రమే, యీనాడు మనిషి ఎదుర్కొంటున్న సమస్యలకు తగిన పరిష్కారాలతో ముందుకు రావడం అతనికి సాధ్యమవుతుంది.

అది అతని చేతిలో లేదు; గతం యొక్క భారం నుండి తనను విముక్తి చేసుకోవడానికి అతడు చేయగలిగింది ఏమీలేదు. ఈ అర్థం లోనే "అతనికి క్రియా స్వతంత్రత లేదు" అని నేను చెపుతున్నా. నీకు ఇక్కడకు రావడానికి, రాకపోడానికి, చదువుకోడానికి, ఆర్థిక శాస్త్రం గాని, తత్వ శాస్త్రం గానీ లేదా మరొకటి గాని బోధించడానికి స్వేచ్ఛ ఉంది – ఇక్కడ నీకు పరిమితమయిన స్వతంత్రత ఉంది. కానీ, ప్రపంచంలో జరిగే సంఘటనలను నియంత్రించడానికి గానీ, లేదా మార్చడానికి గాని నీకు ఫ్రీడం లేదు – ఆ శక్తి ఎవరి దగ్గరా లేదు, ఏ దేశానికీ ఆ పవర్, ఆ శక్తి లేదు.

మీకు తెలుసు, ఇండియా నిస్సహాయ స్తితిలో ఉందని. అమెరికా – అమెరికా గూడా, అంత పెద్దది, బలమైనది, అందరి కంటే ధనికమైనది, అత్యంత శక్తివంత మైన దేశం -- ఇప్పటి వరకు; కానీ ఇప్పుడు కాదు. టైమ్ మేగజైన్ గూడా ఇటువంటి సమాసాలు ఇపుడింక ఉపయోగించడం లేదు, అమెరికాను వర్ణించ

డానికి. అమెరికా, రష్యా లాంటి దేశాలు గూడా ప్రపంచ సంఘటనల రూపు మార్చలేకపోయినా, కనీసం కంట్రోల్ చేయలేక పోయినప్పుడు, పేద దేశమైన ఇండియా ఏం చెయ్య గలదు? అసలు అవకాశమే లేదు.

అందువల్ల ఉన్న ఒక్క ఆశా వ్యక్తి(individual) మీదనే. కానీ, వ్యక్తిగతంగా కూడా మనిషి తాను ఏమీ చేయలేని స్తితిలో ఉన్నట్టు కనిపిస్తున్నాడు ఎందుకంటే, అతడుగూడా గతభారం నుండి, మొత్తం వారసత్వం నుండి, ఇండియాదే గాక మొత్తం ప్రపంచం యొక్క వారసత్వం నుండి విముక్తి కావలసి ఉంది. అందుచేత, ఈ భారం నుండి మనిషి తనను విముక్తి చేసుకోవడం సాధ్యమేనా? వ్యక్తిగతంగా అతనికి ఆ స్వతంత్రత అసలు ఉన్నట్టు కనబడదు. అతనికి క్రియా స్వాతంత్రత (freedom of action) లేదు – ఇదే ఈ సమస్యలోని కీలకాంశం. అయినప్పటికీ వ్యక్తిపై ఆశ ఉంది – ఒకవేళ, ఒక అదృష్టం వల్లనో, లేదా తెలియని ఓ కొత్త అవకాశం వల్లనో ....

**ప్ర: ఈ రెండు స్టేట్ మెంట్స్ పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్నాయ్. మీరంటున్నారు మనిషి బయట ఏ శక్తీ లేదని....**

**యుజి:** అది మనం అంటున్న దేవుణ్ణి, అసందర్భంగా(irrelevant గా) చేస్తుంది -- ఇక్కడ 'దేవుడు' అంటే మీరు వాడే అర్థంలో. మనిషికి బయట ఏ శక్తీ లేదు. గతం యొక్క భారం వల్ల ఆ శక్తి, తనకు తాను వ్యక్త పరచుకోలేక పోతోంది; ఒక్కసారి మనిషి గతాన్నుండి విముక్తి అయినప్పుడు అక్కడ ఉన్న ఆ అసాధారణ శక్తి ఏదో అది తనను వ్యక్తం చేసుకొంటుంది. ఆ అర్థంలో చూస్తే దాన్లో పరస్పర విరుద్ధత కనపడదు.

**ప్ర: అతడు జరిగే ఘటనలు నియంత్రించ గలడా?**

యుజి: కాదు, ఘటనలను నియంత్రించడం కాదు, అతడు ఘటనలను కంట్రోల్ చెయ్యడానికి, వాటిని మార్చడానికి ప్రయత్నించడం మానేస్తాడు.

**ప్ర : అతడు ఆ ప్రవాహం తో పాటుగా అలా పయనిస్తాడంతే, అవునా ?**

**యుజి:** అవును, అతడు ఘటనల (events) ప్రవాహంతోపాటు ముందుకు పోతూ ఉంటాడు. ఈ ప్రపంచాన్ని రక్షింపమని నిన్నూ నన్నూ ఎవరూ పిలవ లేదు.

అలా మనల్ని ఎవరు ఆదేశించారు, చెప్పండి? అనేక శతాబ్దాలనుండి ఈ ప్రపంచం నడుస్తోంది. ఎంతోమంది వచ్చేరు, వెళ్ళేరు. అది తన దారిలో తాను నడుస్తోంది.

అలా అతడు అన్ని సమస్యలనుండి విముక్తి పొందేడు – తన సమస్యల నుండే కాక బయట ప్రపంచం లోని సమస్యల నుండి గూడా. ఒకవేళ ఆ వ్యక్తి యొక్క ప్రభావం ఏదో విధంగా ఉంటే, ఆ ప్రభావం ఉంటుంది; ఒకవేళ అది లేక (పోతే)... అది కొలవబడలేనిది.

**ప్ర : అదే మనిషి యొక్క సంపూర్ణ ఉత్తమ స్తితి (ideal state), అవునా?**

**యుజి:** చూడండి, జంతువు ఒక పుష్పంగా మారుతుంది. అదే దాని ఉద్దేశ్యంలా కనబడుతోంది – ప్రకృతిలో ఒక ఉద్దేశ్యం (purpose) అనేది అసలుంటే, నాకు తెలియదు. ఎన్నో పువ్వులున్నాయ్ – వాటిని చూడండి! ప్రతి పువ్వు దాని తరహాలో అది అద్వితీయ మైనది (unique). (నేను గట్టిగా చెప్ప లేను కానీ) అటువంటి పుష్పాలను, అలాంటి మానవ పుష్పాలను తయారుచేయడమే ప్రకృతి యొక్క ఉద్దేశ్యం లా కనబడుతోంది.

అటువంటి పుష్పాలు మనకు ఓ గుప్పెడు మాత్రమే ఉన్నాయి, వీటిని మనం వేళ్ళతో లెక్క పెట్ట వచ్చు: రమణ మహర్షి ఒకరు ఈమధ్య కాలంలో, శ్రీ రామకృష్ణ, మరికొంత మంది. మేమే అని చెప్పుకొనే మన మధ్య ఇప్పుడు ఉన్నవారు కాదు, ఆ గురువులు కాదు – వీరి గురించి నేను మాట్లాడడం లేదు. ఇది చాలా అద్భుతం-- తిరువణ్ణామలైలో కూర్చున్న ఆ మనిషి – పశ్చిమ దేశాలపై ఆయన ప్రభావం, ఈ గురువులందరిది కలిపిన మొత్తం ప్రభావం కంటే చాలా ఎక్కువ – ఇది చాలా వింతైనది, మీకు అర్ధమయ్యిందా? మానవ చైతన్యం (human consciousness) మొత్తం అంతటి మీద ఆయన యొక్క గొప్ప ప్రభావం ఉంది – ఎక్కడో ఒక మూల జీవిస్తున్న ఆ మనిషి, అర్ధమయ్యిందా మీకు?

ఒకసారి పేరిస్ లో ఒక పారిశ్రామిక వేత్తను కలిసేను. ఆయనకు ఈ మతపర విషయాలపై అసలు అసక్తే లేనివాడు, ఇండియా పై ఇంకా తక్కువ; ఇండియా వ్యతిరేకి అని చెప్పచ్చు. (నవ్వులు...), అక్కడ ఆయన (రమణ మహర్షి) ఫోటో నేను చూశాను – "ఈ ఫోటోని ఇక్కడ ఎందుకు పెట్టుకున్నారు?" అడిగాను. ఆయన

అన్నాడు "ఆయన ముఖం నాకు నచ్చింది. ఈయన గురించి నాకేమీ తెలియదు. ఈయన పుస్తకాలు చదవడం లో గూడా నాకు ఆసక్తి లేదు. ఆ ఫోటో నాకు నచ్చింది, కాబట్టి అది అక్కడుంది. ఆయనను గురించి తెలుసుకోవాలని గూడా నాకు లేదు." అని.

అటువంటి వ్యక్తి బహుశా తనకు తాను సహాయం చేసుకోగలడు, అంతేగాక యీ ప్రపంచానికి కూడా సహాయపడ గలడు.('గలడు' అని నేను చెప్ప లేను.) బహుశా సహాయ పడచ్చు.

**ప్ర: మరొక ప్రశ్న... నాకు తెలియదు, నేను మోటుగా చెపుతున్నాను. నేను పరమ అజ్ఞానిని**

**యుజి :** మీరు ఎంత మోటుగా చెప్పినా పర్వ లేదు. మీరంత తెలియని వారు కాదు. మీరు చాలా తెలిపైన వారని అంటారు. రామానుజాచార్యులు గారి జీవిత చరిత్ర రాసిన వారు మోటుగా మాట్లాడ లేరు.

నేను అప్పుడప్పుడు, అద్వైతాన్ని (శంకరాచార్యుల ఏకత్వాన్ని) ప్రబోధించే, ఇక్కడున్న ఓ ప్రొఫెసర్ గార్ని ఆట పట్టించ డానికి అంటూ ఉండే వాణ్ని, "తత్వశాస్త్రానికి సంబంధించినంత వరకు రామానుజాచార్యులు చెప్పిన దానిని (విశిష్టాద్వైతం) దాటి మీరు ముందుకు వెళ్లలేరు. అది అక్కడ ఆగిపోతుంది. అద్వైతం ఎలాంటిదంటే దాని గురించి మనం మాట్లాడ లేము – ఎందుకంటే మన నిత్య కృత్య జీవితాల్లో, ఆచరణలో అది లేదు. అదే దాని పరిమితి." నేను రామానుజాచార్యుల పక్షమూ కాదు, శంకరాచార్యులకు వ్యతిరేకమూ కాదు. ఒక ఫిలాసఫీ స్టూడెంట్ గా చూస్తే నాకదే అనిపిస్తోంది. నేను తత్వ శాస్త్రం చదివేను – రామానుజాచార్యులను దాటి మీరు ముందుకు వెళ్ల లేరు. మీరు నాతో ఏకీభవించక పోవచ్చు. తత్వ శాస్త్రానికి సంబంధించినంత వరకు రామానుజాచార్యుల అభిప్రాయాలే హద్దు, అంతిమం. మిగతా దాని గురించి? మరేదైనా ఉండ వచ్చు.... ఒకవేళ 'అద్వైత' పరిస్థితే ఉంటే అది ఎటువంటిదంటే, దాని గురించి మాట్లాడడం సాధ్యం కాదు (అది మాటలకు అందనిది). దానిని మనం, యీ ప్రపంచం లోని దేనిని మార్చడానికీ వినియోగించ లేము.

**ప్ర: మనిషి యొక్క యీ అత్యుత్తమ స్తితి (ideal state) ....**

**యుజి:** మొట్టమొదటి సారి మనిషి మనిషిగా అవుతాడు – అది సాధ్యమయ్యేది ఎప్పుడంటే... మనం చెప్పుకొంటున్న గత వారసత్వ సాంప్రదాయాల భారం నుండి, మనిషి యొక్క వారసత్వ సంప్రదాయల మొత్తం నుండి (తూర్పు దేశాల వారిపైనా, పశ్చిమ దేశాల వారిపైనా; తూర్పు, పడమర అనేవి లేవు) అతడు తనను తాను విముక్తి చేసుకొన్నప్పుడే. అప్పుడే అతడు ఒక వ్యక్తి (ఒక వ్యక్తిత్వం గలవాడు) అవుతాడు. మొదటి సారిగా ఒక వ్యక్తి గా అవుతాడు – అటువంటి వ్యక్తి గురించే నేను మాట్లాడుతున్నది.

ఆ వ్యక్తి యొక్క ప్రభావం మానవ చైతన్యం (human consciousness) పై తప్పక ఉంటుంది ఎందుకంటే, మనిషి లోని ఈ చైతన్యం లో ఏదైనా జరిగినప్పుడు దాని ప్రభావం (మొత్తం అంతటి మీద) ఉంటుంది, అది చాలా చాలా అతి తక్కువ కావచ్చు. ఒక ఉపమానం ఇస్తాను ఒక : చెరువులో ఒక రాయి విసిరి నప్పుడు అది, వృత్తాకారపు అలల్ని చెరువంతటా వ్యాపింప చేస్తుంది. అదేవిధంగా దీని ప్రభావం గూడా చాలా చాలా మెల్లగా ఉంటుంది – దీన్ని దేనితోనూ కొలవ లేము.

అందువల్ల, బహుశా మనిషికి ఉన్నది అ ఒక్క ఆశ మాత్రమే – అటువంటి వ్యక్తి మొట్టమొదటి సారిగా ఒక మనిషి అవుతాడు – అలా కానప్పుడు అతడు పశువే. వారసత్వ సంస్కృతి (heritage) వల్ల ఒక పశువులా ఉండిపోయాడు, కారణం.. ప్రకృతి నడిచే విధానం దృష్టితో చూస్తే, చేత కాని వాళ్ళు గూడా ఇంకా భూమి మీద ఉండ గలిగే అవకాశం, సంస్కృతి కలుగజేసింది. లేకపోతే ప్రకృతి వీరిని చాలా కాలం క్రిందటే ఎప్పుడో తిరస్కరించి ఉండేది. ప్రకృతిలో ఇమడలేని వాళ్ళు గూడా బతకడానికి సాధ్యమయింది – ఇమడగలిగిన వాళ్ళు మాత్రమే బతకడానికి కాదు (not the survival of the fittest)(నవ్వులు..), ప్రపంచం లో ఫిట్ కాని వాళ్ళు కూడా బతకడానికే – మతమే దీనికి కారణం. అదే నా వాదన. మీరు ఒప్పుకోక పోవచ్చు. మీరు ఒప్పుకోరు.

**ప్ర : దీని అర్థం ఈ సంపూర్ణ ఆదర్శమానవుడు....**

**యుజి:** ఇతడు అన్నివిధాలా సంపూర్ణ మానవుడు కాదు, ఆదర్శ పురుషుడు కాదు – అతడు ఇతరులకు మోడల్, ఒక ఆదర్శవంతుడు కాలేడు.

**ప్ర: అతన్ని మీరెలా పిలుస్తారు?**

**యుజి:** అతడు ఒక వ్యక్తి (తనదైన వ్యక్తిత్వం ఉన్నఒక మనిషి.) అతడు జంతు లక్షణాల నుండి విముక్తి పొంది మనిషిగా అవుతాడు. చూడండి, జంతువులు అనుకరిస్తాయ్, జంతువులు తమ నాయకులను తయారు చేస్తాయ్, జంతు లక్షణాలు ఇప్పటికీ మానిషిలో అంటిపెట్టుకొని ఉన్నాయ్ – అందు వల్లనే అతడు ఒక నాయకుణ్ణి, ఒక టాప్-డాగ్ ని తయారు చేస్తాడు, ఆ తర్వాత దాన్ని ఫాలో అవుతాడు.

**ప్ర: అతడు సూపర్** మేన్ **లాంటివాడా, అన్నీ శక్తులూ ఉన్న వాడా ?**

**యుజి:** సర్, అతడు ఒక పుష్పం లాంటి వాడు. ఇది ఒక పుష్పం లాంటిది. అంతేకాదు, ప్రతీ పువ్వు ఒక ప్రత్యేకమైనది.

**ప్ర : అతని స్తితి, మీరు తరచుగా ప్రస్తావించే ఆ సహజ స్తితి, అవునా?**

యుజి: నీవు 'నీవు' గా మారుతావ్. 'మానవజాతి యొక్క మొత్తం వారసత్వ సంస్కృతుల మీద నీవు ఆధారపడి ఇలా జీవిస్తూ ఉండడం తప్పు' అనే అవగాహన నీలో ఉదయించినపుడు – ఆ అవగాహన ఒక షాక్ లా, పిడుగులా వచ్చి నిన్ను కొడుతుంది – నీలో ఇపుడున్న పరిస్తితికి కారణం ఈ సంస్కృతి మీద నీవు ఆధారపడి ఉండడమే, అది తూర్పు దేశాలది కావచ్చు, పశ్చిమ దేశాలది కావచ్చు. అది మొత్తమంతటికీ కూడా వర్తిస్తుంది, ఎందుకంటే వ్యక్తులు కలిస్తే దేశమవుతుంది, వేరు వేరు దేశాలు పోడిగిస్తే ప్రపంచం అవుతుంది. అలా నీవు గతం యొక్క భారం నుండి విముక్తి పొంది, మొదటసారిగా ఒక వ్యక్తి అవుతావు.

ఈ రెండు పుష్పాల మధ్యా అసలు ఏవిధమైన సంబంధం లేదు, అందువల్ల ప్రకృతి అప్పుడప్పుడు ఈ లోకం లోకి విసిరిన ఈ పువ్వులను ఒక దానితో మరొకటి పోల్చి చూడ్డంలో అర్ధం లేదు. ఇదంతా చిన్న చిన్న సమూహాలు గా తయారయి వారిలో-వారు దెబ్బలాడుకోడానికి దారి తీసినప్పటికీ, ఎవరి రీతిలో వారు

కొంతవరకు ప్రభావితం చేసేరు, అంతే. అదలా నడుస్తూనే ఉంటుంది. ఈ ప్రపంచాన్ని రక్షించమని ఎవరిని అడిగేరు?

**ప్ర : అది ఒక పువ్వుల గుంపు అని మీరు అనలేరా?**

**యుజి**: కానీ ప్రతీ పువ్వుకీ తనదైన పరిమళం ఉంటుంది. మనమెంతో గర్వంగా చెప్పుకొంటున్న మనిషి యొక్క యీ వారసత్వ సాంప్రదాయాలు లేకుండా ఉండి ఉంటే, ఇలాంటి పుష్పాలు ఎన్నో ఉండి ఉండేవి. ఆ సంప్రదాయాలు ప్రకృతి ఇచ్చిన..... నాశనం చేసేయి. ప్రకృతి యొక్క విధానాలకు, పరిణామ క్రమానికి నేను అర్థం చెప్పడం లేదు, లేదా అర్థంచేసుకొన్నానని చెప్పడం లేదు, అటువంటిదేమీ కాదు. పరిణామక్రమం (evolution) అనేదే అసలు లేక పోవచ్చు. ఈ సంస్కృతే లేకుంటే, ఈ ప్రకృతి మరెన్నో పుష్పాలను సృష్టించి ఉండేది – అందువల్ల మనిషి తనదైన రీతిలో తనను విముక్తి చేసుకోవడంలో మన సంస్కృతి పెద్ద అడ్డంకి అయి కూఛుంది. చూడండి, అతని కష్టాలకు బాధ్యత వహించవలసినది ఏదంటే, ఇదే, మన సంస్కృతి.

మరి, ఆ పుష్పం – మానవ జాతికి ఆ పుష్పం ఎంత విలువైనది? దానికున్న విలువ ఏమిటి? నీవు దాన్ని చూడ వచ్చు, అభినందించ వచ్చు, దానిపై కవిత్వం రాయచ్చు, దాని చిత్రాన్ని గీయచ్చు, లేదా నీవు దానిని నలిపి బయటకు విసిరి పారేయవచ్చు లేదా నీ ఆవుకి ఆహారంగా పెట్టచ్చు – కానీ అది ఇంకా అక్కడే ఉంది. దాని వల్ల ఈ సమాజనికి అసలు ఉపయోగం లేదు, కానీ అది ఉంది.

ఈ సంస్కృతే లేకుండా ఉండి ఉంటే ఈ ప్రపంచం ఇంకా ఎక్కువ పువ్వులను తయారు చేసి ఉండేది, వివిధ రకాల పుష్పాలను, నీవు గర్వంగా చెప్పుకొనే ఒక్క గులాబీలనే కాదు. మీరు ప్రతీ దాన్ని ఒక మోడల్ గా మార్చాలనుకొంటున్నారు. దేని కోసం? కానీ ప్రకృతి, సమయం వచ్చినప్పుడల్లా వివిధ రకాల పువ్వులను సృష్టించి ఉండేది, ప్రతీదీ దాని రీతిలో ప్రత్యేకమైనదిగా, ప్రతీదీ దాని తరహాలో అందమైనదిగా. ఆ అవకాశాన్ని సంస్కృతి నాశనం చేసి, మనిషి మెడకు ఉరి తాడులా చుట్టు కొని, మొత్తం గతం యొక్క బరువు నుండి, తనంతట తాను విముక్తి చేసుకోనీయకుండా అతనిని అడ్డుకుంటోంది.

**ప్ర: ఆ సహజ స్తితి, అసలైన మనిషి ఒకటేనా?**

**యుజి: అవును, అతడు మరొకరిలా ఇకపై ఉండడు; అతడు అతనిలాగే ఉంటాడు. ఏమంటారు?**

**ప్ర : సర్, మీ నలభై తొమ్మిదవ ఏట మీరు దీన్ని పొందేరు కదూ?**

**యుజి:** అకస్మాత్తుగా అత్యంత శక్తితో నాకు తగిలిన యీ షాక్, యీ పిడుగు ప్రతీ దాన్ని తునా తునకలు చేసింది, నా శరీరం లోని ప్రతి కణాన్ని, ప్రతీ గ్రంధిని బద్దలు కొట్టింది --దేహం లోని మొత్తం రసాయినకతను మార్చిపడేసినట్టు అనిపించింది. దీనిని ధృవీకరించడానికి వైజ్ఞానిక ఆధారం గానీ, వైద్యుడు లేడు, కానీ ఎవరి యొక్క క్యూరియాసిటీ(ఉత్కంట)ని తీర్చడంలో నాకు ఆసక్తి లేదు, ఎందుకంటే, ఇది నేను ఎవరికి అమ్మడం లేదు, శిష్యులను కూడతీసుకొని యీ మార్పును ఎలా తీసుకొని రావాలో బోధించడం లేదు. ఇది మీ ఇచ్ఛాపూర్వకంగా గాని, స్వశక్తితో గాని మీరు తీసుకొని రాగలిగేది కాదు. ఇది అలా దానంతట అదే జరిగి పోతుంది. ఇది అకారణమనది అని నేనంటాను. దాని ఉద్దేశ్యం ఏమిటో నిజంగా నాకు తెలియదు. కానీ ఏదో ఉంది.

**ప్ర : ఒక పరివర్తన వచ్చిందా?**

**యుజి** : శరీరం యొక్క రసాయినిక తత్వం అంతా పూర్తిగా మారిపోతుంది, అందువల్ల ఈ శరీరం తనదైన సహజరీతిలో పనిచేయడం మొదలుపెడుతుంది. సంస్కృతి సంప్రదాయాల చేత విషపూరితం(యీ పదం నేను కావాలనే వాడుతున్నాను) చేయబడ్డ, కలుషితం చేయబడ్డ ప్రతీదీ దేహం నుండి బయటకు నెట్టివేయబడింది. అది నీ దేహం (సిస్టమ్) నుండి బయటకు నెట్టివేయబడింది, తరవాత అప్పుడు ఆ చైతన్యం (consciousness), లేదా జీవం (లేదా నువ్వే పేరు పెట్టి పిలిచినా) తనను తాను వ్యక్త పరుస్తూ చాలా సహజమైన రీతిలో పని చేస్తుంది. ఆ మొత్తమంతా నీ దేహం నుండి బయటికి నెట్టి వేయ బడాలి; అలా కాకుంటే, నీకు దేవుని మీద నమ్మకం లేక పోతే, నాస్తికుడివి అవుతావ్, బోధిస్తావ్, ఉపదేశాలిస్తావ్, మతాంకీకరణ చేసి ఇతరులను నాస్తికులుగా మార్చడానికి ప్రయత్నిస్తావ్. కానీ ఈ

వ్యక్తి ఆస్తికుడూ కాదు, నాస్తికుడూ కాదు, 'దేవుని గురించి మనమేమీ తెలుసుకోలేము' అనే అజ్ఞేయవాదీ (agnostic) కాదు. అతడు అతనిలా ఉంటాడు.

నిన్ను మరోలా తయారు చెయ్యడానికి ప్రయత్నించే, ఈ హెరిటేజ్, (వారసత్వ సంప్రదాయ సంపద) సృష్టించిన ఆ గమనం ఆగిపోతుంది, ఆ విధంగా, ఏ అడ్డు లేకుండా, ఏ అవకరం లేకుండా, మనిషి యొక్క, మానవ జాతి మొత్తం గతం యొక్క భారాన్ని వదిలించుకొని, నీవు ఏదైతే అయి ఉన్నావో అది, తనదైన రీతిలో వ్యక్తం అవడం మొదలవుతుంది, అంతే. అందుచేత, అటువంటి వ్యక్తి వల్ల సమాజనికి ఏ ఉపయోగమూ లేదు; అదీగాక, అతడు సంఘానికి ఒక ముప్పు అవుతాడు.

**ప్ర : ఉపయోగపడడం అనే ప్రశ్నే రాదా?**

**యుజి:** ఎప్పుడూ రానే రాదు. తాను ఏదో ఒక శక్తి చేత ఈ ప్రపంచాన్ని సంస్కరించడానికి తీసుకొని రాబడ్డాడని అతడు అనుకోడు. తానొక జగద్రక్షకుడనని లేదా విముక్తి పొందిన వాడినని లేదా జ్ఞానోదయం పొందిన వాడినని అతడు అనుకోడు.

**ప్ర: అవును, తానొక మానవ జాతి రక్షకుడనని అతడు చెప్పుకున్న క్షణం అతడు ఒక సంప్రదాయాన్ని స్థాపన చేసినట్టే.**

**యుజి**: ఆయన శిష్యులు, భక్తులు, ఫాలోయర్స్ అతణ్ని సాంప్రదాయంలో బిగించిన మరు క్షణం.. ఆ సంప్రదాయాన్నుండి విడిపోవాల్సిన అవసరం ఎవరో మరొకరికి వస్తుంది – అదే నేను చెప్పదలచుకొన్నది.

**ప్ర: స్వామీ వివేకానంద 'మీరు చూసారా' అని రామకృష్ణను అడిగినపుడు "అవును, నేను చూసా" ఆయన చెప్పేడు. దాని అర్థం ఏమిటి?**

**యుజి:** ఆయన్నే మీరు అడగాలి. దానికి నేను జవాబు ఇవ్వ లేను. ఆయన ఏ అర్థంలో ఆ మాట అన్నాడో నాకు తెలియదు. కానీ నేను మీకు వివరించి చెప్పేను....

**ప్ర: బహుశా ప్రతీ అంతర్గత భావం (concept) ఒక పద్ధతికి సంబంధించినదై ఉంటుంది. ఇప్పుడు ఆయన దాని బయట ఉన్నాడు, అవన్నీ ఇపుడు సంబంధం లేనివి అందువల్ల జవాబు ఇవ్వాల్సిన అవసరం తనకి లేదనుకొంటాడు.**

యుజి : రామకృష్ణ పరమ హంస ఏం చెప్పేడు, శంకరాచార్యులు ఏమి చెప్పేడు లేదా బుద్ధుడు ఏం చెప్పేడు అన్నది నాకనవసరం (I don't care).

**ప్ర: అవన్నీ మీరు బయటకు విసిరేశారు?**

**యుజి:** ఆ పదాన్ని వాడకండి. అదంతా నా సిస్టమ్ నుండి(దేహం నుండి) బయటికి పోయింది; నేను బయటకు విసిరి వేయడం వగైరా కాదు. అది నా శరీరమంతటి నుండి పోయిందంతే. అందువల్ల నేను చెప్పినది నిలబడ వచ్చు లేదా దానంతట అదే పడి పోవచ్చు. దీనికి ఏ రకమైన ప్రామాణికం యొక్క సమర్ధనా అవసరంలేదు. అందుకే అలాంటి మనిషి ఈ సమాజనికి ముప్పు. అతడు సంప్రదాయానికి కూడా పెద్ద ముప్పు, ఎందుకంటే అతడు వారసత్వసంప్రదాయాల పునాదులను తొలచివేసే ప్రమాదం ఉంది కాబట్టి.

**ప్ర: మీరు ఏడు కొండలు ఏడు రోజులు గురించి మాట్లాడేరు...**

**యుజి** : ఆ ఏడుకి లేదా ఆ ఏడు రోజులలో నాకు జరిగిన వాటికీ ఏమీ ప్రాధాన్యత లేదు – ప్రాముఖ్యత లేనేలేదు. అవన్నీ తాంత్రిక విషయాలు (occult stuff). తాంత్రికంలో అసలు ఏమీ ఉండదు. వాటన్నిటికీ ఏ ప్రాధాన్యత అసలు లేదు.

నేను నా మిత్రులకు తరచుగా చెప్పినట్టుగా, ప్రజలను విముక్తులను చేయడానికి నేను ఇండియా రావడం లేదు, ఉపన్యాసాలు యివ్వడానికి రావడం లేదు, నేను రావడం ఒక వ్యక్తిగత విషయం – యూరప్ లోని విపరీతమైన శీతకాలపు చలిని తప్పించుకోడానికి – అంతేకాక ఇక్కడ తక్కువ ఖర్చవుతుంది. నేను ప్రజలతో మాట్లాడడం యాదృచ్ఛికం, అనుకోకుండా జరిగేది – నేను చెప్పేది నిజం. లేకపోతే నేను వేదిక ఎక్కే వాణ్ని. వేదికలెక్కడం దేనికి? నాకు ఇంటరెస్టు లేదు. ఇవ్వడానికి నా వద్ద ఏ సందేశమూ లేదు.

**ప్ర: ప్రతి ఒక్కరూ యీ సహజ స్తితిని పొంద గలరు, కానీ అది అతని చేతుల్లో లేదు, అవునా?**

**యుజి:** అది అతని చేతుల్లో లేదు; అది ఎవరి చేతుల్లోనూ లేదు. కానీ అది నీలో ఉందనే విషయం ఒక వెయ్యి శాతం రూఢి అయినది వాస్తవం, ఎందుకంటే అది నా ఒక్కడి యొక్క ప్రత్యేక హక్కు కాదు, లేదా దాని కొరకు నేను ప్రత్యేకంగా ఎన్నుకోబడిన వాణ్ని కాదు. మనిషి బయట ఏ శక్తి లేదు- అనే నా మాటలకు అర్ధం అదే. నీలో కూడా అదే శక్తి, అదే జీవం పనిచేస్తోంది. మీరు మాట్లాడే ఆ సంస్కృతే దాన్ని కిందకు నొక్కుతోంది. అక్కడ ఏదో తనను వ్యక్తం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది, కాని కల్చర్ (సంస్కృతి) దాన్ని కిందకు నొక్కి వేస్తోంది. ఆ కల్చర్ ని, ఆ సంస్కృతిని ఒక్కసారి బయటకు నెట్టి వేసినపుడు, అది తన రీతిలో తనను వ్యక్తం చేసుకొంటుంది.

**ప్ర: ఈ పరివర్తన చెందిన వారిలో, అందరికీ ఉండే కొన్ని** (కామన్) **లక్షణాలు ఉన్నాయా?**

**యుజి:** ఆ ప్రశ్న ఇక్కడ రాదు. నన్ను నేను ఒక సాధువుతో పోల్చుకుంటే అది నాకు ఒక విషాదాంతమే అవుతుంది. మేము ఒక సంఘ సమాజానికి గాని ఒక సోదర సముదాయానికి లేదా మరో గ్రూపుకో చెందినవారం కాము. ఒక గులాబీ పువ్వుకి, ఒక డాఫోడిల్ కి, ఒక గడ్డి పూవుకి పోలిక ఏముంటుంది? దేని ప్రత్యేకత దానికుంది, ప్రతి పువ్వుకీ దాని అందం దానికుంది. మీకు నచ్చినా నచ్చక పోయినా – అది వేరే విషయం.

**ప్ర: ఒక విశిష్టత(uniqueness) యీ పరివర్తనకు సూచిక (index) అవుతుందా?**

**యుజి:** లేదు, ఆ వ్యక్తి తానొక ప్రత్యేకమైన వ్యక్తినని అనుకోడు.

**ప్ర: అతనికి కాదు, యితరులకు అనిపిస్తుందా?**

యుజి : బహుశా. చూడండి, దాని వ్యక్తీకరణలో, ఆ వ్యక్తమయ్యే దానిలో తప్పక ప్రత్యేకత ఉండి తీరాలి. ఇటువంటిది నీకు జరిగినప్పుడు, నీవు నీ యొక్క

ప్రత్యేకతను  చాలా భిన్నమైన రీతిలో  వ్యక్తం చేయడం మొదలు పెడతావ్. అది తనను ఎలా వ్యక్తం చేస్తుంది అనేది మీకూ తెలియదు నాకూ తెలియదు.

**ప్ర: వైజ్ఞానిక శాస్త్రజ్ఞుల గురించి మీ అభిప్రాయలేమిటి? మీరేదో చెప్పేరు: ఐన్ స్టైన్ (Einstein) మానవ జాతికి గొప్ప అన్యాయం చేసేడని.**

**యుజి:** ఆయన అతిపెద్ద హాని చేసాడనిపించడం లేదా మీకు – ఆ ఆటమ్ బాంబ్?

**ప్ర: పదార్థం, శక్తి ఈ రెండిటినీ పరస్పరంగా మార్చడం సాధ్యం, అని మాత్రమే చెప్పేడు.**

**యుజి:** అది ఆటమ్ బాంబ్ కి దారి తీసింది. అమెరికా ఆటమ్ బాంబ్ ను తయారుచెయ్యాలా లేదా అనే ప్రశ్న ఉత్పన్నమయినపుడు, ఆయన చెప్పేడు “ఎస్, ఎలాగైనా సరే చేయండి. మీరు చేయకపోతే జర్మనీ చేస్తుంది.” ఐన్ స్టెయిన్ కాక పోతే మరొకరు ఆ పని చేసి ఉండే వారు.

**ప్ర: ఆయనకు వేరే మార్గం లేదు; రెండు చెడ్డ వాటిల్లో ఒకటి ఆయన ఎంచుకోవాల్సిందే.**

**యుజి:** కాదు. రెండు చెడ్డ వాటిల్లో కొంచెం తక్కువ చెడ్డ దాన్ని ఎంచుకోడం మొదలు పెడితే నీవు చెడ్డ దానితోనే మిగిలి పోతావ్. ఇప్పుడు మనకదే జరిగింది.

నేను ఆయన్ని శత్రువు నెంబర్.1 గా భావించడం లేదు. నేను సిగ్మండ్ ఫ్రాయిడ్ ని ఇరవయ్యో శతాబ్దపు అతి పెద్ద మోసంగా భావిస్తాను, ఎందుకంటే, ఆయన అసలు ఏ ఆధారం లేని సిద్ధాంతం గురించి మాట్లాడేడు. అతడు ఇరవయ్యో శతాబ్దపు నమ్మకాన్ని సొమ్ము చేసుకొనే జిత్తులమారి. కానీ ఇది ఇప్పటి మనిషి యొక్క పరిభాష అయిపోయింది. ప్రతీ ఒక్కరూ దానినే ఉపయోగిస్తున్నారు. ఈ అర్థం లోనే అన్నాను గానీ  వీళ్ళందరూ మానవజాతి   శత్రువులని గాని, మరొకటి గాని నేను అనుకోవడం లేదు.

**ప్ర : (మీలో జరిగిన) యీ మార్పును  మీరు ‘ఒక పెద్ద విపత్తు calamity)’ (అని అంటారా?**

**యుజి:** చూడండి, అందరూ చెప్పుకొనే ఆ జ్ఞానోదయం, ఆత్మ సాక్షాత్కారం (self-realization, తనను తాను తెలుసుకోవడం), భగవంతుణ్ణి తెలుసుకోవడం – వీటికి మీరేం పదాలు ఉపయోగించినా, (ఈ పదాలు ఉపయోగించడం నాకు ఇష్టం లేదు), యిది ఒక పారవశ్యం లాంటిదని, నీవు శాశ్వతానందాన్ని పొందుతావని, ఆనంద స్థితిలో ఎప్పుడూ ఉంటావనీ – వారి గురించి ఈ రకమైన మానసిక చిత్రాలు, ఊహలు వాళ్ళకున్నాయ్. కానీ ఈ రకమైనది ఒక వ్యక్తికి సంభవించినపుడు ఆ వ్యక్తికి అర్థమవుతుంది, నిజానికి అటువంటి ఊహలకు ఆధారం ఏమి లేదని. అందుచేత శాశ్వత సుఖం, శాశ్వత ఆనందానుభూతి, శాశ్వత అది, శాశ్వత యిది, అని ఊహించుకొనే మనిషి దృష్టిలో ఇది ఒక విపత్తు, ఎందుకంటే అతడు ఏదో ఎదురు చూస్తున్నాడు కానీ అక్కడ జరిగింది మాత్రం ఊహించిన దానికి ఏ విధమైన సంబంధం లేనిది. నీ ఊహాచిత్రానికీ, వాస్తవంగా అక్కడున్న పరిస్థితికీ అసలు సంబంధమే లేదు. అందువల్ల, అది శాశ్వతమైనది అని ఊహిచుకొనేవాని దృష్టిలో ఇది ఒక విపత్తు, కెలామిటీ – ఈ అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాను. అందువల్లనే నేను ప్రజలకి చాలా సార్లు చెపుతాను “నేను ఒక క్షణకాలం ఇదంతా ఏమిటో మీకు చూపించ గలిగితే, మీరు, పడవ నడిపే పది అడుగుల కర్రతో కూడా దీనిని ముట్టుకోడానికి యిష్టపడరు. దీనికి దూరంగా పారిపోతారు, కారణం మీరు కోరుకున్నది ఇది కాదు. చూడండి, మీరు కోరుకొనేది అసలు లేనే లేదు.

తరవాత ప్రశ్న ఏమిటంటే: యీ ఋషులందరూ, దీన్ని శాశ్వతానందం, మరణం లేనిది, అది యిది, ఆ మరొకటి(the other) అని ఎందుకంటారు? దీనిలో నాకు అసలు ఏమాత్రం యింట్రస్టు లేదు. కానీ, దాన్ని గూర్చిన నీకున్న ఊహా చిత్రానికీ... వాస్తవంగా ఉన్న నేను మాట్లాడే యీ సహజ స్థితికి, ఏ మాత్రమూ సంబంధం లేదు. అందుచేత మరొకరికి జ్ఞానోదయం అయిందా లేదా అన్న ప్రశ్న నాకు ఆసక్తి కలిగించదు, ఎందుకంటే జ్ఞానోదయం అనేది లేనే లేదు.

**ప్ర: మీరు చెప్పిన దానిని బట్టి చూస్తే ఈ ప్రశ్న బహుశా చాలా వరకు అసందర్భం. మీ వద్ద ఏదైనా సందేశం ఉందా?**

**యుజి:** ఎవరికి?

**ప్ర : ఎవరికైనా. ప్రతీ ఒక్కరికీ.**

**యుజి:** నా వద్ద ఏ సందేశమూ లేదు, సర్ - మనవాళికి ఇవ్వడానికి ఏ సందేశమూ లేదు – నో మెస్సేజ్. ప్రజలు నన్ను అడుగుతున్నారు "చెప్పడానికి ఏమీ లేనప్పుడు ఎవరిని ఉద్ధరించడానికి ఎప్పుడూ మాట్లాడుతూనే ఉంటావ్?" అని. నేనెవ్వరికీ హెల్ప్ చేయలేనని నేనంటే, "మరి నువ్వెందుకు ఇక్కడున్నావ్?" అని అంటారు (నేను మీ గురించి చెప్పడం లేదు). ఈ పువ్వుల వ్యవహారాన్ని నేను ఉపయోగించ దలచుకోలేదు. ఆ పుష్పం యొక్క పరిమళం అటువంటిది. అటువంటి వ్యక్తి అన్నిటినీ విడిచిపెట్టి గుహలోకి పోయి కూర్చోలేడు లేదా ఎక్కడో దాక్కోలేడు. అతడు ఈ ప్రపంచంలో ప్రజల మధ్య బతకాల్సిందే; అతనికి వెళ్లడానికి చోటు లేదు. ఆ యొక్క పువ్వు పరిమళం అటువంటిది – అదేమిటో మీకు తెలియదు.

ఆ పుష్పం యొక్క పరిమళం మీకు తెలియదు – మీకు తెలుసుకునే మార్గం లేదు – అందువల్లే దాన్ని పోల్చి చూస్తున్నారు: "ఇది ఆ పువ్వు లాగే వాసనేస్తోంది, ఆ పువ్వు లాగే కనబడుతోంది" అని. మీరు చేస్తున్నదంతా యిదే. మీరు అలా చెయ్యడం మానేస్తే – ఇంతకుముందెన్నడూ తెలియని ఆ పువ్వేమిటో, దాని సువాసన ఏమిటో అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం మానేస్తే – ఇక్కడ మరొక పువ్వు ఉంది; ఆ పువ్వు యొక్క నకలు కాదు, మీరు ప్రశంసించే గులాబీ కాదు, డాఫోడిల్ కాదు. "డాఫోడీల్స్ మీద ఒక పాట" అనే కవిత ఒకాయన రాసేడు, లేదా గులాబీ మీద... గులాబీ కి అంత ప్రాముఖ్యత ఎందుకొచ్చింది? కారణమేమంటే అందరూ అవి అంటే ఇష్ట పడతారు. అక్కడున్న ఆ గడ్డి పువ్వు, గులాబీ కంటే అందంగా ఉంటుంది. మీరు దీన్ని పోల్చుకోవడానికి అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం మానేసినప్పుడు, అది ఏ రకమైన పువ్వు, దాని సువాసన ఎలా ఉంటుంది అనే ఊహ కూడా లేనపుడు, మన చుట్టూ ఉన్న అన్నీ పువ్వుల తోనూ ఏ విధమైన సంబంధం లేని ఒక కొత్త పువ్వు మీకు అక్కడ కనిపిస్తుంది.

**ప్ర: థేంక్ యు, సర్. నేనిపుడు ఒక మారిన మనిషిని, ఒక గంట క్రితం కంటే.**

**యుజి:** థేంక్ యు.

---- మూడవ భాగం సమాప్తం ----

# ఆశ్చర్యం అవగాహనల మధ్య

*(1972-1980 మధ్య స్విట్జర్ లేన్డ్, ఇండియా లో సంభాషణల నుండి సంగ్రహించ బడినది)*

*****

ప్రపంచానికి ఇవ్వడానికి నా దగ్గర ఏ సందేశమూ లేదు. నాకు ఏం జరిగినా అది ఎలాంటిదంటే, దాన్ని నీవు యీ ప్రపంచంతో పంచుకోలేవు. ఆ కారణం వల్లనే నేను వేదిక ఎక్కను, ఏ ఉపన్యాసాలు ఇవ్వను – నేను ఉపన్యాసాలు ఇవ్వ లేనని కాదు; ప్రపంచమంతటా నేను ఉపన్యాసాలు యిచ్చేను – చెప్పడానికి నా దగ్గర ఏమీ లేదు. వాళ్ళు తయారుచేసి తీసుకొచ్చి చుట్టూ చేరి, ప్రశ్నలు అడిగే ప్రజల మధ్య ఒక చోట కూర్చోవడం నాకు ఇష్టం ఉండదు. నేనెప్పుడు నా అంతట నేను సంభాషణలు మొదలు పెట్టను; ప్రజలొచ్చి నా చుట్టూ కూచుంటారు – వాళ్ళకి నచ్చినట్టు వాళ్లు చేసుకోవచ్చు. ఎవరైనా సడన్ గా ఏద్దైనా ప్రశ్న అడిగితే, ఆ ప్రశ్నకు జవాబు లేదనే దాన్ని నొక్కి చెపుతూ, ఎత్తిచూపిస్తూ జవాబివ్వడానికి ప్రయత్నిస్తాను. నేను, ఆ ప్రశ్నలోని పదాలు వేరే విధంగా అమర్చి అదే ప్రశ్నను వెనక్కు వారికే విసరడం మాత్రమే చేస్తాను. నేనేమీ ఆటాడటంలేదు, ఎందువలనంటే నా దృక్పథమే సరైనది అని ఒప్పించి ఒకరిని గెలవాలనే ఆసక్తి నాకు లేదు. ఇది అభిప్రాయాలు యివ్వడం గురించి కాదు – నాకూ అభిప్రాయాలు ఉన్నాయనుకోండి, ప్రతీ విషయం మీదా, దీనత్వం నుండి దైవత్వం వరకు, కానీ అవి విలువ లేనివి, అందరివీ లాగే.

---------------

నేను చెప్పే దాంట్లో పదానికి-పదం అర్థాన్ని మీరు తీసుకోకూడదు. అంతటినీ శబ్దార్థ ప్రకారం తీసుకొని ప్రజలు చాలా ఇబ్బందులు కలిగించారు. ప్రతీ పదం, పతీ

వాక్యం మీరిపుడు కొనసాగిస్తున్న జీవన విధానంతో ఎంతవరకు సంబంధించి ఉంది అని ప్రాక్టికల్ గా పరీక్షించి చూసుకోవాలి. మీరు తప్పక పరీక్ష చేసి చూడాలి, కానీ మీరు దీన్ని అంగీకరించే పరిస్థితులలో లేరు -- దురదృష్ట వశాత్తూ ఇది ఒక వాస్తవం, తీసుకోండి లేదా వదిలెయ్యండి. కాగితంపై రాసుకోడం ద్వారా మీరు మంచి కంటే హాని ఎక్కువ చేస్తారు. చూడండి, నేనున్నది చాలా యిరకాటమైన పరిస్థితి -- నేను మీకేమీ సహాయం చెయ్య లేను, నేనేం చెప్పినా అది మిమ్మల్ని తప్పు దోవ పట్టిస్తోంది.

------------------

**యుజీ :** సులభమైన భాషలో చెప్పండి. సంక్లిష్ట సమాసాలు, వాక్యాలు నేను అర్థం చేసుకోలేను -- ఈ సమస్య నాకుంది. కాస్త మందబుద్ధి కలవాణ్ణో మరొకటో నాకు తెలియదు -- ఊహాత్మక విషయాలను నేను అర్థం చేసుకోలేను. మీరు సరళమైన చిన్నచిన్న పదాల్లో పెట్టి చెప్పండి. అసలు మీ ప్రశ్న ఏమిటి? ఎందుకంటే దాని జవాబు అక్కడే ఉంది; నేను జవాబు యివ్వ వలసిన అవసరం లేదు. నేను సాధారణంగా ఏంచేస్తానంటే, అదే ప్రశ్నలోని పదాలను మరో విధంగా అమర్చి ఆ ప్రశ్న మీకు అర్థ రహితంగా కనబడేట్టు చేస్తాను.

**ప్ర: ప్రశ్నలోనే దాగి ఉన్న జవాబును బయటకు రాబడుతారా?**

**యుజీ :** అంతే. అందువల్లనే అసలు మీ ప్రశ్నేమిటో అర్థం చేసుకోవాలనుకొంటున్నాను. ఇందులో మాటలగారడీ లాంటిది ఏదీ లేదు. మరో ప్రశ్నను మీ మీదకు వదలాలన్నదీ కాదు నా ఉద్దేశ్యం. కానీ నేను మీ ప్రశ్నను ముందు అర్థం చేసుకోవాలి, అప్పుడే నేను ఆ ప్రశ్న లోని పదాలను నా పద్ధతిలో అమర్చి వెనక్కి మీపై విసర గలను. అపుడు, మీ ప్రశ్న పూర్తిగా అర్థ రహితమని, నేను చెప్పకుండానే మీ అంతట మీకు తెలుస్తుంది; "మీ ప్రశ్న అర్థం లేని ప్రశ్న" అని నేను అంటున్నానని కాదు.

---------------

ఈ సంభాషణ మనకు ఎప్పుడు ఉపయోగపడుతుందంటే, మనమధ్య ఏ సంభాషణా సాధ్యం కాదనీ ఏ సంభాషణా అవసరం లేదనీ మన ఇద్దరం నిర్ధారణకు

రాగలిగి నప్పుడు మాత్రమే. అవగాహన, చూడడం ('understanding','seeing') అనే పదాలు నేను వాడినప్పుడు, వాటికి నేనిచ్చే అర్థం వేరు. అవగాహన అంటే ఇకపైన ఆ ప్రశ్న లేని స్తితి; "ఇప్పుడు నాకు అర్థమయింది!" అని చెప్పేదేదీ అక్కడ లేదు – ఇదే మనిద్దరి మధ్య ఉన్న అసలు ఇబ్బంది. నేను చెపుతున్నది మీరు అర్థం చేసుకోవడం ద్వారా మీరు దేన్నీ పొంద లేరు.

మరో విషయం గట్టిగా చెప్పాలనుకొంటున్నాను : మీరు వేసే ప్రశ్నలన్నీ మీ సొంత ప్రశ్నలే అయి ఉండాలి – అప్పుడే వాటి గురించి మనం మాట్లాడు కోడంలో అర్థముంటుంది. అది మీ ప్రశ్న అయి ఉండాలి. అందువల్ల 'ఈ ప్రశ్న నాదే, నా సొంతం' అని మీరు చెప్పుకో గలిగే ప్రశ్న, ఇప్పటి వరకు ఎవ్వరూ ఎప్పుడూ వెయ్యని ప్రశ్న, ఏదైనా మీ దగ్గర ఉందా ?

**ప్ర: ప్రజలు అడిగే చాలా ప్రశ్నలు మాకు ఇంట్రస్టింగ్ గా కనిపిస్తాయ్, అందువల్ల అవి మా ప్రశ్నల్లా అనిపిస్తాయ్.**

**యుజీ :** కానీ, అవి మీవి కావు. ఈ విషయం మీ అంతట మీరే కనుక్కొంటారు: అవి మీ ప్రశ్నలు కానే కావని. ప్రశ్నించే వాడు పోవాలి. ప్రశ్నించే వాడే ఆన్సర్ ని సృష్టిస్తాడు; ఆ ఆన్సర్ నుండే ప్రశ్నించే వాడు పుడతాడు, అలా కాకుంటే ప్రశ్నించే వాడుండడు. నేనేమీ మాటల గారడీ చేయడానికి ప్రయత్నించడం లేదు. జవాబు మీకు తెలుసు, కానీ మీకు నా నుండి నిర్ధారణ కావాలి, లేదా మీ సమస్య పై నా నుండి కొంత వివరణ మీకు కావాలి, లేదా తెలుసుకోవాలనే కుతూహలం -- వీటిలో ఏ ఒక్క కారణం వల్ల మీరు నాతో మాట్లాడాలనుకొన్నా, మీరు మీ సమయాన్ని వృధా చేస్తున్నట్టే; మీరు ఓ పండితుని దగ్గరికో, బాగా చదువుకొన్న ఒక వ్యక్తి దగ్గరకో వెళ్ళాలి – వాళ్ళు మీ ప్రశ్నలకు సంబధించిన కావలసినంత జ్ఞానాన్ని మీకు ప్రసాదిస్తారు. ఈ రకమైన సంభాషణలో నాకున్న ఇంటరెస్ట్ అంతా, మీ సొంత ప్రశ్నను మీరు తయారు చేసుకోవడంలో మీకు సహాయపడడం వరకే. ఇది మీ సొంతం అని మీరు చెప్పుకోదగ్గ ఒక ప్రశ్నను, మీరు ప్రత్నించి రూపొందించండి.

ఇక్కడ నాలో అసలు ఏ ప్రశ్నలూ లేవు. నేను వచ్చి యిక్కడ కూర్చుంటాను, ఇదంతా ఖాళీ. కానీ 'ఖాళీ' అనే పదాన్ని మీరు వాడే అర్థం లో

కాదు. ఖాళీగా ఉండడం , నిండుగా ఉండడం అనేవి రెండూ వేరు వేరు కాదు; శూన్యానికి, నిండుతనానికి మధ్య హద్దులు గీయలేవు. కానీ ఇక్కడ ఏమీ లేదు – శూన్యం – అందువల్ల నేను చెప్పబోయేది ఏమిటో నాకు తెలియదు. మీకు చెప్పడం కొరకు నేను దేనినీ ప్రిపేరు చేసుకొని రాను. నా నుండి మీరు, ఏం రాబట్టగలరు అన్నది మీ సొంత వ్యవహారం – అది మీది, నాది కాదు – నాదని నేను చెప్పుకోగలిగేది ఏదీ ఇక్కడ లేదు. ఇది మీ ఆస్తి, కారణం ఈ జవాబును మీరు నానుండి రాబట్టేరు కాబట్టి – ఇది నాది కాదు – జవాబుతో అసలు నాకు పని లేదు. ఇది జవాబు కాదు. నేను మీకు ఏ ఆన్సర్లూ అసలు ఇవ్వడం లేదు.

-----------------

ఇది ఒక అసంకల్పిత ప్రతీకార చర్య(reflex action) లాంటిది: మీరు ఒక ప్రశ్న వేస్తారు, అందువల్ల దాని నుండి ఏదో ఒకటి బయటకు వస్తుంది. ఇది ఎలా జరుగుతుందో నాకు తెలియదు. ఇది ఆలోచించడం వలన పుట్టింది కాదు. నాలోనుండి వచ్చినది ఏదీ ఆలోచన సృష్టి చేసింది కాదు – కానీ ఏదో బయటకు వస్తోంది. మీరు ఒక బంతిని విసురుతున్నారు, అపుడు ఆ బంతి అక్కడ తగిలి వెనక్కి వస్తోంది, దాన్ని మీరు 'జవాబు' అంటున్నారు. వాస్తవంగా నేను చేస్తున్నదల్లా మీరు వేసిన ప్రశ్నను వేరే విధంగా అమర్చి మీకు వెనక్కి విసురుతున్నానంతే.

**ప్ర: ప్రశ్నే జవాబును బయటకు తెస్తుంది, అవునా?**

**యుజీ** : ప్రశ్నకు ఆన్సర్ లేదు అందువల్ల ఆ ప్రశ్న ఇంక అక్కడ ఉండ లేదు. ఆ అర్ధంలో నాలో ఏ రకమైన ప్రశ్నలూ లేవు, ఈ ప్రపంచంలో కార్యనిర్వహణకు అవసరమయ్యే ప్రశ్నలు తప్ప – వేరే ప్రశ్నలేమీ నాకు లేవు.

**ప్ర : మీరిచ్చిన ఆన్సర్ ఆ ప్రశ్నకు ప్రతిబింబం మాత్రమేనా?**

**యుజీ**: అది నా ఆన్సర్ కాదు, ఎందుకంటే ఆ ప్రశ్న ఇంక యిక్కడ ఉండదు. ఆ ప్రశ్న నా ప్రశ్నలాగే నాకు అనిపిస్తుంది; దానికి ఆన్సర్ లేదు కాబట్టి అది ఆన్సర్స్ కొరకు ఎదురు చూడదు; ఆ ప్రశ్న తనను తాను దగ్ధం చేసుకొంటుంది, ఆ తరువాత అక్కడ ఉన్నది energy,శక్తి (అంటే ప్రశ్న శక్తిగా మారుతుంది). మీరు తొమ్మిది

పది గంటలు(మాట్లాడడం) కొనసాగించ లేరు; అది నేను చేయగలను. అది(మాట్లాడడం) శక్తిని క్షీణింప చేయదు, కానీ అక్కడున్న శక్తికి, అది మరింత శక్తిని జోడిస్తూ ఉంటుంది. మాట్లాడడమే ఒక శక్తి : మాట్లాడడం ఆ శక్తి యొక్క వ్యక్తీకరణ.

**ప్ర: ఉదాహరణకి నేను క్వాంటం మెకానిక్స్ గురించి అడిగేననుకోండి?**

**యుజీ:** ఆ సబ్జెక్టు నాకు తెలియదు – అది నా జవాబు – అందువల్ల ఆ ప్రశ్న ఏ విధంగా చూసినా మాయామయి పోతుంది. క్వాంటం మెకానిక్స్ కు సంబంధించిన సమాచారం, జ్ఞానం ఏదైతే నా దగ్గర ఉందో అది సూటిగా ఒక బాణంలా బయటికి వస్తుంది. అక్కడ పెట్టబడిన దంతా బయటకు వస్తుంది. కానీ... “దేవుడున్నాడా?”, “ఈ జీవితం ఒక కేవలం యాదృచ్ఛికమేనా, ఒక ఘటన మాత్రమేనా?”, “ఈ సృష్టిలో న్యాయం ఉందా?” ... ఇలాంటి ప్రశ్నలకి ఆన్సర్లు లేవు, అందువల్ల ఇటువంటి ప్రశ్నలు వాటంతట అవే దగ్ధం అవుతాయ్.

---------------------

**ప్ర: నేను ఎవరిని?**

**యుజీ :** (నవ్వు) మీరెవరో మీకు బాగా తెలుసు.

**ప్ర: అంటే?**

**యుజీ :** “నేను ఎవరిని” అనే ప్రశ్న నిజంగా మీదేనా? కానే కాదు; ఈ ప్రశ్నను మీరు ఎక్కడ నుండో పట్టుకొచ్చారు. ప్రశ్నించేవాడే ఒక ప్రోబ్లం, ప్రశ్న కాదు. ఈ ప్రశ్న కాక పోతే మరో ప్రశ్నను నీవు తీసుకొస్తావ్. మరో వలబై సంవత్సరాల తర్వాత గూడా యీ జీవితానికి అర్థం ఏమిటి అని అడుగుతూ ఉంటావ్. ఒక జీవిస్తున్న మనిషి ఇటువంటి ప్రశ్న వేయడు. జీవితంలో నీకు అర్థం కనబడ్డం లేదని తెలుస్తూనే ఉంది. నీవు జీవించడం లేదు. నీవు మరణించిన మనిషి లాంటివాడివి(you are dead). జీవితానికి అర్థం ఏమిటో నేను నీకు చెపితే అది నిన్ను ఎక్కడ దాకా తీసుకెడుతుంది? నీవు దాన్నెలా అర్థం చేసుకుంటావ్?

**: ప్రశ్నించే వాడంటూ ఒకడున్నాడా?**

**యుజీ:** లేడు. ఉన్నది ప్రశ్న మాత్రమే. అన్నీ ప్రశ్నలూ ఒకేటే – అవి, బట్టీ పట్టి యాంత్రికంగా మళ్ళీ మళ్ళీ వేస్తున్న ప్రశ్నలు. “నేనెవరిని”, “జీవితానికి అర్థం ఏమిటి”, “దేవున్నాడా”, “చనిపోయిన తర్వాత గూడా జీవితం ఉంటుందా” ఈ ప్రశ్నలన్నీ నీ జ్ఞాపకాల నుండి మాత్రమే బయటికి వస్తాయ్. అందుకే నేను నిన్ను అడుగుతున్నాను, నీ సొంత ప్రశ్న (your own) ఏమైనా నీ వద్ద ఉందా అని.

-------------------

**ప్ర: నిజంగా నీవు దాన్ని పరిశీలించి చూసినప్పుడు “నేను ఎవరు?” (Who am I) అనే ప్రశ్న ఇంక అక్కడ ఉండదని మీరంటున్నారు, అవునా?**

**యుజీ :** ఎందుకంటే ప్రశ్నించేవాడి నుండి ప్రశ్నను మీరు విడదీయలేరు కాబట్టి. ప్రశ్న, ప్రశ్నించేవాడు ఒకటే. మీరు ఈ నిజాన్ని ఒప్పుకుంటే, ఇది చాలా తేలిగ్గా అర్థమయ్యే విషయం. ప్రశ్న అదృశ్యమైనపుడు, దానితో పాటు ప్రశ్నించేవాడు గూడ అదృశ్య మవుతాడు. ప్రశ్నించేవాడు అదృశ్యమవడానికి ఇష్ట పడడు కాబట్టి ఆ ప్రశ్న అక్కడే ఉండి పోతుంది. ప్రశ్నించేవాడికి, ఆ ప్రశ్నకు ఆన్సర్ కావాలి. కానీ ఆ ప్రశ్నకు ఆన్సర్ లేదు కాబట్టి ఆ ప్రశ్నించేవాడు అక్కడే ఎప్పటికీ ఉండిపోతాడు. ప్రశ్నించేవాడి అభిమతం తాను కొనసాగించాలని, సమాధానం తెలుసుకోవాలని కాదు.

**ప్ర: కానీ జవాబు మీద ఉన్న శ్రద్ధ ఇంకా అలాగే ఉంది.**

**యుజీ :** ఆ శ్రద్ధే ప్రశ్నించే వాడు, (యింకా యితర పదాలేం వాడచ్చు?) ఆ ఎదురు చూడ్డమే ప్రశ్నించే వాడు, జవాబు కొరకు ఎదురుచూడ్డమే, ఈ ప్రశ్నకి ఒక ఆన్సర్ ఉందనే ఆశే యీ ప్రశ్నించే వాడు. చూడండి, ఇవన్నీ వేరు వేరు కాదు; ఇది గమ్మత్తుగా వేరు వేరు పరిస్తితులలోకి మార్పు చెందింది. ఈ ప్రశ్నించేవాడు మొదట అంటాడు, తాను శ్రద్ధగా వింటున్నానని. అతడు అంత శ్రద్ధ చూపడానికి కారణం అతనికి జవాబు కావాలి కనక. అది బహుశా దొరకకపోవచ్చనే సూచనలు అతనికి అక్కర లేదు. ఈ ఆన్సర్ తో అతడు ఏం చేస్తాడు? అతడు శ్రద్ధగా వింటున్నాడు, ఎదురు చూస్తున్నాడు, అశతో ఉన్నాడు -- ఇవన్నీ అతడే. -- ఎందుకని? ....

ఎందుకంటే, " నేనెవర్ని?నేను ఎవరై ఉన్నాను, ?" (who am I?) అనే ప్రశ్నకు ఆన్సర్ లేదు కాబట్టి – అది నీ అంతటి నీవు తెలుకొనే మార్గం లేదు.

'ఎవరు'ని 'నేను'ని కలిపేది క్రియ. ఎవరు & నేను అనేవి రెండూ వేరు వేరు అయినట్టు అనిపిస్తాయ్, అ రెంటినీ లింక్ చేసేది 'అయి ఉన్నాను' అనే క్రియ. 'అయిఉన్నాను' (am) అనే క్రియే 'నేను'కు కొనసాగింపును (continuity ని) ఇస్తుంది. ఈ క్రియ(verb) అక్కడ లేనపుడు -- యీ క్రియ మాయమవ గలిగితే, (నవ్వు !) – అపుడు 'ఎవరు' & 'నేను' ను లింక్ చేయాల్సిన అవసరం దేనికీ లేదు; అవి రెండూ ఒకటే (ఇక్కడ నేను అంటే ఎవరో కాదు, ఆ 'నేననెవరు?' అనే ప్రశ్నే నీవు).

**ప్ర: క్రియ (లేక) పోతే ? (If the verb goes?)**

**యుజీ** : ప్రశ్న గూడా (ఉండదు) దానితోనే పోతుంది. క్రియ లేకుండా ప్రశ్న ఉండడం సాధ్యం కాదు. "నేను, ఎవరు, (Who I)" అనే వాక్యం అర్థం లేనిది. 'అయిఉన్నాను (Am)' అనే క్రియ ఉండి తీరాలి (తెలుగు వాడుక భాషలో 'అయిఉన్నాను' లేనప్పటికీ, అది ఉన్నట్టుగానే అర్థం వస్తుందనుకోండి, అది వేరే విషయం) – అందుచేత 'క్రియ' విడదీసే ప్రక్రియను సృష్టిస్తుంది. ఈవిధంగా నీవు ప్రశ్నను సృష్టించావ్. ఆ ప్రశ్న కు ఆన్సర్ ఉన్నట్లు ఆ ప్రశ్నే సూచిస్తుంది; అలా కాకపోతే, ఆ ప్రశ్నను నీవు నీకే వేసు కోవు. ఆ ప్రశ్నకు, "ఇపుడు నేను ఏదైతే అయిఉన్నానో అది కానిది ఏదో మరొకటి ఉండి తీరాలి," అనే అస్పష్టమైన సమాధానం నీ దగ్గర ఉండడమే యీ ప్రశ్నలన్నిటికీ కారణం, మీకు అర్థమయ్యిందా? నేను చెప్పదలచుకొన్నది మీకు అర్థమయ్యేట్టు చెప్పానో లేదో నాకు తెలియదు.

-------------

**ప్ర: సర్, మరణం తర్వాత ఏ జరుగుతుంది?**

**యుజీ** : మరణాన్ని గురించిన ప్రశ్నలన్నీ అర్థం లేనివి, ముఖ్యంగా నీలాంటి యువకునికి. నీవు యింకా నీ జీవితాన్ని పూర్తిగా జీవించలేదు. అటువంటి సిల్లీ ప్రశ్న ఎందుకు అడుగుతావ్? అటువంటి విషయాలపై నీకెందుకంత ఆసక్తి?

జీవిస్తున్న  మనిషికి అటువంటి ప్రశ్నలు వేసే టైమ్ ఉండదు. జీవించనివాడే అడుగుతాడు "నా మరణం తర్వాత నేనేమవుతాను?" అని. నీవు జీవించడం లేదు. ముందు జీవితాన్ని జీవించు, తరవాత ఆ టైమ్ వచ్చినప్పుడు..... దీన్ని ఇప్పుడు అలా వదిలేద్దాం. యీ రకమైన ఫిలాసఫీ లో నాకు ఇంట్రస్టు లేదు.

మరణం తర్వాత ఏమీజరగదు. అసలు మరణమనేది ఏదీలేదు. ఏది మరణిస్తుందని నువ్వనుకొంటున్నావ్? ఏది? ఈ దేహం, దానిలో ఉన్న మూలక ద్రవ్యాలుగా విడిపోతుంది, అందువల్ల పోయేదేదీ లేదు. దీన్ని కాలిస్తే ఆ బూడిద మట్టికి బలం చేకూర్చి  మొక్కలు బాగా పెరగడానికి ఉపయోగ పడుతుంది. దాన్ని పాతిపెడితే పురుగులు తిని జీవిస్తాయ్. నదిలో విసిరేస్తే అది చేపలకు ఆహారమవుతుంది. ఒకరకం జీవి మరొక రకం జీవిని తిని బతుకుతుంది, అలా జీవం కొనసాగడానికి దోహద పడుతుంది. ఆ విధంగా చూస్తే జీవానికి  మరణం లేదు (life is immortal).

కానీ, చావనే భయంలో చిక్కుకున్న వాళ్ళకి అది ఏమాత్రం ఉపకరించబోదు. చావు అంటే భయమే కదా, ఏదో అంతమయి పోతోందనే భయం. నీకు  తెలిసిన 'నీవు',  నీవనుభూతి చెందే  'నీవు' -- ఆ 'నీవు' తాను అంతం కావడానికి ఒప్పు కోదు. కానీ, యితరుల లాగే, తన దేహం ఏదో ఒక రోజు చని పోతుందని, దానికి కూడా తెలుసు. ఇతరుల మరణాలు నీ అనుభవంలోకి  వస్తాయ్ -- అది ఒక భయానక పరిస్తితి, ఎందుకంటే దేహం పోయినప్పుడు ఆ 'నీవు'  కొనసాగు తుందో లేదో నీకు పూర్తిగా తెలియదు. అందువల్ల ఆ  'నీవు', మరణం తరువాత గుడా జీవితాన్ని  ఊహించు కొంటుంది. అందువల్ల అపుడు, మరణం తర్వాత గూడ లైఫ్ ఉంటుందా ఉండదా అనే ప్రశ్న చాలా ముఖ్యమైనదవుతుంది. భయం యీ ప్రశ్నను సృష్టిస్తుంది, అందువల్ల  భయం పోయినప్పుడు చావును గూర్చిన యీ ప్రశ్న గూడ పోతుంది.

మీ సొంత మరణం మీ అనుభవంలోకి రాదు. అందుకే, మోక్షం, విముక్తి లాంటివాటి  మీద ఎక్కవ ఆసక్తి ఉన్న కొంతమందితో  చెపుతూ ఉంటాను, "మీలో

ప్రతి ఒక్కరూ, ఎవరికీ మినహాయింపు లేకుండా, మీరందరూ చనిపోయే క్షణంముందు మోక్షం పొందుతారు" అని.

(నవ్వు!) కానీ అప్పటికే మీకు చాలా ఆలస్యమయిపోతుంది: శరీరం సాగిలపడి పోతుంది, మళ్ళీ తిరిగి వెనక్కి బతికిరాలేదు. ఆ మరణం మీకు ఇపుడే రావచ్చు – అది ప్రస్తుత క్షణంలో జరిగేది. (it is a thing that happens now).

------------------

నీ మరణాన్ని గురించి ఇప్పుడు కానీ, అందరూ మాట్లాడే ఆ ప్రాణం అనేది పోయే ముందు కానీ, తెలుసుకొనే మార్గం నీ దగ్గర లేదు. జ్ఞానం (knowledge) అంతమయ్యే వరకు, అంటే జ్ఞానంకొనసాగడం అంతమయ్యే వరకు మరణం సంభవించ లేదు. నీకు మరణాన్ని గురించి ఏదో తెలుసుకోవాలని ఉంది: మరణానికి సంబధించిన ఆ జ్ఞానాన్ని గూడా నీ జ్ఞానంలో ఒక భాగంగా చేయాలనుకొంటున్నావ్. కానీ మరణమనేది ఒక రహస్యమైన విషయం కాదు. ఆ జ్ఞానం అంతం అవ్వడమే మరణం. మరణం తర్వాత ఏది కొనసాగుతుందని, కంటిన్యూ అవుతుందని నువ్వు అనుకొంటున్నావ్? నీవు జీవిస్తున్నప్పుడు ఉన్నది ఏమిటి? ఆ ఉన్నది, ఆ entity ఎక్కడుంది? అక్కడ ఏమీ లేదు – ఆత్మ లేదు – అక్కడ ఉన్నది 'మరణం తర్వాత' గురించిన ఈ ప్రశ్న మాత్రమే. దీనికి ఆన్సర్ కనుక్కోడానికి ఈ ప్రశ్న ఇపుడు మరణించాలి -- నీ ఆన్సర్ కనుక్కోడానికి... నా ఆన్సర్ కనుక్కోడానికి కాదు -- ఎందుకంటే మరణం తర్వాత ఏదో కొనసాగుతుంది అన్న ఊహ, నమ్మకం నుండే ఆ ప్రశ్న పుట్టింది కాబట్టి.

-----------

**ప్ర: మీ తార్కిక వ్యక్తీకరణను ఒక్కొక్కప్పుడు నేను అర్థం చేసుకో గలుగుతున్నాను, మీరు చెప్పేది నిజమని గట్టిగా అనిపిస్తోంది. ఆ నిర్ణయానికి ఎలా రాగలిగేనో నాకు తెలియదు, కానీ ఆ నిర్ణయానికి రాగానే ఒక్కసారి ఏదో ఒక పెద్ద అభద్రతా భావం కలుగుతోంది.**

**యుజీ** : చూడండి, ఎద్దైతే ప్రశ్నిస్తోందో, ఆ ప్రశ్నించే దాని ఆస్తిత్వం ప్రమాదంలో పడుతుంది.

**ప్ర: అవును సరిగ్గా చెప్పేరు, అది చాలా భయాన్ని కలిగిస్తుంది.**

**యుజీ :** చూడండి, అదే ఇబ్బంది: మౌలిక విషయాన్ని ప్రశ్నించే ధైర్యం నీకు లేదు, ఎందుకంటే.. అది, అక్కడ ఉన్న నీకు చాలా విలువైన దాన్ని నాశనం చేస్తుంది: ఆ విలువైనదేమిటంటే... "నీకు తెలిసిన 'నీవు', నీవు అనుభూతి చెందే 'నీవు' కొనసాగడం

**ప్ర: ఒక్క సారి ప్రశ్నించ డానికి ధైర్యం చేస్తే అపుడు ఏమవుతుంది?**

**యుజీ :** "అపుడు ఏమవుతుంది?" అనే ప్రశ్న అక్కడ ఉండదు. అప్పుడు అది ఎక్ట్ (తన పని) చేయడం మొదలు పెడుతుంది. అదే ఏక్షన్ (చర్య).

**ప్ర: నాకు ఆ ధైర్యం చేయాలని చాలా కోరికగా వుంది. ఆ ధైర్యం చేసే మార్గం ఏమిటి?**

**యుజీ :** తనంతట తానే జవాబును కనుగొనే శక్తి అంతర్గతంగా ఆ ప్రశ్నలోనే ఉంది. చూడండి, ఆన్సర్ లేనప్పుడు ఆ ప్రశ్న అక్కడ ఉండలేదు. మీ లోపలనుండి గాని, మీ బయటనుండి గాని జవాబు వస్తుందని మీరు ఎదురు చూస్తున్నారు. మీ లోపల, మీ బయట, యీ రెండు ప్రదేశలూ గూడ ఉపయోగపడవని మీకు తెలిసినప్పుడు ఆ ప్రశ్నకు ఏంజరుగుతుంది? ఆ సమాధానాలను నేను తిరస్కరించడానికి కారణం యితరుల మాటలను లేదా వారి అనుభవాలను నేను అంగీకరించక పోవడం వల్ల కాదు, దానికి కారణం నావరకు, అవి సరైనవి కావు. అవి నిజం అవ్వచ్చు కానీ విలువ లేనివి, అందువల్ల వాటన్నిటినీ నేను తిరస్కరిస్తున్నా. అందుచేత బయటి నుండి వచ్చే సహాయమేమీ నాకికపైన ఉండదు. ఆ బయటి సహాయం లేనప్పుడు ఇక్కడ అసహాయత అనేది అసలు ఉండనే ఉండదు – అవి(బయటి సహాయం కొరకు ఎదురుచూడ్డం మరియు అసహాయత) రెండూ ముడిపడి ఉంటాయ్; వీటిని నిజంగా నీవు విడదీయ లేవ్.

------------------

పరిష్కారమే అసలు సమస్య. నీవు సమస్యను పరిష్కరించ లేనపుడు అ సమస్య సమస్యగా ఉండదు. నీకు సమస్యపై కంటే పరిష్కారం పైనే మక్కువ ఎక్కువ. కానీ పరిస్కారం అనేది రేపటికి సంబంధించినది, ఇప్పటికి కాదు – ప్రోబ్లమ్

ఎప్పుడు సాల్వ్ చేస్తావ్? -- అందుచేత పరిష్కారం కాదు కావలసినది. పరిష్కారాలు కనుక్కోవడానికి నీకెందుకంత ఆసక్తి? అవి నీకేవిధంగానూ ఉపకరించ లేదు. కానీ నీవు ఇంకా పరిష్కారాల వైపే చూస్తున్నావ్, సమస్య వైపు కాదు. అసలు సమస్య ఏమిటి? –ఇదే నేను అడుగుతున్నాను. నీకే సమస్యా లేదు, కానీ నువ్వు పరిష్కారాల గురించి మాట్లాడుతున్నావ్.

-----------------

ఇతరులు ఇచ్చిన సమాధానాలు మిమ్మల్ని తృప్తి పరచలేదు. మీరు నా దగ్గరకు వచ్చారు – నేను జ్ఞానోదయం అయిన వాడినని మీరనుకొంటున్నారు. ఆ ప్రశ్నలకు ఆన్సర్స్ ఇవ్వబడ్డాయ్, అయినా మళ్ళీ అడుగుతున్నారు. మీకు తెలిసిన దానికి నిర్ధారణ మీకు కావాలి, కానీ యీ మనిషి చెప్పేది మీ అభిప్రాయాలకు సరిపోయేట్టు ఉండదు, అందువల్ల నాతో ఏకీభవించరు. ఆ ప్రశ్నకు ఆన్సర్ మీరే కనుక్కోవాలి.

--------------

జ్ఞానోదయం అనేది ఏదీ లేదని మీకు మీరే తెలుసుకొన్నప్పుడు యీ వెదకడం ఆగిపోతుంది. అన్వేషణ చేసి 'నేను' నుండి విముక్తి పొందాలని మీరు కోరు కొంటున్నారు, కానీ 'నేను' అనే దాని నుండి మీరు విముక్తి పొందడానికి మీరు ఏదైతే చేస్తున్నారో అదే 'నేను'. ఈ చిన్న విషయం మీకు అర్థమయ్యేట్టు నేనెలా చెప్పాలి? ఎలా అనేది లేదు. అది నేను చెపితే, అది దానికి(అన్వేషణకి) మరింత ఊపు జోడించి, ఆ ఊపుకు మరి కొంత బలం యిస్తుంది. అది అన్ని ప్రశ్నలకే ప్రశ్న -- " ఎలా, ఎలా, ఎలా? అనేది.

నేను గానీ మరొకరు గానీ చెప్పినవే ఆన్సరులు అని మీరనుకొన్నంత కాలం ఆ 'ఎలా' అనేది ఉంటుంది."నేను ఆన్సర్ కనుక్కొన్నాను" -- వారు వారి ప్రశ్నలకి ఆన్సర్ లు కనుక్కున్నారు. నీ ప్రశ్నలకు ఆన్సర్స్ ఇవ్వ గలిన వాళ్ళు వీరే అని, నీవనుకొని, వారి ఆన్సర్సు మీద నీవు ఆధారపడి ఉన్నంత కాలం ఆ ప్రశ్నలు అక్కడే శాశ్వతంగా ఉంటాయి. అవి సమాధానాలు కావు; అవే ఆన్సర్స్ అయితే, ఆ ప్రశ్నలు ఇంక అక్కడ ఉండేవి కావు. అది నీ ఆన్సరే అయి ఉండాలి.

తర్వాత, ఆన్సర్స్ ను ఏ పద్ధతీ లేకుండా నీవు కనుక్కోవాలి. ఏ పద్ధతైనా సరే అది నీ ప్రశ్నపై నీళ్ళు జల్లి, అంటే ప్రశ్నయొక్క తీవ్రతను తగ్గించి నిన్ను ప్రశ్న నుండి దూరంగా తీసుకొనిపోతుంది. ఆ ప్రశ్న దానిరీతిలో తీవ్రతరం అవుతుంది. ఆ ప్రశ్నకు ఆన్సర్ తప్ప మీకు మరేమీ అక్కర లేదు. ఇంకేమీ అక్కర్లేదు. మీ ప్రశ్నకు ఆన్సర్ తప్ప దేనిపైనా మీకింక ఆసక్తి లేదు. రాత్రి లేదు పగలు లేదు మీ జీవిత శేషమంతా మీకున్నది అదొక్కటే ప్రశ్న– "ఎలా" అనేది.

ఆ 'ఎలా' అనేది ఇతరులు ఇచ్చిన ఆన్సర్స్ కి సంబంధించినది కాబట్టి ఆ ఆన్సర్లన్నిటినీ నీవు తిరస్కరించాలి. అ ప్రశ్న తనను తాను దగ్ధం చేసుకోవాలి, కానీ నీవు బయటినుండి గానీ, నీలోపల నుండి గానీ ఆన్సర్ కోసం ఎదురు చూసినంత కాలం, ఆ ప్రశ్న తనను తను దగ్ధం చేసుకోలేదు. ఆ ప్రశ్న తనను తాను దగ్ధం చేసుకొన్నప్పుడు అక్కడ ఏమి ఉందో అది తనను వ్యక్తపరచుకోడం మొదలెడుతుంది. అది ఇతరుల సమాధానం కాదు, నీ ఆన్సరే. సమాధానం కనుక్కోవలసిన అవసరం గూడా నీకు లేదు, ఎందుకంటే అక్కడ సమాధానం ఆల్రెడీ, (ముందు నుంచే) ఉంది, అది తనను తాను ఏదో విధంగా వ్యక్తపరచు కుంటుంది. నీవు పండితుడివి కానక్కరలేదు, పుస్తకాలు చదవక్కరలేదు, నువ్వేమీ చేయక్కరలేదు; అక్కడ ఉన్నది తనకు తానే వ్యక్తం చేసుకోడం మొదలు పెడుతుంది.

అసలు, ఆ ప్రశ్నకు ఆన్సర్ మీకు అంత అవసరమా? మీకిది తెలుసా... జీవితమంతా తల కిందులుగా తపస్సు చేసిన వాళ్ళు, చెట్టునుండి వేల్లాడినవాళ్లు ఎక్కడికీ చేరుకోలేక పోయారు – వాళ్ళచుట్టూ చీమల పుట్టలు పెరిగాయి గానీ వాళ్లేమీ సాధించలేక పోయారు. అది అంత తేలికైనది కాదు. ఇది నాకు జరిగినప్పుడు, నేను నా అంతట తెలుసుకో గలిగేను... నా శోధన అంతా తప్పుడు మార్గంలో నడిచిందని, దానిలో ఆధ్యాత్మికత, ధార్మికత, మానసిక ప్రతిభ ఏమీ లేదనీ, అదంతా జ్ఞానేంద్రియాలన్నీ తమ యొక్క పూర్తి భౌతిక శారీరక సామర్ధ్యంతో కార్య నిర్వహణ చేయగలగడమే అనీ. అదే నా ప్రశ్నకు (నాకు దొరికిన) సమాధానం.

అన్ని ప్రశ్నలూ ఒకే ప్రశ్నకు వివిధ రూపాలు; అవి వేరు వేరు ప్రశ్నలు కాదు. నీ సంకల్పం ఎంత ధృఢ మైనది? నీ ఆకాంక్ష ఎంత తీవ్ర మైనది? ఆ ప్రశ్నకు సమాధానం కావాల్సిన అత్యవసరం ఏమిటి? నీకు యిప్పటికే తెలిసి ఉన్న జవాబుల నుండే ఒక ప్రశ్న పుడుతుంది. నేనున్న స్తితి ఏమిటో నీవు తెలుసుకోవాలి, తరవాత దాన్ని జ్ఞానంలో, నీ జ్ఞానంలో ఒక భాగం చేయాలి, అంటే దాన్ని ఒక సాంప్రదాయంగా చేయాలి; కానీ జ్ఞానం (నాలెడ్జి) అంతం అయి తీరాలి. ఈ చిన్న విషయాన్ని నీవెలా అర్ధం చేసుకోగలవ్? తెలుసు కోవాలని నీవు కోరుకోవడం నీ నాలెడ్జికి మరి కొంత ఊపును ఇస్తుంది. ఇదేమిటో తెలుసుకోవడం సాధ్యం కాదు, ఎందుకంటే నాలెడ్జి (లోక జ్ఞానం) ఇంకా అక్కడే ఉంది, అది తన ప్రభావాన్ని పెంచుకుంటోంది. నాలెడ్జిని కొనసాగించడంలోనే నీ ఇంట్రెస్ట్ అంతా .

--------------

పుస్తకాలు ప్రజలకు ఏదైనా నేర్ప గలిగితే ఈ ప్రపంచం ఒక స్వర్గ ధామం అవుతుంది. సాంకేతిక విషయాలు, ఒకే – టేప్ రికార్డర్ ఎలా ఫిక్స్ చేయాలి మొదలైనవి – కానీ ఇటువంటి విషయాలలో పుస్తకాలు ఉపయోగ పడవు. ఈ సంభాషణలలో, మాటలలో ఏదైనా విలువ ఉందో లేదో నాకు తెలియదు. కానీ ఇక్కడ కదలిక ఏదీ లేదని నీకు చాలా స్పష్టంగా చెప్పదలచుకున్నాను : నీవు యిప్పుడు ఏమైఉన్నావో దాని నుండి దానిలో ఏ మార్పూ జరగదు. నీవు ఒక్క అడుగు గూడా ముందుకు వేయలేదు. ఏ అడుగూ వేయ వలసిన అవసరం నీకు లేదు.

**ప్ర: మన సమావేశంలో మాటలు ముఖ్యం కాదు, పదాలకు మించినది మరేదో తప్పక ఉందని నాకు నమ్మకం కుదిరింది.**

**యుజీ** : నాకు తెలియదు, నీవు ఖచ్చితంగా చేప్ప లేవు : అది నీ సొంత ఊహా కావచ్చు. ఏదైనా ఉంటే అది తనదైన రీతిలో పని చేస్తుంది. నాలో, నీలో, అక్కడ తోటలో ఉన్న నత్తలో, ఆ బయట ఉన్న వానపాములో పనిచేస్తున్న, యీ చైతన్యం (consciousness) ఒక్కటే. నాలో దానికి సరిహద్దులు లేవు. నీలో సరిహద్దులు ఉన్నాయ్ – నీవు దాని లోపలే ఉండి పోయావ్. బహుశా ఈ పరిమితి లేని చైతన్యం

నిన్ను పుష్ చేస్తోంది, నిన్ను నెట్టుతోంది. నాకు తెలియదు. నన్ను కాదు (నన్ను నెట్టదు); నాకు దీనితో పనిలేదు, ఇది తన లెవెల్ కనుక్కుంటున్న నీరు లాంటిది, అంతే. – అది దాని సహజ గుణం. నీలో జరుగుతున్నది అదే: తన చుట్టూ ఆవరించి ఉన్న ప్రాణం లేని, అసహజమైన ఆలోచనల, అనుభవాల, కట్టడాన్ని బద్దలుకొట్టడానికి ఆ జీవం ప్రయత్నిస్తోంది. బద్దలకొట్టి తెరిచి బయటకు రావడానికి అది ప్రయత్నిస్తోంది. అలా జరగడడం నీకిష్టం లేదు. నీవక్కడ కొన్ని బీటలు చూడగానే, కొంచెం సిమెంట్ తెస్తావ్, ఆ బీటలు నింపుతావ్, వాటిని మూసేస్తావ్. అందరూ అనుకొనే ఆత్మ జ్ఞాని, అధ్యాత్మికుడు, దైవికుడు మొదలైన వారి యొక్క అవసరం లేదు నిన్ను నెట్టడానికి; ఏదైనా అక్కడున్న ఆ ఆకుగాని మరొకటి గానీ, అదే విషయాన్ని నీకు బోధిస్తుంది, అది చేయగలిగినదేదో దాన్ని నీవు చేసుకోనిచ్చినప్పుడు మాత్రమే. నీవు దానిని తన పనిని తప్పక చేసుకోనివ్వాలి, నేను యీ విధంగా చెప్పడమే బెటరు. “దానిని చేసుకోనివ్వు” అనే దానిలో కొంతవరకు నీ ప్రమేయం గూడా ఉందనే అర్థం వచ్చినప్పటికీ, కానీ, నా ఉద్దేశ్యం అది కాదు.

---------

**ప్ర: జీవం, ప్రాణం (లైఫ్) అంటే ఏమిటి?**

**యుజీ** : జీవం అంటే ఏమిటో నీకెప్పటికీ తెలియదు. జీవం గురించి ఎవ్వరూ ఏమీ చెప్ప లేరు. నీవు ఎన్ని నిర్వచనాలైనా యివ్వచ్చు. కానీ వాటికి అర్థం లేదు. నీవు జీవం గురించి సిద్ధాంతీకరించవచ్చు, కానీ అది నీకు దేనికీ ఉపయోగ పడదు – దేనినీ అర్థం చేసుకొనేందుకు అది నీకు సహాయ పడదు. అందువల్ల “జీవం అంటే ఏమిటి?” లాంటి ప్రశ్నలు నీవు అడగ వద్దు. నీకు తెలుసు. “లైఫ్ అంటే ఏమిటి?” – ఆ ప్రశ్న కు జవాబు లేదు, అందువల్ల ఆ ప్రశ్న మరింక అక్కడ ఉండ లేదు. నీకు నిజంగా తెలియదు, కాబట్టి ఆ ప్రశ్న అదృశ్యమవుతుంది. కానీ నువ్వు అలా అవనివ్వవు, ఎందుకంటే ఆ ప్రశ్నకు ఒక ఆన్సర్ ఉండి తీరాలి అని నువ్వు అనుకొంటావ్ కాబట్టి. నీకు ఆన్సర్ తెలియనప్పుడు, నువ్వనుకొంటావ్ ఆ ప్రశ్నకు ఆన్సర్ యివ్వ గలిగిన వాడు ఈ ప్రపంచంలో ఎవరో ఒకరు ఉండి ఉండ వచ్చని.

"లైఫ్ అంటే ఏమిటీ" -- ఆ ప్రశ్నకు సమాధానం ఎవ్వరూ ఇవ్వ లేరు – మనకు నిజంగా తెలియదు. అందుచేత ఆ ప్రశ్న అక్కడ ఉండ లేదు; ఆ ప్రశ్న తనను తాను దగ్ధం చేసుకుంటుంది. ప్రశ్న ఆలోచన నుండి పుట్టింది, అందువల్ల అది తనంతట తాను కాలి పోయినప్పుడు అక్కడ ఉండేది శక్తి (energy). అది ఒక దహనం(combustion): ఆలోచన తనను తాను కాల్చుకొని భౌతిక శక్తిని (physical energy) ఇస్తుంది. అదే విధంగా, ప్రశ్న దగ్ధమై నప్పుడు, దానితో పాటు ప్రశ్నించే వాడు గూడా పోతాడు. ప్రశ్న మరియు ప్రశ్నించే వాడు, యీ రెండూ వేరు వేరు కాదు. ప్రశ్న దగ్ధమైనప్పుడు అక్కడ ఉండేది శక్తి. ఆ శక్తి గురించి నీవేమీ చెప్ప లేవు -- అది యిప్పటికే తనను తాను కనపరచు కొంటూ అవధులు లేకుండా తనను వ్యక్త పరచు కుంటోంది; దానికి పరిమితులు లేవు, సరిహద్దులు లేవు. అది నీది కాదు, నాది కాదు; అది ప్రతి ఒక్కరికీ చెందుతుంది. నీవు అందులో ఒక భాగం. నీవు దాని యొక్క ఒక వ్యక్తీకరణ. ఒక పువ్వు ఏవిధంగా జీవం యొక్క ఒక వ్యక్తీకరణో అదే విధంగా నీవు గూడ లైఫ్ కి మరొక వ్యక్తీకరణ. దీనంతటికీ వెనుక ఉన్నది జీవం, లైఫ్. అదేమిటో నీకెప్పటికీ తెలియదు.

-----------

నీకు జంతువుకు తేడా లేదు – ఈ వాస్తవాన్ని ఒప్పుకోడానికి నీకు యిష్టం ఉండదు. ఇద్దరి మధ్య ఉన్నఒకే ఒక్క తేడా ఏమిటంటే నువ్వు ఆలోచిస్తావ్. జంతువులు కూడా ఆలోచిస్తాయ్. కానీ మనిషిలో అది చాలా సంక్లిష్టంగా తయారయ్యింది – అదే తేడా. జంతువులు ఆలోచించవు అని నీవు నాకు చెప్పకు; అవి గూడ ఆలోచిస్తాయ్. అందులో అనుమానం లేదు. కానీ మనిషిలో అది చాలా సంక్లిష్ట నిర్మాణంగా (structure గా) తయారయ్యింది, ఇక్కడ సమస్య ఏమిటంటే ఈ ఆలోచనల నిర్మాణం నుండి ఎలా విముక్తి పొందాలి, తర్వాత ఈ లోకంలో అవసరమైన కార్యనిర్వహణకు ఒక పరికరంగా దీన్ని ఎలా వినియోగించాలి అన్నది – ఇంతకు మించి దీనికి ఏ ఉపయోగమూ లేదు – దీని ఉపయోగం ఏమిటంటే.. అప్పుడప్పుడు అనుకోకుండా వచ్చే చిన్నచిన్న అవసరాలు నీవు తీర్చుకోడానికి, విషయాలు ఒకరికొకరు తెలియజేసుకోడానికి, రోజువారీ పనులు చేసుకోడానికీ;

ఉదాహరణకు: రైల్వే స్టేషన్ ఎక్కడుంది? టమేటాలు ఎక్కడ దొరుకుతాయ్? మార్కెట్ ఎక్కడుంది? – అంతమాత్రమే. తాత్విక సిద్ధాంతాలు మాట్లాడుకోడం కోసం కాదు – అవి ఏమాత్రం అర్థం లేనివి. మనిషికి కావలసిన ప్రాథమిక అవసరాలు కూడు, గుడ్డ, గూడు; ఇంతకు మించి యితరమైనవి కోరుకోవడంతో మొదలవుతుంది నీ ఆత్మ వంచన, తరవాత నీ ఆత్మవంచనకు అంతంటూ ఉండదు. ఈ రకంగా ఆలోచించడంలో అర్థం లేదు. ఇది నిన్ను క్షీణింపజేస్తుంది.

----------

ఒకరి భావాలు మరొకరికి తెలియజేయడానికి తప్ప ఆలోచించడం అనవసరం. ఎల్లప్పుడూ నాలో నేను మాట్లాడుకోవడం ఎందుకు? దేనికోసం? "నేను సంతోషంగా ఉన్నాను", "నేను హేపీగా లేను", "నేను కష్టాల్లో ఉన్నాను", "అది మైక్రోఫోను", "ఇది ఒక మనిషి", "అతనొక రకం" – ఇలా ఎందుకు చేస్తున్నాం? ప్రతి ఒక్కడూ తనలో తాను మాటాడుకొంటాడు – ఇవన్నీ అతడు బయటకు వినిపించేలా మాట్లాడితే నువ్ వాణ్ని తీసుకెళ్లి పిచ్చాసుపత్రిలో జేర్పిస్తావ్. (నవ్వు..)

**ప్ర: మీరు చెప్పేదానితో నేనేకీభవిస్తాను, అవును, మనలో మనం మాట్లాడుకొంటే, బాగా అలసిపోతాము. అది మనల్ని కుంగదీస్తుంది, అందువల్లనే ఆ ఆలోచన్లను అంతం చేయడానికి మార్గాలు వెదుకుతాం.**

**యుజీ:** అది మనల్ని క్షీణింప చేస్తుంది. దాన్ని నియంత్రించడానికి మనం వాడే పద్ధతులన్నీ, దురదృష్ట వశాత్తు మనల్నింకా క్షీణింప చేస్తాయ్. మన పద్ధతులు, వ్యవస్థలు గూడ దీనికి ఇంకా దోహదం చేస్తాయ్. ఆలోచనలను ఆపడానికి నువ్వేమీ చేయలేవ్.

**ప్ర: సరే, మరి మీరేలా చెయ్యగలిగేరు?**

**యుజీ :** "ఆలోచించకుండా ఉండడం ఎలా?" అనేది మీ ప్రశ్న. ఆ ప్రశ్నలో అంతరార్థం ఏమిటో తెలుసా? నీకు ఒక దారి, ఒక పద్ధతి, ఒక తీరు, ఒక టెక్నిక్ కావాలి – అలా ఇంకా ఆలోచిస్తూనే ఉంటారు.

**ప్ర: నేను ఆలోచించ దలచుకో లేదు. ఈ ప్రశ్న సరిగ్గా లేకపోతే ఈ ప్రశ్నను మీరు సరిచేయండి.**

**యుజీ** : మీరు ఆలోచించ దలచుకోలేదన్న మాటను నేను పూర్తిగా నమ్మను. చూడండి, "నేను వీటితో విసిగి పోయాను" అని మీలో అనిపించేటంతటి స్థితికి మీయంతట మీరు రావాలి. మిమ్ములను ఎవరూ అక్కడకు తొయ్య లేరు.

**ప్ర: అంటే, నీవు చేయగలిగైనా ఉండాలి లేదా నీవు చేయ లేని స్థితిలో అయినా ఉండాలి ?**

**యుజీ** : చూడండి, అప్పుడు కూడా మీరు చేయలేరని మీకే తెలుస్తుంది. చూడండి, ఆలోచన దాని అవసరం వచ్చినపుడే ఉంటుంది. ఆ ఆవశ్యకత లేనప్పుడు అది ఉందో లేదో గూడా నీకు తెలియదు. అది ఉందా లేదా అనేది నేను పట్టించుకోను. కానీ దాని అవసరం ఉన్నపుడు అంటే నిన్ను గైడ్ చేయడానికి లేదా ఇతరులతో మాట్లాడడంలో నీకు సహాయ పడ్డానికి అది ఉంటుంది. ఆ అవసరం ఉందా లేదా అనేది నిర్ణయించేది ఇక్కడ(నీ లోపల) లేదు, అది బయట ఉంది. ఆలోచన ఉపయోగించాల్సిన అవసరాన్ని పరిస్థితులు కలిగిస్తాయ్. ఇది(ఆలోచన) తనంతట తానే మొదలు అవదు.

-----------

మనమందరమూ ఆలోచన గురించి మాట్లాడుకొంటున్నాం. ఆలోచనను చూడడం నీకు సాధ్యమా? కాదు, దీన్ని చూస్తున్నది మరొక ఆలోచన – అదే గమ్మత్తు– ఇది తనను రెండుగా విభజించు కొంటుంది. లేక పోతే నీవు ఆలోచనను ఛూడలేవ్. ఒక ఆలోచన మరొక ఆలోచనను చూస్తున్నపుడు అక్కడ రెండు ఆలోచనలు లేవు, ఒక్కటే ఉంటుంది. అక్కడ రెండు ఆలోచనలు ఉన్నట్టు నీకు అనిపిస్తుంది, కానీ అక్కడ ఉన్నది ఒకటే చలనం(movement). అందువల్ల ఆ విభజనను ఏది సృష్టిస్తుంది? ఆ విభజనను ఆలోచన సృష్టిస్తుంది -- అదే నీ యొక్క 'ఆలోచించడం' అనేదానికి నాంది. ఇది చాలా గమ్మత్తైన వ్యవహారం. ఇది ఒకే చలనం, అంతే కాదు, నువ్వు 'ఆలోచన' అని అంటున్న దాన్ని చూస్తున్నది, ఆ ఆలోచన గురించి నీ దగ్గరున్న నిర్వచనాలే.

"ఆలోచన అంటే ఏమిటి?" – ఈ ప్రశ్నను నీవు నీకే వేసుకో. నీవు దాన్ని ఎలా చూడ గలవు? ఆ ప్రశ్నే ఒక ఆలోచన, అవును కదా. "ఆలోచన అంటే

ఏమిటి?" – దీనికి ఆన్సర్ లేదు; నువ్వే ఆన్సర్ ఇచ్చినా అది ఒక నిర్వచనం మాత్రమే. నీవు ఎలాగైనా చెప్పచ్చు "ఆలోచనంటే ఇది, ఆలోచనంటే అది" అని (నేను ఎన్నో నిర్వచనాలు చెపుతున్నాను: ఆలోచన అంటే టైమ్; ఆలోచనంటే స్థలం,space; ఆలోచనంటే matter పదార్ధం) -- నువ్వు చెప్ప గలిగేది ఇంతే.

కానీ, నీవు నేరుగా ఆలోచనను చూడాలనుకొంటే, నీ అంతట నీవు కనుక్కోవాలనుకుంటే, నీకు దాన్ని చూసే దారి లేదు. అదేమిటో ఏమిటో నీ అంతట నీవు కనుక్కునే మార్గం లేదు, కారణం ఆలోచనను నీవు అనుభూతి చెంద లేవు (ఎక్స్ పీరిఎన్స్ చేయ లేవు) కాబట్టి; ఆలోచన గురించి నీకున్న జ్ఞానం ద్వారా మాత్రమే ఆలోచనని నీవు అనుభవం చేయగలవు. ఇతరులు నీకిచ్చిన ఆన్సర్లను నీవు అంగీకరించక పోతే ఏమవుతుంది?.... "ఆలోచన అంటే ఏమిటి" అనే ప్రశ్నకు ఏదో ఒకటి జరిగి తీరాలి. ఆ ప్రశ్న తనను దగ్ధం చేసుకుంటుంది, ఎందుకంటే మనకు తెలిసిన ఆన్సరు తప్ప మరో ఆన్సరు లేదు కాబట్టి. ఆ ప్రశ్నతనను తాను దగ్ధం చేసుకొంటుంది, అపుడు ఆ ప్రశ్న ఉండే చోటులో నీకున్నది ఆన్సర్, శక్తి (ఎనర్జీ). ఈ ప్రశ్న, యీ ఆలోచన.... అనేది ఒక పదార్ధం (matter). ఆలోచన తనంతట తాను దగ్ధమైనప్పుడు అక్కడ ఉండేది ఎనర్జీ (శక్తి), అదే అభివ్యక్తమయిన జీవం (manifestation of life). మరోలా చెప్పాలంటే, జీవం మరియూ శక్తి, రెండూ పర్యాయ పదాలు.

-------------

ఆలోచన ఎక్కడ నుండి వస్తుంది? లోపల నుండా, బయట నుండా? మానవ చైతన్యం (human consciousness) యొక్క మూల స్థానం ఎక్కడ ఉంది? ఇది నీకు అర్ధమయేట్టు చెప్పడం కోసం లేదా ఏ కొద్దిపాటి అనుభూతిని, ఒక ఫీల్ ని, ఇవ్వడం కొరకు నేను చెపుతున్నాను -- ఒక 'ఆలోచనా గోళం' (thought sphere) ఉందని. ఆ ఆలోచనా గోళం లోపట మనమందరం పనిచేస్తున్నాం(functioning), మనందరికి బహుశా ఒక ఏంటీనా, లేదా మనం పిలిచే ఏరియల్ లేదా మరోటి ఉంది; ఆ ఏరియల్ ని, మనం ఏ సంస్కృతి మధ్య పుట్టిమో, ఆ సంస్కృతి సృష్టించింది, ఆ

ఏరియల్ ఈ నిర్దిష్టమైన తనకు కావాలిన ఆలోచనలను గ్రహిస్తోంది (పికప్ చేస్తోంది).

ఈ మానవ చైతన్యం (human consciousness) యొక్క మూల స్థానాన్ని నీ అంతట నీవు కనుక్కోవడానికి ఏ మార్గాలూ లేవు, కారణం (నీ వరకు) అంతా అయిపోయింది, దానివల్ల నీవిపుడు ఆ చైతన్యం నుండి వేరు కాదు కాబట్టి. ఈ human consciousness యొక్క మూల స్థానం కనుక్కోవడానికి, లక్షల డాలర్లు వృధా చేసి, భౌతిక శాస్త్ర వేత్తలు మానసిక శాస్త్ర వేత్తలు పరిశోధనలు చేస్తున్నప్పటికీ, వాళ్ళు దాన్ని ఎప్పటికీ కనుక్కో లేరు. ఇది నేను చేస్తున్న పిడి వాదం గాని మరోటి గాని కాదు.

**ప్ర: ఏంటీనా ద్వారా ఆలోచనలను పికప్ చేసే సామర్థ్యం కొంత వరకు ఉంది. ఇపుడు, అసలు ఈ ఏంటీనా ఏమిటో పూర్తిగా తెలియకుండా ఆ సామర్థ్యతను పెంచగలమా?**

**యుజీ :** అది పెంచాలని మీరు ఎందుకు అనుకొంటున్నారు? నిజంగా ఆ పరిమితులు ఉన్నాయని నేను ఒప్పుకొంటున్నాను. (వైజ్ఞానిక పదాలు వాడితే), జన్యుపరంగా అంటే genetically చూస్తే, నా సమర్థతకు పరిమితి ఉంది. ఒక వ్యక్తి యొక్క సామర్థ్యం చాలా తక్కువ అని నేననుకొంటున్నాను -- నాకు తెలియదు. అది జీన్స్ బట్టి నిర్ణయింప బడుతుంది

**ప్ర: ఆ జన్యు వుల లోని శక్తిని లో చాలా చాలా తక్కువ మనం వాడుతున్నాం.**

**యుజీ :** చాలా అతి తక్కువ భాగం. ఏదో ఒక కారణం వల్ల, మనలోని సమర్థత ఒక పరిపూర్ణ దశకు పరిణామం చెందే అవకాశాన్ని మన సంస్కృతి పరిమితం చేస్తోంది. ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట (మానవ పరిమాణ క్రమంలో), ఆలోచన యొక్క అవసరం వచ్చి ఉండచ్చు, కానీ అది ఇప్పుడు మనిషికి శత్రువుగా తయారయ్యింది, దీనికి కారణం పరిణామక్రమ ప్రక్రియ యొక్క సమర్థతను బయటపడకుండా సంస్కృతి అడ్డుకోవడమే. ఒకవేళ పరిణామక్రమ ప్రక్రియ అనేది ఒకటి ఉంటే, నాకు తెలియదు, అది ఉంది అని నేను నిశ్చయంగా చెప్ప లేను కానీ అటువంటిది ఏదో ఉందని నాకు అనిపిస్తోంది. ఎందుకంటే ఈ సంస్కృతి ఒక

'పరిపూర్ణ మానవుడు, ఒక ధార్మికుడు, ఒక నిజమైన పెద్ద మనిషి, ఒక నిజాయితీపరుడు అనే వాటిని (అనే ఆశయాలను, ఊహలను) సృష్టించింది, కానీ ఇది మనిషి యొక్క  నిజస్వభావానికి వ్యతిరేకం. మనిషి లోపల ఉన్న ఆ స్వాభావిక గుణాన్నే (దీన్ని మీరెలా పిలవాలనుకొంటే అలా పిలవండి) 'వ్యక్తిత్వం (personality)' అని  నేను అంటాను.

వ్యక్తిత్వం అనే పదాన్ని, మానసిక శాస్త్రవేత్తలు చెప్పే అర్థంలో నేను వాడలేదు. ప్రతీ మనిషికీ తనదైన ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉంది, అది తనను తాను వ్యక్త పరచుకోడానికి ప్రయత్నిస్తోంది. కానీ సంస్కృతి ఒక 'నార్మల్ మనిషి' అనే ఊహను సృష్టించింది. చూడండి, 'సత్ప్రవర్తన పెంచుకొనడం'  (character-building) అనేది ఈ సమాజం కొనసాగించడానికే ఉంది. ఈ 'మంచి నడవడిక నేర్చుకొనే విధానం'  మనిషి లోపల ఉన్న దాన్ని అణగదొక్కి, బయట పడకుండా నిరోధించింది. నేను యీ అర్థం లోనే, వ్యక్తిత్వం అనే పదం వాడుతున్నా. ఈ ప్రపంచం లో ఇప్పుడున్న మొత్తం నాలుగు వందల కోట్ల ప్రజల్లో నీలాంటి వాడు ఒక్కడు కూడా ఉండడు. శారీరక ధర్మ పరంగా  మాట్లాడితే ప్రతి వ్యక్తీ ,  ప్రకృతి పరిణామప్రక్రియ యొక్క ఒక అసాధారణ సృష్టి. అందువల్ల ప్రతీ వ్యక్తీ ఒక ప్రత్యేకమైన మనిషి.

ఇక్కడ ఉన్నది తనను తాను వ్యక్త పరచుకొని ఒక మానవునిగా వికసించ డానికి ప్రయత్నిస్తోంది. మానవుడు జంతుప్రవృత్తులన్నీ పోగొట్టుకున్నాడు, కానీ మానవ ప్రవృత్తులను వృద్ధి చేసుకోలేదు. వీళ్ళందరూ మాట్లాడే దివ్యదృష్టి, దివ్యశ్రవణం లాంటి అతీంద్రియ (మానసిక) శక్తులన్నీ మానవ ప్రవృత్తులు  – ఇవి అవసరం, ఎందుకంటే మానవజీవికి కావాల్సినవి రెండు.  ఒకటి: ఏదోవిధంగా బతకేయడం. ఎందుకు బతకడం? నాకు తెలియదు; ఇది మూర్ఖపు ప్రశ్న. మనుగడ అన్నిటి కంటే ముఖ్యమైనది. మానవ జీవరాశికి తనదైన మనుగడ విధానం ఉంది, అది ఆలోచనా గమనం యొక్క మనుగడ విధానం కంటే భిన్నమైనది. రెండవది: తనను పునరుత్పత్తి చేసుకోవడం. అది తిరిగి ఉత్పత్తి చేసి తీరాలి. ఈ రెండూ జీవిస్తున్న మానవ జీవ' రాశి  యొక్క ప్రధాన స్వాభావిక లక్షణాలు.

వ్యక్తిత్వం తనను తన రీతిలో వ్యక్తపరచుకోవడం అసలు సాధ్యంకాకుండా చేసింది యీ సంస్కృతి, కారణం సంస్కృతికి వేరే అభిప్రాయాలు ఉన్నాయ్. ఇది మనిషిలో మానసిక రుగ్మతలను సృష్టించింది. ఆలోచన యొక్క విభజన గమనాన్ని (ఏది మంచిది, ఏది చెడ్డది అనే) సంస్కృతి సృష్టించింది. మనిషిలోపల ఉన్నదేదైనా బయటకు వ్యక్తమయి వికసించాలంటే ఈ ఆలోచన యొక్క విభజన గమనం ఆగిపోవాలి. ఆ అవకాశం మానవ శరీర యాంత్రికతలో ఒక భాగం. అది లోపల ఇప్పటికే ఉంది. అందువల్ల ఆలోచన యొక్క యీ విభజన గమనం (divisive movement), యీ మానసిక దౌర్బల్య స్థితి, అంత మవ్వాలి. కానీ మనం చేయగలిగినది ఏదైనా ఉందా?

**ప్ర : ఈ సమస్యను ఏవిధంగా పరిష్కరించాలి?**

**యుజీ:** ఇక్కడ సమస్య ఏమిటంటే, నువ్వేంచేసినా – నీవేదిశలో, ఏస్థాయిలో ఏంచెయ్యాలనుకొన్నా -- అది యీ ఆలోచనా క్రమానికి కొనసాగింపునిస్తుంది. మనస్సుకు దేహానికీ మధ్య ఉన్న వేర్పాటు (separation) పోవాలి. వాస్తవంగా అక్కడ సెపరేషన్ లేదు, ఆ రెండూ వేరు కాదు. మనస్సు అనే పదం వాడడానికి నాకు అభ్యంతరం లేదు. కానీ, అది ఒక ప్రత్యేకమైన స్థలంలో గాని, ప్రాంతం లో గానీ లేదు; నీ దేహం లోని ప్రతీ కాణానికీ దానియొక్క సొంత మైండ్ ఉంది, అదీ గాక అది పనిచేసే తీరు, ఇతర కణాలు పనిచేసే తీరుకు భిన్నంగా ఉంటుంది.

కాబట్టి, ఈ శరీరం లోని రసాయనిక ప్రక్రియ మొత్తం లో మార్పు రావాలి. ఒక రకంగా దేహంలోని రసాయనిక తత్వంలో సంపూర్ణమార్పు (alchemy) జరగాలి(నేనిలా చెప్ప వచ్చంటే). అదృష్ట వశాత్తూ మానవ జీవుల దేహంలో కొన్ని ప్రదేశాలు ఆలోచన యొక్క కంట్రోలులో లేవు. అవి గ్రంధులు, డక్ట్ లెస్ గ్లేండ్స్, వినాళికా గ్రంధులు. (ఇది నా అంతట నేను కనిపెట్టేను, మీరు ఒప్పుకోండి లేదా తిరస్కరించండి లేదా ఏదైనా చేసుకోండి మీ ఇష్టం).

**ప్ర: అదృష్ట వశాత్తూ అంటారా?**

**యుజీ** : అదృష్ట వశాత్తూ లక్కీగా, లేకపోతే మనిషి ఎప్పుడో అంతమయి పోయే వాడు. వాటిని నియంత్రించిన రోజు మనిషికి చివరి రోజు అవుతుంది: అతడు

అన్నిటినీ పోగొట్టుకుంటాడు. అతడు ఈ సామాజిక నిర్మాణంలో ఒక నట్ అండ్ బోల్ట్ అవుతాడు (ఒక 'మర' లా మారతాడు) – ఇప్పటికే అలా అయిపోయాడు. ఈ వ్యక్తిత్వానికున్న ఆ కొంచెం స్వతంత్రం, తనను తాను వ్యక్త పరచుకొనే ఆ కొంచెం అవకాశం కూడా లేకుండా పోతుంది.

ఈ గ్రంధులు, ఆలోచన యొక్క కంట్రోల్ లో ఉండవు. హిందువులు వీటిని 'చక్రాలు' అని పిలుస్తారు. ఈ చక్రాలు ఏ ఏ చోట్ల ఉన్నట్టుగా వాళ్ళు ఊహించారో సరిగ్గా అదే స్తానాల్లో ఈ గ్రంధులు ఉన్నాయ్. అవి అతీంద్రియ దేహం (psychic body) లో లేవు – చూడండి, వాళ్ళు ఊహించిన అతీంద్రియ దేహం, సూక్ష్మ దేహం, కారణ శరీరం  లాంటివి ఎక్కడా లేవు. వినాళికా గ్రంధులు అని పిలవబడే ఈ గ్రంధులే వాళ్ళ అనుభూతిలోకి వచ్చిఉంటాయ్. ఈ గ్రంధులు ఏ విధంగా పనిచేస్తాయి, ఇవి ఎందుకున్నాయి, అనే విషయాల పైన చాలా రీసెర్చి జరుగుతోంది, చాలా డబ్బు ఖర్చు పెడుతున్నారు – పిట్యుటరీ గ్లండ్(పీయూష గ్రంధి), పీనల్ గ్లండ్(పీనిఎల్), థైమస్ గ్లండ్(బాల గ్రంధి) వగైరా. "చక్రాలు" అనే పదాన్ని  వాడ్డం నాకిష్టం లేదు, డక్ట్ లెస్ గ్లండ్స్ అనే పిలుస్తాను. అవి ఏక్టివేట్ కాకపోతే, అవి పనిలోకి రాకపోతే  మానవులు... వారు వారిలా వికసించే అవకాశం పోతుంది. పరిణామ ప్రక్రియ అనేది ఉందో లేదో నేను చెప్పలేను కానీ, అటువంటి పరిణామ ప్రక్రియ ఒకటి  ఉన్నట్టుగా అనిపిస్తోంది. దాని స్వభావం ఏమిటి, దాని ఉద్దేశ్యం ఏమిటి అనేది నాకు తెలియదు. కానీ అది దేనినో సృష్టించడానికి ప్రయత్నిస్తున్నట్టుగా కనిపిస్తోంది. ఈ మానవ జీవరాశి  మొత్తమంతా ఒక విధమైన పుష్పం వలే వికసించక పోతే మనిషి అసంపూర్ణంగానే  మిగిలిపోతాడు. పుష్పం అనే పదం ఉపయోగించడం నాకిష్టం లేదు, ఎందుకంటే  దానిలో  మర్మర్థాలు కనిపించే అవకాశం ఉంది.

**ప్ర: Actualization? (నిజం కావడం ?)**

**యుజీ** : మనిషి సంపూర్ణ మానవునిగా నిజంగా అవడం – ఇది జరగకుండా అడ్డుకోనేది సంస్కృతి.   ఇదంతా నీ సిస్టమ్ (దేహం) నుండి బయటికి పోవాలి.

బయట ఉన్నది పోవడం కాదు – పుస్తకాలు కాల్చేయడం, దేవాలయాలు పడగొట్టడం కాదు నేను చెపుతున్నది.

**ప్ర: ఈ కల్చర్ (సంస్కృతి) ని బద్దలుకొట్టి బయటపడే శక్తి మనలో అంతర్గతంగా ఉందా?**

**యుజీ** : అదే నీవు, సమాజం నీలో ఉంది, బయట కాదు .ఆ సంస్కృతి, మానవ చైతన్యం)human consciousness)లో ఒక భాగం, నీకు పూర్వం మనిషి యొక్క అనుభవంలోకి వచ్చినది, అనుభూతి చెందినది, ప్రతీదీ, ఆ చైతన్యంలో ఒక భాగమే. [జె.ఎస్: మనకు తెలియని ఇతరుల అనుభవాలు మన consciousness లో భాగం కాగలవా?]

కానీ ఒక ప్రశ్నకు మనకు పూర్తిగా జవాబు దొరక లేదు, ఆ ప్రశ్న ఏమిటంటే, “ఈ సంస్కృతి ఒక తరం నుండి మరొక తరానికి ఎలా చేరవేయబడింది?” అది నిజంగా ఒక రహస్యమే. [జె.యస్ : ఈ మనలోని సంస్కృతి, మనిషి పుట్టిన తర్వాత చుట్టూ ఉన్న సమాజం నుండి గ్రహించినదీ, నేర్చుకొన్నదీ నేర్పబడినదే గాని, జెనిటికల్ గా, జన్యు పరంగా, పుట్టుక తోనే సంక్రమించినది కాదని నాకనిపిస్తోంది.]

అన్నీ అనుభవాలూ -- ఈ ముప్పై నలభై, ఏభై సంవత్సరాలలో మీకు కలిగిన అనుభవాలు మాత్రమే కాకుండా, జంతు జాతి కాన్షియస్నెస్, చెట్ల కాన్షియస్నెస్, 9పక్షి కాన్షియస్నెస్ – ఇవన్నీ కూడా, నేనంటున్న యీ కాన్షియస్నెస్ లో, చైతన్యంలో ఒక భాగమే. (ఒక సత్వం, తత్వం, ఒక వ్యక్తి లాంటిది, ఒక entity నీలో ఉంది, అది మళ్ళీ పుడుతుంది అని కాదు, అటువంటిదేదీ లేదు, నాకు సబంధించినంత వరకు ఈ పునర్జన్మ వ్యవహారమంతా absurd, అర్థం లేనిది). అందుకే, మీకు పక్షిలా ఎగురుతున్నట్టు కలలు వస్తాయ్. మనిషి యొక్క సెక్స్ ఫేంటసీస్ (లైంగిక విచిత్ర చిత్రాలు) జంతు భంగిమలు, వాత్సాయన కామ సూత్రాలు లాంటివి -- అవన్నీ ఆ కాన్షియస్నెస్ లో ఒక భాగమే, ఇవ్వన్నీ కూడా ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమిస్తాయ్, అవెలా సంక్రమిస్తాయో నాకు తెలియదు,

నేను చెప్ప లేను, అది చెప్పే సమర్ధత నాకు లేదు. కానీ దీనికి ఇదే దారి అనిపిస్తోంది, కొన్ని దారులు ఉండి తీరాలి, వీటిని చేరవేయడానికి....

**ప్ర: జన్యువుల(genes) కంటే యితర దారుల ద్వారా వచ్చే అవకాశం ఎక్కువా ?**

**యుజీ** : జన్యువుల ద్వారానే కాకుండా అంతకు మించి : కొంతవరకు జీన్స్ వల్లనే. విషయాలను (things ను) ఎక్స్ పీరిఎన్స్ చేయడంలో కాన్షియస్నెస్(చైతన్యం) చాలా శక్తివంతమయిన అంశం, కానీ ఈ కాన్షియస్నెస్ లోపల ఉన్న దానినంతటినీ కనుక్కోవడం ఎవరికీ సాధ్యం కాదు – అది చాలా విస్తారమైనది, చాలా పెద్దది.

**ప్ర: ఈ గ్రంధులు పనిచేయించడానికి మనమేవిధంగా దోహదపడ గలం ?**

**యుజీ** : ఒక విషయంలో వైద్య సాంకేతిక విజ్ఞానానికి నేను వ్యతిరేకకం. చూడండి.. మనిషిని అర్ధం చేసుకోవాలనే కోరికకు కారణం అతన్ని కంట్రోల్ చేయడానికి – అందుకే నాకు దానిపై ఎక్కువ సానుభూతి లేదు. ఎండోక్రయిన్ గ్రంధులను కంట్రోల్ చేసిన రోజున నీవు మనిషి వ్యక్తిత్వాన్నే మార్చేయ గలవు; అపుడు బ్రైన్ వాషింగ్ (నచ్చ చెప్పి ఒప్పించే పద్ధతి) అవసరం ఉండదు. బ్రైన్ వాషింగ్ అనేది ఒక పెద్ద పొడవైన ప్రక్రియ. ప్రకృతిని దాని మానాన దాన్ని వదిలేసి ఉండి ఉంటే, ప్రతి ఒక్కరూ ఒక ప్రత్యేకమైన పుష్పం అయి ఉండే వారు. ఈ లోకంలో ఒక్క గులాబీలే ఎందుకుండాలి? ఎందుకోసం? ఒక గడ్డి పువ్వులో లేదా ఒక డేండెలిన్ పువ్వు (ఒక రకమైన అడవి పువ్వు. దీనిలో వైద్య పరమైన పోషక పదర్ధాలు ఉంటాయ్) కూడా అంత అందంగా, అంత ప్రత్యేకత కలిగినదై ఉంటుంది. మల్లెలు గులాబీలు మాత్రమే ఎందుకుండాలి? అందువల్ల మార్పు వచ్చే అవకాశం ఉంది, అది అకస్మాత్తుగా వస్తుంది, కొంచెం కొంచెంగా రాదు. అది చాలా అకస్మాత్తుగా జరగాలి ఓ పెద్ద విస్ఫోటకంలా, మొత్తం అంతటినీ బద్దలు కొట్టేయడానికి.

**ప్ర : వ్యక్తి లో?**

**యుజీ** : అవును వ్యక్తి లో. దీనిలో సమాజానికి సంబంధించిన విషయాలు ఏమీ లేవు, దీనిలో మతపరమైన విషయాలు లేవు, రహస్యమైన విషయాలు లేవు – ఇటువంటివేమీ లేవు. ఇది మొత్తం మానవ చైతన్యాన్ని ప్రభావితం చేయచ్చు, కానీ

ఇది ఒక ఊహాగానం – దీన్ని గురించి నేనేమీ చెప్పలేను. కానీ దీని ప్రభావం ఉండి తీరాలి – ఉన్నది ఒకే ఒక మనసు, ఉన్నది ఒకే ఒక చైతన్యం(consciousness) ఇక్కడ ఏమి జరిగినా దాని ప్రభావం తప్పక ఉంటుంది కానీ ఆ ప్రభావం చాలా చాలా తక్కువగా ఉంటుంది.

**ప్ర: ప్రజలను కంట్రోల్ చెయ్యడానికి కాకుండా, యీ ఫలితాలు పొందదానికి దీన్నిఎలా ప్రోత్సహించాలి?**

యుజీ: కాదు, అక్కడ ఉన్న ప్రేరణ అంతా, మొత్తమంతటినీ మార్చడానికే. ఎలా చెయ్యాలి అనే నీ ఆసక్తి యొక్క అంతరార్థం మార్పుచేయాలని. దీన్ని నీవెందుకు అర్థం చేసుకోవాలనుకొంటున్నావ్? మీరర్థం చేసుకోకూడదని నేను చెప్పడం లేదు, కానీ అర్థం చేసుకోవాలి అన్నదాని వెనక మీ ఉద్దేశ్యం ఆ మార్పుని తీసుకొని రావాలని. అది మన సంస్కృతి లో ఒక భాగం. సంస్కృతి అది కావాలంటోంది.

చూడండి... ఇక్కడ ఎప్పుడూ యుద్ధం జరుగుతూ ఉంటుంది. తనను తాను వ్యక్త పరచు కోవాలని ప్రయత్నిస్తున్న ఇక్కడున్నదానికీ, దాన్ని అడ్డుకొనే సంస్కృతికీ మధ్య. ఊపిరాడకుండా గట్టిగా నొక్కి పట్టుకొన్న ఈ సంస్కృతి నుండి, నీవు విముక్తి పొందడానికి ఏదైనా మార్గం ఉందా, అది సాధ్య మేనా? నీవు ప్రయత్నించి అది చేయ గలవా? నీ సంకల్పంతో నీవు ఏదీ చెయ్యలేవు; దానంతట అది జరగాలి. అందుకే నేనంటాను అది అకారణమని.

గత చరిత్రలో యిలా కొంతమందికి జరిగినట్టుగా కనిపిస్తోంది. వారిలో ప్రతి ఒక్కరూ వారి వారి ప్రత్యేకతను తనదైన రీతిలో వ్యక్తం చేసేరు, ఆ విధానం, వారి వారి నేపధ్యం మీద ఆధారపడి ఉంటుంది. అది, వారి నేపధ్యం యొక్క వ్యక్తీకరణ. కానీ ఈ రకమైనది ఏ వ్యక్తికైనా ఈ రోజు జరగ వలసి ఉంటే -- అది జరిగి తీరాల్సిందే ఎందుకంటే ప్రకృతి దాని రీతిలో అప్పుడప్పుడు ఒక పుష్పం లాంటి మానవుణ్ణి, మానవ పరిణామక్రమం లోని ఆఖరి ఉత్పత్తిని, చివరి-ప్రోడక్టుని బయటకు విసురుతుంది. ఈ మానవ పరిణామక్రమం లోని చివరి ఉత్పత్తిని ఒక మోడల్ గా చేసుకొని, మరొకరిని సృష్టించడానికి యీ పరిణామప్రక్రియ ఉపయోగించుకోలేదు.

అది ఒక పుష్పాన్ని సృష్టించినపుడు, అంతే, దాన్ని భద్ర పరచి ఉంచలేవ్. దాని సువాసనను దాచి ఉంచలేవ్, ఎందుకంటే నీవు దాన్ని దాచి ఉంచితే అది కంపు కొడుతుంది. ఈ పరిణామ ప్రక్రియకు, లేదా ఈ పరిణామ ప్రక్రియా గమనానికి (నువ్వే పదం వాడదలచు కొన్నప్పటికీ) సంపూర్ణంగా పరిణామం చెందిన ఒక దాన్ని మోడల్ గా తీసుకొని మరొకటి సృష్టించడంలో ఆసక్తి ఉండదు; అది తన సొంతమైన కొత్త సృష్టిని చేస్తుంది.

కానీ నీవడుగుతున్న ప్రశ్నకు జవాబు చెప్పడం చాలా కష్టం ఎందుకంటే దానికి జవాబు లేదు. ఎలా అనేది పోయితీరాలి, ఇదొక్కటే మార్గం. 'ఎలా' అనేది పోయితీరాలి, కారణం 'ఎలా' అనేదాంట్లో... ఏదో ఒకటి చేసి, నీ శరీరం మొత్తంలో రసాయినిక మార్పును, ఒక రసాయనిక పరివర్తనను తీసుకొని రాగలిగే ఒక మార్గం, ఒక పద్ధతి, ఒక ప్రక్రియ ఉంది అనే అర్థం వస్తుంది. కానీ అటువంటి ఏ పద్ధతి అయినా నీవు ఆశించిన ప్రయోజనాన్ని రాకుండాచేస్తుంది. ఆ ప్రశ్నకు జవాబు కనుక్కునే మార్గాలేమీ లేవనే పరిస్తితిలో నీవున్నట్లు నీఅంతట నీవు కనుక్కొన్నప్పుడు, ఏదో ఒకటి జరిగడానికి ఆ క్షణమే సరైన సమయం. మొత్తమంతా జరగడానికి అవసరమైన అక్కడ ఉన్న ఆ మీట నొక్కబడడానికి, అక్కడున్న ఆ మీటకు సంబంధించిన (ట్రిగ్గరింగ్) పరికరాలు నీకు సహాయం చేయడానికి ఆ క్షణమే సరైన సమయం. అర్థం చేసుకోవాలనే కోరిక నుండీ లేదా మార్పు తీసుకొని రావాలి అనే కోరిక నుండీ నీవు విముక్తి పొంది, 'ఎలా' అనే ప్రశ్న అక్కడే ఉండి పోయినప్పుడు...(ఏం జరుగుతుంది?). ఆ ప్రశ్న ఒక ఆలోచనే కదా, ఆలోచనంటే కేవలం ఒక కంపనమే (ఒక వైబ్రేషనే) కదా. దానిలో అణునిర్మాణం అంతర్లీనమై ఉంటుంది: ఆ ఆలోచనలో ఒక అణువు నాటుకొని ఉంటుంది. ఆ ఆలోచన కదలలేనపుడు, అది ఏ దిశలో కూడా ఒక్క అడుగు గూడా ముందుకు వేయ లేనప్పుడు, ఆ ఆలోచనకి ఏదో ఒకటి అవ్వాలి.

అక్కడ 'ఎలా' అనే ఒక్క ఆలోచన మాత్రమే ఉంది. ఈ జీవికి ఇష్టమైన ఒక ప్రశ్న ఏమిటంటే "సంస్కృతి యొక్క బానిసత్వం నుండి, సంకెళ్ళ నుండి ఎలా బయట పడాలి?" అనేది. ఇదే ఈ జీవి లో ఉన్న ఒకే ఒక ప్రశ్న – ఇవి మాటల

రూపంలో కాదు, ఒక ఆలోచన రూపంలో కాదు – ఈ మానవ జీవి దేహం మొత్తం అంతా ఆ ఒక్క ప్రశ్నగా మారుతుంది. మీకు అర్ధమయ్యేట్టు నేను చెప్ప గలిగేనో లేదో నాకు తెలియదు. ఈ ఒక్క ప్రశ్నా, యీ ఒక్క ఆలోచనా ప్రతీ కణం లోనూ, ఎముకల్లోని మజ్జ లోనూ కొట్టుకొంటూ స్పందిస్తూ, సంస్కృతి అనే సంకెళ్ళ పట్టునుండి విముక్తి చెందడానికి ప్రయత్నిస్తోంది. అక్కడ ఉన్న ఆ ఒకే ప్రశ్న, ఒకే ఆలోచన, అదే రక్షించేది. ఆన్సర్ కనుక్కోనే మార్గమే లేదని, ఏమీ చేయ్యడం తనకింక సాధ్యం కాదని, ఆ ప్రశ్న తనకు తానే తెలుసుకొంటుంది, అందువల్ల అది పేలిపోతుంది. ఆ ప్రశ్నకు కదిలే దారి లేనప్పుడు, కదిలే చోటు లేనప్పుడు, విస్ఫోటకం జరుగుతుంది. ఆ ప్రేలుడు, ఒక పరమాణు విస్ఫోటకం, ఆటం బాంబు పేలుడు లాంటిది. అది, ఆలోచన యొక్క ఆ కంటిన్యూటీని బ్రేక్ చేస్తుంది, ఆలోచన కొనసాగించడాన్ని ఆపేస్తుంది.

వాస్తవంగా ఆలోచన కొనసాగించడం (కంటిన్యూటీ ఆఫ్ థాట్) అనేది ఉండదు, ఎందుకంటే ఆలోచనలు విడి విడిగా, విడి పోయి ఉంటాయ్. కానీ ఏదో వాటిని లింక్ చేస్తోంది, కలుపుతోంది. నీవు అంటున్న 'నేను లేదా self' లేదా సెంటర్' అనేది ఒక భ్రాంతి, అది మిధ్య అని నేను చెప్ప గలను, ఎందుకంటే 'నేను/self' అనే దాన్ని పరికించి నీవు చూసి నప్పుడు నీకు తెలుస్తుంది, 'నేను' ను గురించి నీకున్న జ్ఞానమే 'నేను' ను సృష్టించిందని. ఆత్మజ్ఞానం,'తనంతట తాను తెలుసుకున్న జ్ఞానం' లేదా 'తనను తాను తెలుసుకోడం', ('self-knowledge' or 'self- knowing') అనే మాటలు నా దృష్టిలో అర్ధం లేని మాటలు. ఇది జ్ఞానం(నాలెడ్జి) యొక్క పరిధి లోపలే ఉంది. ఇది తనతో తానే గారడీ చేస్తోంది.

కాబట్టి, యీ కంటిన్యూటీ అంతమవుతుంది తరవాత ఆలోచన దాని యొక్క సహజ లయలో(నేచురల్ రిధమ్లో) పడుతుంది. అపుడు అదింక ఆలోచనలను లింక్ చేయలేదు, ఒక ఆలోచనను తరవాత వచ్చే ఆలోచనలతో గొలుసుకట్టుగా కలప లేదు అంటే ఆలోచనల లింకింగ్ ఆగి పోతుంది. ఒక సారి ఆ లింకింగు బ్రేక్ అయినపుడు, తెగి పోయినపుడు, దాని పని సమాప్తం(it is finished), అంటే ఆలోచనలు గొలుసుకట్టుగా కొనసాగడం శాశ్వతంగా ఆగిపోతుంది. అప్పుడు ఒకసారి

ఆలోచన పేలడం కాదు; ఆలోచన, అది పుట్టిన ప్రతి సారీ పేలుతుంది. చూడండి, అది ఒక అణువిస్ఫోటనం లాంటిది. అది శరీరం అంతటినీ ముక్కలు చేస్తుంది. అదంత తేలికైన విషయం ఏమీ కాదు; అది మనిషి యొక్క అంతం – అది ఎలా ముక్కలు చేస్తుందంటే, దేహం లోని ప్రతీ కణాన్ని, ప్రతీ నాడినీ బద్దలు కొడుతుంది. ఆ క్షణంలో నేను భయంకరమైన శారీరక చిత్రవధలకు గురైయ్యాను. ఆ ప్రేలుడును నేను అనుభవించానని కాదు, ఆ ప్రేలుడును ఎవరూ అనుభవించ లేరు. కానీ తర్వాత కలిగే దాని ప్రభావాలూ, దాని పర్యవసానం, శరీరం లోని మొత్తం రసాయనిక తత్వాన్ని మార్చేస్తుంది. దాని తరవాత ఇంక ఆలోచన లింకప్ చేయ లేదు : అంటే, వస్తువులను, విషయాలను, అనుభవించాలని ఎప్పుడూ ఉండే ఆ కోరిక అంత మవుతుంది.

**ప్ర: ఈ ప్రక్రియను వీక్షించే వాడు గానీ లేదా వీక్షించేది గాని ఎవరైనా ఉన్నారా?**

**యుజీ** : వీక్షించే వారు ఎవరో ఉన్నారనే ఆ కృత్రికమైన గుర్తింపు (నేను అనే ఆ identity), ఆ భ్రాంతి అంతమై పోయింది. చూడండి, అప్పుడూ, ఇప్పుడూ కూడా అనుభూతులను అనుభూతిపొందుతున్నవాడు (ఫీలింగ్సుని ఫీల్ అవుతున్నవాడు) అక్కడ లేడు, ఆలోచనలు ఆలోచిస్తున్న వాడు అక్కడ లేడు, మాట్లాడుతున్నవాడు ఎవరూ అక్కడలేడు. ఇది దానంతట అది తనంత తానుగా, ఆటోమేటిగ్గా పనిచేస్తున్న ఒక వట్టి సింపుల్ కంప్యూటర్ యంత్రం. మీ ప్రశ్నమీద గాని, నా ప్రశ్నమీద గాని యీ కంప్యూటరుకి ఆసక్తి లేదు. తనలోని మెకానిజం అర్థం చేసుకోవాలననే ఆసక్తి యీ కప్యూటర్ కి లేదు, కాబట్టి మన తార్కికమైన హేతుబద్ధమైన ఆలోచనల వల్ల కలిగిన ఆ ప్రశ్నలన్నీ ఇక పైన చెల్లనివి. అవి వాటియొక్క ప్రాధాన్యతను కోల్పోయాయ్.

అందువల్ల, ఈ మెకానిజం, అక్కడున్న అసాధారణమైన ప్రజ్ఞతో ఆటోమేటిగ్గా పని చేస్తుంది. తనకేది మంచిదో దీనికి తెలుసు. దీన్ని దైవత్వం అని పిలవద్దు. మానవ శరీర యంత్రాన్ని నడిపిస్తున్న ఒక గొప్ప, అసాధారణ ప్రజ్ఞ (ఇంటెలిజెన్స్) అక్కడ ఉంది, యీ శరీరాన్ని రక్షించడమే దానికున్న ఇంటరెస్ట్. ఇది చేసే ప్రతీ పని తన మనుగడను కాపాడుకోవడం కొరకే – అదే దీని తాపత్రయమంతా.

అప్పుడు, జ్ఞానేంద్రియాలు చాలా ముఖ్యమైనవవుతాయ్: ఇవి, ఆలోచన యొక్క అవసరమైనప్పుడు తప్ప, ఆలోచన జోక్యం లేకుండా, పూర్తి సామర్ధ్యంతో పనిచేయడం మొదలు పెడతాయ్. ఇక్కడ ఒక విషయాన్ని నేను మీకు తప్పక స్పష్టం చేయాలి: ఆలోచన దానంతట అది పుట్టదు, అవసరం ఉన్నప్పుడే అది వస్తుంది. అది పరిస్థితుల ఆవశ్యకత మీద ఆధార పడి ఉంటుంది: ఆలోచన యొక్క అవసరం ఉన్న పరిస్తితి అక్కడ ఉన్నపుడు అది అక్కడ ఉంటుంది; అటువంటి పరిస్తితి లేనపుడు అది ఉండదు. నువ్వు ఉపయోగించే పెన్ను లాగ – నువ్వు అందమైన కవిత్వం రాయచ్చు, లేదా చెక్కుపై దొంగ సంతకం చెయ్యచ్చు లేదా ఆ పెన్నుతో మరొకటి చెయ్యచ్చు – దాని అవసరం వచ్చినపుడు అది ఉంటుంది. ఆలోచన యొక్క ప్రయోజనం సమాచారాన్ని అందజేయడం, కమ్యూనికేషన్ కొరకు మాత్రమే, అంతకు మించి దానికి ఏ విలువా లేదు. అప్పుడు జ్ఞానేంద్రియలే నీకు మార్గాన్ని చూపిస్తాయ్, ఆలోచనలు నిన్ను నడిపించవు. అందువల్ల ఇంద్రియ నిగ్రహం లాంటి మాటలన్నీ పనికి రానివి, వుత్త చెత్త. జ్ఞానేంద్రియాలలో అంతర్భూత నియంత్రణా యంత్రాంగం (బిల్ట్-ఇన్ కంట్రోల్ మెకానిజం) ఉంది; దాన్నిఅది బయట నుండి తెచ్చుకోనక్కరలేదు. ఈ యమ (సంయమనం, మితాహారం వగైరా), నియమ (ఆచారాలు) మొదలైన మాటలన్నీ రబ్బిష్(చెత్త) ; దీనిలో తనదైన స్వీయ-నియంత్రణా విధానం ఉంది. ఉదాహరణకు మీరు రుచి యొక్క జ్ఞానేంద్రియాన్ని కంట్రోల్ చేయడానికి ప్రయత్నించచ్చు కానీ ఇక్కడ, యీ స్తితిలో దాన్ని నిగ్రహించాల్సిన, నియంత్రించ వలసిన పని లేదు. ఈ భౌతిక జీవిని లేదా మానవ జీవిని (లేదా మీరు ఎలాగైనా పిలవండి) నడిపించేవి ఆలోచనలు కాదు, మనస్సూ కాదు, జ్ఞానేంద్రియాలు చేసే చర్యలు మాత్రమే.

-----------

**ప్ర ; ఒక సాధారణ మానవుడిలా.....**

**యుజీ:** నేను చెపుతున్నా... నీవు ఒక సాధారణ ప్రాణివి కాదు; నీవొక అసాధారణమైన జీవివి. (నవ్వు) నీ లాంటి వారు మరొకరు లేరు. ఉపనిషత్తులలో చెప్పినట్టు ఆ 'అద్వితీయం' ('రెండవది లేని ఆ ఒక్కటీ') నీవే. ఇది జరగడానికి

కారణం నీవేదో చెయ్యడం వల్లా కాదు, ఏమీ చెయ్యక పోవడం వల్లా కాదు. అందుకే నేను 'అకారణం' అనే పదం ఉపయోగిసస్తున్నా – ఇది సంభవించడానికి కారణం ఏమీలేదు. కార్య కారణ సంబంధాన్ని స్థాపించడంలో ఆసక్తి చూపే ఆ ఆలోచనల నిర్మాణం ఇకపైన అక్కడ లేదు. దీనికి మిగిలి ఉన్నదొక్కటే. ఏదో రకంగా బతకడం, ఆ మనుగడ పరిమితమైనది: దాని గతిభారం (momentum) దానికుంది, ఆ గమన-శక్తి పోయినప్పుడు, అది అంతమైపోతుంది. అది శరీరధర్మపరంగా గాని, మరోలా గాని మరొకరిని పునరోత్పత్తి చేయలేదు. ఈ కారణం వల్లనే, నేనంటాను, ఇది మానవ పరిణామక్రమంలో ఆఖరి దశ (end product) అని. ఒక పుష్పాన్ని గాని, మరో మానవున్ని గాని పుట్టించవలసిన అవసరం లేదు,– అందుకే అంటాను దేహం లోని రసాయినకత అంతా మారిపోతుందని. హార్మోన్స్ (వినాళ గ్రంధుల స్రావం) మారుతాయి, నీవు ఇంక పురుషుడువీ కాదు స్త్రీవీ కాదు. అటువంటి మనిషి ఈ సమాజానికి ఏ విధంగానూ ఉపయోగపడడు, అంతే కాదు, అతడు మరొక సమాజాన్ని సృష్టించ లేడు. (నవ్వు..)

పరిపూర్ణత (Perfection) అనేది ఒక పెర్రి ఆలోచన. ఒక భాష మాట్లాడ్డం లేదా ఒక సంగీత పరికరాన్ని వాయించడం మొదలైన వాటిలో సంపూర్ణతను సాధించవచ్చు కానీ నేను చెప్పేది అదికాదు. సంవత్సరాల తరబడి సాధనచేసి పరిపూర్ణ మానవునిగా అవ్వాలని నువ్వు కోరుకొంటున్నావ్, అది పరిపూర్ణతను తీసుకొని రాగలిగే విషయం కాదు. దీనికి గేరంటీ లేదు, ఇది ఎందుకు జరుగుతోంది అనే ప్రశ్నకు జవాబు లేదు. ఇది పునరుత్పత్తి చేయలేనిది. పరిపూర్ణ పురుషుడు (ఒక పెర్ఫెక్ట్ మేన్) అనే, ఆదర్శాన్ని వాళ్ళు మన ముందు ఉంచారు, అదే మొత్తమంతటినీ తప్పు దారిలో పెట్టింది. పెర్ఫెక్ట్ మేన్ అనే వాడు అసలు లేనేలేడు. ఎవరిలో ఈ జన్యు పరివర్తన (mutation- మీరీ యీ పదాన్ని వాడదలచు కొంటే) జరిగిందో అతడు ఏ లోపాలూ లేని పరిపూర్ణ పురుషుడు కాదు; అతనికి, పర్ఫెక్ట్ మేన్ కి ఉండని విచిత్ర ప్రవర్తనలు, బుద్ధిహీనత, అర్ధరహిత ప్రవర్తన,.. అన్నీ ఉంటాయ్ – దీనికి దాంతో పనిలేదు. అతడు సూపర్ డూపర్ జీనియస్ (మేధావి) అవలేడు – రేపు అతడు కొత్త విషయాలు కనిపెట్టి మనిషిని తీసుకెళ్లి ప్రతీ గ్రహం

మీద పెట్టలేడు – అటువంటివదేమీ కాదు! అతని బలహీనతలు అలాగే ఉంటాయ్ – ఇవి (యీ బలహీనతలు) పుట్టుకతో సంక్రమించినవి.

------------------

నేను నా చర్యలను  ప్రశ్నించుకోవడం, వాటిని చేసేముందు గానీ, చేసిన తరువాత గానీ, పూర్తిగా ఆగిపోయింది. నైతిక విలువలకు సంబంధించిన ప్రశ్నలు – నేనిలా చేసి ఉండాల్సింది, నేనిలా చేయకుండా  ఉండాల్సింది, నేను అలా అనకుండా ఉండాల్సింది..  మొదలైనవి నాలో  లేవు. నాలో పశ్చాత్తాపాలు లేవు, క్షమాపణలు లేవు; నేను చేసేదంతా ఆటోమేటిక్ గా, యాంత్రికంగా  జరిగిపోతుంది. ఏ పరిస్థితిలోనైనా నేను ప్రవర్తించిన దాని కంటే భిన్నంగా ప్రవర్తించే శక్తి నాలో లేదు. తార్కికంగా, హేతుబద్ధంగా ఆలోచించ వలసిన అవసరం నాకులేదు – అదేమీ లేదు. – ఒక ప్రత్యేక పరిస్థితిలో ఒకప్పుడు జరిగే  నా చర్య ఒకటే, అంటే వేరే చర్య ఆ టైములో జరగదు.  కానీ,  అదే పరిస్థితి మరోసారి వచ్చినప్పుడు నా చర్య,  వేరేలా ఉంటుంది. ఆ రెండు పరిస్థితులు మీకు ఒకే రకమైనవిగా  అనిపించ వచ్చుగానీ, నాకు కాదు, ఎందుకంటే, తెలియని ఒక అంశం, ఒక కొత్త ఫేక్టర్ అక్కడ ఉండడం వల్ల,  నా చర్య వేరుగా ఉంటుంది. నీకది నాలో  స్థిరత్వం లేనట్టుగానూ, నా చర్యలు పరస్పర విరుద్ధం గానూ కనిపిస్తాయ్. అలా కాకుండా మరొక విధంగా నేను చేయలేను – ఆ రెండు చర్యల మధ్య ఏ  సంబంధమూ ఏ కనెక్షనూ లేదు. (అంటే గతం వర్తమానం పైన తన ప్రభావాన్ని చూపదు)

అది భౌతిక మైనది, మానసిక మైనది కాదు – ఆ క్షణంలో అక్కడ ఏం జరగడం లేదో  అది నాకు గుర్తుండదు, అంటే గుర్తుకు రాదు. (అంటే... జరుగుతున్నది మాత్రమే నా మనసులో ఉంటుంది.) – అక్కడ రియాక్షన్ (ప్రతిక్రియ) లేదు, రెస్పాన్స్ (స్పందన) మాత్రమే. కానీ మీరెప్పుడూ రియాక్ట్ అవుతూ ఉంటారు – 'అవును, కాదు' 'ఇది-సరైనది, సరైనది-కాదు' అనే ఒక జడ్జ్-మెంట్, ఒక నిర్ణయం అక్కడ ఉంటుంది. నేను మాట్లాడే యీ  రెస్పాన్స్ (స్పందన) అనేది అక్కడ అపుడున్న పరిస్థితుల వల్ల కలిగే ఒక భౌతిక స్పందన. నేనెప్పుడూ భౌతికస్థాయి లోనే పనులు నిర్వర్తిస్తూ ఉంటాను. మిమల్ని చూసినప్పుడు  నాలో

ఏ రకమైన ఆలోచించడం ఉండదు; నా కళ్ళు మీ మీదే కేంద్రీకరింపబడి ఉంటాయ్. నేను యీ వైపు తిరిగితే, మీరు పూర్తిగా తుడిచిపేయ బడతారు (నా మనసులోంచి), అక్కడ ఆ డోర్-నాబ్ ఉంటుంది, మీరుండరు; నా వరకూ మీరిక అసలు లేనే లేరు, మనసులో గూడా. (మనస్సు అనేది లేదు). అవసరముంటేనే మీరు గుర్తొస్తారు -- మీరు ప్రశ్నలు వేసినపుడు. ప్రతిక్రియ (రియాక్షన్) అంటే దాని గురించి ఆలోచించడం: తప్పు, ఒప్పు, మంచి, చెడు వగైరా. స్పందన (రెస్పాన్స్) అంటే ఆలోచనల జోక్యం లేకుండా కేవలం చూడ్డం మాత్రమే, జస్ట్ లుకింగ్. స్పందన భౌతికం; ప్రతిక్రియ మానసికం. మీరు ఎప్పుడూ రియాక్ట్ అవుతూ ఉంటారు; మీరు బయట ఉన్న వాటికి భౌతికంగా స్పందించడం లేదు.

-----------------

**ప్ర: ఎవరైనా మిమ్మల్ని కొట్ట డానికి ప్రయత్నిస్తే, ఎదుర్కో డానికి తయారుగా ఉంటారా?**

**యుజీ** : అది ఒక ఊహ్ జనితమైన పరిస్తితి. బహుశా అతన్ని నేను తిరిగి కొట్టచ్చు, నాకు తెలియదు. నేను అహింసా మార్గన్నీ బోధించే వాణ్ని కాదు. బహుశా. చూడండి, నేనిప్పుడు ఏమీ చెప్పలేను. ఇక్కడ సమస్య ఏమిటంటే మీరు ఏ పరిస్తితినైనా ఎదుర్కొడానికి తయారుగా ఉండాలనుకుంటారు.

**ప్ర: ఒక వేళ ఎవరైనా మిమ్మల్ని కొడితే మీరు భయపడతారా?**

**యుజీ** : భౌతిక పరమైన భయం అనేది ఉంది – మానవజీవుల యొక్క రక్షణకు ఆ భయం చాలా అవసరం. అది చాలా ముఖ్యం. ఏ పరిస్తితిలో ఏం చేయాలో అన్నది ఆ భౌతిక జీవికి తెలుసు, దాని గురించి నీవు ఆలోచించాల్సిన పని లేదు. దానికి ప్రిపరేషన్ లేదు. ఎదురుగా ఒక పాము కనబడితే వెనక్కి అడుగేస్తావ్. అంతే; దాని గురించి నీవు ఆలోచించవు. భౌతిక జీవికి కావలసినదంతా తన శారీరిక రక్షణ మాత్రమే. అంతకంటే ఏమీలేదు.

నీ జీవితంలో ముందుముందు జరిగే అవకాశంఉన్న ప్రతిఒక్క పరిస్తితినీ, ఊహించుకొని, వాటిని ఎదుర్కొడానికి ఎలా సిద్ధపడాలన్న విషయం, ఆ

ఆలోచనాక్రమం (structure) ఎల్లప్పుడూ ఆలోచిస్తూ ఉండడం నిరర్ధకం. ఎందుకంటే ప్రతి పరిస్తితీ ఒకేలా ఉండదు.

లైఫ్ (జీవం) నీకు దోవ చూపిస్తుంది. లైఫ్ అనే పదం వాడ్డం నాకిష్టం లేదు, ఎందుకంటే ఆ పదం గూఢార్ధాలతో మొత్త మంతటినీ గందర గోళం చేస్తుంది, ఈ జీవికి కావలసినది తనను తాను రక్షించుకోవడం. ఆ పని ఎలాచేయాలన్నది దానికి తెలుసు. నేను వాకింగ్ కు వెళ్ళినపుడు నా ఫ్రండ్స్ తో చెపుతూ ఉంటాను "దయచేసి చూస్తూ నడవండి, ఆలోచనలో పడకండి" మీరు ఆలోచించాల్సిన అవసరం లేదు. మీ కళ్ళను చెవుల్ని ఉపయోగించండి, అవే మీకు దారి చూపిస్తాయ్, గైడ్ చేస్తాయ్.

-------------------

చూపులో అసాధారణమైన స్పష్టత వస్తుంది. చెవుల శ్రవణయాంత్రికత చాలా చాలా సున్నితంగా తయారవుతుంది. అంతే; ఆలోచనలో స్పష్టత ఉండడం కాదు. ఇప్పుడు వాళ్ళు చెప్పేది ఇంద్రియ స్పందన లేకుండా చేసుకోవడం (ఇంద్రియ నిగ్రహం). వాళ్ళు పొందాలని ప్రయత్నిస్తున్నది దీనికి విరుద్ధమైనది. ఇక్కడ, ఇంద్రియాలను, వాటి కార్యకలాపాల నుండి దూరంచేయడం ఉండదు. ఇక్కడ ఇంద్రియాలకు ఆటవిడుపు. అవి వాటికి కావలసిన చోటికి వెళ్లచ్చు, కావలసినది ఆలోచించవచ్చు...ఏ ఆలోచన వస్తే అది. గంగా ప్రవాహంలా: నది ఒడ్డు నుండి నీవు సగం కాలిన దేహాలను విసిరేస్తావ్, చెండాలమైన మురుగు నీళ్ళు, చెత్తంతా; అయిదు నిమిషాలు తర్వాత, స్వచ్ఛమైన నీళ్ళు. ఇలాగే ఆలోచనలు గూడా: మంచి ఆలోచన అనేది, చెడు ఆలోచన అనేది ఏదీ లేదు; ఇంద్రియసుఖ సబంధిత ఆలోచనలు, దైవిక ఆలోచనలు అనేవి లేవు; అన్ని ఆలోచనలు ఒకటే.

మీరడగచ్చు "అటువంటి మనిషికి ఇంద్రియ సుఖాలకు సంబంధించిన ఆలోచన ఎలా వస్తుంది?" అని. అటువంటి అలోచనను అణిచి వేయడడం కొరకు గానీ, ఆ ఆలోచన కార్య రూపం దాల్చడానికి గానీ అతడు చేయ గలిగినదేమీ ఉండదు. ఇది ఒక నిజం, ఒక వాస్తవం. అప్పుడప్పుడు నా భార్యతో నాకు కలిగిన లైంగిక సుఖానుభూతుల జ్ఞాపకాలు అనుకోకుండా సడన్ గా ఎక్కడనుండో వస్తాయ్. కానీ యీ ఆలోచనలు తాము స్థిరపడడానికి ప్రయత్నించినపుడు, నీ లోపల ఉన్న ప్రతీదీ

బిగుసుకు పోతుంది. – నీవేమీ చేయనక్కర లేదు. ఆలోచనలు అక్కడ నిలవలేవ్ – అక్కడ కంటిన్యూటీ లేదు, బిల్డ్-అప్ లేదు – తనకు తెలుసు అదేమిటో, అది అక్కడ ఆగిపోతుంది – మరొకటి ఏదో పైకొస్తుంది. కానీ మీ విషయంలో అది అక్కడ ఆగిపోదు; నీవు అంటావ్ "ఈ ఇంద్రియ సుఖాలకు సంబంధించిన ఆలోచనలు నాకెందుకు వస్తున్నాయ్?"అని. ఈ యింద్రియ సుఖ సంబంధిత ఆలోచనలు నీలో ఉన్నప్పుడు నీవు స్వేచ్ఛగా లేవని అనుకొంటావ్; కానీ అవి నీకు లేనపుడు నీవు బతికున్న మనిషివి కావని నీవు నిర్ధారించుకోవచ్చు. సాధువైనా, పాపి అయినా ప్రతీ ప్రేరేపణకు స్పందించాల్సిందే. ఉత్పాదనం(సబ్లిమేషన్) అనేది ఏదీలేదు. అదంతా నాన్సెన్స్. అలా చెప్పే సాధువులు అబద్ధాలు చెపుతున్నారు. అదంతా రబ్బిష్ – అవన్నీ నమ్మకండి. నీవు పాపాత్ముడవని నిన్నునీవు నిందించుకోడంలో అర్థం ఉందా? నువ్వేం మాట్లాడుతున్నావ్, నాన్సెన్స్! స్త్రీని చూసినపుడు స్పందించాలి, ఒక భౌతిక స్పందన కలగాలి – లేదంటే నీవు శవంతో సమానం.

కానీ ఇక్కడ నిరంతరత (కంటిన్యూటీ) లేదు, నో బిల్డప్. మరొక ఆలోచన ఏదో వస్తుంది. ఆలోచనలు ఒస్తుంటాయ్, పోతుంటాయ్; అవే ఆలోచనలు తిరిగి తిరిగి వస్తూ ఉంటాయ్ – అది ఒక సరదాగా అనిపిస్తుంది. ఆ సరదాని ఆనందించడానికి నేను ఆలోచనలను చూడడం కాదు. ఆలోచనలు అక్కడ ఉన్నట్టు ఎప్పుడో గాని తెలియదు. అవి అక్కడ స్థిరంగా ఉండలేవ్; అవి ముందుకు వెడుతూ ఉంటాయ్. నీవు ప్రోబ్లమ్ గుర్తించి నప్పుడు గూడా, అవి అక్కడ ఎక్కువ సేపు ఉండలేవు; మరో ఆలోచన వచ్చి అక్కడ ఉన్నదాన్ని బయటకు నెట్టేస్తుంది. నీవేమీ చేయనక్కర లేదు; అక్కడ ఏం జరుగుతోందో తెలిసే లోపల అది మాయమవుతుంది. నీవు చూడాలని ప్రయత్నిస్తే అది అక్కడ ఉండదు; నీవు చూస్తున్న ఆలోచన అంతకు ముందున్న దాని కంటే చాలా భిన్నమైనది. అవి సమస్యలు కావు; నీవొక చోట కూర్చొని ధ్యానం చేసి వాటిని నియంత్రించడానికి ప్రయత్నించినపుడు మాత్రమే అవి సమస్యలు గా మారతాయ్. ఆలోచనలు నూతిలో నీరులా నీ లోపల ఊరుతూ ఉంటాయ్. నీవు వాటిని ఎలా కంట్రోల్ చెయ్య గలవు? అవి నీ కంట్రోల్ లో ఉండవు.

వాటిని నియంత్రించడం నీకు సాధ్యం కాదు. అది వృధా శ్రమ. నీవు చేయాల్సినది ఏదీ లేదు.

ఈ మనిషి ఒక రాయి కాదు; జరుగుతున్న ప్రతిఒక్కటీ అతన్ని ప్రభావితం చేస్తుంది. చుట్టూ రక్షణ కవచాన్ని సృష్టించు కోవాలనే ధ్యాస గూడా అతనికి ఉండదు. మతపరమైన మనిషి అతని చుట్టూ ఒక రక్షణ కవచాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఒక దానితో మరొకటి కలుపుకొంటూ ముందుకు సాగే ప్రక్రియ ఇక్కడ ఆగిపోయింది: యిక్కడ జరిగేది భౌతిక చర్య మాత్రమే – చర్యలు భౌతిక స్థాయి లోనే ఉంటాయి. ఇంద్రియాలు అడవి గుర్రాల వలె పరుగులు తీస్తాయ్ – వాటిని అదుపులో పెట్టే వాళ్లెవ్వరూ లేరు – పరిస్థితుల అవసరాలకు అనుగుణంగా అవి ఇక్కడ, అక్కడ, అన్ని చోట్లా పరిగెడతాయ్. ఈ చర్యే జీవన గమనం అంటే. యిదే అసలైన జీవనం (the real movement of life). దీనికి ఒక దిశ ఉండదు. నీ అసహాయతను నీవు అంగీకరిస్తే, నీవు గ్రహించ గలిగితే, నీ సమస్య తీరిపోతుంది – అందుకే నేనంటాను నీకు క్రియా స్వాతంత్రం లేదని (there is no freedom of action for you). నేను మాట్లాడుతున్నది 'అన్నిటికీ అదృష్టమే కారణం, తలరాత అనే వేదాంతం కాదు, నేను చెపుతున్నది... గతం జోక్యం చేసుకొని వర్తమానానికి రంగులు పులమకుండా ఆపడం గురించి.

------------------

ఊర్ధ్వరేతస్సు(sublimation of sex energy) గురించి చెప్పే మాటలన్నీ అర్ధ విహీనమైనవి, అదంతా నాన్సెన్స్, హంబక్. నేనెందుకు యింతగా నొక్కి చెపుతున్నానంటే దీనిపై నేను ఇదివరకు, ప్రయోగాలు చేసేను, అందువల్ల అదేమిటో నాకు తెలుసు. లైంగిక శక్తిని విడుదల చేయకుండా దాన్ని పరిరక్షించి, ఏ విధంగానూ నిన్ను నీవు బాగు చేసుకోలేవ్. ఇది వెర్రితనం, అర్థం రహితం. దీని గురించి వాళ్ళు ఎందుకింత గట్టిగా చెపుతున్నారు? మితాహారం, ఇంద్రియనిగ్రహం, బ్రహ్మచర్యం మొదలనవి నిన్ను ఈ స్తితిలో పెట్టడానికి ఏవిధంగానూ సహాయ పడవ్. (నవ్వు...) లైంగిక కార్యం నీవు యీపేళ చేసినా, ఇది నీకు రేపు జరగచ్చు – యిది సెక్స్(రతికార్యం) ద్వారా గూడ జరగచ్చు. అనుభూతి చెందే వాడెవడూ లేని ఒక

క్షణం ఒకవేళ ఉంటే, ఇటువంటిది సంభవించగల క్షణం అదే. అది అధ్యాత్మిక గురువు యొక్క ఉపన్యాసమే కానక్కరలేదు; అ రాలుతున్న ఎండుటాకు గానీ, అంబా అంటున్న ఆవు గానీ, అ సకిలిస్తున్న గుర్రంగానీ, లేదా అక్కడ జరుగుతున్నది ఏదో ఒకటి ఈ గారడీ (ట్రిక్) చేయ గలదు – ఎందుకంటే నీవు దేనినీ అనువదించకుండా ఉంటే, అదే దాని సంగతి చూసుకొంటుంది.

సబ్లిమేషన్(ఉత్పాదనం) అనేది ఏదీ లేదు. పైకి వెళ్ళడం అనేది ఏదీ లేదు. అది బయటికి మాత్రమే వెడుతుంది – కానీ యోగులు యిది ఒప్పుకోరు. వాళ్ళు నిజాయితీ గల వారైతే వాళ్లేమి చెపుతున్నారో వాళ్ళకి తెలుస్తుంది. కాబట్టి అదీ దాని సంగతి.

దురదృష్టవశాత్తూ సెక్స్ ను (లైంగిక కార్యాన్ని) ఇతర కార్యకలాపాల నుండి వేరు చేశారు. ఎందుకు? – నేనెప్పుడూ ఆశ్చర్యపోతూ ఉంటాను. అన్నీ ఒకటే. దాన్ని వేరు చేయలేం. దాన్ని వాళ్ళు వేరే లెవెల్ లో ఎందుకు ఉంచారు? దీన్ని వేరే విధంగా చూడ్డం వల్లనే సమస్య ఉత్పన్నమయ్యింది, ఇక్కడే కాదు, పశ్చిమ దేశాల్లో కూడా. క్రైస్తవ మతం కూడా వాటిని వేరు చేసింది. రక్షణ గురించిన లేదా ఆస్థి గురించిన కారణాలు అవ్వచ్చు. కానీ వీటిని అధిగమించే దారులు ఇప్పుడున్నాయ్ – ఆ రోజుల్లో ఇది అంత తేలిక కాదు.

**ప్ర: ఒక చక్కని పదం ఉంది, నరాల బలహీనత (నెర్వస్ బ్రేక్ డౌన్)**

**యుజీ:** మతమే దీనికి బాధ్యురాలు – మతం మనలో దాన్ని సృష్టించింది. మనం చేసే పనులను ప్రశ్నించడం అనేది నిజంగా ఒక నైతిక విలువల సమస్య. మనకిపుడు కొత్త నైతిక విలువలు తప్పక ఉండాలి – అది అవసరం, లేదంటే మనం పనులు నిర్వర్తించుకోలేం. అదీ యిప్పుడున్న సమస్య. పాశ్చాత్య దేశస్తులు ఇపుడు కొత్త విలువలకై వెతుకుతున్నారు. పాత విలువలకు యిపుడు కాలం చెల్లింది, అవి ఈ కాలానికి సరిపడవు, వాటి పని అయిపోయింది. సెక్స్ ను ఎవరు పట్టించుకొంటారు? సెక్స్ యిపుడు ఎంత సులభం అయిందంటే ప్రతి ఒక్కరూ దాన్ని గురించి మాట్లాడు తున్నారు. కొత్త శాకాన్ని సృష్టించిన ఒక గొప్ప ఆధునిక డిస్కవరి

ఏమంటే, బర్త్ కంట్రోల్ పిల్ (గర్భ నిరోధక మాత్రలు) – ఇది మొత్తమంతటినీ మార్చేసింది.

----------------

నేను మిమ్మల్ని ఒక విషయం అడగొచ్చా? మీ ఉద్దేశ్యం ప్రకారం సాధారణ మానవుడు (నార్మల్ మనిషి) ఎవరు? ఎవరైనా ఉన్నారా? అఫ్కోర్స్ మీరు మనుష్యులను వివిధ రకాలుగా విభజించారు. అయినా మానసికమైన లేదా తత్వపరమైన సాధారణ ప్రమాణాలు పద్ధతులు, నియమాలు (norms) కొన్ని మీకు ఉండచ్చు... లేదా ఆరోగ్యవంతుడంటే ఏమిటి ? ఆరోగ్యం అంటే ఏమిటి? అప్పుడప్పుడు నేను ఆశ్చర్యపోతాను... నార్మల్ మనిషి అంటే ఎవరని? ఈ ప్రశ్న నాలో ఉందని కాదు నేనంటున్నది.

**ప్ర: ఇది సాధారణం (నార్మల్) అనేది సంఘం, ఈ సమాజం నిర్దేశిస్తుంది. సాధారణ మానవుడు ఎప్పుడూ మిగతా ప్రజలతో కలిసి ఉంటాడు, విడిగా ఉండడు, అందువల్ల కొన్ని సద్దుబాట్లు చేసుకొంటాడు – నాకున్న నిర్వచనం ఇదొక్కటే.**

**యుజీ:** ఒక అసాధారణ మనిషి గూడా సాధరణ మనిషిలా ఈ సంఘంలో జీవించ వలసినదే; అతడు పారిపోయి గుహలో జీవిస్తూ ధ్యానం చేస్తూ గడపలేడు. అతనికి యీ సమాజంతో ఏవిధమైన సంఘర్షణ ఉండనే ఉండదు. అతడు ఈ ప్రపంచం యొక్క వాస్తవికతను (reality) అంగీకరిస్తాడు, అది ఏ మాత్రం నిజం(real) కానప్పటికకీ. ఆంతేకాక, అతడు అందరూ అంగీకరించిన నిజాన్ని అంగీకరిస్తూ యీ లోకంలో వ్యవహరిస్తాడు. ఇది చాలా ముఖ్యం: "నేనే బ్రహ్మను" అని నాలో నేనే చెప్పుకుంటూ బహ్మ గురించి ధ్యానం చేస్తూ ఓ గుహలో కూర్చోలేను. అటువంటి మనిషికి ఇది ఒక్కటే నిజం, ఇది తప్ప మరో నిజం లేదు. అంతిమ నిజం (ultimate reality) అనేది తెలివి తక్కువ భావన, అది అర్ధ రహితం, అది, అంతిమ నిజం అనేది లేదు, అది ఒక భ్రమ. ఇదొక్కటే నిజం. ఇంత కంటే నిజం ఏముంటుంది? సమాజం యొక్క ఫీలింగ్సు నీవు ఫీలైనంత కాలం నీవు ఆ సమాజంలో ఒక భాగం. నీ సొంత ఆలోచనలనేవి, నీ సొంత అనుభవాలనేవి, నీ సొంత ఫీలింగ్స్ అనేవి నీకు లేవు కాబట్టి, ఈ సమాజం నుండి నీవు దూరంగా

పారిపోలేవు. ఈ సమాజం నుండి నీవు వేరు కాదు; నీవే ఈ సమాజం. నేను చెపుతున్న దానిలో సామాజిక విషయాలు గాని, లేదా మతపరమైన విషయాలు గాని లేవు.

**ప్ర: ఇదే ప్రశ్నను మీకే వెనక్కి వేయచ్చా? మీ అభిప్రాయంలో సాధారణ మనిషి అంటే ఏమిటి?**

**యుజీ**: నా వరకు సాధారణ (నార్మల్) మనిషి అనే వాడు లేడు. పిచ్చి వాళ్ళు అనే పిలవబడే వాళ్ళను చూస్తున్నపుడు నాకు ఆశ్చర్యం కలుగుతుంది, పిచ్చి వాళ్ళు వీళ్ళా లేక వీళ్ళకి వైద్యం చేస్తున్నవాళ్ళా అని. మొన్న నేనొక జోకు చెప్పేను. ఒక పిచ్చి ఆసుపత్రిలో ఒకడు యిలా అన్నాడు "నేను ఏసు క్రీస్తుని" అని, అపుడు పక్కనే ఉన్న వాడి ఫ్రండు అన్నాడు "నాకు తెలుసు నువ్వు కాదని", మొదటి వాడు అడిగేడు "నీకెలా తెలుసురా" అని. రెండో వాడన్నాడు "నేను ఎటర్నల్ ఫాదర్ని(ఎల్లప్పుడూ ఉండే తండ్రిని), నేనే నిన్ను సృష్టించాను, అంచేత నాకు నువ్వు తెలిసి ఉండాలి కదా?" (నవ్వు...) ఇక్కడ కూడా అలాగే ఉందని అనిపిస్తోంది, అక్కడ కూర్చొని "అహం బ్రహ్మోస్మి" అనే వాళ్ళను చూసినపుడు, నాకనిపిస్తుంది.. ఏమిటీ నాన్సెన్స్ అని. నేనెవరినీ వ్యతిరేకించడం లేదు.

**ప్ర: నేను నార్మల్ గా ఉన్నానా లేదా అన్న ప్రశ్న మీరు మిమ్మల్ని వేసుకోరా?**

**యుజీ** : లేదు నేనెప్పుడూ వేసుకోను, నేను 'టైమ్ మేగజైన్' ను అప్పుడప్పుడు చదువు తాను – ఇలాంటి మేటర్ అంతా నేను చదువుతాను. నేనెందుకు చదువుతానంటే, నేను యీ ప్రపంచంలో బతుకుతున్నా కాబట్టి, ప్రపంచంలో ఏం జరుగుతోందో తెలుసుకోవాలనుకుంటాను. ఎందుకు చదవకూడదు? మిగతా పుస్తకాలన్నీ నాకు చెపుతాయ్... నన్ను నేనెలా బాగు చేసుకోవాలి, నన్ను నేను ఎలా మార్చుకోవాలి, దాన్ని ఎలా చేరుకోవాలి, అలా ఎలా అవ్వాలి మొదలైనవి. నేనిప్పుడున్నట్లు కాకుండా మరోలా మారాలని నేను కోరుకోవడం లేదు. అందుచేత ఆ పుస్తకాలు చదవడంలో నాకు ఆసక్తిలేదు. నన్ను కొంతమంది అడుగుతారు, నేను డిటెక్టివ్ స్టోరీలు (క్రైమ్ ఫిక్షన్) ఎందుకు చదువుతానని. ఎందుకంటే అందులో బోలెడు ఏక్షన్ ఉంటుంది. నేను సినీమా చూడ్డానికి వేడితే,

కౌబాయ్ సినిమాలే చూస్తాను. అక్కడ చాలా స్పీడ్ ఉంటుంది. నేను టీవి చూస్తే వాణిజ్య ప్రకటనలు మాత్రమే చూస్తాను

**ప్ర: మీరు దేనినైనా చూస్తే అది మిమ్మల్ని ప్రభావితం చేస్తుందా?**

**యుజీ** : అది గూడా, నిన్ను ఒక విధంగా ప్రభావితం చేస్తుంది – నీవు ఈ ప్రపంచంలో ఒక భాగం – దాని ప్రభావం నీ మీద ఉంటుంది. నీ ప్రమేయం ఏమీ లేకపోయినా అది నిన్ను ప్రభావితం చేస్తుంది. కలిసి పనిచేయడానికి, ప్రభావితం అవడానికి తేడా ఉంది. అన్నీ కిటికీలు తెరిచే ఉన్నాయ్: ఏమీ పరవాలేదు, ఇది లేదా అది, ఏదైనా రావచ్చు.

మతం గురించి, అధ్యాత్మికత గూర్చి మనకు చాలా వింతైన అభిప్రాయాలూ ఉన్నాయ్ -- ఈ శరీరాన్ని చిత్రవధకు గురిచేయడం, మేకులపై పడుకోవడం, కంట్రోల్ చేయడం, వాంఛలు వద్దనుకోవడం – అన్ని రకాల పిచ్చి పనులూ. యివన్నీ దేని కొరకు? కొన్నిటిని ఎందుకు నిరాకరిస్తారో నాకు తెలియదు. ఓ గ్లాసు బీరు తాగడానికి బారుకెళ్ళిన మనిషికి, గుడికెళ్ళి రాముణ్ణి జపించే మనిషికి తేడా ఏమిటి? బేసిక్ డిఫరెంసేమీ నాకు కనిపించలేదు. బహుశా ఇక్కడ(ఇండియాలో) ఇది సంఘ వ్యతిరేకం కావచ్చు; పశ్చిమ దేశస్తులు ఇది సంఘ వ్యతిరేకం అని అనుకోరు; కానీ ఇక్కడ ఇండియాలో అది సమాజానికి మంచిది కాదని మనం అనుకొంటాం. ఇవన్నీ తప్పించుకొనే దారులు. తప్పించుకోవడానికి నేను వ్యతిరేకం కాదు. కానీ నీవు యీదారిలో పారిపోయినా, ఆదారిలో పారిపోయినా, పారిపోడం పారిపోడమే. నీనుండి నువ్వు పారి పోతున్నావ్.

--------------

నీవు ఏంచేస్తున్నావ్ ఏంచేయటం లేదన్నది ముఖ్యం కాదు. నీవు పవిత్రతని పాటించడం, ధర్మాన్ని పాటించడం అనేది సమాజపరంగా, సమాజనికి విలువైనది, కానీ దీనికి దానితో పని లేదు.

**ప్ర: అవును, మనం సమాజంలో జీవిస్తున్నాం, కానీ దీనికి సంబంధించినంత వరకు -- జ్ఞానోదయం, అవగాహన (realization) లేదా దానికే పేరెట్టినా....**

**యుజీ** : మీరే పేరు ఉపయోగించినా -- అది మీ పదం.

ప్రశ్న: ....దానికి దీనితో పనిలేదు?

యుజీ: దీనికి ఏవిధంగానూ దానితో పనిలేదు. ఆడదానిని బలవంతంగా అనుభవించే ఒక రేపిస్ట్ కి , ఖూనీ చేసిన వాడికి, దొంగకి, శిక్ష పడ్డ వాడికి, ఒక మోసగాడికి కూడా ఇది సంభవించ గలదని చెప్పేటంత దూరం నేనెందుకు వెడుతున్నానంటే ఇది నాకొక్కడికే కాదు...(ఎవరికైనా జరగచ్చు) అని నొక్కి చెప్పడానికి.

**ప్ర: కానీ ఇది జరిగిందా?**

**యుజీ** : ఇది జరగగలదు, అవును. నాకు తెలియదు, జరగ వచ్చు . దానికి దీనితో పని లేదు: నైతిక విలువలతో దీనికి ఏవిధమైన సంబంధం లేదు. దీని అర్థం ఈ మనిషి అనైతికుడు అని కాదు; అనైతికుడు కాలేడు – అనైతికుడుగా అవడం అతనికి సాధ్యం కాదు, అది అసాధ్యం.

**ప్రశ్న: అతని ప్రవర్తన, ఆటోమేటిక్ గా, సమాజంలో అప్పుడున్న నైతిక నియమాలకు సరిపోయేట్టుగా ఉంటుంది.**

యుజీ : అతని ప్రవర్తన తీరులు బహుశా కొంత వరకు, సంఘు కట్టుబాట్లకు అధ్యాత్మిక నియమాలకు లోపలే ఉంటుంది. కానీ అతడు ప్రమాదకరమైన వాడు. నేను చెప్పేదేమిటంటే, నీకు తెలిసిన నీవుకి, నీవు అనుభూతి చెందుతున్న నీవుకి'... అతడు ఓ ముప్పు (threat), అది నీకు ముప్పు.

**ప్ర: ఎలా?**

**యుజీ : మీరు దీనిని ఒప్పుకోరు. ఎలా ఒప్పుకోగలరు?**

**ప్ర: కానీ అది ఆటోమేటిక్ గా అవుతున్నప్పుడు, మీరు ప్రమాదకరం అయ్యే ప్రశ్నే రాదు కదా? దీన్ని పొందే మార్గాన్ని మీరెవ్వరికీ చూపించలేరు కదా?**

యుజీ : అందుకే నేనంటాను, ఈ వ్యక్తి సమాజానికి ఏవిధం గానూ ఉపయోగ పడడని. ఇతడొక అరుదైన పక్షి, ఒక అరుదైన మొక్క – యితణ్ణి వస్తు ప్రదర్శనశాలలో బోనులో పెట్టండి, అతణ్ని చూడండి.. ఇతడు ఏదో ఒక భిన్నమైన వ్యక్తి, తెలుసా.

**ప్ర: కానీ ఎప్పుడూ ప్రమాదకరమైన వాడు కాదు, అవునా ?**

**యుజీ** : చూడండి, అన్నిటి కంటే ఎక్కువ ప్రమాదకరమైన వాడు, ఎందుకంటే యితడు ఏ వ్యవస్థలోనూ ఇమడని వాడు

----------------

**ప్ర: ఒక శతాబ్ద కాలం లోపలే మానవాళి మనుగడకు ముప్పు వాటిల్లుతుందని ప్రజలు చెప్పుకొంటున్నారు.**

**యుజీ:** అది మీరు నమ్ముతారా? ఇది (ఈ జీవరాశి) అనేక శతాబ్దాల నుండి బతికి మనుగడ సాగిస్తోంది. ఇది బతకడానికి ఏదో ఒక మార్గాన్ని వెదుక్కుంటూనే ఉంటుంది. నేను చెప్పేది యిది: ప్రేమ వల్ల కాదు, విశ్వమానవ సౌభ్రాతృత్వం (universal brotherhood) వల్ల కాదు, ఇటువంటి ఉపయోగం లేని మాటల వల్లా కాదు, మనల్ని మనం చంపుకుంటాం అనే భయం వల్లనే మనం కలిసి జీవించడం నేర్చుకొంటాం. నిన్ను నీవు గాయపరచుకోకుండా యితరులను గాయపరచలేవ్, మానసికంగా కాదు, భౌతికంగా – మనం యీ విషయాన్ని గ్రహించి నప్పుడే మనం కలిసి బతకడం నేర్చుకొంటాం.

ప్రతివ్యక్తి తన రక్షణ గురించే తాను ఆలోచించినంత కాలం, మొత్తం అందరి సమగ్ర రక్షణకు తావులేదు. అతర్జాతీయ "రణరంగ సామరస్య అవగాహన (détente)" గురించి మనం మాట్లాడు కొంటున్నాం, కానీ అది వ్యక్తిగత అనుబంధాల వరకు కిందకు దిగిరావాలి. అప్పుడు మాత్రమే ఇది సాధ్యపడుతుంది; విశ్వ మానవ సౌభ్రాతృత్వం, జీవన కలయిక, జీవన ఏకత్వం అని పెద్ద పెద్ద మాటలు మాట్లాడుకోడం వల్ల కాదు – ఇటువంటివి మనకు ఏవిధంగానూ ఉపయోగ పడలేదు, ముందు గూడ ఉపయోగ పడవు. భీతి(టెర్రర్) మాత్రమే మనల్ని శాంతంగా కలిసిజీవించేట్టు చేస్తుంది, మనకి నచ్చినా నచ్చక పోయినా. నీవు చేతిలోకి ఒక పిస్తోలు తీసుకొని, ప్రపంచంలోకెల్లా అతి పెద్ద బలవంతుడైన అత్యంత శక్తివంతమైన మనిషిని నీకొరకు నాట్యమాడించ వచ్చు – ఇది ఒక వాస్తవం. ఇది ఏదో ఒక విధంగా బతుకు కొనసాగిస్తుంది; మొత్తమంతటినీ నీవు విచ్ఛిన్నం చేయలేవ్. మనమందరం ఒకే దెబ్బతో నాశనమయ్యే రోజులు వచ్చాయని ఒక పిచ్చి వాడు మాత్రమే భావిస్తాడు.

అనేక వందల ఏళ్లనుండి మనిషి బతుకుతూ వచ్చాడు, ఇప్పుడు మనం సడన్ గా 'విలువలు' మొదలైన వాటిగురించి మాట్లాడుతున్నాం. దేనికొరకు? ఈ నైతిక విలువలు శాంతి సఖ్యతలతో జీవించడానికి మనకు ఏవిధంగానూ ఉపయోగ పడలేదు. ఈ నైతిక సమస్యను మనం సృష్టించుకున్నాం, అవునా. వృక్ష జాతికి, జంతు జాతికి యీ మతపరమైన ధార్మిక సమస్యలు లేవు; ఈ మతపరమైన సమస్యని మనిషే సృష్టించేడు.

చూడండి, దీనిలో కొంచెం గూడా సామాజిక విషయాలు లేవు, అంతేకాదు ఏరకమైన సామూహిక చర్యను నేను ఊహించలేను. అందువల్ల ఈవ్యక్తి, ప్రకృతి బయటకు విసిరిన ఒక రకమైన మనిషి, ఇతన్ని ఎవరైనా గుర్తిస్తారా లేదా అన్నది ముఖ్యం కాదు. ఈమనిషి, యీ సమాజనికి ఏవిధంగానూ ఉపయోగ పడలేడు. వారి మనుగడకు నేను పెద్ద ముప్పు అని వాళ్ళు భావించిన రోజు సహజంగానే వాళ్ళు నన్ను చంపేస్తారు. నేనేమీ అనుకోను. ఒక వేళ ఈ సంఘం నన్ను చంపి వేస్తే, యిక్కడ ఏం మిగిలి ఉంటుందో అది నాకు ముఖ్యం కాదు. మిషనరీలు (మతప్రచార సంస్థలు) స్థాపించాలానే ఉత్సాహం నాలో లేదు, లేదా మానవాళిని రక్షించాలనే కోరికా లేదు. ఈ మానవాళిని రక్షించమని ఎవరు నాకు ఆదేశం యిచ్చారు? మానవులు అనేక శతాబ్దాలనుండి ఉన్నారు, వాళ్ళు ఇలాగే కొనసాగుతారు. నేను ధార్మిక (holy) బిజినెస్సులో లేను; నేను నా పాటనే పాడతాను. ఎవరైనా వస్తే మాట్లాడుతాను, ఎవరూ రాకపోతే వాకింగ్ కు వెడతాను లేదా పక్షులను, చెట్లను చూస్తాను – ఎన్నో జరుగుతూ ఉంటాయ్. కానీ నేను బయటకు వెళ్ళి, వేదిక పై కూర్చొని మాట్లాడను – అటువంటి దాని కొరకు నేను తయారు చేయబడలేదు. నేను ఒక సింపుల్ మనిషిని – అనవసరంగా విషయాలను క్లిష్టం చేయడం నా కిష్టంలేదు. చూడండి, నేనున్న పొజిషన్, స్థానం చాలా సింపుల్ . నేనెప్పుడూ అందరికీ అందుబాటులో ఉంటాను. నాదని చెప్పుకొనే వ్యక్తిగత జీవితం నాకు లేదు. ఎవరైనా ఏ సమయంలోనైనా రావచ్చు. ఎవరైనా వస్తే వారిని చూసి అంటాను “గుడ్ మోర్నింగ్, మీ కొరకు నేనేం చేయ గలను?” – నేనంత మాత్రమే చేయగలను; ఇవ్వడానికి నాదగ్గర ఏమీ లేదు; దట్సాల్, అంతే.

జ్ఞానం(knowledge) అనేది రహస్యమైనది కాదు, నిగూఢమైనదీ కాదు. మీరు సంతోషంగా ఉన్నట్టు మీకు తెలుసు, యింకా ఫేనూ, లైటూ పనిచేసేవిధానాల వెనకున్న సిద్ధాంతాలు తెలుసు – యీ జ్ఞానం గురించే మనం మాట్లాడు తున్నది. మీరు మరో రకమైన జ్ఞానాన్ని పరిచయం చేస్తారు, అధ్యాత్మిక జ్ఞానం (spiritual నాలెడ్జ్), – కానీ అధ్యాత్మిక జ్ఞానానికి ఇంద్రియ జ్ఞానానికి తేడా ఏమిటి? మనం వీటికి పేరులు పెడతాం. దేముడికి సంబంధించిన విచిత్ర ఊహా చిత్రాలను (ఫేంటసీస్) మీరు అంగీకరిస్తారు, కానీ సెక్స్ కి సంబంధించిన ఫేంటసీలను మాత్రం, ఇంద్రియ సంబంధితం, భౌతికం అంటారు. కానీ ఈ రెండింటికీ తేడా లేదు. కానీ సమాజం ఒక దాన్ని ఒప్పుకొంటుంది, రెండోది ఒప్పుకోదు. మీరు జ్ఞానాన్ని ఒక రకమైన అనుభవం వరకే పరిమితి చేస్తున్నారు, అందువల్ల ఒకటి ఇంద్రియ పరమైనదవుతుంది, మరొకటి అధ్యాత్మిక మైనదవుతుంది. – ఇలా ఎందుకు? ప్రతి ఒక్క అనుభవం, అనుభూతి, ఇంద్రియాలకు సంబంధించినదే అని నేనంటాను.

జీవరాశి జీవనం సాగించేందుకు ముఖ్యమైన జ్ఞానం అంతా అవసరమే. కానీ, దేవుడు, సత్యం, నిజం మొదలైన ఊహాజనిత జ్ఞానం, నా వరకు, ఏమాత్రం అర్థం లేనిది – అవన్నీ సంస్కృతికి సంబంధించిన విలువలు; వీటికీ, జీవుల మనుగడకీ ఏ మాత్రం సంబంధం లేదు. అవన్నీ ఎవరికి నచ్చినట్టు వారు సామాజికంగా ఏక పక్షంగా నిర్ణయించుకొన్న మత పరమైన విలువలు. మన అభిరుచులన్నీ మనం అలవాటు చేసుకొన్నవి. ఇష్టాలు అయిష్టాలు అన్నీ మనం అలవాటు చేసుకొన్నవి. అసలైన (absolute) నైతికత అంటూ ఏమీ లేదు. "నైతికత" అంటే నేను చెప్పే అర్థం.. నీ చర్యలను చేసే ముందు, చేసిన తరువాత ప్రశ్నించుకోవడం. ఇది సామాజికం. ఈ ప్రపంచంలో మంచివాడు చేసే మంచి ఏమిటి? వాడు సమాజనికి మంచి చేస్తాడు, కాదా? ఈ సమాజాన్ని సాఫీగా నడపడానికి యీ నిబంధనలు అవసరం. కానీ ఈ మతానుయాయులు నీలో ఒక పోలీసుని సృష్టించారు. నీవు చేయబోయే పనులు గానీ చేసిన పనులు గానీ -- కొన్ని మంచివని, కొన్ని చెడ్డవని పిలవబడ్డాయ్,– అది నీకు ఏవిధంగానూ ఉపయోగ పడలేదు; ఈ

ఆలోచించడమే సమస్యలను సృష్టించింది. మౌలికంగా మనిషి యొక్క సమస్య నైతిక సంధిగ్ధతే (ఈ పని చేయ దగ్గదా కాదా అనే డైలమాయే), ఒక పని చేసేముందూ, తరవాతా కూడా ప్రశ్నించుకోవడం – ఇదే మనిషికి నరాల సమస్యగా మారింది. మతపర సమస్యగా కాదు -- మీ శరీరం మొత్తం అంతా యీ సమస్యలో కూరుకు పోతుంది. దేముడు కూడా ఒక నరాలకు సంబంధించిన సమస్య. Dog లోని అక్షరాలను కలగలిపితే God అనే పదం గూడ వస్తుంది. కానీ మీ దేహం మొత్తం అంతా God అనే పదానికి రియాక్ట్ అవుతోంది. మీ నమ్మకాలన్నీ, ఒక్క మానసికమైనవి మాత్రమే కాదు, అవి నరాలకు, నాడీమండలానికి కూడా సంబధించినవి.

--------------

మంచి అంటే ఏమిటో నీకు తెలియదు. నీకు తెలిసినదల్లా నీకేది మంచిది అనేది మాత్రమే. నీకు కావలసినది అది మాత్రమే, ఇది వాస్తవం. ప్రతీది దాని చుట్టూ తిరుగుతూ ఉంటుంది. మీ కళలు, కారణాలు, వివరణలు దాని చుట్టూ తిరుగుతూ ఉంటాయ్. నేను మీలో తప్పులు వెదకడం లేదు. ఇది ఒక వాస్తవం. అందులో తప్పు లేదు. దానికి వ్యతిరేకంగా నేను మాట్లాడడం లేదు. పరిస్థితులు మార వచ్చు, కానీ అదే మిమ్మల్ని అన్నీ పరిస్తితులలో నడిపిస్తోంది. చూడండి, అది తప్పు అని నేను చెప్పడం లేదు. అది అలా కాకపోతేనే, మీలో ఏదో లోపం ఉండి ఉండాలి. మంచి-చెడు అనే వ్యతిరేక ద్వందాల పరిధిలో మీరు పనిచేసినంత కాలం, మీరు ఏ పరిస్తితిలో అయినా, ఎప్పుడూ ఎంచుకుంటూనే ఉంటారు, choosy గానే ఉంటారు, అంతే – అలా చెయ్యడం మీరు మాన లేరు.

----------------

నీతిమంతుడు ఒక పిరికి వాడు (ఓ చికెన్). నీతిమంతుడు ఒక భయస్తుడు, ఒక కోడిపిల్ల మనస్తత్వం కలవాడు. అందువల్లే నీతి నియమాలను పాటిస్తాడు, ఇతరుల తప్పు ఒప్పులను నిర్ణయిస్తాడు. తనది న్యాయమైన కోపం అని అనుకొంటాడు! నైతికత ఉన్న మనిషి నైతికత గురించి ఎప్పుడూ మాట్లాడడు, యితరుల నైతికతను నిర్ణయించడు. నెవ్వర్ !

మనిషి ఎప్పుడూ స్వార్ధ పరుడే, అంతే కాదు, అతడు నిస్వార్ధతను ఒక ధర్మంగా పాటించినంత కాలం స్వార్ధపరుడిగానే ఉండిపోతాడు. స్వార్ధపరులపై నాకెటువంటి వ్యతిరేక భావమూ లేదు. స్వార్ధపరత్వం గురించి మాట్లాడ్డం నాకిష్టం లేదు – దానికి ఏ విధమైన ఆధారాలూ లేవు. నీవు అంటావ్ "నేను రేపటి నుండి స్వార్ధం లేని మనిషి గా బతుకుతాను. రేపు నేను గొప్ప మనిషిని అవుతాను" అని. కానీ ఆ రేపు వచ్చేవరకు, లేదా మరుసటి రోజు వరకూ లేదా మరో జన్మ వరకూ నీవు స్వార్ధపరుడిగా ఉండి పోతావ్. నిస్వార్ధత అంటే అర్ధం ఏమిటి? నిస్వార్ధంగా ఉండాలని నీవు ప్రతీ ఒక్కరికీ చెపుతావ్. ఎందుకు? స్వార్ధపరుడిగా ఉండకు.. అని నేనెవ్వరికీ ఎప్పుడూ చెప్ప లేదు. "స్వార్ధంతో ఉండు, స్వార్ధపరుడిగానే ఉండిపో" – ఇదే నా సందేశం. ఆ ధనవంతుని ధాతృత్వం కూడా స్వార్ధమే: అతడు ఒక ధర్మదాతగా గుర్తించుకోబడతాడు, నీవు అతని విగ్రహం ఒకటి అక్కడ నిలబెడతావ్.

మీరు అనుభవించే ప్రాధమిక సుఖాలకు నేనేమాత్రం వ్యతిరేకం కాను. మీరేమి చేసినా దానికి నేను అసలు వ్యతిరేకం కాదు. మీ లోని అశాంతికి కారణం... మీరిపుడు చేస్తున్న దానికంటే ఆసక్తికరమైనది మరొకటి ఉందని మీరు భావించడమే. మీలో ప్రశాంతత లేదు, ఎందుకంటే, ఏది చేసినా ఆదర్శవంతమైన రీతిలో, లోపరహితమైన పద్ధతిలో చేయాలని మీరనుకొంటున్నారు కాబట్టి. ఇలా ఎందుకు జరుగుతోంది?

**ప్ర: మా జీవితాలను మేము సద్వినియోగం చేసుకొన్నామనే భావన, ఫీలింగ్ కలగాలని మేము కోరుకొంటున్నాం.**

**యుజీ:** తరవాత, నీ జీవితం ఆఖరి దశకు వచ్చాక, నీ జీవితం మొత్తం నీవు వృధా చేసుకున్నావని నీకనిపిస్తుంది. నీవు మారడానికి నీవేమీ చేయడం లేదు; నీవు ఒక పునర్జన్మను ఊహించుకొన్నావ్. నీలో ఉన్న అసంతృప్తి చాలా కృత్రిమం. మనుషుల మీద మీకు నిజంగా అభిమానం ఉంటే మార్చడానికి మీరు ఏదో ఒకటి చేస్తూ ఉండే వారు.

"ఏలా బతకాలీ" అనే ప్రశ్న వదిలి వేసినప్పుడు జీవించడమే అత్యంత ముఖ్యం అవుతుంది. సంస్కృతి(కల్చర్) యొక్క భారం నుండి నీవు బయట పడాలి. నీవంత

తేలిగ్గా ఆ కల్చర్ ని తోసి పారెయ్య్య లేవని నాకు తెలుసు – ఉదాహరణకి, ఉదయాన్నే స్నానం చేయడం మొదలైనవి. ఇది చాలా చిన్న విషయం – నేను కూడా స్నానం చేస్తా – దానిలో అంత మత సంబంధిత విషయం ఏముంది? నీవిపుడు చేస్తున్న దాని కంటే ఎక్కువ ఆసక్తికరమైనది ఏదో ఉందని నువ్వు అనుకొంటున్నావ్. అటువంటి భావన నీనుండి పోయినప్పుడు, నీవు చేస్తున్నది చాలా చాలా ఆసక్తికరంగా కనిపిస్తుంది.

-------------

ఏ కోరికలు లేని స్తితిని సాధన చేయాలని నీకు చెప్పేరు. నీవు దానికై ముప్పై నలభై ఏళ్ళు సాధన చేసేవ్, కానీ కోరికలు ఇప్పటికీ ఉన్నాయ్. కాబట్టి ఎక్కడో ఏదో తప్పు ఉండి తీరాలి. కోరిక తప్పు అయ్యే అవకాశం లేదు. కోరికలు లేని స్తితిని ప్రాక్టీస్ చేయమని నీకు చెప్పిన వాడిలో ఏదో లోపం ఉండి ఉండాలి. కోరిక ఒక వాస్తవం. కోరికలు లేని స్తితి ఒక అవాస్తవం. ఇది నిన్ను తప్పు దారి పట్టిస్తోంది. కోరిక అనేది ఉంది. కోరిక ఉండడం ఏ మాత్రం తప్పు కానేరదు. అది ఉంది కాబట్టి అది అసత్యం కాలేదు, అలాగే కోపం కూడా అసత్యం కాదు ఎందుకంటే కోపం ఉంది కాబట్టి. వాళ్ళు 'భగవంతుడు' అని నిర్వచించిన ఏదో శక్తి గురించి లేదా మరో దాని గురించి, మీరు మాట్లాడుతున్నారు, అదేమిటో ఆ భగవంతునికే తెలియాలి!. ఇలా ఆలోచించడమే దాన్ని ఒక సమస్యగా మార్చిందని మీకు తెలియడం లేదా? కోపం ఒక శక్తి, కోరిక ఒక శక్తి – నీకు కావలసిన ఆ శక్తి అంతా ఇప్పటికే అక్కడ పనిచేస్తోంది. అసలు దేనికోసం నీకా శక్తి(energy) కావాల్సి వచ్చింది? ఆలోచించడం ద్వారా నువ్వీ శక్తిని నాశనం చేస్తున్నావ్. ఆలోచించడమే నీకు సమస్యలను సృష్టించింది. ఆలోచించడం లేకపోతే సమస్యే లేదు. నేను చెప్పేదేమిటంటే, ఆలోచచించడం ద్వారా నీవు సమస్యలను పరిష్కరించ లేవు అని; 'ఆలోచించడం' అనేది సమస్యలను మాత్రమే సృష్టిస్తుంది.

ఆలోచించడం ద్వారా వాంఛ అనే సమస్యను పరిష్కరించ గలమని మీరు నమ్ముతున్నారు, దానికి కారణం... నీవు ఆదర్శంగా తీసుకొన్న ఒక స్వామీజీ కోరికలను నియంత్రించ గలిగేడు, అని నీవు అనుకోవడమే. నీవు ఊహించి నట్టుగా

ఆ మనిషికి కోరికలు లేకపోతే, అతనొక శవం. ఆ మనిషిని అసలు నమ్మద్దు! అటువంటి మనిషి ఏదో ఒక సంస్థను నిర్మిస్తాడు తరవాత విలాస వంతమైన జీవితం గడుపుతాడు, దాని ఖర్చు మీరు చెల్లిస్తారు. ఆయన యొక్క, ఆయన సంస్థ యొక్క నిర్వహణాభారం మీరు వహిస్తారు. ఆయన చేస్తున్నదంతా తన జీవనోపాధికే. ఇటువంటి వాని వలలో పడడానికి యీ ప్రపంచలో ఎవరో ఒక మూర్ఖుడు ఉంటాడు. అప్పుడప్పుడు అతని ముందు సాష్టాంగ పడడానికి నీకు అనుమతి ఇస్తాడు. అతనితో కలిసి జీవిస్తే నీవు ఆశ్చర్య పోతావ్(ఆయన విలాసవంతమైన జీవనం చూసి!). నీవు ఆయన దగ్గరే ఉండి, ఆయన జీవన విధానం చూసినపుడు నీ జీవితంలో ఎప్పుడూ తగలని షాక్ నీకు తగులు తుంది. అందు వల్లే ఆ స్వామీజీలు అందరికీ దూరంగా ఉంటారు – ఎందుకంటే ఎప్పుడో ఒకప్పుడు పట్టు పడతామనే భయంతో వారుంటారు (వాళ్ళు మీకు చెప్పేదొకటి, వాళ్ళు చేసేది మరొకటి కాబట్టి). ఒక ధనవంతుడు, అతని డబ్బు కొరకు నీవు అతని దగ్గరకు వెడతావనే భయంతో ఉంటాడు. అదే విధంగా మత ధార్మికుడు గూడా – అతడు నీ దగ్గరకు ఎప్పుడూ రాడు. నీ దేశాధ్యక్షుడిని చూడడం కంటే అతడిని చూడడం ఇంకా చాలా కష్టం. – అతడిని చూడడం కంటే ఒక దేశం ప్రెసిడెంటుని చూడడం చాలా చాలా తేలిక. తన గురించి తాను చెప్పుకున్నట్లుగా అతని ప్రవర్తన ఉండదు, తన గురించి తాను చెప్పుకొనే అతని మాటల్లో నిజం ఉండదు. కానీ దాన్ని(ఆ స్థితిని) పొందిన వారు మనుషుల మధ్య జీవిస్తారు – వారిని నీవు ఎల్లప్పుడూ అక్కడ చూడ గలుగుతావ్.

**ప్ర : జీవితం యొక్క అర్థం, దాని లక్ష్యం ఏమిటి?**

**యుజీ**: మీరు నన్ను అడుగుతున్నారు, “దేనికైనా ఎదో ఒక లక్ష్యం ఉంటుందా?” అని. చూడండి... చాలా అర్థాలూ, చాలా లక్ష్యాలూ మీకివ్వ బడ్డాయ్. ఇంకా జీవితానికి అర్థాన్ని, లక్ష్యాన్ని ఎందుకు వెదుకుతున్నారు? ప్రతి ఒక్కరూ జీవితం యొక్క అర్థాన్ని, జీవితం యొక్క ప్రయోజనాన్ని గురించి మాట్లాడేరు, ప్రతీ ఒక్కరూ. Everybody! చాలామంది జగద్రక్షకులు, సాధువులు, ఋషులు యీ ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చేరు – అటువంటి వాళ్ళు వేల కొలదీ భారత దేశంలో

ఉన్నారు – అయినప్పటికీ యీ రోజు కూడా యిప్పటికీ అదే ప్రశ్నను మీరు వేస్తున్నారు, “యీ జీవితానికి అర్థం ఉందా, లక్ష్యం ఉందా?” అని. అంటే వారిచ్చిన జవాబులు మీకు సంతృప్తి నివ్వలేదు లేదా ఆ ప్రశ్నకు జవాబు, మీ అంతట మీరు, కనుక్కోవాలనే ఆసక్తి మీకు నిజంగా లేదు. మీకు నేను చెపుతున్నాను, మీకు నిజంగా ఆసక్తి లేదని, ఎందుకంటే ఇది భయాన్ని పుట్టించే విషయం. చాలా భయాన్ని పుట్టించే విషయం. సత్యం అనేది ఏదైనా ఉందా? ఈ ప్రశ్నను మీకు మీరే ఎప్పుడైనా వేసుకున్నరా? ఎవరైనా నిజం చెప్పేరా?

**ప్ర: చాలా సత్యాలు ఉన్నాయ్.**

**యుజీ :** మేము పెదికేము, సత్యం చెప్పేము అని చెప్పుకొనే వాళ్ళంతా ఈ ప్రపంచంలో అబద్ధాలు చెప్పే వాళ్ళు. నకిలీ మనుషులు, మోసగాళ్ళు! సరే, యీ ‘సత్యం’ అంటే ఏమిటో మీ అంతట మీరు కనుక్కోవాలని అనుకొంటున్నారు కదా. మీరు కనుక్కోగలరా? సత్యం అంటే ఏమిటో గ్రహించి, దాన్ని చేత్తో పట్టుకొని “ఇదీ సత్యం” అని మీరు చెప్పగలరా? మీరు అంగీకరించినా లేదా తిరస్కరించినా, ఒకటే: అది వారు ఏర్పరచుకున్న నమ్మకాలు, వారి వారి అభిరుచుల మీద ఆధారపడి ఉంటుంది. అందువల్ల సత్యం ఏమిటో మీ అంతట మీరు కనుక్కోవాలానుకొంటే, అది ఏదైనప్పటికీ, దాన్ని అంగీకరించే స్తితిలో గానీ, తిరస్కరించే స్తితిలో గానీ నీవు లేవు. నీవు అనుకొంటావ్, సత్యం అనేది ఒకటి ఉంటుందని. నీవు ఊహించు కొంటావ్ నిజం అనేది ఒకటుందని (అంతిమ నిజం లేదా మరొకటి) – ఈ ఊహ, నీకు సమస్యలను, బాధలను, దుఃఖాన్ని సృష్టిస్తోంది.

ఇలా చూడండి, భగవంతుణ్ణి, సత్యాన్ని, నిజాన్ని, లేదా మీరు చెప్పే మరొక దాన్ని నేను అనుభవించాలని కోరుకొంటున్నాను, అయితే దాని గురించి మాట్లాడే ముందు, అనుభవిస్తున్న, అనుభవాన్ని పొందుతున్న నాలోని శారీరక అవయవ అనుభవ నిర్మాణం యొక్క స్వభావాన్ని (nature of experiencing structure), నేను అర్థం చేసుకోవాలి. దీన్ని అర్థం చేసుకోడం కొరకు నేను ఉపయోగిస్తున్న పరికరం ఏమిటో తప్పక నేను తెలుసుకోవాలి. కానీ నీలో ఉన్న ఆ అనుభవ నిర్మాణం యొక్క పరిభాషలో గ్రహించ లేని దాన్ని, నీవు అర్థం చేసుకోడానికి

ప్రయత్నిస్తున్నావ్. అందు వల్ల, ఆ మరొకటి(the other thing) నీలోకి రావాలంటే యీ అనుభవనిర్మాణం అక్కడ ఉండ కూడదు,. ఆ మరొకటి ఏమిటో నీ కెప్పటికీ తెలియదు. నిజం, సత్యం నీకెప్పటికీ తెలియదు, ఎందుకంటే అది ఒక 'మూవ్ మెంట్', ఒక చలనం! దాన్ని నీవు పట్టుకోలేవ్. దాన్ని నీవు నీలో ఉంచలేవ్, అదేమిటో నీవు వివరించి చెప్పలేవ్, వ్యక్తం చేయలేవ్. తార్కికంగా, నిర్ణయించ గల ఒక ప్రతిపాదన కాదు మనకు కావలసింది. కాబట్టి అది నీ అంతట నీవు కనుక్కున్నదే అయి ఉండాలి. నా అనుభవం ఎవరికి ఉపయోగిస్తుంది? మనవద్ద వేల కొద్దీ లిఖించబడిన అనుభవాలు ఉన్నాయ్ – అవి నీకు ఉపయోగ పడలేదు. నిన్ను ముందుకు నడిపిస్తున్నది నీ అశే -- "నేను యిలాగే దీన్ని, యీ శోధనను లేదా యీ సాధననూ మరో పది సంవత్సరాలు, పదిహేను సంవత్సరాలు చేస్తూ పోతే, బహుశా ఏదో ఒక రోజున నేను..." అనే ఆశ నీకు ఉంటుంది. ఎందుకంటే అశే ఆ నిర్మాణం (ఆ అనుభవ నిర్మాణం, experiencing structure).

**ప్ర: ఆ విధంగా, అతడు జీవిత కాలమంతా వెచ్చించి చివరికి అతడు కనుక్కొన్నాడు... తాను కనుక్కొన్నది ఏమీ లేదని.**

యుజీ: ఏమీ లేదని. అదే కనుగొన్నది. అందరూ చెప్పుకొనే ఆ ఆత్మ సాక్షాత్కారం, ఆత్మజ్ఞానం అంటే కనుక్కోవడానికి 'నేను' అనేది ఏదీ లేదనే విషయాన్ని నీకు నీవు, నీయంతట నీవు కనుక్కోవడం. ఇది చాలా నిశ్చేష్టకరమైన (షాకింగ్) విషయం. – "ఎందుకు నేనింత మూర్ఖంగా నా జీవితాన్నంతా వ్యర్థం చేసుకొన్నాను?" అని నీకు అనిపిస్తుంది. ఇది చాలా షాకింగ్ విషయం, ఎందుకంటే యిది ప్రతి నరాన్ని, ప్రతి కణాన్ని, ఎముకల లోపల ఉన్న మజ్జ కణాలను గూడా నాశనం చేస్తుంది. నేను మీకు చెపుతున్నాను యిది అంత తేలికైన విషయం కాదు, బంగారు పళ్ళెంలో పెట్టి నీకేవ్వరూ చేతికి అందించరు. నీలో ఉన్న అందంగా కనిపించే భ్రమలన్నీ పూర్తిగా తొలగి పోవాలి, అప్పుడే సత్యం తనదైన రీతిలో తనను వ్యక్తం చేసుకోవడం మొదలు పెడుతుంది. సత్యాన్ని కనుక్కోవడం కోసం ప్రయత్నించడం వల్ల ప్రయోజనమేమీ లేదని నేను కనుక్కొన్నాను. సత్యశోధన

చేయడం అసంబద్ధమని, absurd అని నేను కనుక్కొన్నాను, ఎందుకంటే సత్యం అనే దాన్ని నీవు పట్టుకోలేవు, నీలో ఇమిడ్చుకోలేవు, నీవు వ్యక్తం చేయ లేవు.

-------------

**ప్ర: మీరున్న స్తితిని వివరించి తెలియజేయ గలరా?**

**యుజీ** : చూడండి, నేను ఏదైనా తెలియ జేయడానికి ప్రయత్నించిన మరుక్షణం అది పోతుంది; ఇది దాని ఛాయ మాత్రమే. అది యిది కాదు.

**ప్ర: అది మరొకరికి తెలియజేయ లేని ఒక అనుభవమా?**

యుజీ : కాదు, ఇది అనుభవంలోకి రానిది, నీవు అనుభవించ లేనిది, నీవు తెలియ జేయలేవు. ఆ పదాలు వాడ్డం నాకిష్టం లేదు, ఎందుకంటే, 'వ్యక్తం చేయలేనిది', 'తెలియ జేయలేనిది' అనే పదాలు, వ్యక్తం చేయ లేనిది, తెలియజేయ లేనిది ఏదో ఒకటి ఉందనే అర్ధాన్ని యిస్తాయ్. నాకు తెలియదు. వ్యక్తం చేయ లేనిది, తెలియజేయ లేనిది ఏదో ఒకటి ఉందనే ఒక ఊహ ప్రజల్లో ఉంది. అక్కడేమీ లేదు. అక్కడ ఏమీలేదు అనడం గూడ నా కిష్టం లేదు, ఎందుకంటే అప్పుడు, నీవు దాన్ని, అది ఒక శూన్యత, ఒక ఖాళీ, లేదా మరోటి అని పిలిచే అవకాశం నీకు చిక్కుకుంది. (నవ్వు...)

నేను దాని గురించి యీ విధంగా మాత్రమే చెప్ప గలను: అక్కడ ఉన్నది ఏదైనా, అది అనుభవంలోకి రాదు – అక్కడ ఏదైనా అసలు ఉందా అనేది గూడా నాకు తెలియదు -- దాన్ని తెలుసుకొనే మార్గమే అసలు నా దగ్గర లేదు. మీ సొంత వేదాంత పరిభాషలో చెప్పాలంటే, అసలు 'అజ్ఞాతం" (తెలియనిది, unknown) అనేది ఏదీ లేదు. ఆ 'అజ్ఞాతం అని చెప్పబడే దాని గురించి మీకు తెలిసినది ఏదైనా, అది ఆ 'అజ్ఞాతం' కాదు. అసలు ఆ 'అజ్ఞాతం' అనేది ఒకటి ఉందో లేదో నాకు నిజంగా తెలియదు. ఆ అజ్ఞాతం గురించి నీకు తెలిసినది ఏదైనా, నీవు చెప్పే ఆ 'అజ్ఞాతం' అనే దాని యొక్క నీ అనుభవం ఏదైనా, అది ఆ 'అజ్ఞాతం' కాదు, ఎందుకంటే అది నీ జ్ఞానంలో(నాలెడ్జ్ లో) ఒక భాగం అయిపోయింది కాబట్టి.

మీకేం కావాలి? చెప్పండి అదేమిటి? చూడండి, మీకు తెలియని దాన్ని మీరు అడగలేరు, అంతేకాదు దీని గురించి మీకేమీ తెలియదు -- ఇప్పుడు గానీ అప్పుడు

గానీ -- ఒక వేళ మీరు జ్ఞానోదయమైన వారని ఒక క్షణకాలం ఊహించుకొన్నప్పటికీ, దీని గురించి మీరు ఏమీ తెలుసుకొనే మార్గం లేదు. ఇది ఎప్పటికీ  మీ జ్ఞానంలో (knowledge లో) ఒక భాగం కాలేదు.

-------------

ఇకపైన దేనినీ అనుభవించడం సాధ్యం కాదని ఇది అర్థంచేసుకొంది. నేను చెప్పదలచు కొన్నది మీకు స్పష్టంగా చెప్పానో లేదో  నాకు తెలియదు. వ్యక్తిత్వం, ఒంటరితనం, విడిగా ఉండడం, (మీరు ఏవిధంగా పిలచినా) అనేవి యికపై (నాలో) లేవు. నిన్ను వేరు చేసేది, నిన్ను విడిగా ఉంచేదీ నీ ఆలోచనే --  ఇది ఎల్లలు సృష్టిసుంది, సరిహద్దులు సృష్టిస్తుంది. ఒకసారి ఆ సరిహద్దులు లేనప్పుడు, యిది అనంతం, అపరిమితం. నీ కాన్షియస్నెస్ (చైతన్యం) యొక్క అనంతత్వాన్ని మరియు అపరమితత్వాన్ని అనుభూతి చెందగలవని నేను చెప్పడం లేదు; ఆ 'కాన్షియస్నెస్ లో, ఆ చైతన్యంలో ఉన్నది  ఎంత విస్తారమైనది, అపరిమితమైనది అంటే దాని గురించి నీవేమీ  చెప్పలేవ్. అందు వల్లనే నేను యీ పదాలు వాడుతున్నాను "ఇది ఏమీ తెలియని స్తితి (It's a state of not knowing)" అని. నీకు నిజంగా తెలియదు. కానీ నీకు తెలియదని నీ కెలా తెలుసు? నీకేమీ తెలియదని నీకు అనిపించడం కాదు యిది;  కానీ, సాధారణ కాన్షియస్నెస్  తో పోల్చినపుడు  దాన్ని తెలుసుకొనే మార్గాలు నీకు  అసలు ఏమీ లేవ్ – ఎవరి దగ్గరా ఏ మార్గమూ లేదు. ఏదో గ్రహించాలనే ఒక ప్రయత్నం గూడా నీలో  ఉండదు.

---------------

నీవు అనుభవాలను పోగు చేసుకోవు. నీవు ఒక దానిని అనుభవించాలనుకుంటే, మొత్తం రహస్యాల పరంపరలు  అన్నీ అక్కడ నీ తలుపు తడుతూ ఉంటాయ్. అది ఒక  అనుభవం కానే కాదు. అంతిమ నిజాన్ని, సత్యాన్ని, భగవంతుణ్ణి (అదేమిటో ఆ భగవంతునికే తెలియాలి!)  అనుభూతి చెందాలని నీవు కోరుకొంటున్నావ్.   కానీ నీవు అనుభూతి చెందలేని దాన్ని అనుభూతి చెందడానికి నీవు చేసే ప్రయత్నం  అంతా వృధా. దీని అర్థం అనుభవ క్రమానికి  (Experiencing structure) అది అతీతమైనది అని కాదు. ఇది  నేను వివరించి చెప్ప గలిగేది

విషయం కాదు, ఇది నేను చెప్పలేని....” – చూడండి, ఇది ఆ రకమైనది విషయం కాదు; అనుభవం పొందే ఆ నిర్మాణం అంతమవుతుంది. నీవు చూస్తున్న ఆ పువ్వుని పువ్వని, ఆ గులాబీని గులాబీ అని నీవు గుర్తించలేనపుడు, నీవు అక్కడ లేవని అర్థం. నీవు అంటే ఏమిటి? నీవు ఏమీ కాదు (you are nothing), నీవు అంటే నీ దగ్గరున్న అనుభవాల మొత్తం, మరియు వాటి గురించి నీకున్న జ్ఞానం తప్ప మరేమీ కాదు.

--------------

నేను చూస్తాను కానీ నేను చూస్తున్నది ఏమిటో నాకు తెలియదు. నా జ్ఞానేంద్రియాలన్నీ వాటి యొక్క అత్యున్నత స్థాయిలో, టాప్ లెవెల్లో, పూర్తి సామర్థ్యంతో పనిచేస్తూ ఉంటాయ్, అయినప్పటికీ “అది పచ్చగా ఉంది, ఇది గోధుమ రంగులో ఉంది, నీ జుట్టు తెల్లగా ఉంది, నీవు కళ్ళజోడు పెట్టుకున్నావ్...” అని చెప్పేది ఏదీ నాలో లేదు. వస్తువులను గురించిన నా నాలెడ్జి, నా బేగ్రౌండ్ లో ఉంటుంది. – కానీ అది పనిలోకి కాదు. అందువల్ల నేను మెలకువగా ఉన్నానా లేక నిద్ర పోతున్నానా అన్నది నా అంతట నేను ఏవిధంగానూ తెలుసుకోలేను. అందుకే నేనంటాను, ఈ చైతన్యంలో(ఈ కాన్షియస్నెస్ లో) ఇది జాగ్రదావస్థ, యిది నిద్రావస్థ, ఇది స్వప్నావస్థ, ఇది గాఢనిద్రావస్థ, అనే విభజన ఉండదు. మీ సంస్కృత పదం ఉపయోగిస్తే, దీన్ని ‘తురీయావస్థ’ అనవచ్చు – వీటిని అధిగమించడం కాదు; ఈ విభజన అనేదే మొత్తం లేకపోవడం.

----------------

**ప్ర: మీ ప్రపంచంలో కలలు లేవు, అవునా?**

**యుజీ** : ఒక విధంగా జీవితమంతా ఒక అతి పెద్ద స్వప్నం లాంటిది. నేను మిమ్మల్ని చూస్తున్నాను కానీ మీ గురించి నిజంగా నాకేమీ తెలియదు – ఇది ఒక కల, ఒక స్వప్న లోకం – దీనికి అసలు వాస్తవికత లేదు. ఈ అనుభవ క్రమం చైతన్యాన్ని, (లేదా మీరేపేరెట్టి పిలిచినా) తనకు నచ్చిన విధంగా మలచుకోకుండా ఉన్నప్పుడు, జీవితమంతా ఒక అతి పెద్ద కల, అనుభవాల దృష్టితో ఛూస్తే. -- ఇక్కడున్న ఈ దృష్టితో కాదు, మీ దృష్టితో చూసినప్పుడు. చూడండి, మీరు

అన్నిటికీ వాస్తవికతను ఇస్తారు, వస్తువులకే కాకుండా ఫీలింగ్స్ కీ, అనుభవాలకీ కూడా – అంతే కాదు అవి నిజాలని అనుకొంటారు. మీరు వాటిని, మీరు సేకరించిన జ్ఞానం యొక్క పరిభాషలో అర్థం చెప్పుకోకుండా ఉంటే, అవి (ఫీలింగ్స్, అనుభవాలు) వస్తువులు (things) కాదు; మీకు నిజంగా తెలియదు, అవి ఏమిటో.

**ప్ర: కాబట్టి, ఏమీ తెలియని ఈ స్తితి ఒక కలలో జీవించడం లాంటిది?**

**యుజీ:** అది మీకు. విషయాలకి, వస్తువులకి మీరు ఇస్తున్న వాస్తవికతకు సంబంధించినంత వరకు, మీరు ఈ 'ఏమీ తెలియని ఈ స్తితి' ని ఒక 'కల' అని అంటారు. నేను బతికే ఉన్నానో మరణించానో గూడా నాకు నిజంగా తెలియదు.

----------------

ఇక్కడ నిజం అనేదే ఏదీ యికపై లేదు, అంతిమ నిజం (ultimate reality) గురించి ఇంక చెప్పనక్కర లేదు. మీరంగీకరించిన విధంగానే నేను గూడా ప్రతీ ఒక్కదాని వాస్తవికతను అంగీకరించానా.. అన్నట్టుగా ఈ లోకం లో వ్యవహరిస్తూ ఉంటాను. ఉదాహరణకు (ఇదే నేను ఎప్పుడూ అడుగుతూ ఉంటాను), నీవు జీవిస్తున్న ఈ మూడు పరిమానాల స్తలాన్ని (three-dimensional space ని) అనుభూతి చెందడం (experience చేయడం) సాధ్యమా? కాదు. పొడవు యిన్ని అడుగులు, వెడల్పు, ఎత్తు ఇన్ని అడుగులు అనే నాలెడ్జి మీకు ఉండి తీరాలి. ఆ నాలెడ్జి తో తప్ప, ఈ త్రీ డైమెన్షనల్ స్పేసును ఎలా ఎక్స్ పీరిఎన్స్ చేయగలవు? కనుక, కనీసం దీన్ని కూడా ఎక్స్ పీరిఎన్స్ చేయడం సాధ్యం కాదు, యిక ఫోర్త్ డైమెన్షన్ (నాలుగో పరిమాణం) గురించి మాట్లాడడం ఎందుకు.– మనకు నిజంగా దీని గురించి తెలియదు. అందువలన, గోడలు అనేవి నాకు ఉండవు (ఉన్నట్టు అనిపించదు), అంటే అక్కడ ఉన్న గోడల యొక్క ప్రత్యక్ష అనుభూతి(direct experience) నాకు ఉండదని. దీనర్థం నేను అటువైపు వెళ్ళినపుడు గోడలను గుద్దేస్తానని కాదు. ఇది ఒక నీటి ప్రవాహం లాంటిది : నీటికి ఏదైనా అడ్డొస్తే అక్కడ ఒక చర్య (action) ఉంటుంది – అక్కడ నీరు పైనుండి పోతుంది లేదా పక్కనించి పోతుంది. అలా జరగడం ఎప్పుడు సాధ్యమవుతుందంటే బేగ్రౌండ్ లో ఉన్న నాలెడ్జి పనిలోకి (ఆపరేషన్ లోకి) వచ్చినప్పుడు మాత్రమే – అప్పుడు అక్కడ చర్య

ఉంటుంది. కానీ యిక్కడ, ఆ దిశలో నడిస్తే అక్కడ అడ్డు గాని మరొకటి గాని ఉంటుందా అనే ఆలోచనే రాదు.

---------------

చూడండి, పదార్థం (మేటర్) అనే పదం నేను వాడినప్పుడు శాస్త్రజ్ఞులు ఆ పదాన్ని వాడుతున్న అర్థంలో కాదు. ఒక స్పర్శ(contact) ఉంది అనుకోండి...(యుజీ కార్పెట్ ని తాకి చూపిస్తాడు). తెలివైన వాడు అడుగుతాడు "అక్కడ స్పర్శ ఉందని నీకు ఎలా తెలుస్తుంది?" అని. ఆ స్పర్శ అంటే అక్కడ ఏదో ఉంది అని తెలియడం, స్పృహ, awareness అని నీవు చెప్ప గలవు. కానీ అది గట్టిగా ఉంది, అని నీవు అన్నప్పుడు నీవు దానికి గట్టితనం అనే గుణాన్ని యిచ్చేవ్; ఆ గుణాన్ని ఇవ్వకపోతే, అది గట్టిదా లేక మెత్తనిదా? ఆ గుణాన్ని నీవు డైరెక్ట్ గా ఎక్స్పీరిఎన్స్ చేయగలవా? నాకు తెలియదు, అన్నిటి కంటే ఎక్కువగా నిన్ను తప్పు దారి పట్టించేది భాష, లాంగ్వేజ్. "డైరెక్ట్ గా" అనే పదాన్ని నేను వాడితే, డైరెక్ట్ గా అనుభూతి చెందగలిగేది వేరే ఏదో ఉందని మీరనుకుంటారు. అందువల్ల "డైరెక్ట్ గా" అనే పదం నేను వాడడంలో అర్థం ఏమిటంటే, మీరు అసలు దేనినీ ఎక్స్పీరి ఎన్స్ చేయలేరు అని. నేను విష్టావిజన్ (అత్యంత స్పష్టంగా, దగ్గరగా ఉన్నట్టు, 3D చిత్రం లాగ కనిపించడం) గురించి మాట్లాడుతున్నపుడు, నేను విష్టావిజన్ ఎక్స్ పీరిఎన్స్ చేయగలను అని నేను చెప్పడంలేదు; నేను చెప్పేదేమిటంటే నీవు దాన్ని ఎక్స్ పీరిఎన్స్ చేయలేవు. నేను చెప్పేదాన్ని ఎక్స్ పీరిఎన్స్ చేయడానికి ప్రయత్నించ వద్దు. నేను గాని, నీవు గాని, మరొకరు గాని, ఎవ్వరూ ఎక్స్ పీరిఎన్స్ చేయలేరు. అలాంటప్పుడు ఇంక మాట్లాడడం ఎందుకు? ఎందుకంటే నీవు అక్కడ ఉన్నావు కాబట్టి, నేను ఇక్కడ ఉన్నాను కాబట్టి.

---------------

**ప్ర: ట్రయిను గాని మరొకటి గానీ అందుకోవలసిన అవసరం మీకు ఉన్నప్పుడు తప్ప, వర్తమానంలోనే, అంటే అప్పుడున్న క్షణంలో మీరు జీవిస్తూ ఉంటారా ?**

**యుజీ** : 'క్షణ క్షణం జీవించడం' అనే మాటలు మిమ్ములను చాలా తప్పు దారి పట్టిస్తాయ్. క్షణ క్షణం జీవించడాన్ని నీవు ఎప్పుడూ గ్రహించ లేవు – అది నీకు

తెలుస్తున్న నీ అస్తిత్వంలో (conscious existence లో) ఎప్పుడూ భాగం అవదు, ఇక, అది నీకు తెలుస్తున్న నీ ఆలోచనల లోకి, (conscious thinking లోకి) రావడం అనే ప్రసక్తే లేదు.

ఇటు చూడండి, 'నీవు' యొక్క నిర్మాణపద్ధతికి(structure కి) వర్తమానం ఉండదు; అక్కడ ఉన్నదంతా గతం మాత్రమే, భవిష్యత్తును ఊహించుకోడానికి ప్రయత్నిస్తున్న గతం. మీరు గతం గురించి, వర్తమానం గురించి, భవిష్యత్తు గురించి ఆలోచించ గలరు, కానీ భవిష్యత్తు లేదు, వర్తమానం లేదు, ఉన్నది గతం(past) మాత్రమే. మీ భవిష్యత్తు అనేది గతం యొక్క ఊహ(projection) మాత్రమే. వర్తమానం అనేదంటూ ఒకటి ఉంటే, ఆ వర్తమానం ఎప్పటికీ మీ అనుభవంలోకి రాదు, ఎందుకంటే వర్తమానం గురించిన మీ జ్ఞానం (నాలెడ్జ్) మాత్రమే మీ అనుభవం లోకి వస్తుంది, ఆ జ్ఞానం గతమే. అందువల్ల 'ఇప్పుడు' అని నీవు పిలిచే ఆ క్షణాన్ని అనుభవించ డానికి ప్రయత్నించడంలో అర్థమేముంది? ఇప్పుడు-అనేది మీ అనుభవంలోకి ఎప్పుడూ రాదు; నీవు అనుభవించేది ఏదైనా, అది వర్తమానంలోది కాదు, యిప్పుడు జరుగుతున్నది కాదు. అందువల్ల 'ఇప్పుడు' అనేది, నీకు తెలుస్తున్న నీ అస్తిత్వం లో (conscious existence లో)... ఎప్పుడూ ఒక భాగం కాలేదు, అదేమిటో నీవు వ్యక్తం చేయలేవు. నీకు సంబంధించినంత వరకు, 'ఇప్పుడు' అనేది లేదు, దాని యొక్క భావన తప్ప. ఇప్పుడు అనేదాని గురించి నేను మాట్లాడను.

--------------

నీ జీవితమంతా నీవు ఉపయోగించిన, అతి చిన్న వస్తువైన, అక్కడున్న ఆ బెంచిని నీవు అనుభూతి (expeience) చేయలేనప్పుడు, ఒక అతీతమైనదాన్ని అనుభవించాలని ఎలా అనుకోగలవు. బెంచ్ లాంటి ఓ చిన్న వస్తువును గూడా నీవు ఎక్స్పీరిఎన్స్ చేయ లేవు. నీ అనుభవం లోకి వచ్చేది, దాన్ని గురించిన నాలెడ్జ్(జ్ఞానం) మాత్రమే, అంతే కాదు ఆ నాలెడ్జ్ నీకు ఎప్పుడూ బయట వాళ్ళ దగ్గర నుండి వచ్చినదే – అది మరొకరిది; అది నీది కాదు. ఇతరుల అనుభవాన్ని నీవు అనుభూతి పొందితే ఆ అనుభవం నీదికాదు. మరొకరు వచ్చి దాన్ని తీసుకొని

శ్రోతారు : నిన్ను బాగా ఒప్పించే మాటకారి మరొకడు వచ్చి నీవు అనుభూతిచెందే మార్గం ఇది కాదు మరొకటి ఉంది అంటాడు, ఇలాగే మరొకడు మరొకటి చెపుతాడు.

-------------

నాకు అర్థం అయినంత వరకు తయారుకావడం (ప్రిపరేషన్) అంటూ ఏదీ లేదు, సాధనలు, ధ్యానాలు అక్కర లేదు. నలభై సంవత్సరాలు తలకిందులుగా నుంచున్నా ఏమీ జరగదు. నీవేంకోరుకొన్నప్పటికీ, బహుశా.. నీవు అనుభవించ గలిగేదే అనుభవిస్తావ్. ఆలోచన అనేది అసాధారణమైనది: ఒక గట్టిగా ఉండే వస్తువును నీవు తయారు చేసి, దాన్ని అక్కడ పెట్టి, దాన్ని ముట్టుకొని, దాన్ని అనుభూతి చెంది, దానితో మాట్లాడి -- అదొక గొప్ప విషయం అనుకొంటావ్. ఈ అనుభవాలన్నిటి గుండా నీవు వెళ్ళాల్సిందే.

నీకుగాని, మరొకరికిగాని ఇంతకు ముందెన్నడూ జరగనిది, జరగడమే అసాధ్యమైనది, ఎక్కడనుండి వచ్చిందో తెలియనిది అయిన ఒక గొప్ప అసాధారణమైన అనుభవం లాంటిది అప్పుడప్పుడు జరిగి ఉండచ్చు. అది ఎక్కడా లేని చోటు నుండి రాలేదు; అది చైతన్యం యొక్క జ్ఞానంలో, కాన్షియస్నెస్ యొక్క నాలెడ్జి లో భాగం. నీకు పూర్వం, మనిషి అనుభవించినదంతా చైతన్యంలో(కాన్షియస్నెస్ లో) భాగం – యిదంతా అక్కడ ఉంది – అదంతా ఒక కాలుష్యం. నీవు ఏది అనుభవించినా, అది ఎంత ప్రగాఢమైనదైనా, అది ఒక కాలుష్యమే. దీనికి యీ స్తితితో పనిలేదు; ఎవరో ఇదివరకు దాన్ని అనుభవించారు. అక్కడ నీవు దేనిని అనుభవించినా అది విలువ లేనిదే. ఇది అది కాదు.

నీవు అనుభవించినది ఏదైనా, అది ఆలోచన చేత ప్రేరేపించబడినదే. జ్ఞానం (నాలెడ్జ్) లేకుండా నీవు అనుభవించ లేవు. అనుభవం నాలెడ్జిని బల పరుస్తుంది. ఇది ఒక విష వలయం: కుక్క తన తోకను తానే తరుముతూ తిరగడం.

చైతన్యం (Consciousness) విస్తరించడం అనేది చెప్పుకోదగ్గ విషయమేమీ కాదు, కానీ నీవు దానికి చాలా ప్రాముఖ్యతను యిస్తావ్. ఈ ధ్యానాలూ యోగాలు కంటే మాదక ద్రవ్యాలు (drugs) చాలా తేలిగ్గా యీ పని చేస్తాయ్. L.S.D తీసుకున్న వాళ్ళు చాలా మంది నాకు తెలుసు. మీరు దయచేసి నన్ను అపార్థం

చేసుకో వద్దు – నేను వీటిని సమర్థించడం లేదు. మీరు ఒక పెద్ద పర్వతం ముందు ఉన్నారనుకోండి, ఒక్కసారిగా మీ కాన్షియస్నెస్ (చైతన్యం) అక్షరాలా ఆ పర్వతమంతా సైజుకు వ్యాకోచిస్తుంది. ఆ కాన్షియస్నెస్ ఒక్క సారిగా పేల్చి వేయబడుతుంది. అలా సడన్ గా, ఒక్క సారిగా జరిగిన వ్యాకోచం, విపరీత మైన శక్తిని నీలో విడుదల చేస్తుంది. దాని ప్రభావం భౌతిక శరీరం మీద ఎలా ఉంటుంది? మీరనే ఆ కాన్షియస్నెస్ యొక్క సడన్ వ్యాకోచం వల్ల శరీరం స్పందిస్తుంది, ఆ స్పందనే సడన్ గా శ్వాస తీసుకోవడం – సడన్ గా నీవు శ్వాస తీసుకొంటావ్, ఊపిరి పీల్చుకొనే తీరు మొత్తం మారిపోతుంది – అందుకే అంటారు a breath-taking view- (దీర్ఘ శ్వాస తీసుకోవాల్సిన దృశ్యం) అని. నేనొకసారి ఎలిఫెంటా గుహలను (ముంబై దగ్గర) చూడ్డానికి వెళ్ళేను. అక్కడ పెద్ద త్రిమూర్తి విగ్రహం ఉంది; దాని ఎదురుగా నేను నిలబడి ఉన్నాను; అప్పుడు అనుకోకుండా నా కాన్షియస్నెస్ (దీనికి ఏ పేరు పెట్టినా) వ్యాకోచించింది, ఆ విగ్రహం యొక్క సైజంతగా. ఇటువంటి అనుభవాలు నీకు ఎప్పుడూ కలుగుతూనే ఉంటాయ్. ఈ అనుభవాలకు ప్రత్యేకత ఏమీ లేదు.

నీవు యిటున్నా అటున్నా, ఈ అనుభవాలలో దేనికీ అర్థం లేదు. వాస్తవంగా ఇటువైపు లేదా అటువైపు అనేదీ లేదు, ఎందుకంటే ఈ రెండిటినీ వేరు చేసే గీత యిక్కడ లేదు. ఈ అనుభవాలు ఎంత గొప్పవైనప్పటికీ వాటికి అసలు విలువ లేదనేది విషయం నీయంతట నీకే తెలిసొస్తుంది, అంతే. నీవు పరమానంద స్తితిలో ఉండి ఉండ వచ్చు – ఆ 'కెలామిటి(విపత్తు)' తర్వాత కూడా పరమానంద స్తితులు, పారవశ్య స్తితులు, అక్కడున్నదంతా ఒక్క సారిగా కరిగి పోవడం నాకు కలుగుతుంటాయి – వీటికి ఏ అర్థమూ లేదు. మీరూ అనుభూతి పొందుతారు, నేనూ అనుభూతి పొందుతాను– తేడా ఏమిటి? భారత దేశంలో ఋషులు 'ఆనందస్తితి' లేదా 'తమకు శరీరమే లేనట్లు అనిపించే స్తితి' (absence of body consciousness) అని పిలవబడే అతి చిన్న విషయాన్ని అనుభూతి చెందుతారు, దీన్ని వారు, ఒక అతి గొప్ప స్తితిలో ఉన్నట్టుగా భావిస్తారు. అవన్నీ అడ్డంకులు, వారు కాన్షియస్నెస్ ను, చైతన్యాన్ని పరిమితి చేసుకొంటున్నారు, ఇవన్నీ

ఏవిధంగానూ సహాయ పడవు; కానీ మీకవి బహుశా  చాలా ఆసక్తి కరంగా ఉంటాయి, కారణం మనిషి ఎప్పుడు పరిమితమైన చైతన్యం లోనే (లిమిటెడ్ కాన్షియస్నెస్ లోనే) పని చేస్తూ ఉంటాడు.

ఎల్.ఎస్.డి (LSD) అనేది ఒక భయంకరమైనది అనే ఊహతో మొదలెడుతారు. ఎందుకు?  నేను ఆశ్చర్య పోతాను! దీన్ని నేను సమర్ధించడం గాని, సిఫార్సు చేయడం గాని చేయడం లేదు. డ్రగ్స్ (మత్తు పదార్ధాలు) అనుభవాలు పుట్టిస్తాయ్, నేను దేని గురించి మాట్లాడుతున్నానో అది ఒక అనుభవం కాదు. కానీ పశ్చిమ దేశాల్లోని యువత అంతా దీన్ని వాడిచూశారు -- ఆడ పిల్లలు, మగ పిల్లలు అందరు -- అందువల్లే వాళ్ళకి ఇటువంటి భారతీయ (*తత్వశాస్త్ర*) విషయాలపై సడన్ గా ఆసక్తి కలిగింది, అంతే కానీ  వాళ్ళకి  డబ్బుమీద గాని  సామాజిక విలువల మీద గాని విరక్తి కలిగికాదు. వాళ్ళు LSD వాడి చూసేరు, ఇది వీళ్ళకి, ఈ కాన్షియస్నెస్ లో  ఇంకా ఏదో ఇంతకు మించి ఉందనే ఒక రకమైన భావనను కలిగించింది. కానీ అవన్నీ మామూలు అనుభవాలే.

డ్రగ్స్ తీసుకోనడం వల్ల కలిగే అనుభవాలకీ మత పరమైన, అధ్యాత్మిక పరమైన అనుభవాలకీ ఏమీ తేడాలేదు. టిబెట్ సాహిత్యం గురించి ఎప్పుడూ వినని, నాకు తెలిసిన  ఒక యువకుడు,  మాదక ద్రవ్యాలు, డ్రగ్స్  తీసుకొన్నప్పుడు (when on a Trip) వివిధ రకాల మండలాలు (మర్మమైన చిత్ర రేఖలు, mystical designs) ఎక్స్ పీరిఎన్స్ చేశాడు. అతడు వాటి గురించి మాట్లాడం మొదలు పెట్టేడు, తరవాత అతనికి ఒక టిబెటియన్ పౌరుడు వాటిని వివరించి చెప్పేడు. ఇటువంటిది ఎలా జరగడం సాధ్యమయింది?  నీవు టిబెట్ లోనే ఉండనక్కర లేదు; నీవెక్కడ ఉన్నప్పటికీ..., చూడండి, అది అంతా, కాన్షియస్నెస్ లో ఒక భాగమే. డొనాల్డ్ డక్ (Donald Duck) కూడా మానవ-చైతన్యం (Human-Consciousness) లో భాగమైపోయింది.

--------------

నీ సొంతం అని చెప్పుకో గలిగే దేనినీ నీవు అనుభవించలేవు. దేన్ని నీవు అనుభవించినప్పటికీ, ఆ అనుభవం ఎంత గొప్పదైనప్పటికీ, అది నీ కాన్షియస్నెస్

లో (చైతన్యంలో) భాగమయిన జ్ఞానం (నాలెడ్జి) ఫలితమే. **కాల క్రమంలో, గడచిన కాలంలో ఎవరో ఒకరు, ఎక్కడో అక్కడ, ఒక రకమైన దివ్యానందాన్నీ, పరమానందాన్ని, పరవశత్వాన్నీ (మీరు దీనికి ఏ పేరు పెట్టినా పిలవండి) తప్పక అనుభవించి ఉంటారు, అ అనుభవం నీదే అయి ఉండనక్కర లేదు, ఆ అనుభవం నీ యొక్క కాన్షియస్నెస్ లో ఒక భాగమే.** కొత్త అనుభవం అనేది అసలు లేనే లేదనే పాయింట్ కి నీవు రావాలి: నీకు పూర్వమే ఎవరో దానిని అనుభవించారు కాబట్టి ఆ అనుభవం నీది కాదు.

---------------

జ్ఞానులు (sages) మాట్లాడిన దాన్ని అనుభూతి చెందుతాడు కాబట్టి సాధువు (saint) లేదా మార్మికుడు (mystic) సెకండ్ హేండ్ మనిషి. అందుచేత అతడు యింకా ద్వంద్వక్షేత్రం లోనే (field of duality లోనే) ఉంటాడు. జ్ఞానులు, ద్రష్టలూ(sages, seers) మాత్రం, విభజనలేని చైతన్య స్థితిలో వ్యవహరిస్తూ ఉంటారు. మార్మిక అనుభవం అసాధారణమైనది ఎందుకంటే అది మేధస్సుకు సంబంధించినది కాదు; ఈ మార్మిక అనుభవం వీరికి, విషయాలను మరో రకంగా చూడడానికి, మరో రకంగా అనుభూతి చెందడానికి దోహద పడుతుంది, అంతేగాక జ్ఞానుల యొక్క, ద్రష్టల యొక్క మాటలను యితరుల కొరకు అన్వయించి చెప్పడానికి సహాయ పడుతుంది.

ఈ ప్రపంచం జ్ఞానుల కంటే సాధువులకే ఎక్కువ ఋణపడి ఉండాలి, ఈ సాధువులే లేకపోతే ఈ జ్ఞానులను ఎప్పుడో ప్రజలు మరచిపోయే వారు. జ్ఞానులు ఎవరి అధికారం మీద (ప్రమాణ గ్రంధాల మీద) ఆధారపడరు; వాళ్ళు చెప్పినదే ప్రమాణం (అధారిటీ). ఈ జ్ఞానులు మాట్లాడినది & కొంతమంది సాదువులకు కలిగిన అనుభవాలు, ఇవన్నీ సాధువుల అనుభవాల్లో ఒక భాగ మయ్యాయి. వీరు (సాధువులు) తమకు కలిగిన అనుభవాలను సంగీతం ద్వారా ఇంకా వివిధ రకాలుగా ప్రజలతో పంచుకోడానికి ప్రయత్నించేరు. కానీ ఇది అనుభవం కాదు మరొకరితో పంచుకోడానికి. ఇది ఒక అనుభవం కానే కాదు.

ఈ సాధువులు మీకు చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు, అందువల్ల వాళ్లెప్పుడూ ద్వంద స్థితిలో ఉంటారు; కానీ జ్ఞాని లేదా ద్రష్ట (మీరు ఎలా పిలిచినా) విభజన లేని చైతన్యంలో, undivided consciousness లో ఉంటాడు. అతడు విముక్తుడని (free-man అని) అతనికి తెలియదు. అందువల్ల ఇతరులను విముక్తి చేయాలనే ప్రయత్నమే అతనికి ఉండదు. అతడు అక్కడ ఉన్నాడంతే. అతడు దాని గురించి మాట్లాడతాడు, తరువాత వెళ్ళిపోతాడు. గౌడపాదకి శిష్యులు లేరు -- ఎవరికీ బోధించ డానికి నిరాకరించేడు. రమణ మహర్షి మన సమకాలికుడు కూడా – అతనిని గురించి మనకు కొంత తెలుసు. ఆయన ఎవరికీ బోధించలేదు, ఎవరికీ దీక్షనివ్వలేదు. అటువంటి వారు ఎవరి ఆధారిటీ మీదా ఆధారపడరు. గొప్ప గురువులు మరొకరిని ఆధారిటీగా తీసుకోరు. వారు సాధువులు చెప్పేదానికి భాష్యం చెప్పరు. మనం దేనినైనా వేరే కోణంలో చూడడానికీ, వేరే విధంగా అర్థం చేసుకోవడానికీ, సాధువులు సహాయ పడతారు.

మీరు అధ్యాత్మిక సాధనల ద్వారా, జ్ఞానులు కాలేరు; అది మీ చేతుల్లో లేదు. ఒక జ్ఞానికి శిష్యుడు ఉండదు. జ్ఞానికి అనుయాయుడు ఉండడు, ఎందుకంటే... ఇది ఒక అనుభవం కాదు.. పంచుకోగలగడానికి, (ఒక సాధారణ అనుభవం గూడా మీరు ఇతరులతో పంచుకోలేరు. సెక్స్ అనుభవం లేనివారికి సెక్స్ అనుభవం ఏమిటో ఎలా ఉంటుందో మీరు చెప్పగలరా?) జ్ఞానులు, ద్రష్టలు అసలైన తనదైన, ఒరిజినల్ ప్రత్యేకత ఉన్న వాళ్ళు. ఎందుకంటే వారు గతమంతటి నుండి, తమను తాము పూర్తిగా విముక్తి చేసుకొన్నారు. (మార్మిక అనుభవాలు గూడా గతంలో భాగమే.) అటువంటి వారికి గతం ఉండదని కాదు నేనుచెప్పేది; కానీ వారి గతంలో ఆవేశపూరిత భావజాలం (emotional content) ఏమీ ఉండదు – ఆ గతం, అతని చర్యలను ప్రభావితం చేస్తూ నిరంతరంగా పనిలో ఉండదు.

ఇదే చిట్ట చివరిది (అల్టిమేట్): నీ అంతట నీవు పూర్తిగా లొంగి పోవాలి, అన్నిటినీ వదిలిపేయాలి. జ్ఞాన మార్గం లేదు; అసలు మార్గమే లేదు. ఇది సంపూర్ణ ఆత్మసమర్పణ – ఓటమిని అంగీకరించడం, పూర్తిగా నిస్సహాయంగా ఉండిపోవడం – అప్పుడు దానినుండి వెలువడేదే వివేకం (wisdom). సమర్పణ అంటే ఆ పదం

యొక్క మామూలు అర్థంలో కాదు; నీవు చేయగలిగినది ఏమీ లేదని అర్థం. అదే సంపూర్ణ ఆత్మసమర్పణ – టోటల్ నిస్సహాయత. నీ కృషి వల్ల గాని, నీ సంకల్పం వల్ల గాని దీన్ని తీసుకొని రాలేవ్. నీవు దేనికైనా సరండర్ అవ్వాలని కోరుకున్నావంటే అది మరొకటి పొందడానికే. అందువల్లే 'ఒక సంపూర్ణ ఆత్మ-సమర్పణ స్తితి' (a state of total surrender) అనే పదాలు వాడుతున్నా. అది ఒక... 'అన్నీ ప్రయత్నాలు అంతమైన, ఏదో పొందాలనే దిశలో ఆలోచించడం అంతమైన ఆత్మసమర్పణ-స్తితి'. ఏ విధమైన కోరుకోవడాలూ, ఇదిగాని, అదిగానీ ఏ వాంఛా అసలక్కడ ఉండదు.

కానీ, అన్నిటికంటే ముందు, అక్కడ ఆకలి లేదు. ఆకలిగా ఉన్నవాడు ఆకలి తీర్చుకొందుకు ఏదైనా చేస్తాడు, ప్రతీదీ చేస్తాడు. ఆకలిని తృప్తి పరచడానికి తాను ఇంక ఏమీ చేయలేనని తరవాత కనుగొంటాడు. ఏదో అద్భుతం జరిగి ఎక్కడనుండో అది దిగి నీలో ప్రవేశించక పోతుందా... అనే ఆశ గూడా పోవాలి. నీ ఆకలిని తృప్తి పరచడానికి నీవు మరింక ఏమీ చేయలేనప్పుడు నీకు తెలియనిది ఒకటి జరుగుతుంది. ఎవరికైతే యిటువంటిది జరిగిందో వారందరు చాలా శ్రమించారు, ఏమీ చేయలేని చిట్టచివరి దశకి, నిస్సహాయ స్తితికి వచ్చేరు, అంతా పందెంలో పెట్టేరు. ఇది అంత తేలిగ్గా రాదు. దీన్ని నీకు ఎవరో వచ్చి బంగారు పళ్ళెంలో పెట్టి ఇవ్వరు.

--------------

ఇది చాలా సింపుల్ విషయం – ఎంత సింపుల్ అంటే ఆ సంక్లిష్ట నిర్మాణానికి దీని మానాన దీన్ని వదలడం యిష్టం లేదు. అయినప్పటికీ నేను అడుగుతాను "నీవు చేయ గలిగినది ఏదైనా ఉందా?" అని. ఎవ్వరూ ఈ ఆకలిని సృష్టించ లేరు. నేనెప్పుడూ 'వరి ఊక' ఉపమానం యిస్తూ ఉంటాను: ఒక సారి దానికి నిప్పు పెట్ట గానే, అది కాలుతూనే ఉంటుంది, మొత్తం కాలిపోయేవరకు. నీవు దీన్ని కృత్రిమంగా సృష్టించ లేవు. బహుశా నిన్ను గట్టిగా నమ్మించేవాడి చేత ప్రేరేపించబడవచ్చు, లేదా ఒక హిప్నోటిస్ట్ చేత హిప్నోటైజ్ చేయబడ వచ్చు – అటువంటి వాళ్లు చాలా మంది ఉన్నారు.

అనుభవం అనేది యిక్కడ లేదు. నీకు తెలుసు అన్నట్టుగా కనిపిస్తావ్. నీవు ఊహించు కుంటావ్. ఊహించుకోడం ఆగిపోవాలి. ఎలా చెప్పాలో నాకు తెలియడం లేదు. ఊహించుకొనడం లేనపుడు, ఇచ్ఛ లేనపుడు, తమ శక్తిని ఉపయోగించ నపుడు, ఏ దిశలో గూడా, ఏ స్థాయిలో గూడా, ఏ దిశలో గూడా ఏ చలనాలు లేకుండా అంతా స్తంభించి పోయినపుడు, – అదే(ఆ స్తితే) ఇది. దీన్ని అనుభూతి చెందడం అసలు సాధ్యం కాదు (ఇది అనుభవం లోకి రాదు). ఇది ఒక అనుభవం కాదు. ఆనంద స్తితి, మోక్షం, ప్రేమ... దేముడికే తెలియాలి అవేమిటో, వీటిని మీరు అనుభవించాలని కోరుకొంటున్నారు, కానీ ఇవి విలువ లేనివి. నేను ఆనంద స్తితిని అనుభవిస్తే... అది నిజంగా ఆనంద స్తితియేనా? నా దగ్గరున్న ఉన్న నాలెడ్జే(జ్ఞానమే) దీన్ని సృష్టించింది. ఇది(కూడా) నాలెడ్జే. నాలెడ్జి నుండి విముక్తి చెందడం అంత తేలికైన పని కాదు. ఆ నాలెడ్జే నీవు – నీవు ఈ జీవితంలో సంపాదించుకున్న నాలెడ్జే కాదు, కొన్ని కోట్ల సంవత్సరాల యొక్క జ్ఞానం, ప్రతి ఒక్కరి అనుభవాలు గూడ. మనుషులకు కొన్ని అనుభవాలు ఉంటాయ్, వాటిపై వారు అతి పెద్ద (ఆశల, అభిప్రాయాల) కట్టడాన్ని నిర్మించుకుంటారు.

**ప్ర: ఇది ఒక చిన్న విషయమని మీరంటారు, మళ్ళీ ఇది ఒక కష్టమైన విషయమని మీరే అంటారు.**

యుజీ : కాదు, చూడండి, ఇది ఎంత చిన్న విషయమంటే ఈ సంక్లిష్ట నిర్మాణానికి, దీని మానాన దీన్ని వదలాలని లేదు.

-------------

నా గురించిరాసిన వ్యాసాలు నాకు నచ్చవు. నన్నొక మతపరమైన వ్యక్తిగా చూపించడానికి మీరు ప్రయత్నిస్తున్నారు. నేను అటువంటి వాణ్నికాదు. నేను నొక్కి చెపుతున్న అతి ముఖ్యమైన విషయాన్ని గ్రహించడంలో మీరు విఫలమవుతున్నారు. నేను వ్యక్తంచేస్తున్నదేమిటో యీ వ్యాసాలు కొంచెం గూడా తెలియజేయవు. నేను చెప్పే దాంట్లో ఏ రకమైన మతపర విషయాలు లేవు, మర్మగర్భమైన మాటలు అసలు లేవు. మానవాళి రక్షకుల నుండి మనిషిని రక్షించాలి! ఈ మతపర ధార్మికులు – తమాషాలు చేసి మొత్తం మనవాళిని

మూర్ఖులను చేశారు. వాళ్ళని బయటికి తోసి పారేయ్యండి! ధైర్యం అంటే అదే, అక్కడ ధైర్యం ఉంది కాబట్టి; మీరు చూపిస్తున్న ధైర్యం కాదు.

అభయం పై బ్రహ్మం (నిర్భయమే బ్రహ్మం) అని జపిస్తూ ఉండడం వల్ల ప్రయోజనం ఏమిటి? ధైర్యం అంటే కొన్ని ప్రత్యేకమైన, కారణం తెలియని నిర్హేతుక భయాలు (phobias) గురించి కాదు మాట్లాడుతున్నది. జీవరాసులు మనుగడకి ఈ భయాలు(ఫోబియాలు) చాలా అవసరం. ఎత్తు, లోతులను గూర్చిన భయం నీకు ఉండితీరాలి, అది లేక పోతే పడి పోయే ప్రమాదముంది. కానీ యుద్ధభూమిలో పోరాడడానికి మనిషికి ధైర్యాన్ని నేర్పడానికి నీవు ఇష్టపడవు. అతనికి ధైర్యాన్ని ఎందుకు నేర్పాలనుకొంటున్నావ్? ఇతరులను చంపడం తనను చంపుకోడం – అది మీ సంస్కృతి. బెలూన్ లో అట్లాంటిక్ మహా సముద్రం దాటడం లేదా తెప్పమీద పసిఫిక్ మహా సముద్రం దాటడం -- ఎవరైనా చేయగలరు -- అది ధైర్యం కాదు. నిర్భయమనేది యిలాంటి పిచ్చి పనులు చేయడం కాదు.

ధైర్యం (Courage) అంటే, నీకు పూర్వం, మనిషి అనుభవించిన ప్రతీదాన్ని అనుభూతి చెందిన ప్రతీదాన్ని పక్కకు తోసేయడమే. వీటన్నిటికంటే నీవు ఒక్కడివే గొప్ప వాడివి. ప్రతీది సమాప్తమైపోతుంది.. సంప్రదాయాలన్నీ, అవి ఎంత పవిత్ర మైనప్పటికి, దైవిక మైనప్పటికి, మొత్తం పోయాయ్. అప్పుడు మాత్రమే నీవు నీవుగా ఉండ గలవు. అదీ వ్యక్తిత్వం అంటే. మొట్టమొదటి సారిగా నీవు ఒక వ్యక్తివి అవుతావ్. నీవు ఒకరిపై గాని, లేదా ఒక ప్రామాణికం పై గానీ ఆధారపడి ఉన్నంతవరకు నీవు ఒక వ్యక్తివి కావు. ఆధారపడడం ఉన్నంతవరకు ఒక వ్యక్తి యొక్క ప్రత్యేకత బయట పడలేదు. ఏ ప్రామాణికం, అధికారం (authority) పైనా ఆధారపడవలసిన అవసరం నీకు లేదు; దీనికి తనదైన ఓ అధికారం ఉంది. నీవు ఎప్పుడూ దేని అర్థాన్ని వివరించి చెప్పవు. నీవు ఎటువంటి ఆధారిటీని నమ్మవు, అయినప్పటికీ, నీవు ఒక ప్రత్యేకమైన వాడివని చెప్పుకోవు.

ఇక్కడ ప్రోబ్లమ్ ఏమిటంటే అటువంటి వ్యక్తి మాట్లాడకపోయినప్పటికీ, అతని ఉనికి (presence) వల్లనే కొంతమందికి అతడు ఒక ఆదర్శపురుషుడై పోతాడు. ఎవరో ఉదయం నుండి సాయంత్రం వరకు యిక్కడ కూర్చుంటారు – దానికి నేనేమీ

చేయ గలను? అప్పుడప్పుడు సమాధి, అచేతనావస్థ (trance) లోకి వెళ్ళి పోతారు – వాళ్ళు అంటారు "నాకిలా జరగడాన్ని మీరెలా కాదనగలరు?" అపుడు నేనంటాను "మీకు నచ్చినది మీరు చేసుకోవచ్చు" అని. నీదగ్గర ఉన్నదాని కంటే ఎక్కువేమీ నాదగ్గర లేదనే విషయం నీకెలా నచ్చ చెప్పగలను. మీదగ్గర లేనిదేదీ నా దగ్గర లేదు. మరొకరి నుండి ఏదైనా కోరుకోవడమే మీ దురవస్థకు (misery) కారణం. భ్రమ అంతమవడమే నీవు అంతమవడం. అందువల్ల భ్రమ లేకుండా మీరు ఉండలేరు. ఒక భ్రమ స్థానంలో మరొక భ్రమను పెట్టడం మాత్రమే మీరు చేయగలరు.

-------------

ఈ సాధనలన్నిటి యొక్క అసంబద్ధతని, అని మీకు అర్థమయ్యేట్టు చెప్పడం చాలా కష్టం. (మీరు పారిపోడాన్ని ఎప్పటికప్పుడు ఆపివేస్తున్నాను. నిన్ను ఒక మూల ఉంచడానికి బయటకు పోయే ఆ ద్వారాన్ని గూడా మూసి వెయ్యాలి,. మీకు ఊపిరి ఆడకుండా చేయాలి, ప్రాణం పోతుందా అన్నట్లుగా). ఒక నిజమైన గురువు మాత్రమే (యీ సాధనల నిరర్ధకతను) దాన్ని కనుక్కొని మీకు చెప్పగలడు; మరెవ్వరూ కాదు. (పుస్తకాలను, పురాణాలను వివరించి చెప్పేవారు కాదు – అవన్నీ అసలు సంబంధం లేనివి.) అటువంటి వాడు మాత్రమే మాట్లాడ గలడు. అటువంటి మనిషి ఎటువంటి సాధనలను ప్రోత్సహించడు, ఎందుకంటే ఇటువంటిది ఎవరికైనా జరగాలంటే ఆ మనిషికి ఎవరి సహాయం అక్కరలేదని అతనికి తెలుసు; ఏది ఉన్నప్పటికీ ఇది జరుగుతుంది.

మీరు చేస్తున్నది ప్రతీదీ యిది జరగడాన్ని ఆపేస్తోంది. నేను ఇలా అనడం తప్పుడు అర్థాన్ని యిస్తుంది. ఎందుకంటే జరగడానికి ఏమీ లేదు. మీరు చేసేది ఏదైనా అది ఒక స్వీయ కేంద్రీకృత కార్యం (self-centered activity) అని మీరు తెలుసుకోలేక పోతున్నారు. ఏ దిశలో మీరు ఏమి చేసినా అది, దీనంతటికీ మరింత బలాన్ని చేకూరుస్తోంది లేదా దానంతటినీ వక్రీకరిస్తుంది. ఈ సాధనలన్నీ స్వీయ కేంద్రీకృత కార్యకలాపమే(నేను అనే దాని చుట్టూ తిరిగే పనులే). – ఈ విషయం అర్థం చేసుకోవడం చాలా కష్టం. మీరు ఉపయోగిస్తున్న పరికరం 'కార్య కారణ క్షేత్రంలో' (field of cause and effect లో) పుట్టింది – కార్య-కారణ సబంధం

లేకుండా  జరిగే దేనినీ యిది అసలు ఊహించుకోలేదు -- అందువల్ల అది సరైన పరికరం కాదు (దీనిని అర్థం చేసుకోడానికి); అంతేకాదు, వేరే  పరికరం (instrument) మీదగ్గర లేదు.

ఇది అకారణం (acausal). ఇది ఒక స్తితి నుండి మరో స్తితి లోకి దూకడం (a quantum jump). ఇది ఇక్కడ నుండి అక్కడకు దూకుతుంది – నీవు వీటిని లింక్ చేయలేవు. నీవు నన్ను నదికి అవతల తీరం పై ఉంచావ్. పడవలో నదిని దాటుదామని అనుకొంటున్నావ్. ఆ పడవకి చిల్లు ఉంది,  అందుచేత నీవు మునిగి పోతావ్. అవతల ఒడ్డు అనేది ఏమీ లేదు, దాటడానికి అక్కడ నది లేదు, పడవా లేదు – దాన్ని అర్థం చేసుకోవడం మీకు చాలా కష్టం. మీరొక ఊహాచిత్రాన్ని సృష్టించుకున్నారు, దానిని అవతలవైపు ఉంచారు. నేను చెపుతున్నా "అది కాదు, దయచేసి అర్థం చేసుకోండి, నేను గూడా మీరున్న ఒడ్డుమీదే ఉన్నాను, అక్కడ నది లేదు దాటడానికి, అంచేత పడవ నడిపే వాడు అవసరం లేదు".

మీకు ఎవరూ దారి చూపలేరు. మార్గ నిర్దేశకాలు (గైడ్ లైన్స్) లేవు, ఎందుకంటే అతనికే తెలియదు. నాకు తెలిసి ఉంటే మిమ్మల్నికూడా నడిపించేవాణ్ని. అటువంటి వాడు మీకు దారి చూప లేడు, ఎక్కడకీ నడిపించలేడు. నేను గురువులకు వ్యతిరేకమని కాదు -- కానే కాదు. అతనికి తెలుసు – మీ గ్రంధాలు కూడా అదే చెపుతున్నాయ్ – మీకు సహాయం చేయగలిగేది గురువు కాదని. దాని అర్థం అదొక రహస్య విషయమని కాదు. శ్లోకాలు (hymns) అంటున్నాయ్ "ఇది ఎవరిని ఎంచుకున్నదో, వానికే ఇది సంభవిస్తుంది" అని  దీని అర్థం... నీ బయట ఏదో శక్తి ఉందని కాదు. ఆ సామర్థ్యం నీలో ఆల్రెడీ ఉంది. అది పేలగలిగే   సామర్థ్యం దానిలో ఉంది. మనకు తెలియని ఒక అవకాశం వల్ల గానీ, ఏదో అదృష్టం వల్ల గానీ, ఆలోచన రెండుగా విడిపోకుండా తనంతట తాను  అలాగే ఉండిపోగలిగితే, దానికి ఏదో ఒకటి జరగి తీరాలి. అది ఒక అణు విస్పోటకం లాంటిది. ఒకటి కాదు, కోట్లాది. అది పేలినప్పుడు అక్కడ ఉన్న ప్రతీ దాన్ని బద్దలు కొడుతుంది. అది ఒక గొలుసు ప్రతిక్రియ (చైన్ రియాక్షన్); ఒకదాని తర్వాత మరొకటి, ప్రతి కణానికీ ఇది జరుగుతుంది.

ఇది అంత తేలిక కాదు – తర్కం ద్వారా గాని, ఒక శక్తి ద్వారా గాని, ఒకరు బోధించడం వల్ల గాని, మంత్రాలు జపించడం వల్ల గాని కాదు. ఇది సంభవించేట్టు నీవు చేయ లేవు. కానీ అటువంటిది జరిగే అవకాశం ప్రతి ఒక్కరిలో ఉంది, ఎందుకంటే, అది దీని సహజగుణం కాబట్టి. వంద కోట్ల మందిలో ఒక్కరికే ఎందుకు జరుగుతుంది అనే దానికి ఇదే కారణం. ఆ వ్యక్తికే ఇది ఎందుకు జరగాలి, నీ కెందుకు జరగలేదు, అని నీవు అడిగితే, దానికి జవాబు - ఆ అవకాశం నీకు దొరక లేదని. దానికి కారణం లేదు – ఇది అకారణం – ఎందుకంటే నేను నీకు ఇవ్వలేను, ఇది ఎలా జరిగిందో చెప్ప లేను కాబట్టి. ఎలా అనేది లేదు – అందువల్లనే దీనికి కారణం లేదు, దీనిని తిరిగి మళ్ళీ ఉత్పత్తి చేయలేరు. ఒక నకలుని, ఓ కాపీని పునరోత్పత్తి చేయడంలో ఉపయోగం అసలు ఉండదు.– అందువల్లే దానిని పునరోత్పత్తి చేయలేము. ఏ గురువూ తనలాంటి మరో గురువును పునరోత్పత్తి చేయలేదు. ఇది నా అభిప్రాయం కాదు; బుద్ధుడు మరో బుద్ధుణ్ణి ఇక్కడ వదిలి వెళ్ళలేదు, ఏ గురువూ తనలాంటి మరో గురువును తిరిగి ఉత్పత్తి చేయలేదు. అతనికి అనుచరులు (followers) ఉండవచ్చునేమో గాని, తిరిగి ఉత్పత్తి చేయలేనిది ఏదో ఒకటి అతని దగ్గర ఉంది, ఎందుకంటే ప్రకృతి, మరోదాన్ని తయారు చేయడానికి దేన్నీ ఒక నమూనాగా (మోడలు గా) తీసుకోదు.

మిమ్మల్ని శుద్ధి చేసుకొనేందుకు మీరు చేస్తున్నదంతా అసలు అర్ధం లేనిది, ఎందుకంటే శుద్ధి పరచడమనే మాటలు మీకు ఏవిధంగానూ సహాయ పడవు. ఇది మిమ్మల్ని ఒక సాధువుగా తయారు చేయగలదుగానీ, ఆ మరొక దాన్ని తాకలేదు. ఇటువంటిది దిగజారిన జీవరాసులలో మాత్రమే జరగ గలదు. (యిలా జీవ శాస్త్రజ్ఞులు చెపుతారు). ప్రకృతి, ఇదివరకేన్నడూ పునరుత్పత్తి చేయని దాన్ని, ఒక ప్రత్యేకమైన దాన్ని బయటకు విసురుతుంది. అది ఒక విపరీత జీవి (biological freak). అందువల్ల మీయొక్క సామాజిక నైతికత, దాన్ని సాధన చెయ్యడం, దీన్ని సాధన చెయ్యడం అర్ధరహితం. అందువల్లనే ఉపనిషద్దార్శినికులు సాధన గురించి నైతికత గురించి ఎప్పుడూ మాట్లాడలేదు. కానీ సాధువులు మాత్రం వీటి అవసరాన్ని నొక్కి చెప్పేరు ఎందుకంటే వీళ్ళు మరొకరిని అనుకరించే రెండో రకం

అనుకరణదారులు (second-class imitators). ఇటువంటిది జరిగవలసివస్తే అవన్నీ ఉన్నప్పటికీ జరుగుతుంది. అదీ గాక నేను ఇప్పటికీ చెపుతాను, యిది జన్యుపరంగా నిర్ణయింప బడింది అని: అటువంటి మనిషిలో మాత్రమే ఇటువంటిది జరుగుతుంది.

**ప్ర: ఎవరూ దేన్నీ కోరుకోవలసిన అవసరం లేదు, అని మీరు అంటున్నారా?**

**యుజీ :** ఆశ పడ్డం అనేది నీ కాన్షియస్నెస్ లో, చైతన్యంలో ఒక భాగం. అది అంతం అయిపోవాలి; దీన్ని ఆపడానికి నీవు చేయగలిగినది ఏమీలేదు. మరో విధంగా చెప్పాలంటే నీవేమీ చేయలేవ్, సాధన చేయడం తప్ప. నీవేమీ చేయలేని దుస్తితిలో ఉన్నావ్. నీవు సాధన వదిలి వేసినా, అది నీలో సంఘుర్షణను సృష్టిస్తుంది – దాని స్తానంలో మరో సాధన మొదలు పెడతావ్, like JK గారి గారడీ(gimmick)- ఎంపిక లేని జాగృతి – (choiceless awareness). ఆ యుక్తులు ప్రాక్టీస్ చేయడం మొదలు పెడతావ్. అవి అర్ధం లేనివి – పదాలు మారేయ్, కానీ , గేమ్ ఒకటే. కానీ ఎప్పుడో ఒకప్పుడు అసలైనది ఇదికాదు అనే స్వీయ-జ్ఞానం(realization) నీలో ఉదయించాలి. అలా జరగకపోతే ఎప్పుడూ అలా వింటూనే ఉంటావు, మరోసారి విన్నప్పుడు అది అర్థమవుతుందనే ఆశతో. ఆ అవకాశం లేదు. ఏదైనా జరగాల్సి ఉంటే, ఇది ఇక్కడే, ఇప్పుడే జరగాలి.

ఇక్కడ చిక్కేమిటంటే ఎంత ఎక్కువ నమ్మకాలు నీకుంటే, నీకు అంత ఎక్కువ కష్టమవుతుంది, కారణం మరొక నమ్మకం నీ సంప్రదాయానికి జోడవుతుంది. నీవు జాగ్రత్తగా సంరక్షించు కోవాలనే నీ సంప్రదాయం, ఒక కొత్త మనిషి(*టీచర్*) రావడం వల్ల, ఇంకా శక్తిని పుంజుకొని బలపడుతుంది. ఎందువల్లనంటే అతనిని గూడ నీ సంప్రదాయపు చట్రంలో ఇమడ్చ డానికి నీవు ప్రయత్నిస్తున్నావ్. ఈ స్ట్రక్చర్ కి, నిర్మాణానికి కావలిసినది సాంప్రదాయాలను పరిరక్షించడం. కానీ యీ కొత్త మనిషి కావాలనుకొనేది, అన్నింటినీ కూడబెట్టుకొంటూ పోయే తత్వం గల సంప్రదాయాన్ని ఆపడం – సాంప్రదాయాన్ని కొనసాగించడం కాదు, దాన్ని ఆపడం. ఒక మనిషి వచ్చి సాంప్రదాయం కొనసాగకుండా అపుతాడు, దాన్నిగూడా మీరు ఆ కూడబెట్టుకొన్న జ్ఞానం(accumulated wisdom) లో ఒక భాగంగా చేస్తారు – అందుచేత ఇది ఇంకా

కష్టతరం అవుతుంది. ఈ విషయంలో (సంప్రదాయాలు కొనసాగించకుండా అపడంలో) పురోగతిని సాధించిన ఒక వ్యక్తియొక్క విప్లవాత్మక వాక్యం (revolutionary statement) గూడ మీ సంప్రదాయంలో యిప్పటికే ఒక భాగమై పోయింది: ఈ వినడమే, ఈ పురోగతి లోని విప్లవాత్మక గుణాన్ని నాశనం చేసింది, అంతేగాక దీన్ని జ్ఞానంలో (నాలెడ్జిలో), సాంప్రదాయంలో ఒక భాగంగా చేసింది, ఎందుకంటే నీవే ఆ సంప్రదాయం. నీలో పనిచేస్తున్న ఆ 'శ్రద్ధగా వినడం' అనే మెకానిజమే సంప్రదాయం – వినడం ద్వారా సాంప్రదాయం బలాన్ని చేకూర్చు కొంటుంది, తనను తాను పటిష్టం చేసుకొంటుంది. అందువల్లనే నేనంటాను... నా నోటినుండి వచ్చే మాటలకు, కుక్క అరుపులకు, నక్క కూతలకు లేదా పిల్లి కూతలకు తేడా లేదని.

నా నుండి బయటకు వచ్చినదాన్ని, నీవు అంగీకరించే లోపునే మరొకరు వచ్చి, దాన్ని గట్టిగా తిరస్కరించవలసిన, అవసరం ఏర్పడింది. అందుకే నేను మాట్లాడు తున్నాను. ఏదో ఒక కొత్తది జరగవలసిన అవసరాన్ని దీని వ్యక్తీకరణే సృష్టించింది – అది దీని సహజగుణం. అదే దీని ఉద్దేశ్యం, (ఉద్దేశ్యమనేది ఏదైనా ఒకటి ఉంటే); అనుచరులను సృష్టించడం కొరకు కాదు, అక్కడ ఒక కొత్త దాన్ని సృష్టించడం కోసం. ఏదో కొత్తది నిన్ను గతంయొక్క భారం నుండి కాపాడుతోంది. దాన్ని వ్యక్తం చేసిన మరుక్షణమే అది పాతదయి పోతుంది.

ఈ మనిషిలాగే ఎందుకుండాలి? ఒక మనిషి చేతిలోనుండి మరో మనిషి చేతికి కాగడాను మార్చుకుంటూ, పారంపర్యతను కొనసాగిస్తూ – దేని కోసం? మరొకరిని అనుసరించడం అనేది పశువుల లక్షణం. మరొకరిని అనుసరించినంత కాలం మనిషి, మనిషిగా కాలేడు. మనిషి పశువుగా ఉండిపోవడానికి కారణం ఆ సంస్కృతే –గెలవడానికి ఎవరో ఒకరిని వెంటబడుతున్న నాయకుడు, టాప్ డాగ్ ! -- అది మీకు ఏవిధంగానూ ఉపయోగపడలేదు. నీవు శంకరాచార్యుల్ని, బుద్ధుణ్ణీ, చవకబారు అనుకరణ చేయాలనుకొంటున్నావ్; నీవు నీవుగా ఉండాలనుకోవడం లేదు. దేనికోసం? నేను నీకు చెపుతున్నాను, నీవు చాలా ప్రత్యేకమైన వాడివి, అసాధారణమైన వాడివి, యీ సాధువులు, మానవజాతి రక్షకులు, మొత్తం అందరి

కంటే గూడా. నీవు అతని యొక్క చీప్ ఇమిటేషన్ గా ఎందుకు ఉండాలను కొంటున్నావ్? అనేక భ్రమలలో అది ఒకటి. మర్చిపో. శంకరాచార్యులు చనిపోయి శతాబ్దాలు గడిచిపోయాయ్. ఆ సమర్ధత నీలో ఉంది. ముందుగా చేయాల్సింది శంకరాచార్యులను వదిలేయడం. ఒకవేళ శంకరాచార్యులు బోధించిన విషయాలను మీ జీవనోపాధికి ఒక మాధ్యమంగా వాడుకుంటున్నట్టయితే అది వేరే విషయం.

ఇపుడు నీవు 'అక్కడ' ఉన్నావని కాసేపు అనుకొందాం, అపుడు నీవు విముక్తి పొందిన వాడివని నీవు అనుకోవు, మరొకరితో చెప్పవు. నీవు ఎవరినీ విముక్తి చేయడానికి ప్రయత్నించవు; ఇది అక్కడ ఉందంతే, ఒక పుష్పం వలే (నేను యీ పదాన్ని వాడ దలచుకో లేదు; దీనిలో కొన్ని గూఢార్థాలు ఉన్నాయ్). పేడకుప్పపై పూసిన పువ్వుకి తనదైన ఒక అందం ఉంది. మిగతా పువ్వులు దీనికి సాటిరావు. ఒక రోజు అది రాలి పోతుంది – ఐనా ఫరావాలేదు, it doesn't matter.

---------------

నీవు చేయ గలిగినది ఏమీ లేదు. నేను చెప్పిన యీ మాటలో నీకు అర్థం కనపడదు, ఎందుకంటే నీవు ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూనే ఉంటావ్. నీవు ఏదో ఒకటి చేస్తూనే ఉండాలి, అందువల్ల యీ నా మాటలో(statement లో) అర్థం గానీ ఔచిత్యం (relevance) గాని ఏమాత్రం నీకు కనబడదు. ఈ స్తితి యొక్క వివరణ చాలా ప్రమాద కరమైనది, ఎందుకంటే నీవు పనిచేసే విధానంతో దీనిని పోల్చిచూడ్డానికి, ప్రయత్నిస్తున్నావ్. ఎందుకోసం? ఎందుకంటే, నేను చెపుతున్న దానికి తగ్గట్టుగా, నీవు నీ విధానాన్ని పూర్తిగా మార్చుకోడానికి, మెరుగు పరచుకోవాలని,, సవరించుకోవాలని లేదా మరొకటి చేయాలని కోరుకొంటున్నావ్. అక్కడ దేన్ని మార్చాలనుకొంటున్నావ్? అదేమిటి? దాన్ని నీవు కనుక్కోగలవా? అదెక్కడుందో చూపించ గలవా? "ఇదిగో, దీన్ని నేను మార్చాలనుకొంటున్నాను, ఇక్కడ పరివర్తన కావాలనుకొంటున్నాను, ఇదిగో ఇక్కడ నేను సమూలమైన మార్పును, తీసుకొని రావాలనుకొంటున్నాను" అని వేలు పెట్టి నీవు చూపించ గలవా? ఎలాగ? అదేమిటి? దాన్ని చూడ గలవా? అదెక్కడ ఉందో తెలుసా? నీవు దాన్ని కనుక్కో గలవా? నీవు కనుక్కో లేవ్. *(కాసేపు నిశ్శబ్దం.)*

నీకేది కావాలన్నా దాన్ని నీవు పొంద గలవు – నీకేది కావాలన్నా – నీకే అనుభవం కావాలన్నా దాన్ని నీవు అనుభవించ గలవు. నీకు తెలియకపోతే, హెల్ప్ చేయడానికి, ఎవరో ఒకరు ఎక్కడో అక్కడ నీకు ఎప్పుడూ దొరుకుతారు,– నీవు వెతకాలి. నీకు కావలసినది నీవు అనుభవించ వచ్చు. కానీ అది ఏ అనుభవం అయినా, విలువ లేనిది – ఇది, అది కాదు – ఎందుకంటే ఇది అనుభవింపబడ లేనిది; ఇది ఒక అనుభవం కాదు.

జ్ఞానోదయం అనేది అసలు ఒకటి ఉంటే, అది ఒక అనుభవం కానే కాదు. ఇది --"గ్రహించడానికి ఏమీలేదని గ్రహించడం" నీలో ఉదయిస్తుంది. (నీవు యీ విధంగా చెప్పదలచు కొంటే). తెలుసుకోవడానికి 'నేను' అనేది ఏదీ లేదనేది నీకు నీవు, నీయంతట నీవు తెలుసుకోవడమే ఆత్మ జ్ఞానం, ఆత్మ సాక్షాత్కారం. ఇది నిన్ను విచ్ఛిన్నం చేయగల పెద్ద దెబ్బ కాబోతోంది.

ప్ర : ఎవరికి?

యుజీ : దాని వెంటబడే వాళ్ళకి. అందువల్లనే అది ఒక కోటిమందిలో ఒకరికో, వంద కోట్లమందిలో ఒకరికో జరుగుతుంది – అతడు ఏంచేస్తున్నాడు... ఏం చేయడంలేదు అనే దాన్నిబట్టి కాదు – నీ చేస్తున్నదంతా దానికి అడ్డంకే.

--------------

నీవు 'అక్కడ' ఉంటే తప్ప, ఇది(అన్వేషణ) అర్థం లేనిదనే విషయం, నీవసలు అర్థం చేసుకోలేవు. నీవు 'అక్కడ' ఉన్నప్పుడు... ఆ అన్వేషణే నీవు అనీ... ఆ నీవు నుండే నీవు విముక్తి కావాలనుకొంటున్నావనీ... నీవు చూడగలుగుతావు. శోధన (అంటే ఏదో పొందలనే నీ సాధన) లేకుండా 'నీవు' అనేది ఉండదు – అది నీకు అర్థం కాదు. నీముందు నీవు పెట్టుకున్న లక్ష్యమే 'నీవు'ని సృష్టించింది. ఆ లక్ష్యం, ఆ గోల్ లేకపోతే, నీవు ఆ లక్ష్యాన్ని పక్కకు పెట్టేస్తే, ఆ స్తానంలో మరొకటి పెడతావ్. ఏ భ్రమలూ లేకుండా నీవు ఉండలేవ్; ఒక భ్రమ పోతే దాని స్తానంలో మరొకటి పెడతావ్. భ్రమ పోతే నీవూ పోతావ్.

నీవు ఒక లక్ష్యాన్ని సాధించాలనుకొంటే నాకు అభ్యంతరం లేదు, కానీ, ఆ లక్ష్యమే ఒక అసత్యమని నేనంటాను. నీవు సాధించాలనుకున్నది అదే అని,

అందుచేతనే యీ సాధనలన్నీ అవసరం అని నీవంటావ్. కానీ, నేను యిప్పటికీ అంటాను, సాధించడనికి, పొందడానికీ, చేరడానికి ఏమీ లేదని, అందు వల్ల నీ లక్ష్యాన్ని సాధించడానికి నీవు చేస్తున్నదంతా అర్ధరహితం. నేను ఆ సాధనలన్నీ నేను చేస్తున్నపుడు ఈ విషయాన్ని అర్ధం చేసుకోలేక పోయాను. ఎంత తొందరగా నీకిది అర్ధమయితే, అంత మంచిది. అవి ఒకవేళ అవి(ఆ సాధనలు) నీకు కొన్ని అనుభవాలు కలిగిస్తే, నీ సొంత అనుభవాన్ని దాటి వెళ్ళడం నీకు చాలా కష్టమవుతుంది. అవి నిన్ను ఎక్కడికీ తీసుకొని వెళ్ళడం లేదనే విషయం ఎప్పుడో ఒకప్పుడు నీ అంతట నీకే తెలిసివస్తుంది.

కానీ ఆ ఆశ నిన్ను ముందుకు నడిపిస్తూ ఉంటుంది – ఏదో ఒక రోజు దాని ద్వారానే నీ లక్ష్యాన్ని బహుశా చేరుకో గలుగుతానేమో అనే నీ ఆశ – ఎందుకంటే ఆ పరికరం(అంటే ఆలోచన) కాలం నుండి పుట్టింది, కార్య-కారణాల నుండి (cause and effect నుండి) పుట్టింది, అంతేగాక అది 'కాలం' పరిభాషలో తప్ప, దేన్నీ మరో రీతిలో ఊహించ లేదు. అందుచేత టైమ్ అనేదే లేకపోతే జరగడానికి ఏమీ ఉండదు – భవిష్యత్తులోనే కాదు – ఎందుకంటే కాలంతో సంబంధం లేనిదాని యొక్క , టైమ్-లెస్ అంటే 'ఎల్లకాలం ఉండేది' అనేదాని యొక్క అవసరాన్ని సృష్టించింది యీ కాలమే గాబట్టి. కాలం అంటే భవిష్యత్తు. ఈ కాలాన్ని తీసేస్తే, దాని అర్ధం, భవిష్యత్తులో జరగబోయేది ఇప్పుడే జరిగి పోతుందని కాదు. ఇక్కడ జరగడానికి ఏమీ లేదు. కాలానికి అతీతమైన దాన్ని అంటే ఎల్లకాలం ఉండేది అనేదాన్ని పూర్తిగా తీసి పడేసినప్పుడు కాలం దానంతట అది దగ్ధం అవుతుంది.

నీవు జరగాలని కోరుకునేది 'కాలం' పరిభాష లోనే. నీవు ఇప్పటికే ఆ ఆనంద స్తితిలో ఉన్నావని, ఒక క్షణకాలం ఊహించుకొంటే, అప్పుడు నీవు, రేపు గూడా ఆ స్తితిలోనే ఉండాలని కోరుకోవు. నీవు ఏ స్టితిలో ఉండాలని అనుకుంటావో ఆ స్తితిలో నీవు లేవు, ఎందుకంటే అక్కడ లక్ష్యం ఉంది, ఆ లక్ష్యం రేపు, యీరోజు కాదు. అందుకని, ఈ లక్ష్యం లేకపోతే రాబోయే కాలంలో ఏదో జరుగుతుంది అనే ఆలోచనే ఉండదు. దురదృష్టవశాత్తు జరగడానికి ఏమీ లేదు. జరగడం అనేది 'కాలం' లోనే. అసలు 'టైమ్' అనేదే లేనపుడు జరగడమంటూ ఉండదు, జరగడానికి ఏమీ

ఉండదు. ఆత్మే బ్రహ్మం – దీని అర్థం సరిగ్గా అదే. నీవు భవిష్యత్తులో కావాలనుకొన్న ఆ బ్రహ్మం ఇక్కడే ఉంది; ఇక్కడ జరగడానికి ఏమీ లేదు. సాధించడం (దీనికి ఏ పేరెట్టి పిలిచినా పర్వ లేదు) అనేది కాలంలో ఉంటుంది. అందుచేత అది కార్య-కారణ సంబంధంతో ముడిపడి ఉండడం తప్పని సరి. నీవు ఒక ఫలితాన్నిసృష్టించాలని ఆశిస్తున్నావు, కానీ ఇది ఒక ఫలితం కాదు, ఒక ఘటన కాదు, సాధించి పొందేది కాదు.

---------------

దీనితో నీవు ఏంచేసినా, అది నీకు నెప్పి కలిగిస్తుంది – అందుకే, మోక్షాన్ని, విముక్తిని వెతకడమనేది, దుఃఖాలన్నిటిలో అతిపెద్ద దుఃఖమని నేను అంటాను. (నవ్వు...). దానికి అంతం లేదు – నీవు ఈ వెదకడం నిరంతరంగా కొనసాగిస్తూనే ఉంటావ్ -- అది నీకెప్పటికీ దొరకదు. నీవు కోరుకున్న పరమానందం, మోక్షం అదేమిటో ఆ భగవంతునికే తెలియాలి, అవన్నీ అనుభవించినప్పటికీ, ఇంకా ఇంకా ఎక్కువ కావాలనిపిస్తుంది. నీవు నిశ్శబ్దాన్ని అనుభవిస్తావ్, కానీ అది శాశ్వతంగా ఉండాలనుకొంటావ్, నీవెప్పుడూ ఆ నిశ్శబ్ద స్తితిలోనే ఉండి పోవలనుకొంటావ్. ప్రకృతిలో అసలు దేనికీ శాశ్వతత్వం లేదు. నీవెప్పుడూ వీరితో(విముక్తులయిన వారితో) కలిసి జీవించ లేదు. (అటువంటి వారు అసలు ఉన్నారో లేదో నాకు తెలియదు).

ఇది చాలా చిన్న విషయం. అది ఎంత తేలికైన విషయం అంటే ఈ సంక్లిష్ట మయిన నిర్మాణం దానిని స్వేచ్ఛగా ఒంటరిగా వదిలేయడానికి ఇష్టపడదు. నాకు తెలుసు, నీవు చేయగలిగింది ఏమీ లేదని; నీవెందుకూ పనికిరాని వాడివి, you are condemned! (నవ్వు!)

**ప్ర: కనుక దాని సంగతి దానికే వదిలెయ్యాలి.**

**యుజీ :** అవును, దానికే ఒదిలేయండి. .

**ప్ర: మనం అది గూడా చెయ్య లేం**

**యుజీ :** మీరు అది గూడా చేయ లేక పోతున్నారనిపిస్తోంది.

**ప్ర: దాన్ని దానికే మేము వదిలేయగలిగితే , అపుడు మేము అన్నీ చేసినట్లే.**

**యుజీ** : అప్పుడు జరగడానికి ఏమీ ఉండదు.

**ప్ర: మేము  దాన్ని దానిపైనే వదిలేసి ఉండి ఉంటే, మేము ఇక్కడ ఉండి ఉండేవాళ్లం కాదు.**

**ప్ర: కానీ, ఆయన అన్నాడు  "ఇక్కడికి రావడం వల్ల మీకేమీ దొరకదు" అని.**

**యుజీ** : మీ జీవిత కాలమంతా ఆ మనిషి దగ్గర  ఉన్నా జరిగేదేమీ ఉండదు.

**ప్ర:, మేము చేయగలిగేది ఏమీ లేదని, మేమింకా గ్రహించ లేదు**

**యుజీ** : "నేను చేయగలిగినది ఏదీ లేదు" అని మీరు చెప్ప లేరు. చూడండి, "దాని విషయంలో నేను చేయగలిగినది ఏదీ లేదు"  అనే విషయం మీకు అర్థమయి నప్పుడు, మీరు ఆ పాయింటుకు వచ్చినప్పుడు,  మీకు చేయడానికి ఏమీ ఉండదు, వదిలేయడమూ ఉండదు, లేదా..... ఉండదు. ఏ బయటి సంస్థా ఏవిధంగానూ మీకు సహాయ పడదు.

ప్ర ; లోపల ఉన్నది గూడ ఏమీ ఉపయోగ పడదు, అవునా?

యుజీ  : అపుడు, లోపల అనేదీ ఉండదు, వెలుపల అనేదీ ఉండదు – లోపలఉన్న దానికి బయటిదానితో ఎప్పుడూ సంబంధం ఉంటుంది, మీకు అర్థమైయిందా?

"దాని విషయంలో నేను చేయగలిగినది ఏదీ లేదు" అనే వాక్యం గూడ మీరు పూర్తిచేయరు; "దాని విషయంలో నేను చేయ గలిగినది ఏదీ లేదు," అనే వాక్యాన్ని మీరు  పూర్తి చేసే లోపునే (*యుజీ  చిటిక వేస్తూ*) అది ఆ గారడీ చేసేస్తుంది.  ఆ మీట నొక్కే పరికరం నీలో ఒక  భాగం -- అది నీలోనే ఉంది.

--------------

**ప్ర: నేను అడిగేది ఒక సిల్లీ ప్రశ్నలా అనిపించ వచ్చు. మీరు ధ్యానం ప్రాక్టీస్ చేస్తారా**

**యుజీ** : ఏమీ చెయ్యను. – ఏ  ధ్యానాలు చెయ్యను – ఏమీ చేయను. ఏముంది ధ్యానం చేయడానికి? ఇవన్నీ ఏమిటో, యిదివరకే నేను కనుక్కొన్నాను -- ఆ మంత్రాలు, ఆ ధ్యానాలు, ధ్యానం చేసే పనేమిటీ వగరా. కానీ, మహేశ్ యోగి -- భావాతీత ధ్యానం (Transcendental Meditation) లాంటివి నేను సాధన

చేయలేదు; కానీ కొన్ని ధ్యానాలు చేశాను. నేను నా అంతట నేను కనుక్కొన్నది యిది: ధ్యానం ఒక స్వీయ కేంద్రీకృత కార్యకలాపం. ఈ ధ్యానం, ఏ 'నేను' నుండి నీవు విముక్తి పొందాలనుకుంటున్నావో ఆ 'నేను' కే మరింత బలాన్ని చేకూరుస్తుంది. దేని కొరకు మీరు ధ్యానం చేస్తున్నారు? మీరు దేనినుండో విముక్తి పొందాలనుకొంటున్నారు. దేనిమీద ధ్యానం చేస్తున్నారు? సరే, ఆలోచన ఒక చప్పుడు(noise), శబ్దం. శబ్దం అంటే ఏమిటి? నీవు దీన్ని చూసి, "ఇది ఒక టేప్ రికార్డర్" అంటావ్, అంచేత ఆలోచన శబ్దమే. ఆలోచనలు వరుసగా వస్తాయ్, వీటిని నీవు ఎప్పుడూ కలుపుతూ ఉంటావ్, లింక్ చేస్తూ ఉంటావ్, ఈ శబ్దాలను నీవు భరించ లేవు. ఆ రోదనని ఎందుకు తట్టుకోలేక పోతున్నావ్? అందువల్ల మంత్రాలు జపించి ఇంకా పెద్ద శబ్దాలను సృష్టించి, ఆ శబ్దాలలో ఆలోచనల అలజడిని ముంచి వేస్తావ్, ఆ తర్వాత నీలో నీవు శాంతిగా ఉంటావ్. నీలో ఏదో ఒక గొప్ప సంగతి జరిగి పోతోందని అనుకొంటావ్. కానీ ధ్యానాలన్నీ స్వీయ కేంద్రీకృత కార్య కలాపాలే.

నేను ధ్యాన స్తితి గురించి మాట్లాడను. అది కృష్ణమూర్తి (JK) గారి వ్యవహారం -- ఆయన ఓ ధ్యాన స్తితి గురించి మాట్లాడుతారు : "ఇది ఇదికాదు; ఇది అదికాదు." అని. సరే, ఇది ఒక ధ్యానస్తితి అయితే, నేను దేని మీద ధ్యానం చేస్తున్నాను? నేను ఈ క్షణంలో అదిగో దాని మీద ధ్యానం చేస్తున్నాను (*యూజీ ఓ వస్తువును చూపిస్తాడు*) – దాన్ని చూస్తున్నాను. ఆ ప్రతిబింబించడం ఇక్కడ ఉంది. ఏదో కదులుతోంది – కదలిక – జీవం ఒక కదలిక. ఎప్పుడూ అక్కడ ఏదో ఒకటి జరుగుతూ ఉంటుంది – ఎల్లప్పుడూ – అక్కడ ఉన్న చలనమే ఇక్కడ ఉన్న చలనం. అక్కడ ఏదో ఒకటి జరగక పోతే ఇక్కడ చలనం లేదు. రాత్రి సమయం లో ఒక క్షణం అంతా నిశ్శబ్దంగా ఉంటుంది, లేదా బల్లుల శబ్దాలు వినిపిస్తాయి. వాటిని నీవు వింటావ్. నీ చుట్టుపక్కల ఏ శబ్దాలు లేనప్పుడు, నీ గుండె చేసే లబ్-డబ్ చప్పుళ్ళు, లేదా రక్త నాళాలలో ఒక నదిలా ప్రహిహించే రక్త ప్రసరణ శబ్దం నీవు వింటావ్. అది ధ్వని. అది ఓంకార శబ్దం అని నీవు ఊహించుకొని నిన్ను నీవు మోసం చేసుకొంటావ్. అది ఓంకార శబ్దం కాదు. ఈ శరీరం ఒక యంత్రం. ఈ మానవ యంత్రం, ఒక నడిచే కారులా శబ్దం చేస్తుంది. దీన్ని ఓంకారమనీ, బ్రహ్మానందమని

మరొకటి అని ఎందుకు అంటావ్? ఇవి మానవ యంత్రం చేసే శబ్దాలు. నీ గుండె చేసే లబ్-డబ్, లబ్-డబ్ లు నీవు వింటే నీకు పిచ్చెక్కినంత పనౌతుంది. ఇవి తప్ప ఇక్కడ వినడానికి ఏమీ లేదు, బయట ఏమీ లేక పోతే, ఎవరో దగ్గుతుండడం, ఎవరో గుర్రు పెట్టడం, లేదా ఎవరివో భయానక స్వప్నాలలో అరుపులు.

--------------

ఈ మనిషికి ఎప్పుడూ ఒక్క క్షణం గూడ బోరు కొట్టదు. నేనిక్కడ కూర్చొని అక్కడ వూగుతున్న గడియారంలోని పెండ్యులాన్ని (వేలాడే గంటను) ఎన్ని గంటలైనా చూడగలను – నాకు విసుగు పుట్టదు – అక్కడున్నదేమిటో నిజంగా నాకు తెలియదు. ఆ పెండ్యులం కదులుతోంది – నా దేహమంతా ఆ కదలికే. గంటల తరబడి ఇక్కడ కూర్చొని దాన్ని చూడగలను. దానిని చూడ్డంలో నీకు ఆసక్తి ఉండదు; నీ దృష్టంతా వేరే దాంట్లో ఉంటుంది, ఏ ధ్యానం మీదనో. ఈ వ్యక్తి ఎప్పుడూ ధ్యానస్తితి లోనే ఉంటాడు. “ఆ కదలిక, ఆ గమనం ఎక్కడ ఉంది, అని నేను ఆశ్చర్య పోతుంటాను – ఈ ధ్యానమే నాలో జరుగుతున్నది. ఇక్కడ... అద్భుతం, ఆశ్చర్యం అనే పదాలు మనం మామూలుగా వాడే అర్థంలో కాదు నేనంటున్నది; ఈ వ్యక్తి మిగిలిన జీవితమంతా ఈ అద్భుత ఆశ్చర్య స్తితి లోనే ఉండిపోతాడు. బయట, లోపల - అనేవాటిని ఆలోచన సృష్టించింది. ఆలోచనా గమనం లేనపుడు ఇది బయట ఉందా లేక లోపల ఉందా అనేది నీకు తెలియదు. ఇది ఒక అద్దం లాంటిది. ఇది.. ఉన్నది ఉన్నట్లుగా ప్రతిబింబించే, జరుగుతున్న దాన్ని చూపించే అద్దం (live mirror). ఇక్కడ ఎవరూ లేరు: నేను దేన్నీ చూడను; బయట, అక్కడ వస్తువులు ఎలా ఉన్నాయో, అచ్చు అలాగే వాటిని నా దేహమంతా ప్రతిబింబిస్తుంది.

గుర్తించడం మరియు పేరు పెట్టడం అనే మెకానిజం, బేక్ గ్రౌండ్ లోనే ఉంటుంది, అవసరం వచ్చినప్పుడు తప్ప. గుర్తించడం, మరియు పేరు పెట్టడం అనే పనులు చేసే ఆలోచనాగమనం లేని స్తితియే సమాధి, సహజ సమాధి. సమాధి లోకి వెళ్ళడం మళ్ళీ సమాధిలోనుండి బయటకు రావడం ఉంటుందని అని మీరు ఏదేదో ఊహించు కొంటారు. అలాంటిది కానే కాదు; అతడు ఎప్పుడూ అక్కడే ఉంటాడు.

అటువంటి మనిషి యొక్క కళ్ళు తెరుచుకొని ఉన్నా, మూసుకొని ఉన్నా అతను చూస్తున్నది ఏమిటో అతనికి తెలియదు.

అలాంటి సమాధి స్తితిలోకి వచ్చిన వ్యక్తి, ఒక పిచ్చివాణ్ణి ఒక చిన్న పిల్ల వాణ్ని కలిపి తయారుచేసిన మనిషిలాంటి వాడు. పిచ్చివాళ్ళు గూడ అదే విధంగా ప్రవర్తిస్తారు – ఆలోచనలు విడిగా ముక్కలు ముక్కలుగా ఉంటాయ్, అందువల్ల వారి పనులు, ఫీలింగ్స్ గూడ ముక్కలు ముక్కలు గా ఒకదానికొకటి సంబంధం లేకుండా ఉంటాయ్. కానీ వారికి (పిచ్చి వాళ్ళకు) ఆలోచనలతో పాటు భ్రాంతులు, ఊహ చిత్రాలు, లేనివి ఉన్నట్లుగా కనిపించడం ఉంటాయ్ – అదొక్కటే తేడా. ఈ స్తితి ఎల్లప్పుడూ అద్భుతమైన, ఆశ్చర్యకరమైన స్టితే; అతడు దేన్ని చూస్తున్నాడో అతనికి తెలియదు, అతడు దేన్ని వాసనచూస్తున్నాడో అతనికి తెలియదు, అయినప్పటికీ అతని జ్ఞానేంద్రియాలు అత్యంత సామర్ధ్యంతో, అసాధారణమైన సున్నితత్వంతో పని చేస్తాయ్, ప్రతీదాన్నీ తనలోనికి తీసుకొంటూ.

-------------

**ప్ర: మీరు వివరిస్తున్న స్తితిలో నేనెందుకు లేను?**

**యుజీ:** ఎందుకంటే, నీవు చూసిన ప్రతీదాన్నీ , నీలోఉన్న ప్రతీ భావనని అనుభవించాలనే గట్టికోరిక ఎప్పుడూ నీకుంటుంది కాబట్టి. ఎప్పుడూ ఉంటుంది, కారణం నీవు అలా చేయక(కోరక) పోతే, నీవు అంతమయి పోతున్నావు కాబట్టి – నీకు తెలిసిన 'నీవు', నీవు అనుభూతిచెందుతున్న 'నీవు' అంతమై పోతోంది కాబట్టి – కానీ అది పోవడం నీకు ఇష్టం లేదు – నీకు ఆ కొనసాగించడం కావాలి. అందువల్ల అన్ని అధ్యాత్మిక సాధనలు ఆ కొనసాగింపుకు మరింత బలం చేకూర్చే దిశలోనే ఉంటాయ్. ఇది ఒక స్వీయ-కేంద్రీకృత కార్యకలాపం (అంటే 'నేను' అనే దాని కొరకు చేసే కార్యలే). ఆ 'నేను' చేసే పనుల ద్వారా నీవు ఆ 'నేను' నుండి ఎలా విముక్తి పొంద గలవు?(నేను లేదా సెల్ఫ్ అనే పదాన్ని కొటేషన్ మార్క్స్- ' ' లో పెట్టి వాడతాను). అందువల్ల నీ అన్ని అనుభవాలూ, అన్ని ధ్యానాలు, అన్ని సాధనలు, నీవు చేసేవన్నీ 'నేను' ను కేద్రంగా చేసుకొని జరిపే కార్య కలాపాలే. ఇవి ఆ 'నేను' కు బలం చేకూరుస్తున్నాయ్, మరికొంత ఊపునిస్తున్నాయ్, ఊపును

సేకరిస్తున్నాయ్, ఇవన్నీ మిమ్మల్ని వ్యతిరేక దిశలో తీసుకొని పెడుతున్నాయ్. ఆ 'నేను' నుండి విముక్తి కావడానికి నీవేమి చేసినా అవి గూడా ఆ 'నేను' చేయించే పనులే. వీటిని నీవు రెండుగా విభజించ లేవు; నీవు చెప్పే 'మీ అస్తిత్వాన్ని (being ను)' చేరుకోవడానికి నీవు అనుసరించే ప్రక్రియ గూడా ఒక 'మారుతూ ఉండడం (becoming)` అనే ప్రక్రియే. నీకు అర్థమయ్యేట్టు చెప్పానో లేదో నాకు తెలియదు. అందుచేత 'ఉన్నట్లు ఉండడం, మారుతూండడం' (బీయింగు, బికమింగు) లాంటివి ఏమీ లేవు. నువ్వు దానికి  ఏ పేరైనా పెట్టినా, నీవెప్పుడూ మారే ప్రక్రియలోనే ఉంటావ్. మరొకరిలా కాకుండా, నీవు నీవుగానే ఉండి పోవాలనుకోవడం గూడా ఒక మారే ప్రక్రియే. ఈ విషయంలో చేయడానికి ఏమీ లేదు. నిన్ను నీవు ఆ బీయింగ్ స్తితిలో (ఉన్న స్తితిలో) ఉంచడానికి నీవేమి చేసినా అది ఒక బికమింగ్ (మారే ) ప్రక్రియే. ఇదే నేను నీకు తెలియజేస్తున్నది.

**ప్ర: ఇది ఎప్పటికీ బీయింగ్ ప్రక్రియలోకి నడిపించ లేదు?**

**యుజీ:** లేదు. నీవు ఏ దిశలో ఏ స్థాయిలో ఏమి చేసినా అది స్వీయ కేంద్రీకృత కార్యమే. అది(సెల్ఫ్, నేను) చాలా తెలివైనది, జిత్తుల మారిది – ఇది శతాబ్దాలుగా మనుగడ సాగిస్తోంది – దీనికి ప్రపంచం లోని అన్నీ ట్రిక్కులూ (మాయలూ) తెలుసు.

**ప్ర: సత్యాన్ని, యదార్థాన్ని తెలుసుకొన్న వాళ్ళు, జ్ఞానోదయం  కలిగిన వాళ్ళు యింతమంది పుట్టినప్పటికీ, నేను (సెల్ఫ్, ఆత్మ) అనబడేది ఒకటి ఉందనే  భ్రమ కోట్ల సంవత్సరాల నుండి మనుష్యులలో ఎలా ఉండిపోగలిగింది?**

**యుజీ**: ఎలా?(నవ్వు!) ఇది ఉంది. ఇది ఉంది. ఏదో ఒకటి నీవు చేసిన ప్రతీసారీ, అది మంచి పనైనా, చెడ్డ పనైనా, నీవు దాన్ని బలోపేతం చేస్తున్నావ్. చూడండి మనమందరమూ ఈ 'ఆలోచనా గోళం' (thought sphere) లో పనిచేస్తున్నాం, ఈ పదాన్ని నేను వాడవచ్చంటే. ఆ ఆలోచనా-గోళం నుండి  నీవు దేన్ని తీసుకుంటావో అది నీయొక్క  ప్రత్యేక నేపధ్యం(బేక్-గ్రౌండ్), నీ సంస్కృతి, అందుచేత అది ఒక ఏంటీనా(antenna) లాంటిది. ఆ ఏంటీనా ఆ సంస్కృతి యొక్క ఉత్పత్తి (product). నీవు నీ ఆలోచనను రక్షించేందుకు  నీకు ఉపయోగపడే

ఆలోచనలను పికప్ చేసుకొంటావు. ఆలోచన ఒక రక్షణ మెకానిజం. ఈ ఆలోచన దేన్ని రక్షిస్తోంది? ఇది తననే రక్షించుకొంటోంది. ఇది తాను విడిపోకుండా ఆపడానికి (కొనసాగించేలా ఉండేందుకు) తనకు సాధ్యమైనదంతా చేస్తుంది. అధ్యాత్మిక సాధనలను మొదలు పెట్టినా అది గూడ దానికి మరింత బలాన్నిస్తోంది – అది వ్యతిరేక దిశలో కాదు, ఆలోచనలను ఆపే దిశలో కాదు. అందుచేత నీవు తప్పుడు మార్గంలో ఉన్నావు. సానుకూల విధానం (positive approach) అనేదీ లేదు, ప్రతికూల విధానము (negative approach) అనేదీ లేదు. నెగెటివ్ విధానం అని అందరిచే పిలబడేది గూడా ఒక పోజిటివ్ విధానమే. ఏ విధానమైనా, అన్నీ విధానాలూ , పోజిటివ్ గాని నెగెటివ్ గాని, లేదా మరొకటి గానీ – అవన్నీ విధానాలే. అందుచేత అసలు విధానమే లేదు: నీవు చేయ గలిగినది ఏమీ లేదు.

---------------

నీవు నెగెటివ్ విధానం, (అంటే అదికాదు, ఇదికాదు అనే విధానం) చేపట్టేవ్, ఎందుకంటే నీ పొజిటివ్ విధానాలన్నీ (అంటే అదే ఇది, ఇదే అది అనే విధానాలన్నీ) నిరాశపరుస్తున్నాయని రుజువై పోయింది కాబట్టి. ఈ రెండిటి మధ్య తేడా ఉందని నీవు అనుకొంటున్నావ్. కానీ నీవు నెగెటివ్ విధానమని అనుకొంటున్నది గూడా ఒక పొజిటివ్ విధానమే – నీవు దాన్ని ఒక పొజిటివ్ విధానంగా మారుస్తావ్ – ఎందుకంటే నీవు చేరాలనుకున్న లక్ష్యం పొజిటివ్ లక్ష్యం కాబట్టి, నెగెటివ్ విధానం ద్వారా నీవేదో పొందాలనుకొంటున్నావ్, ఏదో సాధించాలనుకొంటున్నావ్, దేన్నో చేరాలనుకొంటున్నావ్, 'ఏమీ తెలియని స్తితి' ని, అదేమిటో ఆ భగవంతునికే తెలియాలి.

అదికాదు అనే నెగెటివ్ విధానం తనను తాను తిరస్కరించాలి. ఇది(నేను చెపుతున్నది), ఒక నిర్ణయానికి రావడం కోసం పోజిటివ్ లక్ష్యంతో ముందుకు వెడుతున్న నెగెటివ్ విధానం కాదు. నేనెప్పుడూ, నేను చెపుతున్న దాన్నే కాదంటూ ఉంటాను. నేనొక విషయం చెపుతాను, ఒక స్టేట్మెంట్ యిస్తాను, కానీ అది నేను చెపుతున్నదాన్నంతటినీ వ్యక్తం చేయటం లేదు, అందువల్ల నేను దాన్ని వెంటనే కాదంటాను. నేను అన్నదానికే విరుద్ధంగా నేను మాట్లాడుతున్నానని

మీరంటారు. నేను పరస్పర విరుద్ధం కానే కాదు. నేను నా మొదటి స్టేట్మెంట్ ను కాదంటాను, రెండో స్టేట్మెంట్ యిస్తాను, తర్వాత నేను యిచ్చిన అన్నీ స్టేట్మెంట్లనూ కాదంటాను – అందువల్లనే అప్పుడప్పుడు, నేను మాట్లాడినది చాలా పరస్పర విరుద్ధంగా కనబడుతుంది. నేను ఎల్లప్పుడూ నేను చెప్పిన దాన్ని కాదంటూ ఉంటాను, కానీ ఒక పాయింట్ కు చేరుకొనే ఉద్దేశ్యంతో కాదు. నేనన్నది కాదంటున్నానంతే (జస్ట్ నెగేటింగ్). నేను మాట్లాడడం వెనుక ఏ ఉద్దేశ్యమూ లేదు. నేను మీకు ఎత్తి చూపిస్తున్నది, నేను మాట్లాడుతున్నది మీరు అర్థం చేసుకోలేరన్న ఒక ప్రాథమిక పరిస్థితిని మీకు తెలియజేయడం కొరకు మాత్రమే. నేను చెప్పేది అనువదించకుండా, అంటే ఇంటర్ ప్రెట్ చేయకుండా వినడం మీకు సాధ్యం కాదు. నేను చెప్పేదాన్ని అర్థం చేసుకోవడానికి మీరు ఉపయోగించే, మీ ఆలోచనా దృక్పథాన్ని, రిఫరెన్స్ పాయింటును, తీసి పారెయ్యడానికి నేను ఎల్లప్పుడూ ప్రయత్నిస్తున్నాను. ఆ రిఫెరెన్స్ పాయింట్ లేనపుడు నన్ను అర్థం చేసుకోవలసిన అవసరం లేదు, మీకు అర్థమయ్యిందా? – ఇదే నేను ఎప్పుడూ చెపుతున్నాను. ఆ ముసలాయన (జిడ్డు కృష్ణమూర్తి గారు) 'వినడం అనే కళ', నిజమైన వినడం (art of listening, real listening) గురించి మాట్లాడుతూ ఉంటాడు, వినడానికి ఒక పద్ధతి, విధానం ఉందని మీరనుకుంటారు. అటువంటిది ఏదీ అసలు లేదు. నేను దేనిని గురించి మాట్లాడుతున్నానో గూడ మీకు తెలియదు.

---------------

నేను చెపుతున్నది నీవు అంగీకరించే స్తిలోగానీ, లేదా నిరాకరించే స్తితిలో గాని లేవు. నీ రిఫరెన్స్ పాయింటుకు, నీ అభిప్రాయానికి, ఆత్మజ్ఞానం, దైవజ్ఞానం మొదలైన నీ నమ్మకాలకు సరిపడే స్టేట్మెంట్సును, మాటలను నీవు ఒప్పుకొంటావు. ఆ రిఫరెన్స్ పాయింట్ నువ్వే. అక్కడ ఆ రిఫరెన్స్ పాయింట్ తప్ప మరేమీ లేదు – అదే నువ్వు. ఆ రిఫరెన్స్ పాయింట్ పోతే దానితో పాటు నువ్వూ పోతావ్. అదే నీ అంతం. నీవు కు అంతం.

------------

మీ వినడమే అనువదించడం, అర్థం చెప్పుకోడం. మీరు ఎవ్వరినీ వినరు: ఇంటర్ప్రెట్ చేయకుండా అర్థాన్ని యివ్వకుండా, వినడం మీకు సాధ్యం కాదు. చూడండి, అర్థం చెప్పడం మీ బేగ్రౌండ్ లో ఒక భాగం. అందుచేత మీరు వింటున్నదాన్ని ఇంట్రప్రెట్ చేయకుండా, అంటే అనువదించకుండా దేనినీ వినడం మీకు సాధ్యం కాదు.

అందుచేత మరో రకమైన వినడం అనేది ఏదైనా ఉందా? పదాలతో, మాటలతో ఏమాత్రం సంబంధం లేని వినడం ఒకటి ఉంది, కానీ అది 'నీకు తెలుస్తున్న' స్థాయి (conscious level) లో కాదు. (దీనర్థం నీకు స్పృహ లేదని కాదు, నీవు unconscious అని కాదు. – ఇది నేను చాలా స్పష్టంగా, చెపుతున్నాను). అది శబ్దానికి ఒక స్వచ్ఛమైన సాధారణ సింపుల్ భౌతిక స్పందన. శబ్దం కర్ణభేరిలో ఒక కదలికను పుట్టిస్తుంది, అది ఒక కంపనం (vibration) మాత్రమే – అతడు దేనిని గురించి మాట్లాడుతున్నాడో నిజంగా నీకు తెలియదు. ఇది శరీర ధర్మానికి సంబంధించిన విషయం, ఒక భౌతిక ప్రక్రియ, అందుకనే నేను దీన్ని శారీరకతత్వాన్ని తెలియజేసే పదాలలో మాత్రమే చెపుతున్నా, మానసిక, మతపర, అధ్యాత్మిక సంబంధిత పదాలతో చెప్పడం లేదు, ఎందుకంటే ఈ స్థితిని స్వచ్ఛమైన, సింపుల్ భౌతికధర్మ భాషలో తెలియ పరచ వలసిన అవసరం నాకు చాలా ఉంది.

----------------

నా సంభాషణ రికార్డు చేసిన టేపును ప్లే చేసినపుడు దానిలో నాకేమీ అర్థం కనిపించదు. నేను బెంగుళూరులో మాట్లాడినపుడు చేసిన టేపును నిన్న నేను వింటున్నప్పుడు నాకు అనిపించింది, "ఈయన ఏం మాట్లాడుతున్నాడు?" అని. "ఈయన చెపుతున్నది అనవసరపు తెలివి తక్కువ మాటలు. ఈయన చెప్పేది నేను వినను." అనిపించింది. ఆ టేపు ఒక ప్రాణం లేని వస్తువు. అవి నేనన్న మాటలే కావచ్చు, కానీ నా వరకు అది అర్థం పర్థం లేనిది. దాన్ని మర్చిపొండి! కాల్చేయండి! బయట పడేయండి! మీ ప్రశ్నలు ప్రేరేపించినపుడు దానికి అనుగుణంగా ప్రతిస్పందన చేసే ఒక యంత్రం ఇది. వాళ్ళు యిచ్చిన 'ఆన్సర్స్'

నుండి సమస్యను మీరు సృష్టించారు; ఇందులో నా పాత్ర లేదు. ఒక దానికే కట్టుబడి ఉండాలనే నిబద్ధత (commitment ) నాకు లేదు, మాటమార్చనని ఎప్పుడూ నేను చెప్పలేదు. మీ ముందుంచడానికి నా వద్ద నిర్దిష్టమైన దృక్పథం లేదు, వివరించడానికి సిద్ధాంతాలు లేవు; మీ ప్రేరేపణలకు నా ప్రతిస్పందన మాత్రమే ఉంటుంది.

మీరు ఒక ప్రశ్న వేసినపుడు అది వెంటనే అందుకోబడుతుంది, దానిని విశ్లేషించి, అర్థం కొరకు నేను వెతకను; మీరు ప్రశ్న అడగడానికి ముందే సమాధానం అక్కడ ఉంది. మీరు గూడా ఇది చేయగలరు; ఇది మామూలు విషయం కానిదేమీ కాదు. మీరు మీ సొంత పనిలో బిజీగా లేకపోతే, ఇది చాలా తేలిక. ఇది మరొకరి ఆలోచనలను చదవగలిగే శక్తి కాదు. ఇది ఒక ప్రతిధ్వనించే గదిమాత్రమే: అక్కడ ఏమి జరిగుతుందో అది ఇక్కడ జరుగుతోంది. అది నీవు చేయ లేవు; నీవు ప్రతీ దాన్ని అనువదించడానికి, ప్రతీ ఆలోచనను డీకోడ్ చేసి దాని వెనక ఉన్న భావాన్ని వెదకాలనుకొంటావ్.

-------------

నేను చెపుతున్నది, ఆలోచన యొక్క సహాయం వల్ల తప్ప, మీరు అనుభవించలేరు. మరో మాటల్లో చెప్పాలంటే, ఆలోచనా గమనం (movement of thought) ఉన్నంత వరకు నేను మాట్లాడుతున్నది అర్థం చేసుకోవడం నీకు సాధ్యం కాదు. అది లేనప్పుడు, అర్థం చేసుకోవలసిన అవసరం లేదు. ఆ అర్థంలో, అర్థం చేసుకోవడానికి ఏమీ లేదు.

-------------

జీవం ఒక ఏకైక చలనం (Life is one unitary movement), రెండు వేరే చలనాలు కాదు. అది చలిస్తూ ఉంటుంది. అది ఒక రకమైన ప్రసరణ, ఒక ప్రవాహం (continuous flux), కానీ నీవు ఆ ప్రవాహాన్ని చూసి "అది ఒక ప్రవాహం" అని చెప్పలేవు, అలాంటప్పుడు ఇది ఒక flux, ప్రవాహం అని నేను ఎందుకు చెపుతున్నాను? అదేమిటో నీకొక చిన్న అనుభూతి (ఫీల్) ఇవ్వడానికి మాత్రమే ఈ పదాలు వాడుతున్నా. కానీ నీ యొక్క భావాలకు, ఊహలకు అనుగుణంగా ఈ

పదాలను నీవు అనువదిస్తే నీకది అసలు అర్థం కానట్టే. చెప్పబడుతున్న దాని గురించి, నిజంగా నీకేమీ తెలియదు, నీకు అది అసలు అర్థం కాదు -- అందుచేత, నీ అంతట నీవది అర్థం చేసుకోగలిగితే ఏం జరుగుతుంది? అపుడు అక్కడ ఆలోచన యొక్క చలనం ఉండదు. (అర్థం చేసుకోవాలని అనుకొంటున్నావు అంటే దానర్థం అక్కడ ఆలోచన సాగుతోందని.) ఈ మనిషి చెపుతున్నదేమిటో ఒక్కటీ నీకు నిజంగా తెలియదు. అపుడు, నీలోపల జరిగేదేమిటంటే, నీవు ఈ మాటలన్నీ, నీ అభిప్రాయాలకు అనుగుణంగా ఇంటర్ ప్రేట్ చేయకుండా అనువదించకుండా ఒక్కొక్క మాటే ఒక్కొక్క వాక్యమే మళ్ళీ మళ్ళీ తిరిగి తిరిగి అనడం మాత్రమే చేస్తావ్ – ఇతని మాటలు ఒక noise, రణగొణ ధ్వని మాత్రమే; అక్కడ నీవొక ఎకొ-ఛాంబర్ (ప్రతిధ్వనించే గది) – అంతే అక్కడ జరిగేది. నీవు అక్కడ లేవు. (ఆ 'నీవు' అక్కడ ఉన్నపుడు, నీవు అనువదిస్తున్నావ్). ఇది జస్ట్ ఒక జీవి యొక్క ఒక స్వచ్ఛమైన సాధారణ భౌతిక ప్రక్రియ. అక్కడ జీవం ఉంది కాబట్టి అక్కడ ప్రతిస్పందన(response) ఉంది. మీ ప్రతిస్పందన, ప్రేరేపణ (response and the stimulus) వేరు వేరు చలనాలు కావు: ప్రతిస్పందనని ప్రేరేపణ నుండి వేరు చేయ లేవు. (ప్రతిస్పందనను ప్రేరేపణ నుండి వేరుచేసిన మరు క్షణమే విభజన ఉంటుంది, అపుడు 'విభజింప బడిన చైతన్యం ఆపరేట్ అవడం మొదలు ఆవుతుంది. అందుచేత ఇది ఒకే చలనం (one movement).

--------------

**యుజీ** : ఆలోచన, జీవం రెండూ కలసి ప్రవహించే, ఒకే ఒక చలనం (movement). కానీ నీలో ఎల్లప్పుడూ ఆలోచనా చలనం, జీవ చలనానికి సమాంతరంగా వెడుతున్నట్టు అనిపిస్తుంది. అక్కడ అలాగే జరుగుతున్నట్టు అనిపిస్తుంది; లేకపోతే, ఇక్కడ కూర్చొని దీన్ని గురించి మాట్లాడుకోవలసిన అవసరం మనకు ఉండేది కాదు – అంటే.. నేను చెప్పేది వినడం, నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం ఉండేవి కాదు. నీలో ఆలోచన యొక్క continuity లేకుండా ఉండి ఉంటే, మనం ఈ గదిలో సృష్టించిన ఈ పరిస్థితి, యింక ఉండేది కాదు, తాను పనిచేస్తున్న తీరును వివరిస్తున్న ఎవరినీ వినాలని నీవు కోరుకొనే వాడివి కాదు –

నీవు ఎందుకు వినాలి? అతడు ఆ విధంగా వ్యవహరిస్తుంటే, సరే, all right, అతణ్ని అలాగే ఉండనీ. అతని వ్యవహారశైలిపై నీకెందుకంత ఆసక్తి? అతనితో ఏరకమైన సంబంధం అయినా, ఎందుకు ఏర్పరచుకుంటావ్?

నేను చెప్పేది నీవు వింటున్నంత కాలం, నీవు దారి తప్పినట్టే, నీ సమయం వృధా(you are lost). నేను మాట్లాడుతున్నది నీవు అర్థం చేసుకోవాలని అనుకొంటున్నావు కాబట్టి నేను చెపుతున్నది నీవు వింటున్నావ్, అందులో కనిపించని అంతరార్థమేదో ఉందని కాదు, లేదా అది కష్టతరమైనది అవడం వల్ల కాదు; కానీ నీ అవగాహన అంతా ఆ పరికరం, (ఆలోచించడం వెనక ఉన్న మెకానిజం) ద్వారానే ఉంటుంది, కానీ అది కాదు (అది సరైన సాధనం కాదు) దీన్ని అర్థం చేసుకోడానికి. సూక్ష్మమైన, సున్నితమైన సాధనాన్ని నీవు అంతర్దృష్టి అంటావ్ (intuition, ఒక విషయం, నీకు ఎవరూ చెప్పకుండానే దంతట అదే నీకు తెలిసిపోవడం), కానీ వేరే మరొక సాధనం లేదు. సాధనం అది కానప్పుడు, వేరే మరో సాధనం లేనప్పుడు, యీ వాక్యం నుండి తార్కికంగా చివరికి తేలిన విషయం (లాజికల్ కంక్లూజన్) ఏమిటంటే: అర్థం చేసుకొనడానికి ఏమైనా ఒకటి ఉందా? అర్థం చేసుకోవడానికి ఏమీ లేదు. ఈ అవగాహన, ఏదో విధంగా నీలో ఉన్నట్లయితే .....

ఎలాగో, ఆ అవగాహన ఇక్కడ ఉంది. నాలో ఈ అవగాహన ఎలా వచ్చిందో నాకు తెలియదు – అందువల్ల నేను నిన్ను అక్కడికి తీసుకొని వెళ్లలేను – దీనికి ఏమీ కారణం లేదు. కారణమేమిటో నీకు తెలుసుకోవాలని ఉంది, ఎందుకంటే నీలో అది జరగాలని నీవు కోరుకుంటున్నావ్; లేకపోతే కారణం మీద నీకు ఆసక్తి ఉండదు.

అందుకని, నన్ను అర్థంచేసుకొనడం అనేది ఇక్కడ ప్రశ్న కాదు. నన్ను అర్థం చేసుకోడం సాధ్యం కాదు. నన్ను అర్థం చేసుకోడం అస్సలు సాధ్యమే కాదు. నీవు అర్థం చేసుకోగలిగేది ఆ చట్రపరిధిలో, ఆ రిఫరెన్స్ పాయింట్ కు సంబంధించినంత వరకు మాత్రమే. ఎంత ఎక్కువగా వింటే అంత ఎక్కువ స్పష్టత వస్తుందని నీవనుకొంటున్నావు; కానీ, ఆలోచన యొక్క స్పష్టత వల్ల, నేను దేని గురించి మాట్లాడుతున్నానో అర్థం చేసుకోవడం నీకు ఎక్కువ కష్టమవుతుంది. అలా నీవు

ప్రతీ సంవత్సరం ఇక్కడకు వచ్చి, నీ అవగాహనలో స్పష్టత పెరుగుతూ పోతోంది అనుకొంటావ్; కానీ నిజానికి, అర్థం చేసుకొనే అవకాశం  అంటూ ఏదైనా ఉంటే, దాన్ని అది (వినడం) నాశనం చేస్తోంది.

అర్థం చేసుకోడానికి ఏమీ లేదు --  ఈ అవగాహన, ఎలాగో, నాలో ఉంది, అదెలా వచ్చింది అనేది ఎవరికీ తెలియదు, అంతే కాదు నీవు దీన్ని చూసేట్టు(అర్థం చేసుకో గలిగేట్టు) చేసే మార్గం లేనే లేదు, మీరు అడుగుతారు “మీరు ఎందుకు మాట్లాడుతారు?” అని. మీరు ఇక్కడికి వచ్చారు (కాబట్టి).

--------------

నేను ఇంకా యింకా ఎక్కువ స్పష్టంగా చూడగలుగుతున్నాను  అని మీరు అనుకొన్నంత కాలం, మీరేమీ చూడలేదని  నేనంటాను. జె. కృష్ణమూర్తి అంటారు “చూడ్డమే అంతమవడం (seeing is the end)”. నేను చూశాను అని మీరంటే మీరు చూడలేదు, ఎందుకంటే, చూడడం అంటే ‘నేను చూశాను’ అని చెప్పే ఆ structure (ఆలోచనానిర్మాణం) అంతమవడమే కాబట్టి. మీరు తెలుసుకోగలిగే ‘చూడడం (seeing)’ ఉండదు. మరో మాటల్లో చెప్పాలంటే ‘చూడడం’ జరగ లేదు. “దీన్ని ఇంకా ఎక్కువగా అర్థం చేసుకోగలను, నా చుట్టూ ఉన్న ప్రపంచాన్ని ఇంకా స్పష్టంగా చూడగలను” అని నీవు అనుకొన్నంత కాలం నీవు దేన్నీ చూడవు, దేన్నీ అర్థం చేసుకోవు..  అని నేనంటాను. ఈ సంభాషణ నిన్ను ఎక్కడికీ చేర్చ లేదు. నాకున్న ఒకే ఒక ఇంట్రస్టు ఏమిటంటే  దీనంతటినీ సమాప్తం చేయడం.

--------------

మీకు నాకు తేడా ఏమిటంటే మీరు అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు, అక్కడ జరుగుతున్నది లేకపోవడమే ఇక్కడ ఉన్నది. చర్చ గందరగోళాన్ని మరింత పెంచుతుంది -- ఇది ఎందుకూ పనికి రాదు. నేను, అడ్డంకిని మాత్రమే ఎత్తి చూపించ గలను. అంత మాత్రమే.

**ప్ర : ఇది ఒక రకమైన ప్రిపరేషనా,  సిద్ధం చేయడమా?**

**యుజీ**: కాదు. నేను మళ్ళీ మళ్ళీ ఎప్పుడూ  చెపుతూ ఉంటాను, “ఆత్మవిచారణ (inquiry) ఉపయోగం లేనిది”, కానీ మీరు జీవితంలో నేర్చుకొన్న

పద్ధతులన్నిటినీ దీనికి అనువర్తించాలనుకొంటున్నారు. బుద్ధుడు చెట్టు కింద కూర్చొని అక్కడ నుండి కదలనన్నాడని మీరంటారు. అన్నిటినీ చేసిన తర్వాతే అవి అతనికి ఏవిధంగానూ ఉపయోగపడలేదని ఆయన తనంతట తాను గ్రహించాడు. తనకు ఏదీ ఉపకరించ లేదని అతనికి తెలుసు, అప్పుడు బహుశా ఏదో అతనికి జరిగి ఉంటుంది. నీవు వాదిస్తావ్ "ఆయన ఇది చేశాడు, అందుచేత నేను అదే దారిలో ఎందుకు వెళ్లకూడదు?" అని. కానీ నీ విషయం పూర్తిగా వేరు, నీవా పరిస్తితిలో లేవు; అయినప్పటికీ ఏదో జరుగుతుందని నీవాశిస్తావ్. యిక్కడ విషయమేమిటంటే, అర్థం చేసుకోవడానికి ఏమీ లేదనేది.

-------------

**ప్ర : "నాకు ఏదీ తెలియదు" అని మీరు చెప్పినప్పుడు, ఆ విషయం మీకు తెలుసు అనే అర్థాన్ని ఇస్తుందా?**

**యుజీ:** చూడండి, దీని అర్థం, 'ఏమీ తెలియని స్తితిలో నేనున్నానని నాకు తెలుసు' అని కాదు "నాకు ఏదీ తెలియదు" అన్న వాక్యం ఆ స్తితి యొక్క వ్యక్తీకరణ. దీన్ని సరిగ్గా అర్థం చేసుకోండి. నేను దేన్ని చూస్తున్నానో అది నాకు తెలియదని నాతో నేను చెప్పుకోవడం కాదు ఇది; ఆ స్తితి యే "నాకు తెలియదు" అనే వ్యక్తీకరణను బయటకు విసురుతోంది – ఆ స్తితి తన గురించి తాను వివరించుకొడమే ఆ వ్యక్తీకరణ. అంతేకాని, "నాకు తెలియదు" అని చెపుతున్న వాడు ఎవరో అక్కడ ఉన్నాడని కాదు; "దాని గురించి నాకేమీ నిజంగా తెలియదు." అని ఆ స్తితి తన గురించి తానే చెపుతోంది. ఇది యిలాగే ఉంది!

**ప్ర: "ఇది యిలాగే ఉంది." అనే మాట పిడివాదం లాగా అనిపిస్తోంది.**

**యుజీ :** ఇక్కడ నేను చెపుతున్నదంతా ఒక హేతుబద్ధ చట్రంలో, ఒక తార్కిక చట్రంలో, ఇమడ్చడానికి మీరు చేసే అన్నీ ప్రయత్నాలు విఫలమైనప్పుడు, ఇదంతా ఏమిటో మీరెలాగూ తెలుసుకోలేరు అని నేను చెప్పవలసి వస్తుంది; ఇది తర్కానికి అతీతమైనది, హేతుబద్ధతకు అతీతమైనది, ఇది నిజం. దాని గురించి నాకేమీ తెలియదన్న నా మాటని మీరు అంగీకరించాలి లేదా తిరస్కరించాలి. ఇది ఒక పోజిటివ్ స్టేట్-మెంట్ కాదు. నీవు ఎప్పుడూ దీనిని అనుభవించలేవు.

అనుభవించడానికి ప్రయత్నించద్దు! అది ఏ విధంగానూ నీకు ఉపయోగించదు. ఇదివాస్తవం. దానికి రెండు దారులు లేవ్. నేను పిడివాదం చేయడం లేదు. ఇది హేతుబద్ధత లేని మాట కాదు. నాకు నిజంగా ఏ ఒక్కటీ తెలియదు. ఇది నిజం, ఎందుకంటే, అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తున్న ఆ ఆలోచనా నిర్మాణం, అంటే నీవు, దీన్ని ఎప్పటికీ అర్థం చేసుకోలేవు – ఈ అర్థంలో ఇది వాస్తవం. ఇక్కడ ఇది ఈ విధంగానే ఉంది: దాని గురించిన దేన్నీ నేను అర్థం చేసుకోలేను. ఇక్కడ యీ విధంగానే ఉంది; అక్కడ గూడా ఇది యీ విధంగానే ఉండి తీరాలి. కానీ, అక్కడ ఆ విధంగా లేదు ఎందుకంటే దేన్ని అయితే నీవెప్పటికీ ఆర్థం చేసుకోలేవో, ఎక్స్పీరియన్స్ చేయలేవో దాన్ని నీవు అర్థంచేసుకోడానికి ఇప్పటికీ ప్రయత్నిస్తున్నావు కాబట్టి.

ఇక్కడ దీన్ని అర్థం చేసుకోవడం కొంచెం కష్టం. {మనం యిక్కడ చాలా సింపుల్ భాషను ఉపయోగిస్తున్నాం. వాళ్ళు (ఉపనిషత్తుల కాలం నాటి ఋషులు) మాటలకి పూర్తిగా వేరే అర్థాలున్న కాలంలో మాట్లాడేరు -- అప్పుడు టేప్ రికార్డర్లు లేవు, స్టెనోగ్రాఫర్లూ లేరు; వారి శిష్యులు విని, వాటిని తర్వాత తరాలవారికి అందించే వారు} అందువల్లనే నేను తరచుగా అడుగుతాను "నేను బోధిస్తున్నదేమిటి? దయచేసి నాకు చెప్పండి." అని. నా టీచింగ్ గురించి ఏదీ నాకు తెలియదు. నేనున్న స్తితి గురించి ఏదీ నాకు తెలియదు – నేను తెలుసుకోగలనని కాదు; నాకు తెలుసు నేను తెలుసుకోలేనని -- అక్కడ ఆ లిమిటేషన్ ఉంది. దీనికి తనదైన పరిమితి ఉంది. ఇది తన యొక్క లిమిటేషన్ ను అర్థం చేసుకొంది. ఇది దాన్ని అసలు ఎక్స్-పీరిఎన్స్ చేయ లేదు – అదే నేను చెపుతున్నదంతా. నేనున్న స్తితి గురించి నాకేమీ తెలియదు కాబట్టి, నేను దాని గురించి ఏమీ చెప్పలేను, పొజిటివ్ గానీ, నెగెటివ్ గాని, ఎందుకంటే పొజిటివ్ & నెగెటివ్ రెండు స్టేట్-మెంట్స్ గూడా ఆలోచనా క్షేత్ర పరిధిలోనే ఉంటాయి. కానీ నా స్తితి గురించి మీరు చాలా చెపుతున్నారు: నా స్తితి గురించి నా కంటే మీకే ఎక్కువ తెలుసనిపిస్తోంది. నా స్తితి గురించి ఏదైనా మీరెలా చెప్పగలరు? నా స్తితి గురించి మీరేమీ చెప్పడం లేదు; ఇదంతా నేను చెపుతున్న దానికి మీ సొంత అనువాదం. చూడండి, వినడమంటేనే అనువదించడం. నేను చెపుతున్నది మీరు వినలేరు. ఒకవేళ, నా మాటలు అర్థం

చేసుకోకుండా వాటినే తిరిగి పలుకుతూ, నేను చెపుతున్న దాని యొక్క ప్రతిధ్వని మాత్రమే ఉన్న స్తితిలో మీరు ఉన్నట్లయితే, యీ మనిషి దేని గురించి మాట్లాడుతున్నాడో నిజంగా మీకు తెలియదు, అంతేకాదు మీరు, కనీసం అర్థం చేసుకోడానికి కూడా ప్రయత్నం చేయరు. అక్కడ వినడం అంటూ ఉండి ఉంటే, మీరు చెపుతున్నదంతా ఉండేది కాదు – అందుకే నేను అంటాను, మీరు వినడం లేదని.

నేను చెప్పేదేదీ మీరసలు వినలేరు అనే ఈ చిన్న యదార్థాన్ని నేను మీకు చెపుతున్నాను. నేను చెప్పేది మీరు వినడం- వినక పోవడం అనేది పాయింట్ కాదు; నేను చెపుతున్నది అసలు మీరు వినలేరు. మీరు వింటున్నదానిని మీరు ఎలా అర్థం చేసుకొన్నా అది మీ సొంతం తప్ప నేను అంటున్నది కాదు. నేను చెపుతున్నదేమిటో మీకు తెలియదు, నాకు గూడా తెలియదు. (నవ్వు..) దాని గురించి నేనసలు ఏమీ చెప్పడం లేదు. మీరసలు వినడం లేదన్నది మాత్రమే నేను చెపుతున్నది, ఎందుకంటే మీరు వినలేరు కాబట్టి. మీరు వినలేరు కాబట్టి మీరు వినడానికి ప్రయత్నించకండి! -- ఇదే నేను చెపుతున్నదంతా .

--------------

నేను చెపుతున్న దానిలో తర్కం (లాజిక్) ఏమీ లేదు. దీనికి లాజిక్ అనేది ఒకటుంటే, దీనిసొంత లాజిక్ దీనికి ఉంది – అదేమిటో నాకు తెలియదు. కానీ మీ ఆలోచనల యొక్క తార్కిక చట్రంలో నన్ను ఇమడ్చాల్సిన అవసరం మీకుంది; అలా జరగకపోతే ఆ హేతుబద్ధమైన, ఆ తార్కిక ఆలోచనా నిర్మాణ క్రమం అంతమవుతుంది. చూడండి, మీరు హేతుబద్ధంగా చేయక తప్పదు– అదే మీరు. కానీ దీనికి హేతువుతో పనిలేదు, మీ తర్కంతో పనిలేదు – దానర్థం ఇది తర్క విరుద్ధమనీ కాదు, నిర్హేతుకమనీ కాదు.

----------------

మీరు దేన్ని అర్థం చేసుకోవాలనుకొంటున్నారు? అర్థం చేసుకోడానికి ఏమీ లేదు – ఈ అవగాహన గురించే నేను మాట్లాడుతున్నది. ఇదంతా దేని గురించో, దేని గురించి నేను మాట్లాడుతున్నానో మీకు అర్థం అయితే మీరు యిప్పటికే

అక్కడ ఉన్నట్టు. అది ఏదో కొత్తగా ఉంటుంది, అంతా కొత్తగా ఉంటుంది. అపుడు దాన్ని వ్యక్తం చేసే నీ విధానం మొత్తం వేరుగా ఉంటుంది. నీవు బుద్ధుడు చెప్పిన దాన్నే తిరిగి చెప్పవ్, ఏసు క్రీస్తు చెప్పినదే, జిడ్డు కృష్ణమూర్తి చెప్పినదే, లేదా మరో కృష్ణమూర్తి చెపుతున్నదే తిరిగి చెప్పవు. ఇది కొత్తగా ఉంటుంది, అంతేగాక ఇది, పూర్తిగా వేరే విధానంలో తనను తాను వ్యక్తం చేసుకొంటుంది. ఇది ఏ విధంగా తనను వ్యక్త పరచుకొంటుంది అనేది, నాకు తెలియదు, నీకు తెలియదు, ఎవరికీ తెలియదు. ఇతరులు వారికి నచ్చిన విధంగా నన్ను అర్ధం చేసుకొంటే అది వాళ్ళ వ్యవహారం; దానిలో మా స్వార్ధమేమీ లేదు.

బహుశా మీరు నన్ను ఎవరో ఒకరితో పోల్చి, మీరు చెప్పినదే ఆ ఫలానా ఆయన, ఇంతకు ముందే చెప్పేడు, అంటారు – నేనేక్కడకెళ్ళినా అదే నాకు ఎదురవ్వడం నా దురదృష్టం. కృష్ణమూర్తి అనుసరులు, రమణ మహర్షి అనుసరులు, లేదా మరొకరు వచ్చి అంటారు "మీరూ అదే చెపుతున్నారు!" అని. నేనూ అదే చెపుతున్నానని మీకెలా తెలుసు, ఏ ఆధారంతో మీరలా మాట్లాడగలరు? (How the hell do you know I am saying the same thing?) ఆయన దేని గురించి మాట్లాడుతున్నాడో మీకేమైనా తెలుసా? అన్నిటి కంటే ముందు, ఆయన దేన్ని గురించి మాట్లాడుతున్నాడో, దాని వెనక ఏముందో మీకు తెలియాలి, అప్పుడు నేను చెపుతున్న దాన్ని ఆయన చెపుతున్న దానితో పోల్చ గలరు. వాళ్ళు చెప్పిన వాటిలో ఏ ఒక్కటీ నేను చెప్పడం లేదు.

------------------

ఎవరితోనూ నన్ను నేను, పోల్చుకోను. జ్ఞానులతోటి, సాధువుల తోటీ, జగద్రక్షకుల తోటి నన్ను నేను ఎందుకు పోల్చు కోవాలి? అది నా జీవితంలో అతి పెద్ద విషాదమౌతుంది, కాదంటారా? నేనసలు ఎవరితోనూ నన్ను పోల్చుకోను. నేను చెపుతున్నది అంతకు ముందు ఎవరో చెప్పినది కాదు. కానేకాదు, నాకెలా తెలుసు? నీవు నన్ను ఆ చట్రంలో ఇమడ్చడానికి ప్రత్నిస్తున్నావు. అది నీవు తప్పనిసరిగా చేసి తీరాలి. అది నీవు చెయ్యకపోతే నీవు అంతమవుతావు ('నీవు' అంతమవుతుంది). అది ఒక చాలా ప్రమాదకరమైన పరిస్తితి. అందువల్ల, నేను

మాట్లాడుతున్నదంతా ఉట్టి చెత్త, అర్థంపర్థం లేనిది, వట్టి తెలివితక్కువ మాటలు అని చెప్పి, మీరు నన్ను మొత్తం తిరస్కరించాలి. లేదా మీ నేపథ్యంతోనో లేదా మరొకరి భావనా చట్రంలోనో ఇమిడ్చి "ఆయన చెప్పినదే ఈయన చెపుతున్నాడు" అని చెప్పాలి. నీవు అలా చేయక పోతే, ఎవరి బోధనల నుండో నీవు సృష్టించుకొన్న చిల్లర దేవుళ్ళు కుప్ప కూలుతారు. నీవు తప్పని సరిగా ఏదో ఒకటి చేయాలి – ఏదో ఒకటి.

ప్ర : సర్, మీరిచ్చే సందేశమేంటి?

యుజీ: ఇది చాలా సింపుల్. మీకు యిక్కడ ఏమీ దొరకదు. మీ సమయాన్ని మీరు పాడు చేసుకొంటున్నారు. మూటా ముళ్లూ సద్దుకొని వెళ్లిపొండి, పేకప్ అండ్ గో! ఇదే నా సందేశం. ఇవ్వడానికి నా దగ్గర ఏమీ లేదు; మీరు తీసుకోవలసినది ఏమీ లేదు. మీరు ఇంకా ఇక్కడే కూర్చుంటే మీరు మీ సమయాన్ని నిజంగా వృధా చేస్తున్నారు. మీరు చేయవలసినది ఒకటుంది, లేచి వెళ్ళిపోవడం. నేనేదో ఇవ్వగలనని ఇంకా మీరనుకొంటే, మీరిక్కడ స్వర్గం దిగివచ్చే వరకూ కూర్చొని ఉండి పోవాల్సిందే, శాశ్వతంగా ఎప్పటికీ. ఇవ్వడానికి నాదగ్గరేమీ లేదు. ఏదీ యివ్వనక్కర లేదు.

-------------

ఆ అధ్యాత్మిక వ్యాపారం – దానిలో నేను లేను. నాకేదీ అక్కర లేదు, ఇవ్వడానికి నా దగ్గర ఏమీ లేదు, కాబట్టి యిక్కడ 'ఒప్పంద ఉల్లంఘున' లేదు. నథింగ్ -- నాకేమీ అక్కరలేదు. ఆత్మసంతృప్తి కొరకు నేను మాట్లాడుతున్నానని మీరనుకోవచ్చు –నేనది చేస్తే, అది నా విషాదాంతం, నా దుఃఖం -- అందువలన, దానితో మీకు సంబంధం లేదు; నా దుఃఖాంత జీవితంలో కలగజేసుకోవడం మీకు ఇష్టం ఉండదు.

-------------

**ప్ర : లోక సంగ్రహం కోసం, లోకోద్ధరణకి, ప్రపంచాన్ని ఉద్ధరించడానికి, మీరిక్కడ ఉన్నారా?**

**యుజీ:** లోకాన్ని ఉద్ధరించడం కోసం నేనిక్కడ లేను; మీరేమైపోయినా నాకు పర్వాలేదు, నాకు తెలుసు, మిమల్ని ఎవ్వరూ రక్షించ లేరు. ఏదో జరుగుతుందని, మీరిక్కడ కూర్చుంటారు, రోజులకొద్దీ, వారాలకొద్దీ , సంవత్సరాలకొద్దీ... ఆ దేవుని రాజ్యం, ఆ స్వర్గం దిగివచ్చే వరకూ, ఎదురుచూస్తూ, అయినా ఏ దేవుని రాజ్యమూ రాదు (అది ఎప్పటికీ జరగదు). మీరు ఎక్కడికి వెళ్లాలనుకొంటే అక్కడికి వెళ్ళండి, ఏం చెయ్యాలనుకుంటే అది చెయ్యండి! నేను స్పష్టంగా, గట్టిగా, మీకు అర్ధమయ్యే భాషలో చెపుతున్నా.. మీకు తెలియజేయడానికి, ఇప్పుడు గానీ, మరెప్పుడూ గానీ, ఇక్కడ ఏమీ లేదని -- నాకు నిజంగా ఆశ్చర్యంగా ఉంది -- నేనింతగా నొక్కి చెపుతున్నా మీరు ఇక్కడే తచ్చాడుతున్నారు. ఇది మీ ఖర్మ. లేనిదాన్ని పట్టుకోడానికి మీరు పరుగెడుతున్నారు. పరివర్తన చేయడానికి ఏమీ లేదు, మార్చడానికి ఏమీలేదు, అర్ధంచేసుకోడానికి ఏమీ లేదు. అందువల్ల మీరు నాలాగ ఉండాలని అనుకొన్నంత కాలం, మీరు మీలాగే ఉండిపోతారు, అడిగిన ప్రశ్నలే మళ్ళీ మళ్ళీ అడుగుతూ. మీకు అదే జవాబు దొరుకుతుంది -- మీ ప్రశ్నలన్నిటికీ ఒకటే జవాబు, “ప్రశ్నలు అడగడం మానేయండి!” అనేది.

**ప్ర: ప్రజలు ఎలా ఉండాలని మీరనుకొంటున్నారు?**

**యుజీ** : వాళ్ళు ఎలా ఉన్నారో దానికి భిన్నంగా వారు ఉండలేరు. హంతకుడు హంతకుడుగానే ఉండిపోతాడు – దానికతడు మూల్యం చెల్లిస్తాడనేది వేరేసంగతి. హత్య చట్ట విరుద్ధం, అయినా హత్యలు పెరిగిపోతున్నాయ్. నాకు నీలో ఒక హంతకుడు పొంచి చూస్తూ కనిపిస్తున్నాడు. నీవు కావాలనుకొన్నది నీకు దొరకకపోతే, దానికి ఎవరైనా అడ్డొస్తే, అది నీకు తప్పనిసరిగా కావాలనిపిస్తే, వాడిని అడ్డు తొలిగించుకోడానికి ఏంచెయ్యడానికైనా నీవ్వేమాత్రం వెనుకాడవు – అంతే. సంస్కృతి గురించి నీవు చెప్పే మాటలన్నీ నా దృష్టిలో అర్ధం లేనివి. ఈ సంస్కృతి అంతా ‘చంపు & చంపించుకో (kill and get killed)’ అనే పునాది మీద నిర్మించబడింది – విశ్వ విద్యాలయాలలో గూడ ఇది బోధిస్తున్నారు. నువ్వంటే నాకు భయం లేదు. నీవు నన్ను చంపచ్చు – ఇది నీకిచ్చిన ప్రత్యేకమైన హక్కు.

## జ్ఞానోదయ రహస్యం

నీవు ఎలా ఉన్నావో అలా కాకుండా మరోలా ఉండలేవు. మారడానికి ఏంచేయ్యడానికి నీవు ప్రయత్నించినా నీవు విజయం సాధించ లేవు. నీనుండి దూరంగా పారిపోవడం ఆపేయ్! ఇది నీకు చెప్పి ప్రయోజనం ఏమిటి? ఇది నేను నీకు చెప్పినా ఉపయోగం లేదు ఎందుకంటే నీవు దాన్ని ఎటూ ఆపవు. ఆపమని నేను నీకు చెపుతున్నాను. నా మాటల్లో నీకు పూర్తిగా నమ్మకం లేదు: "ఏమో, నేను చేయ గలిగినది ఏదైనా ఉందేమో." అనుకొంటావు. క్రియాస్వాతంత్రం నీకు లేదని నిశ్చయంగా నేను చెప్ప గలను. ఈ అర్ధంలో నేనింకా కాస్త ముందుకెళ్లి అంటాను, నీవు నీ జీన్స్ యొక్క నియంత్రణలో ఉన్నావని. నేనన్న యీ మాట ఒక సిద్ధాంతమని నీవంటావ్, నీవలా అనడం సహజం, నీవేదో ఒకటి చేయగలవని నీ ఆశ. నీవు ఏదో ఒకటి చేయగలవనే భరోసా, నమ్మకం కలిగించే అధ్యాత్మిక వ్యాపారస్తులు చాలా మంది ఉన్నారు, అందువల్ల నీవు వాళ్ళ దగ్గరకు వెడతావ్ – అది నీకు చాలా తేలిక. నేను చెప్పినది నిజమని నేను రూఢిగా చెప్పగలననడంలో మార్పుండదు. అది ఒక సిద్ధాంతమని నీవంటావ్. సరే, నీ ఇష్టం, నీవు వెళ్ళి నీ అదృష్టాన్ని పరీక్షించుకో. చివరికి నీకు నీవే, నీఅంతట నీవే తెలుసు కొంటావ్ "యీయన చెప్పేది నిజమే" అని. నేను నా పాట పాడి వెళ్లిపోతాను.

నావరకూ ఇది చాలా స్పష్టం. మీకు సహాయం చేయగలమని చెప్పిన వారు చాలా మంది ఉన్నారు – మీరు అక్కడకి హాయిగా వెళ్ళి మీ అదృష్టం పరీక్షించుకోండి. కానీ నేను యీ చట్టభద్ధమైన హెచ్చరిక లాంటిది జత చేస్తున్నాను (సిగరెట్ పెట్టెలపై ఉండే హెల్త్ వార్నింగ్ లాంటిది) : మీరు ఎవ్వరి దగ్గర నుండి ఏదీ పొంద లేరు, ఎందుకంటే పొందడానికి ఏమీ లేదు కాబట్టి. అందుకే నేనంటాను, జ్ఞానోదయం అనేదే లేదు కాబట్టి, ఎవరికి జ్ఞానోదయమయింది, ఎవరికి జ్ఞానోదయం కాలేదు అనే ప్రశ్నే రాదు. ఇలాంటి వాటి వెంటపడుతున్న మీరంతా ఒకే రకంగా ఆలోచించే మనుష్యులు. ఆంతకంటే ఏమీ లేదు. అది, వారిని గురించి మీకున్న అభిప్రాయం, వూహాగానం, యిదే నేను చెపుతున్నదంతా. వారిపై మీరు ఏర్పరచుకొన్న ఊహాజనిత అభిప్రాయం తప్ప మరొకటి ఏదీ లేకపోవచ్చు.

-------------

ప్ర : సహజ స్థితిలో ఉన్న మనిషి కరుణ గల వాడై ఉంటాడా?

యుజీ: అది మీఊహ; వారు మొండిగా, నిర్దయగా, నిర్లిప్తంగా, దేన్నీ పట్టించుకోకుండా ఉంటారు. కరుణ(compassion) అనేది దైవిక వ్యాపారంలో ప్రచారం కొరకు వాడే ఒక యుక్తి, అమ్మడం కోసం చెప్పే మాటలు. తాను దయాభావం నిండిన వాడినని యీ మనిషికి తెలుసునని మీరనుకొంటున్నారా? అతడలాంటి వాడైతే, అది దయ కాదు. మీరు పేర్లు పెడుతున్నారు. అది, ఆ కరుణ ఏ విధంగా వ్యక్తమవుతుంది? చెప్పండి మీరునాకు. ఏ రకమైన కరుణని మీరు అతనిలో చూస్తున్నారు? నేను దయగల వాడనని మీరు ఊహించుకొంటున్నారు.

అంత గొప్పగా మాట్లాడుకొని పొగిడే విషయమేమీ కాదిది. ఒక సంస్థను స్థాపించినపుడు తొంభై శాతం విరాళాలు ఆ సంస్థ నిర్వహణకే వాడేస్తారు. అమెరికాలో చాలా సంస్థలున్నాయి – ధనవంతులు, సమాజ సేవికలూ విరాళాలు పోగుచేస్తారు, తొంభై పర్సెంట్ విరాళాలు కార్య నిర్వహణకే వినియోగిస్తారు. మీరంతే చేయగలరు; మీరేమీ ప్రపంచాన్ని మార్చబోవడం లేదు. ఈ ప్రపంచాన్ని మార్చమని నీకు ఎవరూ పిలుపునివ్వ లేదు.

--------------

ఈ సమాజాన్ని మార్చాలనే కోరిక నాకు లేదు. నేను చెప్పే దాంట్లో సమాజనికి సంబంధించిన విషయాలసలు లేనేలేవు. ఈ ప్రపంచంలో ఏం లోపముంది? ఈ ప్రపంచాన్ని ఎందుకు మార్చాలనుకొంటున్నావ్? ఇది అత్యంత సుందర ప్రపంచం! నీ నీ సొంత అభిప్రాయాలకు అనుగుణమైన ప్రపంచంలో జీవించడానికి ఈ ప్రపంచాన్ని మార్చాలనుకొంటున్నావ్. అసలు సమస్య ఏమిటంటే నిన్ను నీవు మార్చుకోవాలనుకొంటున్నావ్, కానీ అది నీకు సాధ్యపడడం లేదు. అందువల్ల, నీ సొంత పద్ధతిలోకి ప్రపంచాన్ని ఇమడ్చడానికి, యీ ప్రపంచాన్ని మార్చాలనుకొంటున్నావ్.

---------------

**ప్ర: ఇందులో సామాజిక విషయాలు లేవా? వాళ్ళు లోక సంగ్రహాన్ని గురించి మాట్లాడుతున్నారు. ఆత్మజ్ఞాని తనున్న ప్రదేశాన్ని పవిత్రపరుస్తాడని వారి అభిప్రాయం. అతడు స్వచ్ఛమైన కంపనలు (vibrations) కలుగజేస్తాడు, అక్కడున్న వాతావరణం పరిశుద్ధమవుతుందని వారంటారు.**

**యుజీ:** దానిలో సామాజిక విషయాలు ఉన్నాయా? వారు చెప్పేదాంట్లో నిజం ఉందా? 'నీవు నిన్ను ప్రేమించినట్లుగా నీ పొరుగువాణ్ణి ప్రేమించు' అని మాట్లాడిన మనిషి యొక్క పేరు మీద, ఈ మధ్య జరిగిన అన్ని యుద్ధాలలోకంటే ఎక్కువ రక్తపాతం జరిగింది. దాన్ని నీవు సామాజిక ప్రయోజనం అంటావా? వాళ్ళందరూ దెబ్బలాడుకొంటున్నారు, పోట్లాడుకొంటున్నారు. అందులో సోషల్ కంటెంట్ ఏముంది, సమాజానికి పనికివచ్చేదేముంది? నీవు మంచివాడిగా, ఒక నైస్ మెన్ గా అమాయకుడిలా ఉండాలనుకొంటున్నావ్; అందరికంటే భిన్నంగా అవ్వాలనుకొంటావ్ – అలా రేపు గానీ ఎల్లుండి గానీ అలా అవ్వగలనేమో అంటావ్, ఎప్పుడూ అదే మాట -- ఆ తర్వాత, మరో జన్మలో అవ్వగలనేమో అంటావ్. అదే బోధకులందరూ చేసే వాగ్దానం. వారు ఊరికే వాగ్దానం మటుక్కే చేస్తారు, వచ్చే జన్మలో అది జరుగుతుందని అతనంటాడు. అప్పటివరకూ అతని బిజినెస్ కొనసాగుతుంది, గేరెంటీగా. అతడు అలాంటిదేమీ లేదంటే, నీవతడిని వదిలేస్తావ్. అందుకే నాకు ఇబ్బంది లేదు: నీవు అతణ్ని ఎలాగూ వదిలేస్తావ్, ఎందుకంటే, నిన్ను ఏదైతే ఇక్కడకు తీసుకొచ్చిందో అదే తప్పక నిన్ను మరొక చోటుకు తీసుకొని వెడుతుంది. ఏదో ఒకటి పొందాలని నీ కోరిక. అది నీకు దొరకదు. ఏదో ఒక తప్పుడు వాగ్దానం, ఆశ నీలో ఉంది. నేను దొంగ వాగ్దానాలు చేయను, అసత్యపు ఆశలు కల్పించను. కానీ వాళ్ళు నీలో ఆశలు పుట్టించేరు. అందుచేత నీవది పట్టుకొని ముందు'కు వెడుతూనే ఉంటావ్, పెద్ద పులి మీద స్వారీ లాగా, నీవు కిందకు దూకలేవ్.

ప్రయాణం అనేది లేదు (There's no journey). నిన్ను తీసుకొని వెళ్ళేవారు లేదా తీసుకెడతున్నామని నటించేవారు, దానికై ప్రయత్నించే వారూ. ఇద్దరు గూడా చిన్నపిల్లల్లా తమలో తాము ఆడుకొంటున్నారు. మీరు నాతో కలిసినడవలేరు.

నాతో ఎలా నడవగలరు? అక్కడ దారిలో ముల్లులన్నా, రాళ్ళున్నా మీకెంత భయమంటే... మీకు ఒక శిక్షణ పొందిన గైడ్ కావాలంటారు. అక్కడ నడిచే ప్రదేశం ఎలా ఉంటుందో నాకు కూడా తెలియదు. చెప్పులు తొడుక్కున్న మనిషితో ఎప్పుడూ నడవద్దు, ఎందుకంటే అతడు ఎప్పుడూ ముళ్లమీదే నడుస్తాడన్న సామెత నువ్వు వినలేదా? నువ్ కష్టాల్లో చిక్కుకుంటావ్. దారెలా ఉంటుందో నాకు కూడా తెలియదు; నేను అలా నడుచుకొంటూ పోతున్నానంతే, జస్ట్ గోయింగ్.

--------------

మీరు చాలా విషయాల గురించి మాట్లాడుతారు – హోమ్ ట్రూత్స్ (వంటింటి నిజాలు), "మంచిగా ఉండండి, తెలివిగా ప్రవర్తించండి". కానీ దీనిలో సామాజిక సేవ ఏదీ అసల్లేదు: ప్రపంచాన్ని మార్చడానికి, ఇవి ఉపయోగపడవు. వీటితో ప్రపంచ సంస్కరణ చేయలేం, కొత్త ప్రపంచాన్ని, కొత్త మనిషిని తయారు చేయలేం – అదంతా నాన్సెస్. కొంతమందికి హెల్ప్ చేయడానికి కొంత మంది ఇలా చేస్తే, అది OK – ఏదో ఒకటి చేయండి – అది పనిచేస్తే చేయచ్చు. కానీ అవి పనిచేయవని తెలిసినప్పటికీ వాటినే చెప్పడం కరెక్ట్ కాదు – "వాళ్ళకి కొన్ని కొత్త బొమ్మలిద్దాం ఆడుకోడానికి. సంప్రదాయపు బొమ్మలన్నీ ఫెయిలయ్యాయ్, అందువల్ల, ఇక్కడ కొన్ని కొత్త ఆట వస్తువులు ఉన్నాయ్, ప్రత్యేకంగా జపాను నుండి ఇంపోర్ట్ అయినవి" (లేదా మరో చోటు నుండో, అది భగవంతుడికే తెలియాలి). మీరేంచేస్తున్నారు? మీరేమీ చేయడం లేదు; కొత్త మాటలను, కొత్త పదాలను, కొత్త నానుడిని రిపీట్ చేస్తున్నారు – మీరు చేస్తున్నదంతే.

--------------

ఆ కాన్షియస్నెస్ లో (చైతన్యంలో) ఉన్నదంతా ఒక కాలుష్యమే అనే వాస్తవాన్ని నీవు ఒప్పుకోవు. నీవు పవిత్రమని భావించినదంతా, చాలా గొప్పది అని అనుకొన్నదంతా – బుద్ధ చైతన్యం, క్రీస్తు చైతన్యం, కృష్ణ చైతన్యం – అన్నీ ఆ చైతన్యంలో (కాన్షియసెస్ లో) ఒక కాలుష్యమే. ఆ చైతన్యం తనను తాను శుద్ధి చేసుకోవాలి: వాటన్నిటినీ, ఆ చెత్త అంతా -- ఆ పవిత్రమైనవన్నీ , ఆ దైవికమయినవన్నీ పోవాలి. అవన్నీ పోయి నప్పుడే, నీవు నీవవుతావ్. అలా

కానప్పుడు అక్కడ ఒకరిపై ఆధారపడటం ఉంటుంది: అక్కడ అసాధారణమైనదేదో అనుభూతి చెందుతావ్, అపుడు ఒక సంస్థను స్థాపిస్తావ్, కృష్ణ చైతన్యమనో, మరొకటనో. ఈ సంస్థలు ఇరవై మిలియన్ డాలర్ల విరాళం పోగుచేస్తాయ్, పుస్తకాలు ప్రచురిస్తాయ్, దీన్ని వ్యాపింపజేసి ఆ సిల్లీ విషయాల అనుభవం ఇతరులకు కూడా కలిగించడానికి.

---------------

**ప్ర: ఒక చర్చికి వెళ్లడానికీ, యిక్కడికి రావడానికీ ఏదైనా తేడా ఉందా?**

**యుజీ : వాటివెనుక ఉన్న** ప్రేరణ మాత్రం మౌలికంగా ఒకటే. నీవు, ఒక కొత్త బోధకుడు కొరకు, ఒక కొత్త బైబుల్ కొరకు, ఒక కొత్త పద్ధతి కొరకు, ఒక కొత్త చర్చి కొరకు వెదుకుతున్నావ్ – నీవింతే చేయగలవు. మౌలికంగా ఇది గూడా అలాంటిదే: నీవు కేథలిక్ చర్చి నుండి ఒక అడుగు గూడ ముందుకు వేయలేదు. ఒకవేళ మత ధార్మికత మాత్రమే నీవు కావాలనుకొంటే, క్రైస్తవ మతం వదలి మరో వైపు చూడాల్సిన అవసరం లేదు. వివిధ మతాలలోని గొప్ప గొప్ప ప్రబోధకుల ప్రగాఢమైన వాక్యాలన్నీ ఒకేలా ఉంటాయి. నేను చెప్పేదేమిటంటే ఇతర దేశాలవైపు ఇతర మత గురువుల వైపు చూడ్డంలో అర్థం లేదు. నువ్వు కొత్త కొత్త పద్ధతులూ, కొత్త పదాలూ నేర్చు కొంటావ్ తరవాత ఈ కొత్త భాషలో ఆలోచించడం, మాట్లాడ్డం మొదలు పెట్టి, బహుశా నీకు నీవే గొప్పగా ఫీలయిపోతావ్, కానీ మౌళికంగా దానిలో చెప్పుకోదగ్గదేమీ అసలు ఉండదు.

**ప్ర: ఇంకా కొత్తగానే ఉన్న నా కలలన్నిటినీ మీరు పటాపంచెలు చెసేరు.**

**యుజీ** : కాదు, కాదు. మీరు అంత రూఢిగా చెప్పలేరు. అవి ఇప్పటికీ అలాగే ఉన్నాయి. అవి మీలో గట్టిగా నాటుకొనిపోయాయి. నీ నిర్మాణ క్రమంలో ఒక చిన్న బీట వస్తే నీవు దానిపై మళ్ళీ ప్లాస్టరింగ్ చేస్తావ్. అది చాలా బలమైనది. దానికి కొన్ని కోట్ల కోట్ల సంవత్సరాల గతిశక్తి, ఊపు (momentum) ఉంది. దానికి అన్ని మాయలూ తెలుసు – అది బలం పుంజు కోడానికి ఏదో ఒక ట్రిక్ కనిపెడుతుంది. అది దీని నైజం. దాన్ని నీవేమీ చేయలేవ్. నలబై సంవత్సరాలు చర్చించినా నీవు తెలుసుకోలేవని నేను రూఢిగా చెప్పగలను. నిన్ను ఏదో ఒక చోటుకి చేరుస్తానని

ఎవరైనా నిన్ను నమ్మిస్తే, అతడు నిన్ను తప్పుదోవ పట్టిస్తున్నట్టే. అతడు నిజాయితీ పరుడే అయి ఉండచ్చు. నిజాయితీ పరులనెవ్వరినీ నమ్మద్దు! వాళ్లందరినీ బయటకు గెంటేయ్! ఈ రంగంలో ఏ ఒక్కడూ నిజాయితీపరుడు కాదు. బయట ఉన్న ఏ సంస్థా నీకు ఉపయోగ పడదు.

-------------

**ప్ర: స్వామీజీలు, మతగురువులు చేసిన బోధలన్నిటినీ మీరు విసర్జిస్తున్నారా?**

**యుజీ:** నేను వదిలేయడం లేదు; నేను మీకు చెపుతున్నా "ఏ స్వామీజీ దగ్గరకో వెళ్ళండి, ఆయన ఏదో ఒకటి మీరు కోరుకొన్నది ఇస్తాడు, గుడ్ లక్!" అంతే. ఇది మీకు దొరకనే దొరకదని నేను చెప్పగలను; ఇది మీరు పొంద గలిగేది కాదు. మీకు ఆ అదృష్టం కలగాలని నేను ఆకాంక్షిస్తున్నాను. నాకు బాగా తెలుసు, ఇది, మీరు గానీ మరొకరు గానీ సంపాదించేది కాదు, ఎవరైనా ఇవ్వగలిగేదీ కాదు. దీన్ని నేను ఇవ్వలేను. ఎవరైనా ఇది నీకు ఇస్తానని వాగ్దానం చేస్తున్నాడంటే, వట్టి వాగ్దానం మాత్రమే చేస్తున్నట్లు... అంటే అతడు నిన్ను మోసం చేస్తున్నాడు. అతడు నీతో ఆడుకొంటున్నాడు. అతడు చేసిన వాగ్దానాలు నెరవేర్చ లేడు, అందువల్ల నీ తరువాత జన్మలో అవి నెరవేరుతాయంటాడు లేదా మరో పది పది జన్మల తర్వాత అంటాడు. ఆ విధంగా అతడు(అతని మాట) సురక్షితం! (మరో పది జన్మల దాకా అతని మాటను తప్పు పట్టలేవ్)

**ప్ర: మమ్మల్ని ఏం చెయ్యమంటారు? మేము చెయ్యాల్సింది ఏమిటి?**

**యుజీ** : మిమ్మలని ఏదీ చెయ్యమని నేను అడగటం లేదు. నా సమస్య ఏమిటంటే, మీరెక్కడ ఉన్నారో నిజంగా నాకు తెలియదు – ఈ విషయంలో నేను మీకు హెల్ప్ చేయలేను – మీరు నాకు చెప్పాలి. మీరెక్కడ ఉన్నారు? మీరు నాకంటే భిన్నంగా ఉన్నారని మీరు అనుకొనేటట్లు చేసేది ఏమిటి? నాకు మీకు తేడా లేదు. నేను మీకంటే వేరు కాదు -- కాలేను.

దీనిలో మీకు యిష్టం ఉండదు. దీనిలో మీకు ఇష్టం ఎలా ఉంటుంది? -- అది నా ప్రశ్న. ఈ రకమైన దానిలో మీకు ఇంట్రస్ట్ ఎలా ఉంటుంది? మీ ఆసక్తి అంతా వేరే దాంట్లో ఉంది, మీ ఆసక్తి అంతా సరదాలతో కూడిన విషయాలలోనూ, విచిత్ర

ఊహానుభూతులలోనూ (fantasies) -- మీరు అన్నీ రకాల ఫేంటసీస్ లో మునిగి తేలుతూ ఉండచ్చు – అది మీ వ్యక్తిగత వ్యవహారం. ఇది మీకు ఫేంటసీ గా అనిపించక పోతే మరో రకమైన ఫాంటసీని వెదుక్కుంటారు. మిమ్మల్ని మీరు పరిసమాప్తి చేసుకోడానికి ఎలా ఇష్ట పడతారు? – ఇదీ నా ప్రశ్న. నీకు తెలిసినదంతా... నీకు తెలిసిన 'నీవు', నీవు అభూతిచెందే 'నీవు', నిరంతరతని (కంటిన్యూటీని) కోరుకొంటుందని. అంటే ఆ 'నీవు' ఎల్లప్పుడూ కొనసాగాలని కోరుకొంటుందని. దీనికి అన్ని మాయలూ తెలుసు. దాన్ని నువ్వు ఓడించ లేవ్.

అందరూ ప్రశ్నలు వేస్తారు, అన్నీ ప్రశ్నల సారాంశాన్ని ఒకే ప్రశ్న లో పెట్టవచ్చు -- "ఎలా?" అనే ప్రశ్నలో. మీ దగ్గర ఉన్నది నేను ఎలా పొందగలను? ఎలా?" ఈ 'ఎలా' అనే ప్రశ్న ద్వారా ఆ స్ట్రక్చర్(ఆ 'నేను' అనే నిర్మాణ క్రమం) తనను కొనసాగించుకొంటూ, తనను శాశ్వతంగా అక్కడ స్థాపించు కొంటోంది,. ఎలా? ఎలా అనేది లేదు. ఈ 'ఎలా' అన్నదే మీకు కావాలనుకొంటే, ఆ స్వామీజీలు మీకు సహాయం చేస్తారు.

--------------

**ప్ర: మీతో కొంత కాలం గడిపిన వారితో గడపడం చాలా వరకు నాకు ఆనందాన్ని కలిగించదు. మీతో సాంగత్యం,... ఔదార్యాన్ని చూపక పోవడం, ఉదాసీనంగా ఉండడం, ఉన్నదానితో సంతృప్తి చెందడం, మొదలైన వాటిని ప్రోత్సహిస్తుంది. కానీ నేను, సరదాగా ఉండే వాళ్ళని, ఉత్సాహ వంతులను, ప్రేమ చూపించే వాళ్ళని ఇష్ట పడతాను.**

**యుజీ** : తన గురించి తాను చెప్పుకోవడం, సానుభూతి చూపడం, లోపల ఉన్న మానసిక అవరోధాలను అధిగమించడం మొదలైన విషయాల్లో నాకేమాత్రం ఆసక్తి లేదు; నా సహజ స్తితి గురించి తెలుసుకొందుకు నా దగ్గరకు వచ్చిన వాళ్ళు అడిగిన దానికి అనుగుణంగా నా ప్రతిస్పందన ఉంటుంది. మానసిక పరివర్తన లేదా అందరూ మాట్లాడే చైతన్య విస్తరణ (consciousness expansion) లాంటి వాటిమీద ప్రజలకు ఇంట్రస్టు ఉంటే, 'మానవ సంబంధాల శిక్షణ గ్రూప్స్(encounter groups) దగ్గరికీ, మానసిక వైద్యుల దగ్గరికీ వెళ్ళి, నేను చెప్పే ఫ్రాయిడన్ ఫ్రాడ్ (సిగ్మండ్

ఫ్రాయిడ్ చేసే మోసం) గురించి మాట్లాడండి. చివరికి వాళ్ళు చెప్పే ఆ మానసిక వృద్ధి, వాళ్ళకి ఆనందాన్ని ఇవ్వలేదు, వాళ్ళ సెక్స్ లైఫ్ లో గూడా ఏమీ పెరుగుదల ఉండదు; మహా అయితే కొత్త తరహాలో, యికా గాఢంగా దుఃఖించడం నేర్చుకుంటారు. దానితో నాకు సంబంధం లేదు; వాళ్ళు ఏ విషయం గురించి నా దగ్గరకు వచ్చారు అన్నదే అన్నిటికన్నా నాకు ముఖ్యం. ఈ సహజ స్థితిని పొందడానికి మీరేంచేసినా అది పూర్తిగా వ్యర్థ ప్రయత్నమని చెప్పడమే నా అభిలాష.

ఏమైనప్పటికీ, నన్ను చూడ్డానికి వచ్చిన వాళ్ళు నా దగ్గర ఎక్కువ కాలం ఉండరు. వాళ్ళు కొన్ని సార్లు ఒస్తారు, కొన్ని నెలలు ఇక్కడే అటూ ఇటూ తిరిగి వెళ్లిపోతారు. తరువాత వాళ్ళు తమ సాధారణ జీవితాల్లోకి వెళ్ళి పోతారు, లేదా వాళ్ళకి కావలసింది యిస్తానని వాగ్దానం చేసిన వారి దగ్గరికి వెడతారు. కొందరు, కొత్తగా వచ్చిన అమెరికన్ అవతార్ బబ్బా ఫ్రీ జాన్ శిష్యులవుతారు, వాళ్ళు ఏంచేసినా నాకు సమ్మతమే.

కానీ, నేనెప్పుడూ చేయనిది ఏమిటంటే, వాళ్ళను మోసగించడం. నేను ఏదైనా ఇవ్వగలననే అభిప్రాయాన్ని ఎప్పుడూ వాళ్ళలో కలిగించను. 'తేడాలు చూపని జాగృతి' (undifferentiated awareness) మరియు 'గమనించువాడు గమనింపబడేదీ ఒకటే' (the observer being the same as the observed) మొదలైనవన్నిటినీ సాధన చేయడం లాంటి అవాస్తవమైన అర్ధరహితమైన ఆలోచనల లోకి గేలం వేసి, నేను ఎప్పుడూ లాగను.

**ప్ర: అలా అయితే మిమ్మల్ని ఫాలో అయ్యేవాళ్లు నిరుత్సాహంగా ముభావంగా ఉన్నా మీకు ఫరవా లేదా?**

యుజీ : ఏదైనా నాకు ఓకే. మీదగ్గర ఓ పది లక్షల డాలర్లూ, ఎనిమిది మంది గర్ల్ ఫ్రెండ్సూ ఉన్నా నాకు ఓకే. నీవు ఒంటరిగా ఉన్నా, నీవు ఒప్పుకోకపోయినా, నీ జేబులో ఒక్క పైసా గూడ లేకపోయినా, కేన్సర్ తో బాధ పడుతున్నా అది గూడా నాకు ఓకే. అన్నీ ఎలా ఉన్నవి ఆలా ఉన్నా నాకు పూర్తిగా సంతోషమే. కష్టాలు, పేదరికం, ఇంకా చావు గూడా నాకు సంతోషమే; బోలెడు సంపద, యింకా

కావల్సినంత మానసిక సఫలత ఉన్నా నాకు సంతోషమే. నాకు జరిగిన జీవ పరివర్తన (biological transformation) లాంటి ప్రక్రియ నీలో జరగే వరకు, నీ నిజమైన సమస్యలకు పరిష్కారం ఎలాగూ నీకు సాధ్యపడదని నేను అనుకొంటున్నాను. ఇది నాలో జరిగింది కాబట్టి, నేను మీ కంటే, లేదా మరొకరికంటే ఉన్నతమైన వాణ్ణని ఎప్పుడూ అనుకోను; అంతేకాదు, నేను గొప్పవాడిననే భావాలు లేదా తక్కువవాడిననే భావాలు ఒక్క క్షణానికి గూడ నా బుర్ర లోకి ఎప్పుడూ రావు. ఇటువంటి భావం అస్సలు ఉండక పోవడం అనేది ఈ మొత్తం పరివర్తన వ్యవహారం యొక్క లక్షణాల్లో ఒకటి.

**ప్ర: మీ టీచింగ్ అంతటినీ కలిపి ఒక వాక్యం లో చెప్పవలసి వస్తే అదేమై ఉంటుంది?**

**యుజీ :** ఆ వాక్యం "నేను మీకు సహాయం చేయలేను" అనేది

**ప్ర: అయినా, ప్రజలు మిమ్మల్ని చూడ్డానికి ఇక్కడ స్విట్జర్లాండుకూ అక్కడ ఇండియాకి వస్తారు. అంటే మీరు ఏదో విధంగా వారికి తప్పక హెల్ప్ చేస్తూ ఉండాలి లేదా మీరు వాళ్ళకి ఏదో రకమైన సహాయం చేస్తున్నారని వాళ్ళయినా తప్పక అనుకొంటూ ఉండాలి, లేకపోతే వాళ్ళు మీ దగ్గరకు రారు.**

**యుజీ :** కొందరు తెలుసుకోవాలనే ఆసక్తితో వస్తారు. కానీ నన్ను అర్థం చేసుకోవాలనే కోరిక నిజంగా ఎక్కువగా ఉన్న వారికి నేను చెప్పగలిగేది ఏమిటంటే, చెప్పడానికి నా వద్ద ఏమీ లేదని. నేను ఏ ఒక్కరికీ అసలు సహాయం చేయలేను, వేరెవ్వరూ గూడ చేయలేరు. మీకు హెల్ప్ అవసరం లేదు; పైగా మీరు నిస్సహాయంగా ఉండిపోవాల్సిన అవసరం ఉంది – అంతేకాదు, ఈ నిస్సహాయతను నా సహాయం ద్వారా పొందాలని కోరుకొంటూ ఉంటే, మీరు దారి తప్పినట్టే.

**ప్ర: మీరున్న స్తితికీ, చాలా మంది ఉన్న స్తితికీ మధ్య ఉన్న తేడా గురించి మాట్లాడ గలరా?**

**యుజీ :** తేడా చాలా తక్కువ అనుకొంటాను. వెంట్రుకవాసి తేడా మాత్రమే ఉంది.

**ప్ర: కానీ మీ శరీరంలో జీవసంబంధిత (Biological) మార్పులు జరిగేయ్.**

**యుజీ:** అవును, కానీ ఏదో ఒక రహస్య స్థలంలో దాగిన ఏ రహస్యమూ నాలో లేదు. ఇవ్వడానికి నాదగ్గర ఏమీ లేదు. నేనివ్వగలిగేది ఏమంటే, ఆత్మవిచారణ(inquiry) లాంటి తత్వశాస్త్ర చర్చలన్నీ నిరుపయోగమనీ, ఈ విషయంలో ఏ రకమైన సంభాషణలూ సాధ్యం కాదనీ, ఇంకా మీ ప్రశ్నలు గూడా మరొకరి ప్రశ్నలు లాగే ఏ రకమైన ప్రయోజనాన్నీ ఇవ్వవనీ, హామీ ఇవ్వగలను. అవగాహన అంటే నా అర్థం, ఇంక ఏ ప్రశ్నలు లేని స్తితి.

**ప్ర: ఇది, ఒక ఆలోచించడం లేని స్తితి అని అంటున్నారా?**

**యుజీ** : ఎక్కడైతే ఆలోచించడం, జీవించడం రెండుగా కాకుండా ఒకటే అయి ఉంటాయో ఆదే యీ స్తితి. ఇది మేధకు సంబంధించిన (intellectual) స్తితి కాదు. ఇది ఒక అనుభూతి(feeling) లాంటి స్తితి. (ఫీలింగ్ అనే పదం మీరు వాడే అర్థంలో కాకుండా వేరే అర్థంలో నేను వాడుతున్నప్పటికీ). ఇది కోరుకొనడం లేని ఒక స్తితి. మనిషి ఎప్పుడూ ఏదో ఒకటి అన్వేషిస్తూ ఉంటాడు – డబ్బు, అధికారం, సెక్స్, లవ్, అధిభౌతిక అనుభవం, సత్యం, జ్ఞానోదయం – అందువల్ల ఏదో ఒక దాన్ని పొందడానికి ఈ వెతకడమే అతనిని అతనియొక్క సహజ స్తితికి బయట ఉంచుతుంది. నేను సజహ స్తితి లో ఉన్నప్పటికీ, మరొకరికి నేను హెల్ప్ చేయలేను, ఎందుకంటే ఇది నా సహజ స్తితి ( నా నేచురల్ స్టేట్), అతనిది కాదు.

**ప్ర: నేను అన్వేషించడం మానేస్తే నాలో ఒక మార్పు కలుగుతుందని మీరు అంటున్నారా?**

**యుజీ** : అవును, అది జరుగుతుంది. “అవును, అది జరుగుతుంది” అని నేను అంటే ఏమవుతుంది? నా హామీ వల్ల మీకేం లాభం? దాని వల్ల ప్రయోజనమేమీ లేదు – దానికి అస్సలు విలువ లేదు – అందువల్ల నేను చెప్పినా మరెవ్వరు చెప్పినా వినద్దు. ఇతరులు చెప్పేది వినడం అనేదాన్ని మీరు పుట్టినప్పటినుండి చేస్తూనే ఉన్నారు – మీరు సంతోషంగా లేకపోవడనికి కారణం ఇదే. నీవు ఒక ప్రత్యేకమైన వ్యక్తివి. నీవు మరో మనిషిలా ఉండాలని కోరుకోవడంలో ఏ కారణమూ లేదు. నీవు మరో మనిషిలా ఎటూ ఉండలేవు. ఈ కోరుకోవడం – వినాలని కోరుకోవవడం, అర్థం చేసుకోవాలని కోరుకోవడం, ఫలానా ఫలానా వ్యక్తిలా

ఉండాలనుకోవడం – వీటన్నిటికీ కారణం, సమాజం ఒక పరిపూర్ణమైన వ్యక్తిని సృష్టించాలనుకోవడమే; కానీ 'పరిపూర్ణ మానవుడు' అనేది ఏదీ లేదు – ఇదీ మన సమస్య. మనం చేయగలిగేదంతా ఏమిటంటే మనం మనలాగ ఉండడమే, అలా ఉండడానికి ఎవ్వరూ నీకు హెల్ప్ చేయలేరు. అతను స్కీయింగ్(మంచుమీద జారుతూ ముందుకు పోవడం) ఎలా చెయ్యాలో లేదా కారు రిపైర్ ఎలా చెయ్యాలో నేర్పగలడు, కానీ ముఖ్యమైనదేదీ నేర్పలేడు.

**ప్ర: బుద్ధుడు, క్రీస్తు గూడా నేర్పలేడా?**

**యుజీ** : వాళ్ళ గురించి ఎందుకు ఎందుకు ఆలోచిస్తావ్? వాళ్ళు మరణించేరు. వాళ్ళని ఏ నదిలోకో విసిరేయ్. నువ్వా పని చేయవు. నీవు ఎవరో ఒకరు చెప్పేది వింటూనే ఉంటావ్ (ఎవరనేది ఇక్కడ ముఖ్యం కాదు), ఇంకా, ఇంకా ఎక్కువగా వినడం వల్ల, రేపు గానీ ఎల్లుండి గానీ ఏదోవిధంగా ఈ జీవిత రంగులరాట్నం నుండి బయట పడిపోవచ్చని ఆశతో ఎదురుచూస్తూనే ఉంటావ్. తలిదండ్రులు చెప్పేది వింటావ్, స్కూల్లో టీచర్లు చెప్పేది వింటావ్, మంచిగా ఉండాలని, నీ కర్తవ్యాన్ని నిర్వహించాలని, కోపంగా ఉండకూడదని వగైరా, వగైరా. కానీ దానివల్ల ప్రయోజనం కనపడదు, అందువల్ల ఎవరిదగ్గరికో వెళ్ళి యోగసాధన నేర్చుకొంటావ్, తరవాత ఇపుడొక ముసలాయన వచ్చి ఎంపిక లేని జాగ్రదావస్థలో (choicelessly aware గా) ఉండ మంటాడు. లేదా అధ్యాత్మిక వ్యాపారం చేసుకొనేవారు ఎవరో ఒకరు నీకు దొరుకుతారు, ఆయన అద్భుతాలు (miracles) చేస్తాడు -- గాలిలో నుండి పనికి రాని వస్తులు సృష్టిస్తాడు, దానికి నువ్ పడిపోతావ్ – లేదా బహుశా అతడు నిన్ను తాకుతాడు అపుడు నీవు ఒక నీలి కాంతినో లేదా ఆకుపచ్చటి కాంతినో లేదా ఒక పసుపు పచ్చ కాంతినో చూస్తావ్ – అదేమిటో భగవంతునికే తెలియాలి – అపుడు, జ్ఞానోదయ అనుభవం కలగడానికి అతడు హెల్ప్ చేయగలడనే ఆశ నీకు కలుగుతుంది. కానీ అతడు నీకు సహాయం చేయలేడు. అది పట్టుకో గలిగేది, లోపల ఉంచుకో గలిగేది, వ్యక్తం చేయగలిగేదీ కాదు. అసలు నీవేమీ చేయలేని నీ పరిస్థితిని చూడ గలుగుతున్నావో లేదో నాకు తెలియదు, ఆయన నీకు హెల్ప్ చేయగలడని ఎవరైనా ఎలా అనుకుంటారో నాకు తెలియడం లేదు. అతడు తప్పనిసరిగా నిన్ను

తప్పుదారి పట్టిస్తాడు. అతడు ఎంత తక్కువ మోసగాడైతే అంత ఎక్కువ శక్తి గలవాడై ఉంటాడు, ఎంత ఎక్కువ జ్ఞానైతే అంత ఎక్కువ కీడు, దుఃఖమూ నీకు కలిగిస్తాడు.

**ప్ర: పునర్జన్మకు సంబంధించిన ప్రశ్నలో మీకు ఏమైనా ఆసక్తి ఉందా?**

**యుజీ** : "మీరు అసలు పుట్టేరా" అనే ప్రశ్న నాకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తుంది . మీరు చెప్పగలరా? -- మీరు జన్మించేరని నిశ్చయంగా, స్వయంగా, మీ అంతట మీకు (ఎవరో చెప్పడం కాదు) తెలుసా? మీ సొంత పుట్టుకను మీరు అనుభవించ గలరా, ఎక్స్పీరిఎన్స్ చేయగలరా? మీరు చేయలేరు. మీరు ఇతరుల జనన మరణాలను అనుభవించ గలరు, కానీ ఏదో ఒక రోజు మీరు మీ సొంత మరణాన్ని అనుభవించగలనని అనుకొంటున్నారు. కానీ మీ సొంత మరణాన్ని మీరు ఎక్స్పీరిఎన్స్ చేస్తారన్న గేరంటీ లేదు. మీ సొంత చావును, మీ సొంత పుట్టుకను అర్థం చేసుకోవాలనే ఆసక్తి ఉన్న మీ స్ట్రక్చర్ (మీ ఆలోచనా నిర్మాణ క్రమం) అపుడు అక్కడ ఉండదు. అలా అసలు జీవానికి, తనకంటూ ఒక మొదలూ, ఒక చివరా లేదు (So life as such has no beginning and no end). అది ఒక, ఆరంభం లేని, అంతం లేని గమనం, నీవు దానియొక్క ఒక వ్యక్తీకరణ మాత్రమే. నీవు జీవం యొక్క, ఒక వ్యక్తీకరణ, ఒక పక్షి లేదా ఒక పురుగు లేదా ఒక మేఘం లాగ.

**ప్ర: కానీ నాకు ఒక పురుగుకీ ఉన్న ఒకే ఒక తేడా ఏమిటంటే, నేనున్నట్లు నాకు తెలుసు కానీ పురుగుకి తానున్నట్లు తనకు తెలియదు.**

**యుజీ** : ఆలోచన ద్వారా నీ అస్తిత్వం నీకు తెలిస్తుంది (ఇక్కడ ఆలోచన అంటే నా అర్థం ఒక్క నీకు తెలిసిన అలోచన మాత్రమే కాదు, నీ ద్వారా సాగుతున్న జీవనాన్ని ఫీలింగ్స్ లోకి, ఆనందంలోకి, బాధల లోకి మారుస్తున్న సమాజ నిబంధనలకు అనుగుణంగా నడిచేట్టు అలవాటు పడడం, conditioning గూడా.) అంతేకాదు, ఈ ఆలోచన నీది కాదు; ఇది ఇతరుల నుండి నేర్చు కొన్నది, ఇది సెకండ్ హేండ్, ఇది ప్రతి ఒక్కరికీ చెందుతుంది. నీవు ప్రతి ఒక్కరికీ చెందుతావ్. అందువల్ల సహజమైన దాన్ని నీవెందుకు అంగీకరించవు? సహజమైన దాన్ని నీవు అంగీకరించి నపుడు, వాటియొక్క సొంత దారిలో, సొంత లయలో అన్నీ పడతాయ్:

చేయడానికి ఏమీ లేదు, నియంత్రించడానికి ఏమీ లేదు. అడగడానికి ఏమీ లేదు. నీవేమీ చేయక్కర్లేదు. నీ పని అయిపోయింది, ఇంక నీవంతమయ్యావ్. (You are finished.)

-------------

**ప్ర: బాగానే ఉంది కానీ, మనిషి ఒక కొండ మీద కూర్చొని కృశించి పోలేడు కదా.**

**ప్ర: ఒకే, నేను చేస్తున్నది అదే.**

**యుజీ :** ఇంకా కృశిస్తూనే ఉన్నారు, మీరెక్కడ ఉన్నారన్నది ముఖ్యం కాదు. కొండ మీదే ఉండాల్సిన అవసరం లేదు; మీ కార్యకలపాలన్నిటి మధ్యనే ఆ క్షీణించడం కొనసాగుతూ ఉంది. ఏదో ఒక రోజు, ఏదోవిధంగా, ఏదో ఒక అద్భుతం జరిగి, లేదా ఎవరి సహాయంద్వారానో, ఈ విషయంలో ఏదో ఒకటి చేయగలనని అనుకోవడమే మీకున్న పెద్ద భారం, బర్డెన్. ఈ విషయంలో మీరేమీ చేయలేరు, దీన్ని మనం ఎదుర్కుందాం. అద్భుతాలు జరగవు ! ఎవ్వరూ మీకు సాయం చేయ లేరు!

**ప్ర: మరెవ్వరూ సహాయం చేయక పోతే....**

**యుజీ :** నీకు నీవు ఎలా హెల్ప్ చేసుకోవాలో కూడా నీకు తెలియదు – అదీ విషయం . నీకు తెలుసు ఈ రెండూ వేరు కాదని. బయటి వారెవ్వరూ నీకు సహాయం చేయలేరనే విషయాన్ని నీవు నిజంగా గ్రహించి నపుడు, నీ మొత్తం నిస్సహాయత అంతా దానంతటఅదే పోతుంది. ఇవి రెండూ (సొంత హెల్ప్ & బయటి హెల్ప్) ఒకే నాణేనికి బొమ్మా బొరుసులు. నీకు ఇంకా కొంత ఆశ ఉంది – నీవు ఇంకా ఇక్కడే ఉన్నావన్న వాస్తవానికి అర్థం ఏమంటే ఆశను నీవింకా విడిచి పెట్ట లేదని. నీవు ఇక్కడికి రాకపోతే, ఇండియా లోని మరొకరిని చూడ్డానికి వెడతావ్ – ఒక దేవుని ఆవతారాన్నో, భూమిపై నడిచే ఓ దేవుణ్ణో. బహుశా అతడు పనికి రాని వస్తువులు కొన్నిటిని గాలిలోనుండి సృష్టిస్తాడు, కానీ దాని ఉపయోగం ఏమిటి? అతడు ఎవరైనా సరే, నీకు ఆశ లేక పోతే అతను చెప్పేది వినవు, ఏ పుస్తకాన్నీ ముట్టుకోవు, యీ ప్రపంచంలో ఎవరు చెప్పేదీ వినవు. దీనర్థం నీవు

గర్విష్టివని, మరోటని కాదు; కానీ, అన్నీ రకాల అన్ని స్థాయిల్లో ఉన్న బయటి మనుషులను, బయటి వ్యవస్థలను మొత్తమన్నిటినీ, శాశ్వతంగా వదిలేస్తావ్.

"ఏంచెయ్యాలో నాకు తెలియదు. నేను నిస్సహాయుణ్ణి, అన్నీ విధాలా నిస్సహాయుణ్ణి" – నీవు మొత్తం నిస్సహాయుడివని నీవు అనుకొన్నంత కాలం నీవు బయటి వారిపై ఆధార పడతావ్. కానీ, ఒకే దెబ్బతో దాన్ని పోగేట్టేయ వచ్చు: ఒక్క దెబ్బతో ఇతరులపై ఆధారపడ్డం శాశ్వతంగా అంతమవుతుంది, దానితో పాటు నీవు నిస్సహాయుడవనే అభిప్రాయం పోతుంది, దాని గురించి ఏంచెయ్యాలో తెలియని పరిస్తితి గూడా పోతుంది. కానీ ఏదో జరుగుతుందనో, లేదా ఎవరి అనుగ్రహమో పైనుండి మీద పడుతుందనో నీవెదురుచూస్తున్నావ్ – అంటే నీవింకా బయటి వాళ్ళ మీద ఆధార పడుతున్నావ్. నీ బయట ఏ శక్తీ లేదని నేను నీకు చెప్ప గలను – ఏ పవరూ గూడా లేదని. దీని అర్ధం.. నీవు చదివిన ఆ సూపర్ డూపర్ గాడ్స్ యొక్క గుణాలన్నీ నీలో ఉన్నాయని కాదు. ఈ విశ్వంలో ఏదైనా ఒక శక్తి ఉంటే, అది నీలోనే ఉంది.

**ప్ర: మీరు చెప్పేది ఒప్పుకుంటాను.**

**యుజీ** : ఇక్కడ ఒప్పుకోవడమనే ప్రశ్న కాదు; ఇది వాస్తవం, కానీ యీ వాస్తవాన్ని నీవనుభూతి చెందలేవ్. ఒప్పుకున్నానని నీవనుకున్నంత కాలం నీవు సందేహ రహితం కాదు.

**ప్ర: నా బయట ఏ శక్తీ లేదు, ఇక్కడ ఇప్పుడు?**

**యుజీ** : నీవా శక్తిని తనంతట తానుగా వ్యక్తపరచుకోనీయడం లేదు. ఎందుకంటే అది, నీవు అనుభవించలేనిది. దాన్ని నీవు ఎక్స్పీరియెన్స్ చేయాలనుకొంటున్నావ్. అది ఎలా సాధ్యం? ఆ శక్తి ఓ జీవిస్తున్నది, ప్రాణాధారమైనది – అది కదులుతూ లయబద్ధంగా కొట్టుకొనే నాడి, జీవం (it's the throb, the pulse, the beat of life) – నీవు, ఆ జీవం యొక్క ఒక వ్యక్తీకరణ(expression) మాత్రమే, దట్సాల్, అంత మాత్రమే. దాన్ని నీవు ఎలా అనుభవించ గలవు? దేని ద్వారా అయితే నీవు అనుభవం పొందుతున్నావో, ఆ ఆలోచనానిర్మాణం ప్రాణం లేనిది. అది జీవాన్ని అసలు అనుభవించ లేదు.

ఎందుకంటే ఒకటి జీవిస్తున్నది రెండోది ప్రాణం లేనిది, అందువల్ల ఆ రెండిటి మధ్య సంబంధం ఉండదు. నీవు ప్రాణం లేని వాటిని(dead things) మాత్రమే అనుభవించ గలవు, జీవం ఉన్న దాన్ని కాదు. జీవం(లైఫ్) తనను తాను వ్యక్తం చేసుకోవాలి. ఇది ఎవ్వరూ నీకు నేర్ప లేనిది. దీన్ని ఎవరి దగ్గరనుండో నీవు తెచ్చుకోనక్కర లేదు; నీ దగ్గర ఉన్నది, అక్కడే ఉంది (what you have is there).

ప్ర : అవును. కానీ ఒక వేళ ...

యుజీ : 'అవును, కానీ' లేదు. అవును అని చెప్పిన తర్వాత 'కానీ' తో మొదలు పెట్ట కూడదు. అక్కడ 'కానీ' లేదు. ఒక వేళ ఆ 'అవును' నిజమైన 'అవును' అయితే అది అక్కడ ఉన్నదాన్ని విడిపిస్తుంది -- ఆ 'అవును' నెమ్మదిగా మాయమవుతుంది అపుడు అక్కడ ఉన్నది, తనను తాను వ్యక్తం చేసుకోవడం మొదలు పెడుతుంది. ఒక వేళ నువ్వు 'కానీ' అంటే, నీవు ఆ ప్రాణం లేని ఆలోచనానిర్మాణానికి, అనుభవానికి, ఆశకి, కొనసాగింపు (కంటిన్యుటీని) ఇస్తున్నావ్. ఆ మొత్తం నిర్మాణాన్ని(whole structure ని) ముక్కలు ముక్కలుగా బద్దలు కొట్టేది, ఆ "అవును" అనేదే.

--------------

ఏ బయటి ఏజెన్సీ గూడ నీకు సహాయం చేయ లేదు – ఎవ్వరూ కూడా – దీనిని గూర్చి యింత ఎక్కువగా మాట్లాడుతున్న ఈ మనిషి కూడా; వీడు కూడా హెల్ప్ చేయలేడు. (కనీసం ఈ వ్యక్తి నిజాయితీగా మాట్లాడుతున్నాడు, "అవును, నేను హెల్ప్ చేయలేను" అంటున్నాడు.) అంచేత, నీకు బయటి నుండి ఏ విధమైన సహాయం దొరకదని తేలిపోయింది. ఈ పాయింట్ కి చేరుకోవడం చాలా కష్టం, అంటే, "నాకు సహాయం చేయగల వారు, బయట ఎవ్వరూ ఇక లేరు!" అనే పాయింటుకు రావడం. అపుడు నీవు ఎవరి దగ్గరకీ వెళ్ళి వారు చెప్పేది వినవు, అతడు ఎంత పవిత్రుడైన సరే. అతడు దేవుళ్ళకే దేవుడు అవ్వచ్చు, "నేను మానవాళి అంతటినీ విముక్తి చేయడానికి వచ్చిన వాణ్ని" అని ఆయన చెప్పవచ్చు, అయినా నీవు ఆయన దగ్గరకు వెళ్ళవు, నీకర్థమయిందా? (ఒక వేళ, అదేమిటో చూద్దామనే ఆసక్తితో నీవు ఆయన దగ్గరకు వేడితే ఫరవాలేదు.) నీవు బయట ఉన్న ఏ మార్గం

ద్వారా కూడా దేన్నీ పొందాలని కోరుకోవు. నీవు నీ మీదే ఆధారపడి ఉంటావ్, కానీ నీకు నిజంగా ఏమీ తెలియదు. నీవు కనుక్కోవాలనుకొంటావ్. అదే ప్రశ్నను తిరిగి తిరిగి వేసుకుంటావ్ – కానీ నీవు అక్కడే ఉండిపోతావ్, ముందుకు వెళ్లలేవ్ – "దీనిని నేను ఎలా అర్థం చేసుకోగలను?" అదే ప్రశ్న నీలో ఉంటుంది. బయటినుండి వచ్చిన అన్ని సమాధానలూ వదిలేసిన తర్వాత, నీ లోపలి నుండి కూడా ఏ జవాబూ రానప్పుడు, ఆ ప్రశ్న కు ఏమి జరుగుతుంది? ఆ ప్రశ్న అక్కడే ఉండి పోలేదు. అది దానంతట అదే నెమ్మదిగా అదృశ్యమై పోతుంది. ఆలోచన 'అయాన్సు'(ions) గా మారిపోతుంది, (Ionization of thought takes place), ఎందుకంటే అది తప్పించుకొని ఎక్కడికీ పోలేదు కాబట్టి, అదే శక్తి, అదే జీవం, లైఫ్.

-------------

**ప్ర: జె. కృష్ణమూర్తి గారితో ఏడు సంవత్సరాలు మీరు గడిపేరని విన్నాము. ఆయన ప్రభావం, ఇపుడు మీరున్న స్తితిని పొందడానికి దోహద పడ లేదంటారా? దాని ప్రభావం అస్సలు శూన్యమా?**

యుజీ : అస్సలు ఏమాత్రం లేదు. అందరూ వచ్చి నన్ను అడుగుతూ ఉంటారు "మీరు జె. కృష్ణమూర్తి గారి చుట్టూ ఏడు సంవత్సరాలు తిరిగేరు, ఆయన యొక్క ప్రభావం(impact) మీ మీద లేదా?" అని. ఆయనతో నాకు పరిచయం ఉన్నప్పటికీ నాలో ఈ మార్పు సంభవించింది- అని నేను అంటాను. అది జరగాల్సి ఉంటే, నేను ఉన్నప్పటికీ, నా గురువులు ఉన్నప్పటికీ, అది జరిగి తీరుతుంది. ఆయన impact(ప్రభావం) నథింగ్; పైపెచ్చు దాని వల్ల నాకు ఇది జరగడం చాలా కష్టమయింది. అది, నీకు నీవుగా ఉండే అవకాశాన్ని ఆపడమే కాకుండా నీ గతం యొక్క భారాన్ని నీకు నీవే తొలగించుకొనే అవకాశాన్ని పాడు చేస్తుందని నేను చెప్పగలను.

గతం యొక్క భారాన్ని నీకు నీవే ఎలా తొలగించుకోగలవు? ఈ భాష చూడండి... తొలగించుకోడం - అనే పదం, తొలగించుకోడం కొరకు నీవు చేయగలిగినది ఒకటి ఏదో ఉంది అనే అర్థాన్ని ఇస్తుంది. నీ గతాన్నుండి విముక్తి చేసుకోవడానికి నీవు చేయ గలిగినది ఏదీ లేదు. ఎక్కడైతే గతం ఇకపైన పని

చేయదో, ఆపరేట్ కాదో, ఆ స్థితి యొక్క వివరణ మాత్రమే ఇది – ఆ స్థితిలో, నీ చర్యలను గతం ప్రభావితం చేయ లేదు. ఆ చర్యలు... ఇకపైన నీ చర్యలు కావు. ఆ చర్య గురించి నీకేమీ తెలియదు, ఆ చర్యను, అసలు నీవు, నీకు నచ్చిన విధంగా, మలచుకో లేవు, అది జీవం యొక్క చర్యే. ఈ సందర్భంలో నేను చెప్పదలచుకున్నది ఏమంటే, అది, ఆ జీవం యొక్క చర్య, ఆ action of లైఫ్ మర్మమైనదీ కాదు, మతపరమైనదీ కాదు లేదా, అప్పటికప్పుడు అనుకోకుండా జరిగిన శుద్ధమైన(pure) చర్యా కాదు; దీనితో దానికి సంబంధం లేదు. జీవం యొక్క action, చర్య ఎప్పుడూ ఉంటుంది, అంటే జ్ఞానేంద్రియ కార్యకలాపాలు ఉన్నంతవరకు ఏదో ఒకటి జరుగుతూనే ఉంటుంది అనే అర్థంలో. ఒకటి కాదు, లక్షల కోట్ల సెన్సేషన్స్ (సంచలనాలు) మానవ జీవిని తట్టుతూ ఉంటాయ్. ఈ మానవ జీవి వాటికంటే వేరు కాదు; ఇదంతా ఒకటే ఎలక్ట్రో మెగ్నటిక్ ఫీల్డ్( విద్యుదయస్కాంత క్షేత్రం). ఇది అంతా ఒకటే క్షేత్రం. నిన్ను విడదీసి, వేరుచేసి, ఒక చిన్ని (tiny) విద్యుతయస్కాంత క్షేత్రాన్ని సృష్టించేది ఆలోచన.

---------------

**ప్ర: ఏ మనిషి అయినా తన ఆలోచనను తాను ఎరిగి ఉండడం ద్వారా (through being aware of it) దానిని, సంప్రదాయక నియమ నిబంధనల నుండి, అలవాట్ల నుండి, విముక్తి చేయ గలడా (uncondition చేయగలడా)?**

**యుజీ :** నీవు ఆలోచనను ఎలా చూస్తావ్? నీవు ఎప్పుడైనా నిజంగా ప్రయత్నించావా, లేక ఆ ఐడియాని అంగీకరించావా? ఎవరైతే ఆ 'సంప్రదాయబద్ధతకు అలవాటుపడ్డ ఆలోచనను' (కండిషండ్ థాట్ ను) చూస్తున్నాడో, అతడు గూడ సంప్రదాయ బద్ధతకు అలవాటు పడ్డ వాడే(కండిషండ్ మనిషే), అందువలన, అలా చేయడం లోని అసంబద్ధతను(absurdity) నీవు గమనించేవా? నువ్వా అసంబద్ధతని గమనించావని నాకు అనిపించడం లేదు. నీవేమీ చేయ లేవు. అందువల్ల సంప్రదాయాలకు అలవాటు పడిపోయిన, నీ సొంత ఆలోచనలను ఆ సంప్రదాయ నమ్మకాలనుండి విముక్తి చేసే ప్రయాణాన్ని (కార్యక్రమాన్ని ) మొదలెట్టద్దు.

కానీ మీరు ఆ ప్రయత్నం ఇంకా చేస్తూనే ఉన్నారు. ఈ ఐడియాలను మీరు ఒప్పుకుంటారు; ఆ మాటల్లో నిజం ఉందా, అని మీరెప్పుడూ ప్రశ్నించరు. అలా చెప్పింది ఎవరనేది ముఖ్యం కాదు. మీ వరకూ అది నిజం కాదు. అంతే కాదు, అది మిమ్మల్ని తప్పు దారిలో నడిపిస్తోంది ఎందుకంటే ఆ మాటలలో నిజం ఉందా లేదా అన్నది మీ అంతట మీరు పరీక్షించు కోరు కాబట్టి.

--------------

చూడండి, ఆ కండిషనింగ్ (సాంప్రదాయీకరణ) నుండి మీరు ఎప్పుడూ బయట పడ లేరు. ఎవ్వరినీ నమ్మద్దు. సాంప్రదాయబద్ధత నుండి బయటపడ్డ మనస్సు (అన్-కండిషండ్ మైండ్) అనేది ఏదీ లేదు; మనసు కండిషన్ చేయబడినదే. చూడండి, ఇది అర్థం లేని మాట, మైండ్ అనేది ఒకటుంటే, అది కండిషనయినదే అయి తీరాలి. థియోసోఫికల్ సొసైటీలో(దివ్యజ్ఞాన సమాజంలో) "ఓపెన్ మైండ్ (తెరచిన మనస్సు) అనే పదాన్ని మేము చాలా తరచుగా వాడుతూ ఉండే వాళ్ళం. ఆ పదాలు ఎంత ఆబ్సర్డ్, అసంబద్ధం! మనసు అనేది ఎప్పుడూ తెరచి ఉండదు. అది మూసివేయబడే ఉంటుంది. మైండ్ అనేది ఒకటి ఉందనే దాన్నే నేను ఒప్పుకోను. ఇక, ఓపెన్-మైండ్, అన్-కండిషండ్ మైండ్ గురించి మాట్లాడ వలసిన అవసరం లేదు. ఆలోచనల మొత్తం, అనుభవాల మొత్తం -- అనేది ఏదీ లేదు; అవన్నీ ఒక దానికొకటి కలవకుండా ఉంటాయ్, విడి విడిగా ఉంటాయ్.

ఆలోచనలు లేని స్థితి, నిశ్శబ్దం (silence).... నిశ్శబ్దాన్ని మీరు ఎలా ఎక్స్పీరిఎన్స్ చేయగలరు? – అదీ నాప్రశ్న. ఆలోచనలు లేని స్థితిని మీరు ఎలా అనుభవించ గలరు? మీరు ఆలోచన నుండి ఎప్పటికీ విముక్తి పొంద లేరు. ఆలోచన లేని స్థితి అనేది ఒకటుంటే, దాన్ని మీరు గానీ, మరొకరు గానీ అనుభూతి చెంద లేరు. మీరు దేన్ని ఎక్స్-పీరిన్స్ చేసినా అది ఈ ఆలోచన సృష్టించినదే.

ఎల్లకాలం ఉండేది (the timeless)... మేము వ్యాసాలు రాసే వాళ్ళం... "కాలము, కలకాలం" అంటూ. అవి హాస్యాస్పదమైన విషయాలు. టైమే టైమ్-లెస్ ని

సృష్టిస్తుంది తరవాత టైమ్-లెస్ కోసం దాని వెంటపడుతుంది -- ఇలా టైమ్ కొనసాగుతుంది. ఈ కొనసాగించడమే దీనికి ఉన్న ఇంట్రస్ట్ అంతా.

-----------

అస్పష్టభావాలు తప్పు దారి పట్టిస్తాయి. అమాయకత్వం, తెలియనితనం అది, ఇది, మరొకటి మొదలైన వాటి గురించి, మాట్లాడడం మొదలు పెడితే, నీవెక్కడున్నావో నీకే తెలియదు. ఊహాజనిత సిద్ధాంతాలు, చాలా తప్పు దారి పట్టిస్టాయ్, చాలా తప్పు దారి పట్టిస్తాయ్. మీరు తెలియనితనం గురించి మాట్లాడుతున్నారు. ఏమీ తెలియకపోవడం గురించి మీకేం తెలుసు? ఆ స్తితిలో మీరు దేన్ని చూస్తున్నారో మీకు నిజంగా తెలియదు. మీ భార్యను చూస్తున్నట్టు గూడా మీకు తెలియదు. అక్కడ బంధుత్వం ఉంటుందా? అక్కడ ఒక భార్య అనేది ఉంటుందా? కూతుర్లు, కొడుకులూ అనే వాళ్ళు ఉంటారా? చూడండి, ఏమీతెలియనితనం గురించి మీరు మాట్లాడ గలరు, కానీ మైండే లేనపుడు అమాయక మనసు (innocent mind) గురించి మాట్లాడడమెందుకు? మైండ్ ఎక్కడ ఉంది? అన్-కండిషండ్ మైండ్ ఎక్కడ ఉంది? ఈ పదాలు, వాక్యాలు తప్పు అర్థాలిస్తాయి; ఏ విధంగానూ అవి సహాయ పడవు.

-----------

నా వరకు, మైండ్(మనసు) అనేది ఏదీ లేదు. మైండ్ ఒక అవాస్తవం, ఒక కల్పితం. మైండ్ అనేది ఏదీ లేనందువల్ల జె.కృష్ణమూర్తి గారు చెపుతున్న 'మైండు యొక్క సంపూర్ణ పరివర్తన' అనే మాటకు అర్థం లేదు. సమూలంగా గాని, మరోలా గాని, పరివర్తన చెందడానికి అక్కడ ఏమీ లేదు. తనంతట తానే తెలుసుకోడానికి ఆత్మ అనేది గానీ, నేను అనేది గానీ ఏదీ లేదు. దీన్ని పునాదిగా చేసి నిర్మించబడిన అధ్యాత్మిక కట్టడం కూలిపోతుంది, ఎందుకంటే ఎవరికివారే తానంతట తెలుసుకోడానికి, అక్కడ ఏమీ లేదు. క్రిష్ణమూర్తి గారు ఆడుతున్నఆట గూడా యీ అధ్యాత్మిక బజారులో ఇపుడు మనకున్న అవలక్షణ సాధువులు ఆడే ఆటల లాగే నాకు అనిపిస్తోంది. క్రిష్ణమూర్తిగారి బోధనలో నిజం లేదు. ఆయన చెప్పేదాంట్లో అసలు ఏమీ లేదు, ఆయన దేన్నీ సృష్టించలేడు. ఒక మనిషి అరవై, డెబ్బై, వంద

సంవత్సరాలు ఆయన చెప్పేది విన్నప్పటికీ ఆ మనిషిలో ఏ మార్పూ జరగదు, ఎందుకంటే, అదంతా అవాస్తవం కాబట్టి. ఎంతో విజయం సాధించిన ఒక అధ్యాత్మిక గురువు అనడానికి, అనుచరుల యొక్క సంఖ్యే కొలబద్ద అయితే, JK ఒకమరుగుజ్జు. అయన ఒట్టి మాటకారి. అయన ఒక కొత్త ఉచ్చు సృష్టించాడు.

నీవు సిగరేట్స్ తాగాలనుకొంటే, ఇంటి ఇంటికి తిరిగి తమ బ్రాండ్ సిగరెట్లను అమ్ముతున్న చిల్లర వ్యాపారులున్నారు. ప్రతి ఒక్కరూ తమ బ్రాండే అన్నిటికంటే గొప్ప బ్రాండు అని చెప్పుకుంటారు; కృష్ణమూరి వచ్చి అంటారు... నాది నికోటిన్ లేనిదని. అందువల్ల ప్రోబ్లెమ్ గురువులు కాదు... నీవు. నీవు స్మోకింగ్ చేయనంటే ఈ బ్రెండ్స్ అన్నీ మాయమవుతాయ్. ఈ గురువులంతటి అతి చెడ్డ అహంకారులు, ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఉండరు. తమ అనుచరులకు అల్పమైన అనుభవాలు చూపిస్తున్న సంక్షేమ సంస్థల లాంటివారు యీ గురువులు. ఈ గురూ-గేమ్ ఒక లాభ సాటి వ్యాపారం. సంవత్సరానికి ఇరవై లక్షల డాలర్లు మరోరకంగా సంపాదించ గలరా, ప్రయత్నించి చూడండి. నాకేమీ ఆస్తులు లేవని చెప్పుకొనే JK ఎనబై మిలియన్ డాలర్ల సామ్రాజ్యానికి అధిపతి, అధ్యక్షుడు.

-----------

ఎంపికలేని జాగృతి(Choice less awareness) అనేది అర్థరహితం. ఎంచుకోకుండా స్పృహలో ఉండేవాడు ఎవరు? ఇది నీ అంతట నీవు తప్పకుండా పరీక్షించుకోవాలి. విక్టోరియా మహారాణి కాలం నాటి ఆ పెద్ద మనిషి, ఒక ఇరవై, ముప్పై, నలబై సంవత్సరాల క్లబ్ నుండి అధ్యాత్మిక dead-wood లాంటి పెద్ద మనుషులను తన చుట్టూ పోగుచేసుకొన్నాడు. దానివల్ల ప్రయోజనమేమిటి? నేను అతనితో సంవత్సరాలు గడిపేను, నేను చెప్పగలను అతడు గొప్ప నటుడని. "జెంటిల్మెన్, మనమందరం కలిసి ఒక ప్రయాణం మొదలు పెడుతున్నాం" (నవ్వు) – కానీ మీరు ఆయనతో మీరెప్పుడూ ఆ ప్రయాణం చేయలేరు. మీరు ఏంచేసినా, అది ఒకేలా ఉంటుంది. మీరు ఆయనతో అనుభూతి చెందినది ఏమిటంటే ఆలోచన యొక్క స్పష్టీకరణ. ఆ ఆలోచనే మీరు. ఆయనొక సంఘ సంస్కర్త (do-gooder). ఆయన దాన్ని ఎప్పుడో వదిలివేయాల్సింది.

--------------

మీరు నా మాటను యదార్థంగా తీసుకోవాలి. నేను మీ కంటే భిన్నమైన వాడిననే భావన నా మనసులోకి ఎప్పుడూ రాదు. అందువల్ల, మీరు ఇక్కడ కూర్చొని ప్రశ్నలు వేసినపుడు, "వీళ్ళు నన్ను ఈ ప్రశ్నలు ఎందుకు అడుగు తున్నారు?" అని నాకు అనిపిస్తుంది. మీరు అడిగే ఈ ప్రశ్నలకు జవాబులు లేనే లేవు. ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఈ ప్రశ్నలకు ఆన్సర్స్ యివ్వ లేరు. వాళ్ళు ఏ ఆన్సర్స్ యిచ్చినా అవి నిన్ను తప్పు దారి పట్టిస్తాయి – చివరికి మీరు, దారి తప్పించబడిన వారిగా, తప్పుదారి పట్టినవారిగా, సమయం వృధా చేసినవారిగా మిగిలిపోతారు. ఈ గొప్ప టీచర్స్ ను నలభై ఏళ్ళు, ఏభై ఏళ్ళు ఫాలో అయినవాళ్ళలో చాలా మంది నాకు తెలిసిన వాళ్ళున్నారు. వారిలో చాలా మంది, ఏభై అరవై ఏళ్ళు కృష్ణమూర్తి గారి చుట్టూ తిరిగిన వాళ్ళు, నా దగ్గరకు వచ్చి అడుగుతున్నారు "ఆయన చెప్పినది వింటూ ఏభై ఏళ్ళు నేను వృధా చేశానా" అని. ఈ ప్రశ్నకు నేను ఆన్సర్ యివ్వాల్సిన అవసరం ఉందా? ఆన్సరు మీరే చెప్పాలి; అ ప్రశ్నకు జవాబు నేనివ్వనక్కర లేదు. నీవు ఏభై సంవత్సరాలు వేస్ట్ చేసుకొన్నావ్, మరో యాభై సంవత్సరాలు వేస్ట్ చేసుకోబోతున్నావ్. మీరు ఇక్కడకు రావచ్చు – వచ్చినా ఏమీ జరగదు, ఏ మార్పూ ఉండదు. నా దగ్గర మీకేమీ దొరకదు. అందుకే నేను సురక్షితం – నా బతుకు నేను బతుకుతాను – ఎవరైనా వస్తే నేనంటాను "చెప్పండి, నేను మీకేం చేయ గలను, నేను ఎక్కువ చేయ గలిగినదేమీ ఉండదు. థాంక్ యూ. గుడ్ బై." అని.

------------

*(ఈ కింద సంభాషణలో పాల్గొన్న వారు, జె. కృష్ణమూర్తి గారి వార్షిక కేంప్ కు [సానేన్, స్విట్జర్లేండు] హాజర్ అవడానికి వచ్చి, అక్కడికి దగ్గరగా ఉన్న యుజీ నివాసంలో, యుజీని చూడ్డానికి వచ్చారు.)*

**ప్ర: దుఃఖం అనే సమస్యను అర్థం చేసుకోవాలని మేము అనుకొంటున్నాం.**

**యుజీ:** ఇటు చూడండి. కోరుకొన్నది దొరకక పోవడమే దుఃఖం – మీరు కోరుకొనేది ఏదైనప్పటికి – సంతోషం, ఆరోగ్యం, జ్ఞానోదయం – ఇవి మారుతూ ఉంటాయ్, మీకు తెలుసు కదా. అందువల్ల, కోరుకొన్నది దొరకక పోవడమే దుఃఖం.

**ప్ర** : అది మనల్ని మానసిక వ్యాధి గ్రస్తులు గా చేస్తుంది.?

యుజీ : మనసు యొక్క స్వభావమే అంత. (మనసు అనేది ఒకటుంటే) ఎందుకంటే, దానికి ఒకే టైమ్ లో రెండు కావాలి, అందువల్ల ప్రతీ మనిషి, మానసిక రుగ్మతలున్న వాడే. అదీ కావాలి, ఇదీ కావాలి, రెండూ కావాలీ అని నీవు అనుకొన్నంత కాలం నీవు మానసిక వ్యాధితో బాధపడుతుంటావ్. అది నీకు దొరకనప్పుడు మతిభ్రమించిన స్తితిలోకి వెడతావ్, క్రూరంగా ప్రవర్తిస్తావ్. నీవు వెళ్ళి ఎవరో ఒకరిని కొట్టక పోవచ్చు; కానీ నిన్ను నీవు నాశనం చేసుకొంటున్నావ్, ఎందుకంటే హింస నీ లోపలే ఉంది.

మీకు సంతోషంగా లేకుండా చేసేది ఏమిటంటే, లేని దాని కోసం వెతకడం. సంతోషం అనేదే అసలు లేదు. అదేవిధంగా జ్ఞానోదయం అనేది కూడా ఎక్కడా లేదు. మీరనచ్చు, ప్రతీ గురువు, మరియు సాధువులు, మానవాళి రక్షకులు , జ్ఞానోదయం అనేది ఒకటుందనీ, వాళ్ళు జ్ఞానోదయం పొందిన వాళ్ళనీ యుగ యుగాలుగా నొక్కి చెప్పుతున్నారని. వాళ్లందరినీ ఒకే కట్ట కట్టి ఏ నదిలోకో విసిరేయండి! నేను పట్టించుకోను. జ్ఞానోదయం అనేది అసలు లేనే లేదు అని తెలుకోవడమే జ్ఞానోదయం అంటే.(నవ్వు!)

ఆలోచన ఆగదు. ఆలోచనలు ఎప్పుడూ ఉంటాయ్, ఎందుకంటే ఆలోచన, జీవం (లైఫ్) రెండూ వేరు వేరు కాదు. నీవు ఆలోచనలు లేకుండా ఉంటావని ఊహించుకోవద్దు; ఆలోచనలు ఉండచ్చు, లేకపోవచ్చు, కానీ "నీవే ఆ ఆలోచన" అనే గుర్తింపు నీకు అసలు ఉండదు – ఒక ప్రత్యేకమైన ఆలోచనాగమనంతో 'నేను ఇదే` అని తనను గుర్తించుకొనేది (identify చేసుకొనేది) ఏదీ యిక్కడ లేదు. అక్కడ ఆలోచనలు ఉండచ్చు లేదా ఉండకపోవచ్చు -- అవి తప్పక ఉంటాయి ఎందుకంటే జీవం & ఆలోచన రెండూ వేరు వేరు కాదు – ఈ విషయంలో నీవేమీ చేయ లేవు. దేనినైనా అర్థం చేసుకోవదానికి వాడవలసిన పరికరం(instrument) యిది మాత్రం

కాదని, నీవు అర్థం చేసుకున్నప్పుడు, ఏదో విధంగా దీని వేగం తగ్గుతుంది తరవాత ఇది(ఆలోచనా గమనం) తనయొక్క సహజ గమనంలో, సహజ లయలో (natural rhythm లో) పడుతుంది. అపుడు అది నీకు ఒక సమస్యగా గానీ లేదా నీకు భారంగా, బర్డెన్ గా అనిపించదు.

ఆలోచించడం (thinking) నుండి పుట్టిన ఈ పరికరం ద్వారా, ఎవరి బోధననో (టీచింగునో) అర్థం చేసుకోడానికి నీవు ప్రయత్నిస్తున్నావ్. నీవు ఎవరినో ధ్యానంగా వింటున్నప్పుడు, నీవొక తప్పు పరికరాన్ని ఉపయోగిస్తున్నావనే విషయం నీకు అర్థం కాదు. ఎవరైనా చెపుతున్నదాన్ని ఈ పరికరం ద్వారా నీవు అర్థం చేసుకో లేవు – అన్నిటికంటే ముందు ఈ విషయాన్ని నీవు అర్థం చేసుకోవాలి. నీవు పొందాలనుకొన్నది ఏదైనప్పటికీ, దాని కొరకు నీవు చేస్తున్నదేదైనా, అది ఒక అడ్డంకే. అది అగ్నికి ఆజ్యం పోస్తుంది, దానికి మరింత ఊపునిస్తుంది. అందువల్ల, దాని ఊపు ఎలా తగ్గుతుంది? ఎలా ఆగుతుంది? ఆ ఊపును ఆపడం మీరెప్పుడు చేస్తారు? రేపా లేక ఎల్లుండా? "రేపు నేను అర్థం చేసుకుంటా" అంటారు మీరు. రేపు అనేది లేదు: అది రేపు జరగబోవడం లేదు; అది ఇప్పుడే జరగాలి లేకపోతే ఇంకెప్పుడూ జరగదు. అందువల్ల, "నేను దేనిని అర్థం చేసుకోవాలనుకుంటున్నానో, దాన్ని నన్ను అర్థం చేసుకొనివ్వకుండా ఏది నన్ను ఆపుతోందో దాన్ని తెలుసుకోవాలని నేను గట్టి నిర్ణయం తీసుకొన్నా." మీరు అర్థం చేసుకోవాలనుకున్న దాన్ని అర్థంచేసుకోనీయకుండా ఏది మిమ్మల్ని ఆపుతోందో, దాన్నే మీరు, ఉపయోగిస్తున్నారు, అర్దం చేసుకోవడానికి. ఇది నా టీచింగ్ కాదు, ఎవరి టీచింగూ కాదు, కానీ యిదే జరుగుతున్నది. మీరు ఏ పరికరం ద్వారా ఒక విషయాన్ని అర్థం చేసుకోవాలని ప్రత్నిస్తున్నారో, ఆ పరికరం కాదు ఉపయోగించ వలసినది, అర్థం చేసుకోవడానికి.

ఆ విధంగా, నీ ప్రయత్నాల నన్నిటినీ కొనసాగింప జేసేది ఆశ ఒక్కటే -- "ఈ విషయయం రేపు ఆయనతో చర్చిస్తే బహుశా నేను అర్థం చేసు కోగలనేమో" అనే ఆశ. కానీ అది కాదు మార్గం. నేను అర్థం చేసుకోకపోతే, నేను అర్థం చేసుకోలేను: "నాకు తెలియదు, ఈ సమస్య పరిష్కరించడానికి నాకు ఏ మార్గం కనిపించడం

లేదు" వాళ్ళు ఒక ఉదాహరణ ఇచ్చేరు... ఒక కుక్క తన తోకను తానే వెంటాడుతోందని: అది అలా నడుస్తూనే ఉంటుంది, నీకు ఎక్కడకో చేరుతున్నట్టనిపిస్తుంది. ఇది ఒక దురదృష్టకరమైన పరిస్థితి; నీవెక్కడకీ చేరుకోవడం లేదు; అది అసలు పద్ధతి కాదు. అయితే మార్గం ఏమిటి? ఏ మార్గమూ లేదు. నేను చెపుతున్న దాన్ని నీవు ఒక పద్ధతిగా మార్చి, దానికి మరింత ఊపును (momentum ను) యిస్తున్నావ్. అది విధానం కాదు, అది దారి కాదు, ఆ దారి నీదై ఉండాలి. అన్నీ దారులు పోవాలి. మరొకరి దారిలో నీవు నడుస్తున్నంత కాలం, ఆ దారి ఆలోచన నుండి పుట్టిన దారే అవుతుంది, అందుకని, అది వాస్తవంగా కొత్త దారి కాదు; అది అదే పాత దారి, అదే పాత గేమ్ నువ్వు కొత్త విధంగా ఆడుతున్నావ్. అది కొత్త ఆట కాదు; అది నీవెప్పుడూ ఆడే పాత ఆటే. కానీ కొత్త ఆట అడుతున్నావని నీవనుకొంటావ్. నీవు చేస్తున్నదానిలోని అసంబద్ధతను(absurdityని), నీవు చూసినప్పుడు, బహుశా నీవు నీయంతట తెలుసుకుంటావ్ "అయ్యో, ముప్పై, నలభై, ఏభై ఏళ్లుగా నేను చేస్తున్నదేమిటి" అని నీవే జుట్టు పీక్కుంటావ్!

ఆ పర్వతాన్ని చూడ్డానికి నాకు ఇరవై ఏళ్ళు కావాలా? నాకు ఇరవై ఏళ్ళు అక్కర్లేదు. దానిని ఎలా చూడాలో నాకు తెలియదు. ఎవరో తాను ఉండే ఒక సహజ స్తితిని వివరిస్తున్నారు, అది అతనిది, నాది కాదు. పర్వతం- అని పిలవబడే దాని ముందు నీవు ఉన్నపుడు నీలో ఏం జరుగుతుందో నీకు తెలియదు. (నిజంగా ఏం జరుగుతుందో ఆ స్తితిని నేను వివరిస్తున్నాను, – ఆ చర్య గురించే నేను మాట్లాడుతున్నాను.) అది నీ మీద పని చేస్తుంది. ఆ యాక్షన్ నీలో ఎలా కలుగుతుందో, అది నీమీద act చేసినపుడు ఏంజరుగుతుందో, నీకేప్పటికీ అర్థం కాదు. నేను చెప్పేది అర్థంచేసుకోవాలంటే దీనిని నీవు జీవించాలి (You have to live through this). నీవు దాన్ని జీవించి ఉంటే, నీ విక్కడ ఉండే వాడివి కాదు, నీవు యీ ప్రశ్నలన్నీ అడిగేవాడివి కావు. నీవు దీన్ని ఇప్పుడైనా చూస్తావ్ లేదా ఎప్పటికీ చూడవ్. నీ ప్రయత్నాలు కొనసాగించేలా చేసేది ఆశ, "తరువాత క్షణంలో అర్థం చేసుకోగలనేమో" అన్న ఆశ. నీవు చూస్తున్న దానిపై నీ కళ్లను కేంద్రీకరించ

డానికి ప్రయత్నిస్తావ్, నిన్నటి కంటే యీ రోజు కొంచెం ఎక్కువ చూస్తావ్, ఎక్కువ స్పష్టంగా చూస్తావ్. అలా అన్నీ ట్రిక్కులూ నువ్ ప్లే చేస్తున్నావ్ – ఎక్కువ జాగ్రత్తగా మొత్తం ధ్యాసంతా దానిమీదే పెట్టి చూస్తే, నీవు చూసే దానిలో యింకా ఎక్కవ స్పష్టత కనిపిస్తుందని నీవనుకొంటావ్ – ఇదంతా నిన్ను నీవు మోసగించుకోవడమే, ఎందుకంటే నీవు చేసేదంతా నీ ఆలోచనను స్పష్టీకరించుకొడానికే.

నీవు దేన్నీ చూడడం లేదు. ఆ విధంగా నీవు దేన్నీ చూడ లేవు; అది చూడ్డానికి సమయం అక్కర లేదు, అది టైమ్ తీసుకోదు. అందువల్ల "యీ విషయంలో నేను ఏం చెయ్యాలి?", ఎవరో చెపుతారు,"ఒక పువ్వును చూడండి" అని. అందువల్ల ఒక పువ్వు యొక్క ప్రతీ రేఖనూ, రంగునూ, లోతునూ, మరొకటీ, మరొకటీ, నీవు చూస్తావ్. చూసే పద్ధతి అది కానప్పుడు, చూసే పద్దతి ఏమిటి, ఆ పద్ధతి ప్రకారం నీవు దాన్ని చూడబోయేది ఎప్పుడు? "ఆయన వివరిస్తున్న విధంగా నేనసలు చూడనే చూడ లేను, నిజంగా నాకు తెలియదు. నేను ఏ విధంగా దాన్ని చూస్తున్నానో, ఆ విధంగానే తప్ప వేరే విధంగా నేను చూడ లేక పోతున్నానని నిజంగా నాకనిపిస్తోంది." అని చెప్పగలిగే ఒక పాయింటుకి, నిర్ణయానికి మీరు వచ్చి తీరాలి. ముందు మీరు ఈ పాయింట్ కి తప్పకుండ వచ్చి తీరాలి, దీని అర్ధం, ఆయన చెప్పేదాన్ని మీరు పూర్తిగా తోసిపుచ్చాలి – ఆ పువ్వును ఎలా చూడాలో ఆయన చెప్పినదంతా మీ నుండి పూర్తిగా తొలగి పోవాలి – అప్పుడు మీరు ఆ పువ్వు ను చూసే పద్ధతి సంగతి చూడచ్చు. అపుడు ఎలా ముందుకెళ్లాలో అసలు మీకేమీ తెలియక అక్కడే స్తంభించి పోతారు. అలా మీరేమీ చేయలేని స్తితికి మీరు వచ్చి తీరాలి. "ఇది అసాధ్యమైన పని" అని మీ అంతట మీకు తెలియాలి. మీరు ఏమవ్వాలని కోరుకొంటున్నారో దాని కొరకు చేసే ప్రయత్నాలు మానేసి, ముందు దీని విషయం చూడాలి.

"చూసేవాడు లేకుండా చూడడం" (perception without the perceiver)... అనేది ఒక భావన, నీవు చేయగలిగినదంతా దాని గురించి ఆలోచించడమే:– 'అర్ధం చేసుకొనేవాడు లేకుండా అర్ధం చేసుకోవడం' దీని అర్ధమేమిటి? లేదా 'చూచే వాడు లేకుండ చూడడం'... నేను యీ పదాలు ఉపయోగించను. ఇంద్రియ

జ్ఞానాలు(sensations) అనువదించే అనువాదకుడు అక్కడ లేడు అని నేను అంటాను; అవి స్వచ్ఛమైన సాధారణ అనుభూతులవలే ఉండిపోతాయ్; ఆవి అనుభూతులన్న జ్ఞానం గూడా అక్కడ ఉండదు. చూడడం, రుచిచూడడం, తాకడం, వాసన చూడడం, వినడం.. ఇవన్నీ ఇంద్రియజ్ఞానాలే... ఈ అయిదు జ్ఞానేంద్రియాలూ పనిచేస్తూ ఉంటాయి. అనువదించడం లేకుండా, గుర్తించడం లేకుండా ఈ ఇంద్రియానుభూతులు, యింద్రియానుభూతులుగానే ఉండిపోతే, ఏంజరుగుతుందనే విషయం నీకెప్పటికీ తెలియదు. ఈ అనుభూతులన్నిటినీ (యీ సెన్సేషన్స్ అన్నిటినీ) నీవు అనువదిస్తున్నావు. కనుక, “అలా చేయకుండా ఆపడం ఎలా?”,ఈ అనువదించడం నేను ఎలా ఆపబోతున్నాను అని నీవు అడిగితే, నీవు తప్పుదారి పట్టినట్టే. ఈ అనువాదం చేయడాన్ని నువ్వు ఆపలేవ్; ఈ అనువాదం యొక్క ఉత్పత్తే నీవు. ఇది ఆగడం అనేది జరగక పోవచ్చు. ఈ అనువదించడం ఆపవచ్చు అని ఎవరైనా అంటే, అతని మాటలు ఎవ్వరూ ఎట్టి పరిస్తితుల్లో గూడా నమ్మద్దు, ఆ మాటల్లో ఏమాత్రం నిజం లేదు. అలా చెప్పే వాడు, తియ్యటి కూతలు కూసే కోకిల, లేదా విపరీత చేష్టలు చేసే తోకలేని కోతి. అతడు మాట్లాడే మాటలు నా దృష్టిలో అవాస్తవాలు. నీకు ధైర్యం లేదు. నీ వాస్తవికతను ఒప్పుకోడం నీకు యిష్టం లేదు. నేను చెపుతున్నది, మీ కార్య నిర్వహణ విధానానికి అసలు సంబంధించినది కాదు. నేనే విధంగా చూస్తున్నానని నేను అంటానో అదేవిధంగా మీకూ చూడాలని ఉందని రేపు మీరంటారు. నన్ను నేను మోసగించుకుంటున్నానేమో. “ఈ విధంగానే దాన్ని నేను చూస్తున్నాను. నాకు తెలిసినది ఇంతే అని నాకనిపిస్తోంది. ఆ మనిషి యొక్క అవగాహనలు(perceptions) ఏమిటో నాకు తెలియదు.” అందుకని, ఆయన్ని అక్కడే ఒదిలేద్దాం – ఆయన్ని గాని, మరొకరిని గాని నిందించి ప్రయోజనం లేదు. మిమ్ములను మీరు నిందించుకోవడంలో గూడ అర్థం లేదు. మిమ్మల్ని మీరు నిందించుకొని ప్రయోజనం ఏమిటి? మీరు వ్యవహరించే తీరు ఇది. అందువల్ల అప్పుడది సహజంగానే ఆగి పోవాలి – ఆగిపోడం కాదు; దాని తీవ్రత తగ్గి పోవాలి. మీకు తెలియదు. అంటే, ఈ వ్యవహారం అంతటి గురించి ఏమి చెయ్యాలో మీకు

తెలియని స్తితికి మీరు వచ్చారు: “నేను ఏమీ చేయ లేను. నాకు తెలిసిన విధానం ఇదే, నాకు మరో పద్దతి తెలియదు; ఆ మనిషి చెపుతున్న దాంట్లో నాకేమీ అర్ధం కనబడడం లేదు”. కానీ అతడు మరో సారి ప్రయత్నించమంటాడు. నువ్వు మరోసారి ప్రయత్నిస్తావ్, కానీ ఏమీ లాభం కనిపించదు. అలా, ఆశ నిన్ను నడిపిస్తూనే ఉంటుంది – “బహుశా ఆయన చెప్పేది నేను రేపు అర్థం చేసుకోగలనేమో, ఆయన నన్ను చేయమన్నది, చేయడంలో విజయం సాధించ గలనేమో అనే ఆశ: -- కానీ నీవు అర్థం చేసుకోడానికి చేసే ప్రయత్నం లోనే నీ శేష జీవితమంతా గడిపేస్తావ్. కానీ ఇవన్నీ వ్యర్థం అని నీవు తెలుసుకోగలిగితే, బహుశా ఇది ఆగి పోతుంది – నిజంగా ఆగదు, కానీ దాని తీవ్రత, వేగం తగ్గుతుంది.

**ప్ర: (ప్రశ్న సరిగ్గా వినపడ లేదు, కానీ బహుశా UG & JK ల టీచింగ్స్ ను పోల్చే ప్రయత్నం అవ్వచ్చు)**

**యుజీ** : నేను రకరకాల ఉపమానాలు వాడగలను: ఉదాహరణకు పువ్వు. మానవ చైతన్యం (human Consciousness) యొక్క సహజ లక్షణం ఏమిటంటే మాటలతో తనను తాను వ్యక్తం చేసుకోడం – ఇది దీని పరిమళం. అతి తక్కువ మంది, వారేదో చేయడం వల్లా కాదు, చేయకపోవడం వల్లా కాదు, ఈ రకంగా దీనిలో పొరపాటున పడ్డారు, వాళ్ళు మాట్లాడుతారు, మాట్లాడినప్పుడు అది వేరుగా ఉండక తప్పదు ఎందుకంటే మనిషి యొక్క నేపధ్యం, బేగ్రౌండ్ అతన్ని ప్రభావితం చేస్తూ ఉంటుంది. మీరు కూర్చొని ఆ పదాల్ని, ఈ పదాల్ని, ఆ మాటలను, ఈ మాటలనూ పోల్చి చూసి అంటారు, యీయన గూడా అదే చెపుతున్నాడని లేదా అది చెప్పడం లేదని. ఆయన దేనిని గురించి మాట్లాడుతున్నాడో మీకెలా తెలుసు? – ఇదే మిమ్మల్ని నేను అడుగుతున్నాను, అన్నిటికంటే ముఖ్యంగా, ఆయన దేనిని గురించి మాట్లాడుతున్నాడో మీకు తెలియదు. చూడండి, అది మీకు తెలిసి ఉంటే, ప్రతీ సంవత్సరం మళ్ళీ మాళ్ళీ రారు. జీవన ఆనందం కొరకు మాట్లాడుతున్నాననీ ఆయన అనచ్చు – నాకు తెలియదు; మీరే అతణ్ని అడగాలి. మీరు ఎక్కడ ఉన్న వాళ్ళు అక్కడే ఉన్నారని, అంతేకాదు, (ఇంకా మొరటుగా చెప్పాలంటే) మీకు కావాలనుకొన్నదేదీ మీరెటూ పొందడం లేదని అతనికి తెలుసు (నవ్వు..), ఇది

ఒక కఠోర సత్యం. మీకు కావాలనుకొన్నది మీరేలాగూ సాధించలేరు ఎందుకంటే చేయడానికి ఏమీ లేదు, సాధించడానికి ఏమీ లేదు. నన్ను చూడ్డానినికి వచ్చిన వాళ్ళకి, నేను చెప్పేది ఇష్టంగా వినేవాళ్ళకీ, ఇదే తెలియజెప్పడానికే చాలా కాలంగా నేను ప్రత్నిస్తున్నా: ఏదో పొందాలని, ఏదో సాధించాలని మీరు అనుకొన్నంత కాలం లేదా జ్ఞానోదయం పొందిన మనిషినగా అవ్వాలని మీరు అనుకొన్నంత కాలం, జ్ఞానోదయం అయిన మనిషి కాలేరు. జ్ఞానోదయమంటే, జ్ఞానోదయమయిన మనిషిగా అవ్వాలని కోరుకొనడమనే వ్యవహారాన్నంతటినీ  వదిలివేయడమే – అదీ జ్ఞానోదయం అంటే.  ఈ పదాన్ని వాడ్డం నాకిష్టం లేదు.

**ప్ర : అంటే జ్ఞానోదయమనేది ఉందన్న మాట!**

**యుజీ** : చూడండి, మీరు దాన్ని అలా పిలవాలనుకుంటే. నాకు తెలియదు. నేనెప్పుడూ అనుకోను "నేను జ్ఞానోదయం అయిన వాడినని, ఒక ఆత్మ జ్ఞానినని(self-realized man అని). దానర్థం ఏమిటి? నా వరకు దీనికి అర్థం ఏమీ లేదు. అందువల్ల,  జ్ఞానోదయం గురించి మాట్లాడడంలోనూ, లేదా "హల్లో, అందరూ ఇలారండి, వినండి,  నేను జ్ఞానోదయం అయిన వాణ్ని, మీ అందరినీ కూడా విముక్తి చేస్తాను" అంటూ నాలో నేను చెప్పుకుంటూ, అందరితోనూ  చెప్పుతూ, తల ఎగరేసుకు  తిరగడంలోనూ నాకు  అర్థం కనపడ్డంలేదు. అది అధ్యాత్మిక వ్యాపారం(holy business),  అలా నేనెప్పుడూ చేయను. ఇదేమిటో తెలుసుకోవాలనే ఆసక్తితో మీరందరూ ఇక్కడకు వచ్చి ఉండచ్చు.  బహుశా మీరు విని ఉండచ్చు,  ఒక ఫన్నీ ఫెలో ఒకడు ఇక్కడున్నాడని, వాడుగూడా అదే చెపుతున్నాడని, లేదా మరొకటి ఏదో చెపుతున్నాడని, వాడు చాలా కఠినంగా, ఆవేశంగా మాట్టాడుతున్నాడు, వాడు ఆయన్ని దారుణంగా తిడుతూ ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతున్నాడని వగైరా. బహుశా అదేమిటో తెలుసుకోవాలనే ఆతృత మిమ్మల్ని యిక్కడికి తీసుకొచ్చిందేమో నాకు తెలియదు. తెలుసుకోవాలనే ఆసక్తితో మీరు ఇక్కడకు వచ్చి  ఉంటే, నాకేం పర్వాలేదు, నాకు ఓకే. నా మజా కోసమే నేను చేస్తున్నానని మీరు అన్నా, నాకేమీ పర్వాలేదు. కానీ నా ఆనందం కోసం నేను మాట్లాడడంలేదు. నేను మాట్లాడితే నాకేం లాభం? సరే, ఒకవేళ నా ఆనందం కోసమే

నేను చేస్తున్నానని ఓ క్షణం అనుకున్నా, నేను మిమ్మల్ని ఎందుకు వాడుకోనిస్తున్నారు? దూరంగా వెళ్ళిపొండి! మిమ్మల్ని నన్ను వాడుకోనివ్వకండి! దూరంగా ఉండండి! నా ఇంట్రెస్ట్ అంతా మిమ్మల్ని శాశ్వతంగా యిక్కడనుండి పేక్ చేసి పంపించేయడమే. మిమ్మల్ని నా స్వార్ధానికి నన్ను వాడుకోనివ్వకండి! నేను మిమ్మల్ని వాడుకోడంలో నాకు ఆనందమేమీ రాదు. మీరు రేపు రాకపోయినా నాకు తేడా ఏమీ ఉండదు. కానీ నేను చెప్పినది మీరు నమ్మరు, ఎందుకంటే మీకు తెలిసినది సుఖం మాత్రమే. సుఖం తప్పని నేను చెప్పడం లేదు. అది మంచిది కాదని చెప్పకండి. ఒక మనిషి ఒక వేశ్యా గృహానికి ఏ కారణంతో వెడతాడో, మీరూ అదే కారణంతో ఇక్కడున్నారన్నది మీరు అంగీకరిస్తే అది మీకు ఒక పెద్ద షాక్ ఇస్తుంది. అసలేమీ తేడా లేదు – అవే కారణాల వల్ల ప్రజలు అక్కడికి ప్రతీ ఉదయం, ప్రతీరోజు (నవ్వు..) ప్రతీ ఆదివారం తొమ్మిది గంటలకి ఆ గుడారం లోనికి తోసుకొంటూ వెడతారు (Saanen లోని యీ టెంట్ లో JK ఉపన్యాసాలు ఇస్తాడు). కావాలంటే మీరు, నేను చెప్పిన దాన్ని మంచి భాషలో పెట్టుకోవచ్చు, నేను రోజు రోజుకీ మరీ ఎక్కువ చెడ్డ వాణ్ని అయిపోతున్నానని మీరు అనవచ్చు...

"ఇవన్నీ వికారం పుట్టించే మాటలు"- ఇది మీరు గ్రహించ గలిగితే... ఇది నేను, ఆ టెంట్ లో ఉన్నపుడు, నా అంతట నేను గ్రహించి, టెంట్ బయటకు వచ్చేసేను. నేను ఇకపై మరెప్పుడూ అక్కడకు వెళ్ళి ఆయన చెప్పేది గానీ, ఆయనే కాదు, ఈ ప్రపంచంలోని మరెవ్వరూ చెప్పేది గానీ విననని నేను నిర్ణయించుకొన్నాను. అలా అటువంటి ఉపన్యాసాలు నాకు వినడం శాశ్వతంగా ఆగి పోయింది – "నేను ఇక్కడ ఎందుకున్నాను? దేని కొరకు నేను వింటున్నాను?" అని నాకనిపించింది. బహుశా మీరు ఒక సమూల శారీరక మార్పు కలిగిన, ఒక పరివర్తన చెందిన, మనిషి గురించి విని ఉండచ్చు, అదే మిమ్మల్ని యిక్కడికి తీసుకొని వస్తోంది – అదే మిమ్మలను వెంటాడుతోంది; ఇది మిమ్మల్ని అసలు నిద్ర పోనీయడం లేదు. అందువల్ల, అదీ అసలైన అవరోధం – "సెక్స్ ఆలోచనలు నన్ను వెంటాడ కూడదు, కానీ, ఆత్మ సాక్షాత్కారం, భగవంతుడిని తెలుసుకోవడం, జ్ఞానోదయం మొదలైన వాటి యొక్క ఆలోచనలు మాత్రం నన్ను వెంటాడాలి." (అని మీరు అనుకొంటారు.) ఇవన్నీ చాలా

చాలా గొప్ప విషయాలని మీరనచ్చు; కానీ అవన్నీ ఒకటే (లైంగిక ఆలోచనలు అధ్యాత్మిక ఆలోచనలూ రెండూ ఒకటే, యీ రెండిటికీ ఏమాత్రం తేడా లేదు).

ఒక విషయం నేను తప్పక చెప్పాలి. ఇది ఆలోచించడం నుండి పుట్టినది కాదు. ఇది నేను మీ ముందు ఉంచుతున్న ఒక తార్కిక నిర్ధారిత ప్రతిపాదన కాదు. ఈ పదాలు, ఏ రకమైన ఆలోచనా లేకుండా, ఏ ఆలోచనాక్రమం లేకుండా, వాటి యొక్క సహజ మూలస్థానం(Natural Source) నుండి వాటంతట అవే బయటికి పెల్లుబుకుతున్న మాటలు. అందుచేత వీటిని మీరు తీసుకోండీ లేదా వదిలేయ్యండి. వదిలేస్తేనే మీకు మంచిది.

**ప్ర: జె. క్రిష్ణమూర్తి గారు వాడే 'నెగెటిప్ అప్రోచ్` సరిగ్గా ఇదే.**

[*జె.ఎస్: తత్వశాస్త్ర విషయంలో, నెగెటివ్ అప్రోచ్ (Negative Approach) అంటే `కాదు కాదనే' విధానం అంటే అదికాదు, ఇదికాదు అంటూ, నిజంకాని వాటిని* తీసిపారేస్తూ సత్యాన్ని కనుక్కోదానికి *ప్రయత్నించే విధానం; 'పొజిటివ్ అప్రోచ్ (positive approach) అంటే - `అదే ఇది' అనే విధానం -అంటే అదే ఇది, ఇదే అది అని వివరించి, నిజాన్ని కనుక్కోనే విధానం. పాఠకులు సరైన అర్థాన్ని గ్రహించడానికి వీలుగా ఇక్కడ యింగ్లీషు పదాలను వాడుతున్నాను.*]

**యుజీ** : అసలు సమస్య ఏమిటంటే, మీరంటున్న ఆ నెగెటివ్ అప్రోచ్, నిజానికి ఒక పొజిటివ్ అప్రోచ్; కానీ దీన్ని మీరు నెగెటివ్ అప్రోచ్ అంటున్నారు, మీరు మొత్తమంతటిని ఒక పొజిటివ్ అప్రోచ్ గా మార్చేసేరు. నిజంగా ఇది ఒక నెగెటివ్ అప్రోచ్ అయినట్టయితే, ఇది ఎక్కడో ఒక చోట తనను తానే కాదనాలి అంటే నెగేట్ చేయాలి. ఈ నెగెటివ్ విధానాన్ని ఉపయోగించడం చాలా అవసరం, కానీ మీరు దురదృష్టవశాత్తూ ఈ నెగెటివ్ అప్రోచ్ అంతటినీ ఒక పొజిటివ్ అప్రోచ్ గా మార్చేసేరు. దీనికి ఆయన బాధ్యుడు కాదు; ఈ స్ట్రక్చర్, యీ ఆలోచనల నిర్మాణం దేన్ని ముట్టుకున్నా అది పోజిటివ్ గా మారి తీరాలి. ఎందుకంటే అది 'పోజిటివ్ గా ఆలోచించడం' నుండి పుట్టింది. అందువలన మీరు ఏది విన్నా అది ఒక పద్ధతిగా, ఒక సిస్టమ్ గా మారుతోంది – దాని నుండి ఏదో ఒకటి పొందాలనుకుంటారు. ఉదహరణకి, ఎవరో ఒకరు మైండ్(మనసు) అనేది ఒకటి ఉందని, దాన్ని 'నియమ

నిబంధనల నుండి, సాంఘిక సాంప్రదాయాలనుండీ, అలవాట్ల నుండీ విముక్తి చేయాలని, unconditioned చేయాలని చెపుతారు. మీ మైండ్ ని మీరు ఎలా విముక్తి చేస్తారు, ఎలా అన్ కడిషన్ చేస్తారు? ఇటువంటి ప్రత్యేక పదాలు వాడి మీరు మీ మైండ్ ని కండిషనింగ్ చేస్తున్నారు – ఇదంతా మీరు గ్రహించాల్సిన అవసరం ఉంది. ఆ మనిషిని మీరు నిందించద్దు. నా శేష జీవితమంతా నేను మరణించే వరకు, ఇదే పాటను నేను పాడుతూ ఉంటాను, ఎవరైనా దీన్ని వింటారా లేదా అన్నది నాకు ముఖ్యం కాదు. అందువల్ల నీవు ఈ మనిషిని ఒంటరిగా వదిలేస్తావ్: ఈ మనిషితో ఎప్పుడూ ఏ సంబంధం పెట్టుకోవు. నీవు కోరుకున్నదాన్ని పొందడానికి, నీవు ఏదో ఒక గమ్యం చేరడానికి దీనిని ఉపయోగించుకున్న మరుక్షణమే, అదే పాత గేమ్ లోకి నిన్ను నీవు పెట్టుకున్నట్టవుతుంది – ఇది నీవు చూడ గలగాలి (అర్థం చేసుకోగలగాలి). ఇది నీవు చూడడమే ముగింపు (Seeing is the end) – చూడండి, అంతా అయిపోయింది. కానీ మీరు ఏమీ అర్థం చేసుకోలేదు; అక్కడికి మీరు మళ్ళీ మళ్ళీ వెడుతూనే ఉంటారు. మీరు మీ ఆలోచనలను స్పష్టం చేసుకున్నారంతే, మీరు చెప్పుతున్న ఈ స్పష్టీకరణ ద్వారా మీరు ఆలోచన కొనసాగించడానికి బలాన్ని యిచ్చేరు – ఇదే అక్కడ జరిగిందంతా. అంచేత, మిమ్మల్ని నడిపిస్తున్నది ఆ ఆశ మాత్రమే. అది మీకొక నిత్యకృత్యంగా, అలవాటుగా అయిపోయింది: చర్చికి వెళ్ళే బదులు మీరక్కడికి వెడతారు – నీవు చేస్తున్నదంతే. నీవు చేస్తున్న దానిలోని అసంబద్ధతను నీవు చూస్తే, గ్రహిస్తే, అపుడు నీ అంతట నీకు అనిపిస్తుంది, "నేను ఈ పిచ్చి పని ఎందుకు చేస్తున్నాను? నేను చేస్తున్నదేమిటి? ఆయనకూ నాకు తేడా ఏమిటి? నేనిది ఇంకా ఎందుకు వింటున్నాను?" అని.

**ప్ర: అధ్యాత్మిక ఉపన్యాసాలను మీరు వ్యతిరేకిస్తున్నట్లు కనిపిస్తున్నారు.**

**యుజీ:** నిన్న నేను నా మిత్రులకు ఒక పుస్తకంలో ఉన్న ఒక ఉపమానాన్ని చెప్పేను, అదేమిటంటే, అధ్యాత్మిక ఉపన్యాసాలకు వెళ్ళే వాళ్లూ, మత ధార్మిక పుస్తకాలు చదివే వారూ, ఏదో అతీతమైన దానిని పొందాలనుకొనే వారూ... ఒక ఎర్ర రంగు మట్టికుప్ప(రెడ్ ochre) చుట్టూ కూర్చొని చలి కాచుకొంటున్న కోతుల

లాంటివారని. రెడ్ ఓచర్ అంటే ఏమిటో మీకు తెలుసు – అది ఎర్రగా ఉంటుంది, కానీ పెచ్చగా ఉండదు. అధ్యాత్మిక ప్రవచనాల నుండి గానీ, మత గ్రంథాలనుండి గానీ మీకేమీ దొరకదు. నన్ను ఆసక్తితో విసే వారికి ఈ విషయాన్నే చెప్పడానికి ఎప్పటినుండో ప్రయత్నిస్తున్నాను: సాధించి పొందడానికి ఏమీ లేదు. ఈ రణగొణ గందరగోళం దేనికి? నీకు కావలిసినది ఏమిటి? నీవు దేనికోసం పెదుకుతున్నావ్? – ఇదీ నా ప్రశ్న. నీవు దేనికొరకైనా పెదుకుతుంటే, నీకేదైనా కావాలంటే నీవు మొట్టమొదట చేయాల్సినది ఏమిటంటే, నీవు పట్టుకొని వెళ్లాడుతున్న అన్నింటినీ, ఏ షరతులూ లేకుండా విసిరి పారేయ్, అన్నింటినీ కొట్టి పారేయ్, అన్నింటినీ గుంటలో వేసి పాతిపెట్టు, అలా చేయకపోతే నీవు నీవుగా ఉండే అవకాశం నీకు లేదు. నీవు ఏ సిద్ధాంతాన్ని అనుసరించినా, అది ఏదైనప్పటికీ, అది ఎల్లప్పుడూ నిన్ను దారి తప్పేట్టు చేస్తుంది, అది నిన్ను తప్పుదారిలో పెడుతుంది. నేను చెప్పేదాని నుండి మీరు ఏదైనా ఒక అర్థాన్ని ఒకపేళ ఏర్పరచుకున్నట్టయితే... మీరేమీ చేయలేని, అన్నీ విధాలా అన్నీ కోల్పోయిన స్తితిలో, దారి తప్పిన స్తితిలో పడ్డట్టే. ఒకపేళ దేవుడనే వాడు ఒకడుంటే, అతడు తన యొక్క దయ వల్ల మాత్రమే మిమ్ములనందరినీ రక్షించాలి, నా నుండి గూడా. ఒక విషయం మాత్రం మీకు నేను చాలా స్పష్టంగా చెపుతున్నాను: మిమ్మల్ని విముక్తి చేయడానికి మాత్రం నేనిక్కడ కూర్చో లేదు. మిమ్మల్ని విముక్తి చేయడానికి నేనెవర్ని? దేని నుండి మిమ్మల్ని మీరు విముక్తి చేసుకోవాలనుకుంటున్నారు? మీ దగ్గర ఉన్న దానినే మీరు అడగడానికి ప్రయత్నిస్తున్నారు. అందువల్ల, మీరు తప్పుడు మార్గంలో ఉన్నారని మాత్రమే నేను మీకు సూచిస్తున్నాను; కానీ “సరి అయిన మార్గం ఏదీ” అని మీరు నన్ను అడుగుతున్నారు. నేనేం చేయాలి? మీరు తప్పుదోవలో ఉన్నారన్న సంగతి తెలుసా మీకు? అంటే ఏ గురువు పెనుక మీరు పరుగెటుతున్నారో, ఏ విషయాల గురించి మీరు ఆలోచిస్తున్నారో -- అవన్నీ తప్పనిసరిగా పోవాలి. దీన్ని కిటికీలోంచి బయటికి విసిరి పారెయ్యడానికి మీరు సిద్ధమేనా? చెప్పండి. ఏదో ఒక రోజు అది మిమ్మల్ని, మీరు కోరుకున్న చోటుకు చేరుస్తుందన్న ఆశ మీకుంది – అదీ మీ సమస్య, తెలుసా. మీ గురువు తప్పకుండా (మీ మనసులోంచి) పోయి తీరాలి,

ఆయన ఎవరైనప్పటికీ. మీరేదైతే ఇపుడు చదువుతున్నారో – దాని నుండి మీరు విముక్తి(free) అవ్వాలి. ఈ విషయం మీకు వేలెత్తి చూపిస్తే మీలో చాలా మందికి మనసు గాయపడుతుంది. ఆ బుక్ షెల్ఫ్ లో ఒక పుస్తకం ఉంది, 'తెలిసిన దానినుండి విముక్తి' (Freedom from the known- by JK) అవునా? అది చాలా గమ్మత్తైన పేరు (fancy title). అందుకని, మీరా పుస్తకం చదువుతున్నారు. మీరు విముక్తి అవ్వాలంటే దాని నుండే మీరు విముక్తి అవ్వాలి: మీరేం చదువుతున్నారో దాని నుండి ముందు మీరు ఫ్రీ అవ్వాలి, ఆ పెద్దమనిషి తన్ను తాను విముక్తి చేసుకోడంలోనూ, మీరు చదువుతున్న దానినుండీ మిమ్మల్ని విముక్తి చేయడంలోనూ విఫలమైతే, దానర్థం ఆయన ఫెయిల్ అయినట్టే కదా. ఆయనను నిందించడానికి మీరిష్టపడక పోవచ్చు; కానీ మిమ్మల్ని మీరు నిందించుకోడానికి మీకు అభ్యంతరం ఉండదు. అదీ ఇప్పుడు మీరున్న దురదృష్టకరమైన పరిస్తితి అనే విషయం మీకే తెలుస్తుంది. ఇది మీ సమస్య, ఆయనది కాదు. ఆయన మానాన ఆయనను వదిలేయండి.

**ప్ర : ఈ వెదుకులాటను వదిలేసినప్పుడు మా దగ్గర ఏముంటుంది?**

**యుజీ**: ముందే మీకు హామీ కావాలి. చూడండి, మార్గమంటే ఒక గమ్యాన్ని మీరు చేరుకోడానికి ప్రయత్నిస్తున్నారని భావం. మార్గం అనే పదంలో ఒక మర్మార్థం ఉంది. మీరు అనుసరిస్తున్న మార్గం ఏమిటి? ఉదాహరణకు.. ఎవరో మీతో చెపుతున్నారు "కండిషనింగ్ నుండి (నమ్మకాలనుండి, అలవాట్లనుండి) మిమ్మల్ని మీరు విముక్తి చేసుకోవాలి, అదే దారి" అని. కానీ అది మిమ్మల్ని ఎల్లప్పుడూ తప్పు దారి పట్టిస్తోంది; అది మిమ్మల్ని ఎక్కడకీ తీసుకెళ్లడం లేదు. మీనుండి మీరు దూరంగా వెడుతున్నారు:

మీరు మీరుగా ఉండాలి. కానీ, ఆయన చూపిన మార్గం, మీరు మీరుగా కాకుండా, మరోలా ఉండేట్టుగా మిమ్మల్ని వేరే వైపుకు తిప్పుతోంది. మీరు మీరుగా కాకుండా మరోలా ఉండాలని మీరు ఎందుకు కోరుకొంటున్నారు? అలా నిజంగా మీరు కోరుకోక పోతే, ఎవ్వరు చెప్పేదీ వినరు.

చూడండి, ప్రతీ ఒక్కరి కొరకు దయా భావం (full of feeling) నాలో నిండి ఉండాలని నేననుకొంటాను. ఉదాహరణకు, ఎవరైనా ప్రేమ గురించి మాట్లాడుతున్నారనుకోండి, ఆ ప్రేమ, ఏదైనప్పటికీ, అది మీలోపలంతా నిండి ఉండాలని మీరనుకొంటారు. ఆయన చెపుతున్నది గానీ, మరొకరు చెపుతున్నది గానీ, అదేమిటో మీకు ఒక్క ముక్క గూడా అర్థం కాదు. అయినా మీరు ఆ ప్రేమతో నిండి ఉండాలనుకొంటారు. ఉదాహరణకు ప్రేమంటే ఏమిటో మీకు తెలిసిన దాన్ని వంద రెట్లు పెద్దదిగా ఊహించుకొంటారు. దీనివల్లే మీరు-మీరుగా ఉండడం మీకు ఇంకా కష్టమవుతుంది. రేపుగానీ లేదా ఎల్లుండిగానీ నేనలా ఉండగలనని మీరు అనుకుంటారు.

**ప్ర: అది ఒక మార్గం (path) కాదు; దాని నుండి ఒక మార్గాన్ని మనం తాయారు చేస్తున్నాం.**

**యుజీ:** అందువల్ల, నీవు ఎక్కడకీ వెళ్లాలని కోరుకోక పోతే, ఒక మార్గం కొరకు వెతకవలసిన అవసరం ఏముంది?

**--- చివరి (నాల్గవ) భాగం సమాప్తం ---**

